శ్రీరస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

ఇది

శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాజావారి యాంగ్లకళాశాలా
ప్రధానచరిత్రోపన్యాసకులగు
మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం.ఏ.

శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాజావారి సంస్కృత
కళాశాలాంధ్రపండితులగు
ఆకుండి వేంకటశాస్త్రి గార్లచే
నాంధ్రీకరింపఁబడినది.

---

కే. శ్రీనివాసరావుగారి
శ్రీవేదవ్యాస ముద్రాలయమున ముద్రితము,
విజయనగరము.
1923.

---



SRI VEDAVYASA PRESS, VZM.

# ఉపోద్ఘాతము



సుప్రసిద్ధములగు సంస్కృతగ్రంథములలోఁ గౌటిల్యునియర్థశాస్త్ర మొకటియైయున్నది. పూర్వకాలపు నీతివేత్తలు కవులు దాని ప్రాశస్త్యమును పూర్తిగా నెఱిఁగియుండినను నిటీవలికాలమున దాని వ్రాతప్రతులేవియు దొరకనందునఁ గొన్ని సంవత్సరముల క్రిందటివఱకు దానిస్వరూపమిట్టిదియని నిర్ణయించుట దుస్సాధ్యముగ నుండెను. కాని, మైసూరుసంస్థానపుస్తకభాండాగారమునకై పుస్తకముల సంగ్రహించుప్రయత్నములో కాంచీపుర సమీపగ్రామమందు నివసించుచుండిన నొకవైష్ణవబ్రాహ్మణునిగృహమందు 1900 ప్రాంతమున నీగ్రంథపువ్రాఁతప్రతియొకటి దైవవశమునలభించెను. తర్వాతనాలుగైదుసంవత్సరముల కాభాండాగారములోని విద్వాంసులలో నొకరగు శ్యామాశాస్త్రిగారు గ్రంథములోని కొన్నిభాగములనాంగ్లేయభాషలోనికిఁదర్జుమాగావించి “మైసూరురివ్యూ” “ఇండియన్ ఆంటిక్వరీ” అను మాసపత్రికలయందుఁ బ్రచురించిరి. వీనిని చదువుభాగ్యము కలిగినవారందఱు మొదటినుండియు గ్రంథమమూల్యమైనదనుమాటను గ్రహించి మనదేశపుప్రాచీనచరిత్రను పరిశోధించుటయం దెంతయో యుపచరింపఁగలదని దానిని వేనోళ్ళస్తుతింపసాగిరి. అటుపిమ్మటఁ గొంతకాలమునకు మైసూరుప్రభుత్వమువారి యౌదార్యసహాయముచే శ్యామాశాస్త్రిగారు గ్రంథమునంతను పరిష్కరించి సంస్కృతమూలమును సమగ్రముగ ముద్రించుటయేగాక గ్రంథమునకొక యింగ్లీషుతర్జుమాను తయారుచేసి ప్రకటించిరి. ఇదిజరిగి యిప్పటికిసుమారు పదునైదుసంవత్సరములయ్యెను. ఈపదునైదుసంవత్సరములును పండితులీగ్రంథమును విమర్శించినట్లు మఱియొకసంస్కృతగ్రంథమునువిమర్శింపలేదనిచెప్పవచ్చును. ఇంతకుఁ బూర్వము చాలకాలమునుండి సంస్కృతగ్రంథపఠనమం దత్యంతో

స్త్రులవారు ప్రచురించిన జర్మనులులోనగు పాశ్చాత్యపండితులును మన దేశపువిద్వాంసులునుకూడ నీగ్రంథమును చక్కఁగఁ బరిశీలించి దానిలోని గుణదోషముల వివరింపఁదొడఁగిరి. ఇట్లుచేయుటలో గ్రంథముయొక్కస్వభావము గ్రంథకర్త గ్రంథకాలము మొదలగు వానివిషయములగుఱించి భిన్నాభిప్రాయములనేకములు బయల్పడెను. ముద్రితగ్రంథమునకొక వ్రాఁతప్రతిమాత్రమాధారమైనందున సరియైనపాఠమిదియని నిర్ణయించుటకు వీలులేకపోయెను. గ్రంథకర్త సూత్రశైలి నుపయోగించినందున నతనియభిప్రాయము లనేకము లతిగూఢములుగఁ గన్పడెను. అతనిచే వాడఁబడినపరిభాష లెక్కినసంస్కృతగ్రంథములందుఁగాని నిఘంటువులందుఁగాని దొరకకపోవుటచేత వానియర్థమును స్పష్టపఱచుట కష్టతరమయ్యెను. ఇట్టి సందర్భమున విమర్శకులందు భిన్నాభిప్రాయములుండుటవింతకాదు. అయినప్పటికి నర్థశాస్త్రగ్రంథములలో సంస్కృతమందిట్టిగ్రంథము మఱియొకటిలేదని విద్వాంసులెల్లరంగీకరించియున్నారు.

ఇంతటిగౌరవము కౌటిల్యునిగ్రంథమునకువచ్చుటకు సంస్కృతభాషయం దర్థశాస్త్రగ్రంథములు లేకపోవుటకాదు. (1) అతనికి పూర్వము నతనితర్వాతనుకూడ నీవిషయమై యెన్నియోగ్రంథములు వ్రాయఁబడినవి. దీనినేయతఁడు తనగ్రంథాదియందు, "భూసంపాదనపరిపాలనములగుఱించి పూర్వాచార్యులచే నెన్నెన్నియర్థశాస్త్రములు చెప్పఁబడినవో వానినెల్లసంగ్రహించి సంక్షేపముగ నీయర్థశాస్త్రము చేయఁబడినది", యనువాక్యముచేసూచించియున్నాఁడు. ఈయాచార్యులయొక్క సిద్ధాంతములఁ గొన్నిటినిఖండించుసందర్భమున నతఁడు మానవులు బార్హస్పత్యులు ఔశనసులు పారాశరులు అంభీయులు భారద్వాజుఁడు విశాలాక్షుఁడు పరాశరుఁడు పిశునుఁడు కౌణపదంతుఁడు వాతవ్యాధి బాహుదంతీపుత్రుఁడు లోనగునర్థశాస్త్రకారులను పేర్కొనియున్నాఁడు. దీనినిపట్టివానికాలమునాఁటికి రాజనీతినిగుఱించిన గ్రంథములనేకములుండినవని స్పష్టమగు

చున్నది. ఆతనితర్వాత శాంతిపర్వములోనిరాజనీతిప్రకరణములు కామందకనీతిసారము మొదలగుగ్రంథములు వ్రాయఁబడినవి. రాజ్యతంత్రమునుగుఱించిన పుస్తకములిన్నియుండినను కౌటిల్యునియర్థశాస్త్రము ఘనతగాంచుటకు రెండుమూఁడుప్రబల హేతువులున్నట్లుతోఁచుచున్నది. (2) అతనికిఁబూర్వము వ్రాయఁబడిన గ్రంథములన్నియునామమాత్రావశిష్టములైపోయినవి. వానిలోనివాక్యములఁగొన్నిటినతఁడును తదితరగ్రంథకర్తలును నుదాహరించియుండుటచేత మాత్రమే యట్టిగ్రంథములొకప్పుడుండినవని మనకుఁదెలియుచున్నదిగాని యవియెట్టివో నిర్ధారణముచేయుటకుఁ దగిన యాధారములు మరేమియులేవు. అవి శిథిలములైపోవుటచేతఁ బ్రచారమందున్నవానితోఁ గౌటిల్యునియర్థశాస్త్రమే మొదటిదియనిచెప్పవలసియున్నది. (3) కౌటిల్యునితర్వాతి గ్రంథకర్తలెవ్వరాతనివలె రాజ్యపాలనమునకు సంబంధించినవిషయములన్నిటిని విపులముగ వివరించినవారుకారు. అధ్యక్షప్రచారధర్మస్థీయయోగవృత్తసంఘవృత్తాద్యధికరణములలో నతఁడువర్ణించిన విషయములలోఁ జాలభాగము కామందకమందులేదు. ఇట్టివానిలోఁ గొన్నిటినిగుఱించిన ప్రశంస శుక్రనీతియందున్నను నదిసంపూర్ణముగనుండలేదు. కావునరాజ్యాంగతంత్రమునుగుఱించి మనపూర్వులుచేసిన సిద్ధాంతములపఠనమునకుఁ గౌటిల్యునియర్థశాస్త్రమే ప్రధానమగునాధారము. (4) గ్రంథకర్తనుపట్టికూడ గ్రంథమునకెక్కువ గౌరవములభించియున్నది. కౌటిల్యుఁడు పండితుఁడుమాత్రమేకాదు. అతఁడు లౌకికవ్యవహారానుభవముకలిగినవాఁడు. రాజ్యసంపాదన పరిపాలనములం దగ్రగణ్యుఁడని చెప్పఁదగిన చంద్రగుప్తచక్రవర్తికిఁ గుడిభుజమై రాజ్యనీతినిన్యాయముగను జయప్రదముగను ప్రయోగించినవాఁడు. ఇట్టియనుభవజ్ఞులే దండనీతినుపదేశింపఁదగినవారని యతనిసిద్ధాంతము. ఈయభిప్రాయమును మనసునందుంచుకొనియే రాజపుత్రునివిద్యాభ్యాసపద్ధతిని నిర్ణయించు సందర్భములో నతఁడు, "అధ్యక్షులనుండి వార్తను,

వక్తృప్రయోక్తల నుండి దండనీతిని నేర్చుకొనవలె"నని చెప్పియున్నాఁడు. ఇతనికిని, యితరగ్రంథకర్తలకుఁ గలభేదమిదియే. కామందకాదులిట్టి వ్యవహారానుభవముకలిగినవారు కారు. ఇతరులు వ్రాసిన గ్రంథముల వివేకదృష్టితో విమర్శించి స్వాభిప్రాయములఁ గొన్నిటిని చేర్చి కామందకుఁడులోనగువారు నీతిశాస్త్రములరచించిరి. కనుకనే వారిపుస్తకములందు సందర్భానుచితములగు ప్రశంసలుకూడ నక్కడక్కడఁ గన్పడుచుండును. కౌటిల్యుఁడట్లుగాక సందర్భోచితముగను వ్యవహారానుకూలముగను వ్రాసియున్నాఁడు. (5) మనదేశమందుఁ బ్రఖ్యాతిగాంచిన సామ్రాజ్యములన్నిటిలోఁ జంద్రగుప్తచక్రవర్తిచే స్థాపింపఁడిన మౌర్యసామ్రాజ్యము మొదటిది. అనేకరాష్ట్రములసముదాయమగు సామ్రాజ్యమును పరిపాలించుట సులభముకాదు. ఆకాలమున పరిపాలనవిధానమెట్లుండెనో తెలిసికొనుట మనకత్యంతావశ్యకము. ఇదివఱకుఁ మనకీజ్ఞానము చంద్రగుప్తుని యాస్థానమందు రాయబారిగనుండిన మెగాస్తనీసను గ్రీకుదేశస్థుని వ్రాతలమూలమున లభించుచుండెను. కాని, యితఁడు విదేశస్థుఁడగుటచే మనయాచారవ్యవహారములితనికిఁ జక్కఁగబోధపడియుండినదికాదు. కావున నతనివ్రాఁతలు తృప్తికరములుకాకుండెను. ఇప్పుడున్నను మౌర్యులపరిపాలనవిధానమంతయుఁ గౌటిల్యునిమూలమున మనకుస్పష్టముగఁ దెలియుచున్నది.

పైనుదాహరించిన కారణములచేత నర్థశాస్త్రగ్రంథములన్నిటిలోఁ గౌటిల్యునిగ్రంథముత్తమమయినదని చెప్పఁదగియున్నను పాశ్చాత్యులువ్రాసిన రాజనీతిశాస్త్రములకును దీనికిని విశేషభేదమున్నది. కౌటిల్యునిగ్రంథము పరిపాలనవిధానమును వర్ణించుచున్నదేగాని పరిపాలనతత్వమును దానిపరమార్థమును విమర్శించుటలేదు. ఒకటిరెండుప్రదేశములందుమాత్రమతఁడు పరిపాలనావశ్యకతనుగుఱించి సూచించియున్నాఁడు. పాశ్చాత్యులగ్రంథము లిట్టివికావు. కౌటిల్యునిసమకాలికుఁడనిచెప్పఁదగిన అరిస్టాటలు నతనికిఁగొంచెము

పూర్వుఁడగు ప్లేటో యనసత్యసామాన్యములగు గ్రంథములవ్రాసి యున్నారు. ఇటీవలి కాలమున రాజ్యతంత్రమును గుఱించిన గ్రంథములు వంకలకొలఁది ప్రచురింపఁబడియున్నవి. ఈ పాశ్చాత్యగ్రంథములన్నిటిలోఁగూడ రాజ్యతత్వవిమర్శమధికముగఁ గన్పించుచున్నది. రాజునకు సర్వాధికారముండవలెనా? రాజ్యాధికారముయొక్క యదార్థలక్షణములెవ్వి? వ్యక్తిస్వాతంత్ర్యమునకును ప్రభుత్వాధికారమునకును పరస్పరవిరోధమున్నదా లేక వీనిని సమన్వయించుటకవకాశమున్నదా? సర్వోత్తమమయిన రాజ్యముయొక్క లక్షణములెవ్వి? యనువిషయములఁగుఱించిన ప్రశంస వీనిలో విస్తారముగఁ గన్పడుచుండును. కౌటిల్యుఁడిట్టివిషయవర్ణనము చేసినవాఁడు కాఁడు. అసఁగా రాజ్యముయొక్క బాహ్యాంగములు బహిర్వ్యాపారములులోనగువానివిషయమం దున్నంతటిశ్రద్ధ దానియొక్కయాత్మానాత్మవిచారమందతనికి లేకపోయెను. మనుష్యునిస్వభావమునుగ్రహించుటకాతనిశరీరముయొక్కయు శరీరములోని యవయవములయొక్కయు జ్ఞానముమాత్రమేగాక, వానిశరీరములోపలనుండు నాత్మయొక్కజ్ఞానముకూడ నావశ్యకమయినట్లు, రాజ్యముయొక్క స్వభావమునుగుఱ్ఱఁగుటకు దానితత్వమును తెలిసికొనుటగూడ నావశ్యకము. ఈ విచక్షణత లేనికారణముచేతఁ గౌటిల్యునిగ్రంథమేగాక సంస్కృతమందలి రాజనీతిగ్రంథములు తక్కినవికూడఁ బాశ్చాత్యగ్రంథములపరిచయముగలవారి కనేకులకు రుచించుటలేదు. (2) వర్ణ్యాంశములందేగాక రచనాపద్ధతియందుఁగూడఁ బాశ్చాత్యులకును కౌటిల్యునకును భేదమగపడుచున్నది. ఈతనిగ్రంథముచాలమట్టుకు సూత్రప్రాయముగనున్నది. విధినిషేధరూపములగు వాక్యములంతటనున్నవి కాని, వానికిఁగల హేతువిచారణ సంపూర్ణముగలేదు. అనేకస్థలములందు హేతువులను పాఠకులే యూహించుకొనవలసియున్నది. ప్రఖ్యాతిగాంచిన పాశ్చాత్యగ్రంథములందిట్టిలోపములేదు. అనేకవిషయములందుఁ గౌటిల్యునితో సరిపోల్పఁదగిన మాకియవెల్లియొక్క

గ్రంథమును చదివినవారికిని బాగుగస్పష్టముకాఁగలదు. హేతువాదములు విశేషముగ లేకుండుటయేగాక యభిప్రాయముల బలపఱచు నుదాహరణములుకూడఁ గౌటిల్యునియందుఁ జాలతక్కువగనున్నవి. అమాత్యులకిట్టి గుణములుండవలయునని విధించినపుడు పూర్వకాలపురాజులవద్దనుండిన యమాత్యుల పేర్లనుదాహరించి వారికాగుణములుండినవో లేవో యదిచెప్పియుండినబాగుండెడిది. అట్లే షాడ్గుణ్యవిధులను నిర్ణయించుటలోఁ బూర్వకాలపురాజులలో నెవరీవిధుల ననుసరించినదియు, దానిమూలమున వారికెట్టిజయములభించినదియు షాడ్గుణ్యవిధులననుసరింపక యపజయముగాంచిన రాజులెవరయినదియుఁ జెప్పియుండిన, గ్రంథమునకు మఱింతవన్నెవచ్చియుండును. అరిస్టాటలు మాకియవెల్లిలోనగు పాశ్చాత్యగ్రంథములందిదియే గొప్పసుగుణము. కౌటిల్యుఁడుకూడ నిట్టిపద్ధతినవలంబించినయెడల నతనిసిద్ధాంతములు బలపడుటయేగాక యతనిగ్రంథము చరిత్రకారులకు మఱింతయుపకారిగనుండును.

అర్థశాస్త్రమును కౌటిల్యుఁడేరచించెనా యను విషయముగుఱించి కొన్నిసంవత్సరములనుండి జరుగుచుండు వాదప్రతివాదముల పరంపర యింకనంతరింపలేదు; కాని, కౌటిల్యుఁడేదీనినిరచించెనను సిద్ధాంతము బలవత్తరముగనున్నదని చెప్పవచ్చును. ఈసిద్ధాంతమును పోషించుకారణములు మూఁడువిధములుగ నున్నవి. (1) కౌటిల్యుఁడు గ్రంథకర్తయని యర్థశాస్త్రమందలి యీక్రిందిశ్లోకములలో స్పష్టముగఁ జెప్పఁబడియున్నది.

1. సుఖగ్రహణవిజ్ఞేయం తత్త్వార్థపదనిశ్చితం।
కౌటిల్యేనకృతంశాస్త్రం విముక్తగ్రంథవిస్తరం॥

గ్రంథవిస్తరములేకుండునట్లుగను తత్త్వార్థపదనిశ్చితమగునట్లుగను సుఖముగ గ్రహింపఁదగినట్లుగను నీశాస్త్రము కౌటిల్యునిచే వ్రాయఁబడినది. (౫ పుట.)

2. సర్వశాస్త్రాణ్యనుక్రమ్య ప్రయోగముపలభ్యచ।
కౌటిల్యేననరేంద్రార్థే శాసనస్యవిధిఃకృతః॥

సర్వశాస్త్రములను ప్రయోగములననుసరించి నరేంద్రులయుపయోగమునకై కౌటిల్యునిచేనీశాసనవిధికావింపఁబడినది (75 పుట).

3. యేనశాస్త్రంచశస్త్రంచ నందరాజగతాచభూః।
అమర్షేణోద్ధృతాన్యాశు తేనశాస్త్రమిదంకృతం॥

నందరాజగతమగుభూమిని, శాస్త్రమును, శస్త్రమునునమర్షముచే నుద్ధరించినవాఁడే యీశాస్త్రమును రచించెను. (450 పుట).

4. దృష్ట్వావిప్రతిపత్తింబహుధా శాస్త్రేషుభాష్యకారాణాం।
స్వయమేవవిష్ణుగుప్తశ్చకారసూత్రంచభాష్యంచ॥

శాస్త్రములకు భాష్యములొనర్చువారిలో బహువిప్రతిపత్తియుండుటగనిపెట్టి సూత్రములొనర్చిన విష్ణుగుప్తుఁడే స్వయముగ భాష్యమునుకూడ నొనర్చెను. (450 పుట.)

ఇందులో నాలుగవశ్లోకము ప్రక్షిప్తమైనదేమోయను సందేహముకలిగినఁ గలుగవచ్చునుకానితక్కినవానినిగుఱించి యిట్టియనుమానముండుట కవకాశములేదు. అన్నియధ్యాయములను శ్లోకముతో ముగించుట యీగ్రంథకర్తకాచారమైయున్నది. మొదటి రెండుశ్లోకములుప్రక్షిప్తములనిచెప్పినయెడల నీయాచారమునకుభంగముకలుగును. కావున నివిమొదటినుండియు గ్రంథమందుండినశ్లోకములే. ఇవన్నియు గ్రంథము కౌటిల్యకృతమని నొక్కిచెప్పుచున్నవి. ఇదిగాక యధికరణాంతములందుండెడి గద్యలన్నిటిలోఁగూడ కౌటిల్యస్యార్థశాస్త్రస్య యనియు, కౌటిలీయస్యార్థశాస్త్రస్యఅనియు వ్రాయఁబడియుండుటచే నీగ్రంథమువ్రాసినవాఁడు కౌటిల్యుఁడుకాఁడనిచెప్పుట యసంగతము.

(2) కౌటిల్యకృతమగు నర్థశాస్త్రమొకటియున్నట్లు సంస్కృతగ్రంథకర్తలనేకులు చెప్పియున్నారు. క్రీస్తుశకమందలి మూఁడవ శతాబ్దములో వ్రాయఁబడిన కామందకనీతిసారమందు, ""నీతిశాస్త్రా

మృతంశ్రీమానర్థశాస్త్రమహోదధేః। యఉద్దధ్రేనమస్తస్మైవిష్ణుగుప్తాయవేధసే" అనుశ్లోకమున (కౌటిల్యుఁడనునామాంతరముగల) విష్ణుగుప్తునిచే నీతిశాస్త్రము రచింపఁబడినట్లు స్పష్టముగనున్నది. ఆఱవశతాబ్దమందుండిన దండిమహాకవి దశకుమారచరిత్రమున, 'అధీష్వతావద్దండనీతిం, ఇయమిదానీమాచార్య విష్ణుగుప్తేన మౌర్యార్థే షడ్భిః శ్లోకసహస్రైస్సంక్షిప్తా' యనియు; నప్పటికాలమందలి వాఁడనియే చెప్పఁదగి పంచతంత్రకర్త పంచతంత్రమందు, 'తతో ధర్మశాస్త్రాణిమన్వాదీన్యర్థశాస్త్రాణి చాణక్యాదీని కామశాస్త్రాణివాత్స్యాయనాదీని' అనియు; నేడవశతాబ్దమందుండిన బాణుఁడు కాదంబరియందు 'కింవా తేషాంసాంప్రతం యేషాంఅతినృశంస ప్రాయోపదేశనిర్ఘృణం కౌటిల్యశాస్త్రం ప్రమాణం' అనియు వ్రాసియున్నారు. పురాణములనుండియు ముద్రారాక్షసాదినాటకములనుండియు మఱికొన్నిగ్రంథములలోని శ్లోకములఁబట్టియుఁ గౌటిల్యుఁడు చాణక్యుఁడు విష్ణుగుప్తుఁడు మొదలగునవి చంద్రగుప్తచక్రవర్తివద్దఁ బ్రధానమంత్రిగనుండిన బ్రాహ్మణశ్రేష్ఠుని నామాంతరములని విశదమగుచున్నది. అతనిచే నర్థశాస్త్రమొకటి వ్రాయఁబడినదనియనుటకుఁబైవాక్యములన్నియుఁ బ్రమాణములు. ఇదిగాక, మనుస్మృతిమొదలగు స్మృతిగ్రంథములకు వ్యాఖ్యానములరచించిన వారనేకులుతమయభిప్రాయముల నక్కడక్కడఁ గౌటిల్యగ్రంథములోనిభాగముల నాధారముచేసికొని వానిని తమవ్యాఖ్యానములందుదాహరించియున్నారు. రఘువంశమునకువ్యాఖ్యానమువ్రాసిన మల్లినాథసూరియేడెనిమిదిప్రదేశములందుఁ గౌటిల్యునిప్రశంసించి యర్థశాస్త్రములోనివాక్యములఁబ్రమాణముగఁదీసికొనియున్నాఁడు. వీనినిపట్టిచూడఁగాఁ గౌటిల్యుఁడర్థశాస్త్రమునురచించెననుటనిర్వివాదాంశము.

(౩) ఇప్పుడిచట నాంధ్రీకరింపఁబడినగ్రంథమే కౌటిల్యుఁడు రచించిన యర్థశాస్త్రమనుటకూడ నిస్సంశయమే. దండిమహాకవి కౌటిల్యునిగ్రంథమందెన్నిశ్లోకములున్నవనిచెప్పెనో యన్నిశ్లోకములే

యిప్పుడీగ్రంథమందున్నవి. ఏయేభాగములను పూర్వకవులును వ్యాఖ్యానకారులును తమగ్రంథములందుదాహరించిరో యవన్నియునీ యర్థశాస్త్రమందుఁ గనపడుచున్నవి. కావునఁ గౌటిల్యునియర్థశాస్త్రమిదియేకాని మఱియొకటికాదు.

4. ఈగ్రంథము కౌటిల్యవిరచితముకాదనియు, నతనిశిష్యకోటిలో నెవరోకొందఱుకలిసి యీగ్రంథమును వ్రాసిరనియుఁ గొందఱువిద్వాంసుల యభిప్రాయము. గ్రంథమందనేకప్రదేశములందు, 'ఇతికౌటిల్యః' (ఈలాగని కౌటిల్యుఁడు), 'నేతి కౌటిల్యః' (ఈలాగుకాదని కౌటిల్యుఁడు) అనువాక్యములున్నవి. కౌటిల్యుఁడే గ్రంథకర్తయైనయెడలఁ దనయభిప్రాయము నిట్టివాక్యములమూలమున సూచించియుండఁడనియు నిట్టిసందర్భములన్నిటియందు 'ఇదినాయభిప్రాయము' 'ఇదినాయభిప్రాయముకాదు' అనువాక్యములనుపయోగించియుండుననియుఁ గౌటిల్యునికంటె భిన్నులగు వారెవరయిన నీగ్రంథమువ్రాసినప్పుడే యిట్టివాక్యముల కవకాశముకలుగుననియు, నీవిద్వాంసులవాదము. కాని, శాస్త్రకారుల సాంప్రదాయమునెఱింగిన పండితులందఱీవాదము నిదివఱకే ఖండించియున్నారు. ఇతరులయభిప్రాయములను పూర్వపక్షముగావించి, స్వాభిప్రాయముల సిద్ధాంతపరచునపు డహంభావ సూచకమగు 'నా' అనుపదము నుపయోగింపక గ్రంథకర్త స్వనామమును వాడుట పూర్వాచారమైయున్నది. ''ఇతి బోధాయనః, ఇతిబాదరాయణః, ఇతివాత్స్యాయనః" అనువాక్యములు బోధాయన బాదరాయణ వాత్స్యాయనకృతములగు గ్రంథములందుఁ గనిపించుచున్నవి. ఇట్టిసందర్భములో 'ఇతికౌటిల్యః' అనువాక్యమున్నంతమాత్రముచే నిదికౌటిల్యకృతముకాదనిచెప్పుట యుక్తియుక్తముకాదు. మనుస్మృతిని మనుశిష్యుఁడగు భృగువు, యాజ్ఞవల్క్యస్మృతిని యాజ్ఞవల్క్యశిష్యులలో నొకఁడును వ్రాసినట్లు ప్రతీతియున్నది. ఈవిషయమును వ్యాఖ్యానకర్తలు స్పష్టముగఁ జెప్పియున్నారు. కౌటిల్యునియర్థశాస్త్ర

ములుగుఱించి యట్టిపరిశీలితి లేకపోవుటయేయది యతనిశిష్యులచే వ్రాయఁబడినదికాదని తెలుపుచున్నది.

5. పాశ్చాత్యవిద్యాసంస్కారమును పొందిన భారతీయవిమర్శకులలో నగ్రగణ్యుఁడనిచెప్పఁదగినభండార్కారుపండితుఁడీగ్రంథము చంద్రగుప్తుని కాలమునాటిదికాదని మఱియొక హేతువుమూలమున నిరూపించియున్నాఁడు. చంద్రగుప్తుఁడు క్రీస్తుపూర్వము 322 మొదలు 298 వఱకుఁ బరిపాలించినవాఁడు. కౌటిల్యుఁడు చంద్రగుప్తునిమంత్రి. కౌటిల్యుఁడే యీగ్రంథమునకుఁ గర్తయైనయెడలనిది నాలుగవశతాబ్దాంతమున వ్రాయఁబడినదై యుండవలెను. కాని, యిదియంత ప్రాచీనమయినదికాదని రెండుకారణములవలనఁ దోఁచుచున్నది. (1) క్రీ॥పూ॥ 150 ప్రాంతపువాఁడయినట్టియు మహాభాష్యకర్తయునగు పతంజలి తనకాలమందుఁ బ్రచారములో నుండిన వేదాంగములు తర్కము ఇతిహాసము పురాణము వైద్యకములోనగువానిని పేర్కొనియున్నవాఁడుగాని కౌటిల్యునిగుఱించిగాని కౌటిల్యుని యర్థశాస్త్రమును గుఱించిగాని ప్రశంసించియుండలేదు. అంతకు నూటయేఁబదిసంవత్సరములకుఁబూర్వమే యీగ్రంథము వ్రాయఁబడియుండినయెడలఁ బతంజలి దీనినేలపేర్కొనకుండెను? కావుననిది పతంజలితర్వాత వ్రాయఁబడినదిగాని యంతకంటెఁ బ్రాచీనమయినదికాదు. (2) క్రీస్తుశకప్రారంభమందలివాఁడును కామసూత్రగ్రంథకర్తయునగు వాత్స్యాయనునికంటెఁ బూర్వులెవ్వరు కౌటిల్యునిగ్రంథముతోఁ బరిచయము గలిగియుండలేదు. వాత్స్యాయనుఁడుమాత్రము పలువిషయములందుఁ గౌటిల్యునిమార్గమవలంబించియున్నాఁడు. దీనినిపట్టి కౌటిల్యుఁడు వాత్స్యాయనునికిఁ గొంచెముపూర్వపువాఁడై యుండవలెను. అనఁగా క్రీ॥ పూ॥ 50 లేక 100 సంవత్సరములనాటివాఁడు. కావున నర్థశాస్త్రముకూడ నీకాలమునాటిదేగాని క్రీ॥పూ॥ నాల్గవశతాబ్దమందలిదికాదు.

కాని, యీవాదమంతబలమైనదిగఁ గనపడుట లేదు. పతం

జలికాలమునాఁటికి నర్థశాస్త్రము ప్రత్యేకశాస్త్రముగాఁగాక యితిహాసములో నొకభాగముగఁ బరిగణింపఁబడియుండవచ్చును. పురాణ ఇతివృత్త ఆఖ్యాయిక ఉదాహరణ ధర్మశాస్త్ర అర్థశాస్త్రము లితిహాసమనఁబడునని కౌటిల్యుఁడు చెప్పియున్నాఁడు (9 పుట). ఇతిహాసాంతర్భూతమయిన యర్థశాస్త్రమును వాఙ్మయములోఁ బ్రత్యేకశాస్త్రముగఁ బతంజలి చెప్పకపోవుటలో వింతయేమియున్నది. అతఁడర్థశాస్త్రమును పేర్కొనకపోయినంతమాత్రమున నాకాలమందర్థశాస్త్రగ్రంథములు లేవని సాధించుట ప్రమాదముకదా? కౌటిల్యునికిఁ బూర్వమెందఱో యర్థశాస్త్రముల వ్రాసియుండినట్లిదివఱకే తెలిసికొనియుంటిమి. పతంజలికాలమునాఁటికర్థశాస్త్రములే లేవనియుఁ గౌటిల్యుఁడు క్రీస్తుశకప్రారంభమునాఁటివాఁడనియు మనమంగీకరించిన యెడల నీమధ్యకాలమున (అనఁగా నూరు నూటయేఁబదిసంవత్సరములలో) మానవ బార్హస్పత్య ఔశన సాద్యర్థశాస్త్రములన్నియుఁ దయారయినవని నిశ్చయింపవలసినవారమగుదుము. ఇంతస్వల్పకాలములో నీశాస్త్రమింతయధికముగఁ బ్రఖ్యాతిగాంచఁగలిగియుండునా? కావునఁ బతంజలికిఁ బూర్వముకూడ నర్థశాస్త్రములుండినవనియే మనమనుకొనవలెను. ఇదిగాక, వాత్స్యాయనునికిఁ గౌటిల్యునిగ్రంథమందత్యంతమగు గౌరవముండినట్లు కనపడుచున్నది. కౌటిల్యునిగ్రంథములోని వాక్యములు కొన్నియు నతనిపరిభాషలోఁ గొంతభాగమును వాత్స్యాయన కామసూత్రమందగపడుచున్నది. అనేకవిషయములందు వాత్స్యాయనుని శైలి కౌటిల్యుని శైలిని పోలియున్నది. దీనినిపట్టి వాత్స్యాయనునినాటికిఁ గౌటిల్యునిగ్రంథము ప్రాచీనమైనదిగ నుండియుండవలెనని తోఁచుచున్నది; లేనియెడలనింతటిగౌరవము వాత్స్యాయనునికి దానియందు కుదిరియుండదు. అతఁడు క్రీస్తుశకారంభమునాఁటివాఁడుగనుక నతనిగురుతుల్యుఁడగు కౌటిల్యుఁడంతకుఁబూర్వము మూఁడువందల సంవత్సరములవాఁడని మనమునమ్మవచ్చును.

పైఁజెప్పిన యీకారణములన్నిటినిపట్టి యర్థశాస్త్రము కాటిల్యకృతమయినదనియు నీకౌటిల్యుఁడు చంద్రగుప్తచక్రవర్తికి మంత్రియైయుండిన కౌటిల్యుఁడేయనియు నితనిగ్రంథము క్రీ॥పూ॥ 300 ప్రాంతమున వ్రాయఁబడినదనియు స్పష్టమగుచున్నది.

కౌటిల్యుఁడు తక్షశిలానగరమున జన్మించినవాఁడని కొందఱును ద్రవిడదేశమువాఁడని మఱికొందఱు నూహించియున్నారు. ఇతనిపూర్వులు ఋషితుల్యులగు బ్రాహ్మణులు. ఇతఁడు వేదవేత్తయేగాక యాకాలపువిద్యలనన్నిటిని సమగ్రముగనభ్యసించినవాఁడు. ఇతఁడు విద్వాంసుఁడయ్యుఁ బ్రారంభదశలోఁ గూటముద్రలు (నాణెముల) తయారుచేసి గొప్పధనమును సంపాదించినవాఁడను ప్రతీతి కలదు. ఇతనికాలమందు నవనందులనురాజులు మగధసామ్రాజ్యమును పాలించుచుండిరి. వీరు క్షత్రియరాజవంశముల నిర్మూలముగావించినవారనియు శూద్రులనియుఁ బురాణములు చెప్పుచున్నవి. వీరు వైదికేతరమతములగు బౌద్ధజైనమతములలో నొకదానినవలంబించినట్లు తోఁచుచున్నది. వీరు ప్రజలనుపీడించి ధనసంగ్రహముగావించిరనికూడఁ దెలియుచున్నది. శిష్టబ్రాహ్మణుఁడగు కౌటిల్యునకీప్రభుత్వము ధర్మరహితమయినదిగఁ గనపడెను. ఇదిగాక యొకసమయమందతనిని నందులు పరాభవించిరి. అప్పుడతఁడు క్రోధావేశమొందినవాఁడై వారివంశమును నిర్మూలముచేయఁబ్రతిజ్ఞపట్టెను. దీనినిసాధించుప్రయత్నములోనతఁడు చంద్రగుప్తునికిమిత్రుఁడయ్యెను. చంద్రగుప్తుఁడు నందరాజునకు వేశ్యయందుఁబుట్టిన పుత్రుఁడనియు నందరాజుయొక్క యౌరసపుత్రులతనికి మానభంగముచేసిరనియు నందుచేనతఁడు వారియెడల విరోధమువహించెననియుఁ బ్రాచీనగాథలవలనఁ దెలియుచున్నది. మహాశూరుఁడగు చంద్రగుప్తుఁడును సకలవిద్యాసంపన్నుఁడగు కౌటిల్యుఁడునుకలిసి గొప్పసైన్యమును సమకూర్చి పార్వతకుఁడనురాజుయొక్క సహాయమునుసంపాదించి నందులనోడించి మగధరాజ్యమును వశపఱచుకొనిరి. కౌటిల్యుఁడీవి

థముగఁదనప్రతిజ్ఞను జెల్లించి చంద్రగుప్తునికిఁ బట్టాభిషేకముగావిం చి కొంతకాలమువఱకతని కమాత్యుఁడుగనుండి పరిపాలనవిధానము ను చక్కగజరిపి లోకాంతరగతుఁడయ్యెను. కౌటిల్యుని జీవితమును గుఱించి మనకింతకంటె విపులముగఁ దెలిసికొనుటకు గ్రంథాధార ములేవియులేవు. ముద్రారాక్షసనాటకమును చదివినయెడల వానిశ క్తిసామర్థ్యములన్నియు స్ఫుటముగఁ దెలియఁగలవు.

మనుష్యునిస్వభావము వానిచర్యలవలనను మాటలవలనను దె లిసికొనఁదగియున్నది. కౌటిల్యునిస్వభావమును తెలుపుచర్యలవర్ణ నము ముద్రారాక్షసమందుఁదప్ప మఱెక్కడను లేదు. ఆనాటకము నువిమర్శించుటకు సమయముకానందున నర్థశాస్త్రములో నుదాహ రింపఁబడిన వానియభిప్రాయములఁబట్టియే యతని గుణగ్రహణము చేయవలసియున్నది. కౌటిల్యుఁడాతనిపూర్వులగు నర్థశాస్త్రకారుల వాదములనేకముల ఖండించియుఁ గొన్నిటినిపోషించియున్నాఁడు. ఈవాదప్రతివాదములఁ బరీక్షించినయెడల నతనిబుద్ధి ధారాళమైన దనియు విషయవితర్కమందుస్పష్టతనుకోరునట్టిదనియు, "అతిసర్వత్ర వర్జయేత్" అనువాక్యానుసారముగ నతఁడువర్తించినవాఁడనియు యుక్తులసాధించుటయందు వ్యవహారానుకూల్యమే ప్రధానాంశము గనెంచినవాఁడనియు, దౌష్ట్యమునుసహింపనివాఁడనియు, వైదికమ తమందత్యంతాభిమానము గలవాఁడనియు స్ఫురించుచున్నది. విభ క్తాంశములయందలి భిన్నలక్షణములును సమానధర్మములును స్పష్ట పఱుటయే విషయవిభాగమువలని ప్రయోజనము. విభక్తాంశములధి కముకానుకాను స్పష్టతకూడ హెచ్చుగుచుండును. అప్పుడేస్వల్పముల గు భేదములనుకూడ గ్రహింపఁగలిగియుందుము. సూక్ష్మబుద్ధివల నలభించు ఫలమిదియే. కౌటిల్యునిబుద్ధి యిట్టిదియని చెప్పఁదగియు న్నది. విద్యలు మూఁడనియు రెండనియు నొక్కటేయనియు పలు వురుపలువిధముల వాదింపుచుండ నతఁడునాలుగని నిర్వచించుటయు (పు 5, 6) సంధివిగ్రహములు రెండేగుణములని కొందఱిమతమైనను

గుణములాఅని యతఁడు చెప్పియుండుటయు (పు 274) దీనికి నిదర్శనములైయున్నవి. వాదప్రతివాదములందుఁ గౌటిల్యుఁడు 'అతి' ని వర్జించి మధ్యమార్గమును త్రొక్కియున్నాఁడు. ఉద్వేజనీయమగు తీక్ష్ణదండముగాని పరిభవకారియగు మృదుదండముగానికూడదనియు యథార్థదండమేదండమనియు (పు 8), ధర్మార్థవిరోధముగఁ గామమునుసేవింపవలెనుకాని సుఖరహితుఁడుగాఁగూడదనియుఁ ద్రివర్గమును సమముగసేవింపవలెననియు (పు 11), సంతానమునకు బీజము మాత్రముగాని క్షేత్రముమాత్రముగాని ప్రధానముకాదనియు బీజక్షేత్రములురెండును సమానములేయనియు (పు 168) నున్నగు వాక్యము లితనిసమదృష్టి కుదాహరణములైయున్నవి. పిడివాదము చేసి యేదియోయొకవిధమునఁ దనవాదము గెలిపించుకొనవలయుననెడి శాస్త్రవేత్తలలోఁ గౌటిల్యుఁడొకఁడుకాఁడు. కార్యసాఫల్యమే యితనిముఖ్యోద్దేశము. అమాత్యోత్పత్తిప్రకరణములో పరాశరాదుల యభిప్రాయములఁజెప్పి తుదకు ఇదియంతయు— (అనఁగా) అందఱియభిప్రాయములుకూడ—లెస్సగనేయున్నవి. పురుషసామర్థ్యము కార్యసామర్థ్యముననుసరించిగదా కల్పింపఁబడుచున్నది. కావున, సామర్థ్యదేశకాలకర్మలఁబట్టి యమాత్యవిభవమునువిభజించి వీరినందఱిని నమాత్యులుగఁ జేయవచ్చును (పు 14) అనువాక్యమితనివ్యవహారదీక్షకు నిదర్శనము. ఇట్టివాక్యము లెన్నియోయున్నవి.

కౌటిల్యుఁడు ధర్మచింతగలవాఁడు. అన్యాయప్రవృత్తిని గర్హించువాఁడు. స్వలాభమునుకాని తాత్కాలికలాభమునుకాని యపేక్షించువారియెడలబద్ధవైరముగలవాఁడు. ప్రభువుమరణావస్థయందున్నప్పుడుగాని మృతిచెందినవెంటనేగాని యమాత్యుఁడు న్యాయాన్యాయవిచక్షణతచేయక తానే సింహాసనారూఢుఁడగుట పరమధర్మమను భారద్వాజాదుల మతమునుఖండించి, అధర్మిష్ఠమగునీకార్యమెన్నటికిఁగూడదు. ఆత్మసంపన్నుఁడగు రాజపుత్రునే రాజ్యమందుంపవలెనని సిద్ధాంతపఱచియున్నాఁడు (పు 265-66). రాజపుత్ర

రక్షణప్రకరణమందలి యభిప్రాయములఁబట్టికూడఁ గౌటిల్యునిధర్మచింత వ్యక్తమగుచున్నది (పు 34-5). పదునాలుగవయధికరణమందు వర్ణింపఁబడిన యౌపనిషదికములకు క్రూరకర్మలను చాతుర్వర్ణ్యరక్షార్థమై యధర్మిష్ఠులయెడ నుపయోగింపవలెనుకాని స్వలాభమునుద్దేశించి ధర్మిష్ఠులయెడ నుపయోగింపరాదని సూచించుటకుఁగూడ నిదియేకారణము (పు 430). "కౌటిల్యఃకుటిలమతిః" అనుముద్రారాక్షసములోని వాక్యము సత్యమయినదిగఁ గనపడ లేదు.

కౌటిల్యుఁడు పైని చెప్పినచొప్పున వైదికమతాభిమాని యను విషయమునే కామందకుఁడు "జాతవేదా ఇవార్చిష్మాన్ వేదాన్ వేదవిదాంవరః। యోఽధీతవాన్ సుచతురః చతురోప్యేక వేదవత్॥ అను వాక్యములచేఁ జెప్పియున్నాఁడు. కౌటిల్యునినాఁటికి మనదేశమందు వైదికమతములగు జైనబౌద్ధమతములు ప్రజాభిమానమునకుఁ బాత్రములై యుండెడివి. నందుఁడును నతనికిఁబూర్వులగు మఱికొందఱురాజులు నేతన్మతావలంబనులైనట్లు తెలియుచున్నది. ఇట్టిరాజులఁద్రోలఁగించి, కౌటిల్యుఁడు బ్రాహ్మణమతము నుద్ధరింపఁబ్రయత్నించెను. కావుననే యితఁడు తనయర్థశాస్త్రమందు వేదములకును చతుర్వర్ణచతురాశ్రమములకును సహజమగుప్రాధాన్యమును కల్పించియున్నాఁడు. రాజపుత్రుఁడు నేర్చికొనవలసినవిద్యలలో వేదములొక్కటై యున్నవి (పు 9). చతుర్వర్ణచతురాశ్రమములుకలదియేలోకమని యతనియభిప్రాయము (పు 8). రాజు వర్ణాశ్రమస్థితికర్త—లోకము త్రయి (వేదము) చేత రక్షితమై యున్నది (పు 7). లోకములోని చతుర్వర్ణచతురాశ్రమములను ఖిలమగుచుండుస్వధర్మములనురక్షించుటచేతనే రాజు ధర్మప్రవర్తకుఁడగుచున్నాఁడు(పు 153) లోనగువాక్యములవలనఁ గౌటిల్యుని వైదికమతాభిమానము స్పష్టమగుచున్నది.



## II

అర్థశాస్త్రమును విమర్శింపఁబూనినపుడు గ్రంథకర్తను గుఱించియేగాక గ్రంథములోని విషయములగుఱించికూడ కొంతవఱకు చెప్పవలసియున్నది. "మనుష్యులవృత్తియుమనుష్యవతియగుభూమియు అర్థమనబడుచున్నవి. అట్టిభూమియొక్క లాభపాలనోపాయములను తెలుపుశాస్త్రమర్థశాస్త్ర"మని కౌటిల్యుఁడు (పు446). కాని, ఈనిర్వచనమున కనురూపముగ నతఁడు గ్రంథమును వ్రాయులేదు. భూసంపాదనపరిపాలనోపాయములతో దగ్గరసంబంధములేని ప్రశంసలనేకముల నతఁడు గ్రంథమందుచేర్చియున్నాఁడు. అందుచేత నీగ్రంథము మిగులబాహుళ్యమైయున్నది. కొందఱిది యనౌచిత్యదోషమనికూడ భావింపవచ్చును. అధ్యక్షప్రచార ధర్మస్థీయాధికరణములలో చాలభాగమందీదోషముగపడుచున్నది. కోశముందుంపఁదగిన రత్నములు ఆకరకర్మాంతములకుసంబంధించిన ధాతువులు కుప్యవిభాగము తులామానపౌతవము దేశకాలమానము వివాహధర్మము పుత్రవిభాగము లోనగుప్రకరణములలో వివరింపఁబడిన యంశములలో చాలభాగము భూసంపాదనపరిపాలనములతో నెట్టిసంబంధము లేనివి. ఈదోషము శుక్రనీతిమొదలగు నితరనీతిశాస్త్రములందింతకంటె నధికముఁగనున్నది. కాని, ఇట్టివిషయములను కౌటిల్యుఁడు వానిగ్రంథమందుచేర్చుటవలననాకాలపురాజకీయవ్యవస్థలేగాక సాంఘిక ఆర్థికపరిస్థితులను దెలిసికొనుటకు మనకవకాశముకలిగినది. వీనినన్నిటిని సంపూర్ణముగ వివరింపవలయుననుసంకల్పముమొదటనాకుండెనుగాని గ్రంథవిస్తరభీతిచే కొన్నివిషయములనుమాత్ర మిచట చెప్పుచున్నాను.

ప్రభుత్వమునకు దండము (దండనాధికారము) ప్రధానలక్షణము. ఇద్ది యొకపురుషునియందుమాత్రమే సంక్రమించినయెడల నేకనాయకమనియు అనేకులయందు సంక్రమించినయెడల బహునాయకమనియు, ప్రజలయందుగాని ప్రజాప్రతినిధుల యందుగాని

సంక్రమించినయెడలఁ బ్రజానాయకమనియుఁ బ్రభుత్వములను శాస్త్రకారులు మూఁడురకములుగ విభజించియున్నారు. గ్రంథాంతరములనుండి కౌటిల్యునికిఁబూర్వము మనదేశమందు 1. ఏకనాయకప్రభుత్వములు, 2. బహునాయకప్రభుత్వములునుండినట్లు తెలియుచున్నది. కాని, కౌటిల్యునికాలమున బహునాయకములున్నట్లువానిగ్రంథమందు నిదర్శనములులేవు. కొన్ని వాక్యముల నాధారముచేసికొని, యిట్టిప్రభుత్వములుండినట్లు విమర్శకులనేకు లభిప్రాయపడియున్నారుగాని వారియభిప్రాయము యుక్తియుక్తమై యుండలేదు. "రాజనేకులకాధారుఁడు కావునఁ బుత్రహంతుఁడై యుండవలెను. ఆపద్విషయమునఁదప్ప రాజ్యమునకు జ్యేష్ఠుఁడేయర్హుఁడు. ఒకప్పుడు రాజ్యము కులమునకుంగూడ సంక్రమింపవచ్చును. కులసంఘము దుర్జయము" అని కౌటిల్యుఁడు (పు 36) చెప్పియున్నాఁడు. బహునాయకులుగలరాజ్యమే కులసంఘమనియు, నట్టిరాజ్యములు సర్వసాధారణములైయుండెడివనియు విమర్శకులవాదము. కాని, యీదిసాధారణధర్మముకాదనియు నాపద్ధర్మమనియుఁ బూర్వాపరసందర్భమునుపట్టి తెలియుచున్నది. ఇదిగాక, యర్థశాస్త్రమందు సంఘవృత్తమనుయధికరణమొకటియున్నది. అందులో, "కాంభోజసురాష్ట్రములలోని క్షత్రియశ్రేణ్యాదులు వార్తాశస్త్రోపజీవులు. లిచ్ఛివికవ్రిజకమల్లకమద్రకకురుపాంచాలాదులు రాజశబ్దోపజీవులు" అని చెప్పఁబడియున్నది (పు 3[illegible]5). ప్రకరణమందంతట నీసంఘములవశపఱచుకొనుటకువలయు నుపాయములుదాహరింపఁ బడియున్నవి. ఈవాక్యములనుపట్టి కూడ నాకాలమున సంఘప్రభుత్వములుండినట్లు తోఁచుచున్నది. కాని (1) వీనిలోనేవియు స్వతంత్రరాజ్యాధికారము కలిగినట్టివి కావు. కాంభోజాదులవృత్తి చెప్పఁబడినదే కాని వారిరాజ్యాధికారమునుగుఱించిన ప్రశంసలేదు. లిచ్ఛివికాదులను చంద్రగుప్తచక్రవర్తికంటె రెండువందలసంవత్సరములకుఁబూర్వము మగధరాజ్యమునుపాలించిన యజాతశత్రుఁడు జయించివశపఱచుకొనినట్లు చరిత్రలవలన

మనకుఁ దెలియుచున్నది. కురుపాంచాలదేశములందనాదిగ నేకనాయకమే గాని సంఘప్రభుత్వములున్నట్లు ప్రతీతికూడ లేదు. కావునఁ గౌటిల్యుని కాలమందు బహునాయకరాజ్యములు లేవని యేర్పడుచున్నది. (2) లిచ్ఛవి కాదులు రాజశబ్దోపజీవులని చెప్పుటలో వారు కాంభోజాదులవలె వార్తా (కృషిపాశుపాల్యాదులు) మూలముననుగాని శస్త్రములమూలముననుగాని జీవించువారు కారనియు, నిప్పటికాలపు జమీన్దారులవలె రాజబిరుదముగలవారై భూస్వాములై యితరులకృషి మూలమున జీవించుచుండినవారను నర్థము స్ఫురించుచున్నది. ఈ వాక్యములా కాలపు క్షత్రియ శ్రేణుల జీవనోపాయములఁ దెలియఁపఱచునవియే కాని మఱియొకటి కాదు. ప్రభువుయొక్క సైన్యములో 'శ్రేణి' బలమను భాగ మొకటియుండెను (పు 356). అట్టి సైన్యములు కాంభోజాదిక్షత్రియులమూలమున లభించుచుండెను. సంఘములవశపఱచుకొనుటకుఁ గౌటిల్యుఁడు చెప్పిన యుపాయములనన్నిటిని నజాతశత్రుఁడు ప్రయోగించినట్లు బౌద్ధగ్రంథములనుండి తెలియుచున్నది. దీనినిపట్టికూడ నిదివఱకెప్పుడో జరిగినయంశముల మనసునందుంచుకొని కౌటిల్యుఁడీయధికరణమును వ్రాసెనుకాని వానికాలమునాటిస్థితిగతులను వర్ణించినవాఁడు కాఁడని స్పష్టమగుచున్నది.

ఏకనాయకములగు రాజ్యముల పరిపాలనక్రమ మెట్లుండెనో మనమిప్పుడు తెలిసికొనవలెను.

ఏకనాయకములగు రాజ్యములందు సర్వాధికారము రాజునందు సంక్రమించియుండుటచేత స్వధర్మములఁ జక్కగ నిర్వహింపఁగలశక్తి సంపాదించుట రాజునకత్యంతావశ్యకము. "రాజు కార్యోత్సాహముగలవాఁడయినచో భృత్యులుగూడఁ గార్యోత్సాహులై వానిననుసరింతురు. రాజు ప్రమత్తుఁడయినచో వారుగూడఁ బ్రమాదమునొంది వానికార్యములఁ జెడఁగొట్టుదురు; శత్రువులుగూడ వానిని మోసపెట్టెదరు. కావునఁ దాను కార్యోత్సాహముగలవాఁడై యుండవలెను" (పు 39). ఈయుద్దేశము నెఱవేఱుటకొఱకే మొదటినుం

డినుఁ ప్రభువులు వారిపుత్రులవిషయమై కడుశ్రద్ధవహించి, వారిని తగురీతిగశిక్షించి సింహాసనార్హులఁ జేయుచుండిరి. ఈవిధానమును కౌటిల్యుఁడనేకప్రదేశములందు సూచించియున్నాఁడు. "మహిషిఋతుమతియగునపుడే ఋత్విక్కులైంద్రాబార్హస్పత్యమగు చరువునియ్యవలెను. గర్భిణియగునామెయొక్క గర్భపోషణమందును ప్రజననవిషయమునను కౌమారభృత్యజనమును నియమింపవలెను. సంతానముగలిగినపిమ్మటఁ బురోహితుఁడు పుత్రసంస్కారమొనర్పవలెను. మఱియుఁ బ్రాజ్ఞుఁడగుపుత్రునిఁ బండితులు శిక్షింపవలెను." (పు 35). అవినీతపుత్రుఁడుగల రాజకులమభియుక్తమాత్రమై కొట్టఁబడుఁగాన (పు35) నీతనివిషయమై యింతటిశ్రద్ధవహింపవలసిన యవసరముకలదు. రాజపుత్రునికిఁ గొంతవయసువచ్చిన తర్వాత చౌళకర్మనుచేసి విద్యాభ్యాసమందుఁ బ్రవేశపెట్టుచుండిరి. లిపి, సంఖ్యానమువచ్చినతర్వాత నుపనయనముగావించి శిష్టులనుండియాన్వీక్షికీత్రయులను, నధ్యక్షులనుండివార్తను వక్తృప్రయోక్తలనుండి దండనీతిని నేర్చువాఁడు. ఇవిగాక, యతఁడు హస్త్యశ్వరథప్రహరణవిద్యలందును, పురాణేతివృత్తాఖ్యాయికోదాహరణ ధర్మశాస్త్రములందును శిక్షనొందుచుండెను. ఈకాలమందంతట నితఁడు బ్రహ్మచారియై నియమములనుసరించి విద్యాభ్యాసము చేయుచుండువాఁడు, వీనినన్నిటినిపట్టి యాకాలపురాజు లెట్టిపాండిత్యమును సంపాదించుచుండిరో స్పష్టమగుచున్నది (పు 9-10.) విద్య బ్రహ్మచర్యముతో ముగియునదికాదు. సింహాసనాధిష్ఠితుఁడయినపిమ్మటగూడఁ బ్రభువు ప్రతిదినమునఁ గొన్నిగంటలు విద్యావ్యాసంగము చేయుచుండెను. (పు 40).

బ్రహ్మచర్యానంతరము పరిపాలనాధికారము వహించునంతవఱకు రాజపుత్రునిజీవితము కష్టములతోఁగూడియుండెను. ఇవియొకప్పుడు వానిలోపములమూలమునను మఱియొకప్పుడు తండ్రియొక్కలోపములమూలమునను సంభవించుట కలదు. "రాజపుత్రులు

కర్కటకసధర్ములై జనకభక్షకులై యుందురు' (పు 34). సామాన్య ముగవారికిఁ దండ్రియెడ ననురాగముండదు. తండ్రినికూడఁ జంపి తాము రాజులుకావలయునని కోరుచుందురు. కావున నట్టిపుత్రుల ను జాగరూకతతోఁ బరీక్షించుచు, సందర్భానుసారముగ వారిని ర హస్యవధకో దేశాంతరవాసమునకో పాత్రులఁజేయవలెను. ఇంద్రి యలోలురగుపుత్రులను భయపెట్టింపవలెను. కలహింపనుద్దేశించిన వారిని ఖేదపెట్టవలెను. కాని, పుత్రుఁడాత్మసంపన్నుఁడయినయెడల వానిని సేనాపత్యమందుఁగాని యౌవరాజ్యమందుఁగాని యుంచుట యాచారమైయుండెను. ఒక్కొకప్పుడు తండ్రి యితరపుత్రులయం దభిమానముగలవాఁడై జ్యేష్ఠునియెడవిరోధియగుట సంభవించుచుం డెను. అప్పుడాపుత్రుఁడు దేశాంతరములకు వెళ్ళి బలమునుసంగ్ర హించి తండ్రపైవిక్రమించిరాజ్యాపహారణముచేయుటకలదు (పు37-8) మొత్తముమీఁదఁ దండ్రికిని పుత్రునికిని పరస్పరాభిమానముండుట యరుదని కౌటిల్యుని యభిప్రాయము.

సాధారణముగ నాకాలమందుఁ దండ్రియనంతరము జ్యేష్ఠ పుత్రుఁడు సింహాసనమధిష్ఠించుట యాచారము (పు 36). కానికొ న్నిసమయములందిట్లు జరుగునదికాదు. "దుర్బుద్ధిగయొక్కఁడే పుత్రుఁ డయినపుడు వానికిఁబుత్రులు కలుగునట్లు ప్రయత్నింపవలయును. లేదా పుత్రికలకునయినఁ బుత్రులుకలుగునట్లు ప్రయత్నముచేయ వలెను.. అవినీతుఁడగు నేకపుత్రునిమాత్రము రాజ్యమునందుంప రాదు" (పు 36). పుత్రుఁడు వినీతుఁడయినపుడుకూడఁ బ్రమాద వశమునరాజ్యమాతనికి లభింపకపోవచ్చును. ఈప్రమాదము నమా త్యుని దురాశచేఁగాని సామంతాదులప్రకోపముచేఁగాని కలుగుచుం డెడిది. కొన్నిసమయములందుఁ బ్రభువుయొక్కమరణమునురహస్య ముగనుంచి, రాజబంధువులకుఁ బరస్పరకలహముగలిగించి యమా త్యుఁడు తానేరాజ్యమును గ్రహించుచుండువాఁడు. అమాత్యుఁడు ధర్మిష్ఠుఁడును ప్రభుభక్తియుతుఁడునునయినచో నిట్టియాపదలేమియు

లేక, రాజపుత్రుఁడు సింహాసనాసీనుఁడగుచుండెను. ఈవిషయములను కౌటిల్యుఁడు (పు 264-7) వివరించియున్నాఁడు.

ప్రమాదముల నన్నిటిని తప్పించుకొని రాజ్యమునకువచ్చినతర్వాత సామాన్యముగ యావజ్జీవమొకఁడే పరిపాలకుఁడుగ నుండెను. కాని, యొక్కొకప్పుడు ప్రజ లధార్మికుఁడగు రాజును బలవంతముగఁ దొలఁగించుటయుఁగలదు. యజ్ఞములఁ జేయఁదగనివారిచే యజ్ఞములఁజేయించుట, లంచముదీసికొనిరను నేరము నన్యాయముగ నుద్యోగస్థులపై నారోపించుట వర్తకుల యర్థమానముల నపహరించుట లోనగుపనులనుచేసినపుడు రాజునకు రాజ్యభ్రష్టతకలుగుచుండెడిది (పు 16). రాజు ధార్మికుఁడయినపుడుసహితము బంధువులమూలముననఁగాని బాహ్యశత్రుపక్షీయులమూలముననఁగాని యొక్కొకప్పుడు బలవన్మరణమతనికి సంభవించుటకలదు. ఇట్టి యాపదలనుండితప్పించుకొనుటకు వలయునుపాయములు నిశాంతప్రణిధి, ఆత్మరక్షితకప్రకరణములందు వివరింపఁబడియున్నవి (పు 41-6).

కౌటిల్యునిచే వర్ణింపఁబడిన రాజత్వము నిరంకుశమయినదని పండితులయభిప్రాయము. ఇదిసత్యమా కాదాయని నిర్ణయించుటకుఁబూర్వము నిరంకుశప్రభుత్వమన నెట్టిదో తెలిసికొనవలెను. (1) ప్రభువులు శాసనబద్ధులుకాక తమకిష్టమువచ్చిన శాసనములనిర్మించి పరిపాలనముజరుపుచుండిన యెడల వారిప్రభుత్వము నిరంకుశమయినదని చెప్పఁదగియుండును. ఇట్లుకాకపోవుటచేతనే అమెరికా సంయుక్తరాష్ట్రములోని ప్రభుత్వము నిరంకుశము కాదని మనమనుకొనుచుందుము. ఆరాష్ట్రములలోఁగూడ శాసనములనిర్మించు శాసనసభలు వానినమలులోనుంచు కార్యనిర్వాహకశాఖవారు వానినిసమన్వయించు న్యాయాధికారులు కలరు; కాని వీరెల్లరు 1783 లో ప్రజలునిర్మించిన ప్రభుత్వశాసనమునకు బద్ధులై వీరికార్యముల జరుపుచున్నారు. కావున వీరియధికారము నిరంకుశముకాదు. ప్రభుత్వశాసనము (Constitutional law) నతిక్రమించినడుచుటకు వీరికివా

క్కు లేదు. ఇట్టిశాసనమునకు బద్ధములు కానిప్రభుత్వములు నిరంకుశములు. (2) కాని, యింగ్లండులో నిట్టిశాసనమేదియు లేదు. పార్లమెంటునుసభ యెట్టిశాసనములనైన నట్టిశాసనములనిర్మించు నధికారముగలిగియున్నది. అయినప్పటికి నింగ్లీషుప్రభుత్వము నిరంకుశమైనదని మనమనుకొనుటలేదు. దీనికిఁ గారణమేమి? శాసనములనిర్మించు పార్లమెంటులోని సభవారందఱు ప్రజాప్రతినిధులు; ప్రజాభిప్రాయములపట్టి ప్రవర్తించువారు. కావునఁ బ్రజలకువిరుద్ధమగుశాసనములెన్నఁటికి నమలులోకి రాఁజాలవు. కావున నాదేశమందు ప్రజలు ప్రభువునను భేదమువిస్తారములేదు.

ఈరెండులక్షణములలో నేదియున్నను ప్రభుత్వము నిరంకుశము కాకుండును.

మొదటిలక్షణము పూర్వకాలపుభారతీయ ప్రభుత్వములలోఁ గనుపడుచుండినట్లు కౌటిల్యునిఁబట్టి మనముచెప్పవచ్చును. (1) ఇష్టమువచ్చినశాసనమును చేయుటకు రాజునకధికారములేదు. అతనిశాసనములెల్లప్పుడు ధర్మశాస్త్రమునననుసరించి యుండెడివి. అనఁగా నతఁడు శాస్త్రబద్ధుఁడై యుండెనవాఁడు. "ప్రభువు ప్రజలను స్వధర్మమునుండి వ్యభిచరింపకుండఁ జేయువాఁడు. స్వధర్మపరిపాలకుఁడును, ఆర్యమర్యాదావ్యవస్థాపకుఁడును వర్ణాశ్రమస్థితికి కర్తయునగు రాజిహపరసౌఖ్యములఁ బొందుచున్నాఁడు" లోనగువాక్యములు దీనికినిదర్శనము (పు 7). న్యాయస్థానములందుఁ దీర్పులుచెప్పవలసివచ్చినపుడు న్యాయాధికారులు దేశాచారమునుపట్టి వెళ్లువారేగాని రాజశాసనమునుపట్టికాదు. 'దేశజాతిసంఘగ్రామములందుఁ బాటింపఁబడుధర్మమునననుసరించి దాయవిభాగము చేసికొనవలెను' అనువాక్యమందలియభిప్రాయమిదియే (పు 169). కావున రాజుయొక్కశాసనాధికారము నిరంకుశముకాదని తెలియుచున్నది. (2) కౌటిల్యుని గ్రంథమందు శాసనాధికారమను ప్రకరణమొకటికలదు. దానిలోని విషయముల విమర్శించినయెడల రాజశాసనలక్షణములేవియో స్పష్ట

మగును. వీనిలోననేకములు విదేశరాజులకు వ్రాయఁబడు లేఖార్థము లగుటచేనవి నిరంకుశాధికారమునుసూచించునవికావు. తక్కినవిరాజాజ్ఞలయినను వానిలోఁ బ్రజలను బాధింపఁగలవి చాలతక్కువగనున్నవి. ప్రజ్ఞాపనము పరిదానము పరిహారము నిసృష్టి ప్రావృత్తికము ప్రతిలేఖము సర్వత్రగము— అనుశాసనములు ప్రస్తుతకాలపురాజశాసనములను బోలినవికావు. 'విధి నిషేధము శిక్ష' లనునవి శాసనములకంగములని ప్రస్తుతకాలపుపండితులమతము. పైనుదాహరింపఁబడిన వానికీలక్షణములులేవు. కావునఁ గౌటిల్యునికాలములో మనదేశపురాజులు నిరంకుశముగశాసనముల నిర్మించుచుండినవారు కారనితోఁచుచున్నది.

కార్యనిర్వహణమందుమాత్ర మాకాలపురాజులు నిరంకుశులైయుండిరి. అందులోవారికి సలహాలనిచ్చుమంత్రులు మంత్రిపరిషత్తులోనివారు, సమాహర్త సన్నిధాత మున్నగుప్రధానోద్యోగస్థులు, నధ్యక్షాదిసామాన్యాధికారులు— లోనగువారిపైఁ బ్రజలకెట్టియధికారముండెడిదికాదు. ప్రజలుసభలలోఁజేరి ప్రభుకార్యములవిమర్శించి స్వాభిప్రాయములను పరిపాలకులకుఁదెలుపుటకువలయు నేర్పాటులాకాలమందులేవు. ఉద్యోగస్థులు రాజాజ్ఞాబద్ధులుగాని, ప్రజాభిప్రాయము ననుసరించువారుకారు. రాజశాసనములు శాస్త్రవిరుద్ధములవునా కావాయని తీర్మానించుపండితులు రాజువద్దనౌకరులేగాని స్వతంత్రాధికారులుకారు. కావునఁబ్రజలనుపీడించి యక్రమముగఁ గార్యములొనర్చుట కాకాలపురాజులకుఁ జాలనవకాశముండెను.

సామ్రాజ్యపరిపాలనమందు స్వయముగ సమస్తకార్యముల నిర్వహించుటకుఁ బ్రభువునకువీలుండదు. రాజత్వము సహాయసాధ్యము. ఒకచక్రమెన్నఁడు నడువనేరదుగదా? కావునరాజులు సచివులనిడుకొని వారిమతమున ననుసరించి ప్రవర్తింపవలెను (పు 12). ఈవిధముగ రాజునకుసహాయముచేయుచున్నవారిందఱకు నమాత్యు

లను పేరుంజెను. సామాన్యముగ నమాత్యపదమును మంత్రిపదమున కు పర్యాయపదముగ మనమువాడుచుందుము. కాని, కౌటిల్యుని గ్రంథమందు దానికిట్టియర్థములేదు. ప్రతిరాజసేవకుఁడు నమాత్యుఁడనియే పిలువఁబడుచుండెను. ఈకాలమున మనము సర్కారుద్యోగస్థులను 'సివిల్సర్వెంట్సు' (Civil Servants, Civil Service) అనిచెప్పుచుందుము; అమాత్యులననిదియే యర్థము. అమాత్యులలోఁ గొందఱధ్యక్షులుగను, కొందఱుసమాహర్త్రాది ప్రధానోద్యోగస్థులుగను, మఱికొందఱు మంత్రిపరిషత్సభ్యులుగను, తక్కినవారుమంత్రులుగను నియమింపఁబడుచుండిరి. ఇదంతయు వారివారిశక్తిసామర్థ్యములఁబట్టి జరుగుచుండెను (పు 14,15,17,31 లో నీవిషయములు సూచింపఁబడియున్నవి).

అమాత్యులందఱిలో మంత్రులు ప్రధానులైయుండిరి. వారితోనాలోచింపక రాజెట్టికార్యములనుచేయువాఁడుకాఁడు (పు 27). కార్యసిద్ధికైవలయు నారంభోపాయము పురుషద్రవ్యసంపత్తు దేశకాలవిభాగము వినిపాతప్రతీకారములను విషయముల వారువిమర్శించుచుండిరి (పు 29). ఇందువలననే, యత్నసిద్ధి మంత్రాయత్తమని కౌటిల్యుఁడు (పు 368). సామాన్యముగ ముగ్గురునలుగురికంటె నెక్కువమంత్రులుండుటలేదు (పు 29). ఏదయినవిషయమునాలోచింపవలసినపుడు మంత్రులందఱిని సభకూర్చి యనుకొనినకార్యమువలని సాధకబాధకములచర్చించుట మామూలుగనుండెను; చర్చవలన లాభములేదనితోఁచినపుడు, ప్రభువు మంత్రులొక్కొక్కరిని ప్రత్యేకముగఁబిలిపించి వారియభిప్రాయములఁ దెలిసికొనువాఁడు (పు 29) ఈవిధముగ నేదియోతీర్మానముచేసికొని, దానిని లేఖకునిచే శాసనాధికారప్రకరణమునఁ జెప్పఁబడిన రచనాదోషములులేకుండవ్రాయించి ప్రభువు తత్సంబంధులకుఁ బంపువాఁడు; ఇవియే రాజశాసనములు. మంత్రులు సాధారణముగ నెల్లప్పుడు ప్రభువుసమక్షమునను ండువారు; ఆకారణముచేతనే వారికి దుర్గమందుఁ బ్రత్యేకముగ బస

తీర్పాటుగావింపఁబడియుండెను (పు 56).

మంత్రులుగాక మంత్రిపరిషత్తను మఱియొక ప్రత్యేకసభ యుండినట్లు తోఁచుచున్నది. ఇందులోని సభ్యులసంఖ్య నియమితముకాదు. కార్యగౌరవమునుపట్టి సంఖ్యనిర్ణయింపఁబడుచుండెను. యుద్ధసంబంధములగు కార్యములు చక్కఁబెట్టుటకు వలయుసదుపాయములఁ గల్పించుట దానిపనియై యుండెను. కావున దానిలోనిసభ్యులు దేశాటనముచేయుచుఁ బరగణాలలోని యుద్యోగస్థులు వారివారికార్యములు చక్కఁగ నెరవేర్చుచున్నారో లేదో కనుగొనుచుఁ దాము చూచినట్టియు వినినట్టియు విషయములఁ బ్రభువునకుఁ దెలియఁజేయుచుండువారు. ఈకారణముచే నొక్కొకప్పుడు వారు ప్రభుసమక్షముననుండుట తటస్థించునదికాదు. అప్పుడువారితో నాలోచించుట యవసరమయినయెడలఁ బత్త్రప్రేషణమూలమున వారియభిప్రాయములను రాజు తెలిసికొనుచుండెను (పు 30). కొన్నివిషయములందుఁ బ్రభువు మంత్రులను మంత్రిపరిషత్సభ్యులనుకూడఁ గలిపి సభ చేయువాఁడు. అప్పుడధికసంఖ్యాకు లెట్లుచెప్పిన నట్లునడచుకొనుట యాచారము (పు 30). ఆలోచనకై యేర్పడినసభలగురించి కౌటిల్యుఁడింతకంటె విపులముగఁ జెప్పియుండలేదు.

మంత్రులందఱిలో నమాత్యుఁడు ప్రధానుఁడు. అమాత్యశబ్దమేకవచనమందుఁ బ్రయోగింపఁబడినపుడు ప్రధానమంత్రియని దానికర్థము. రాజ్యమందు రాజుతర్వాతివాఁడే యమాత్యుఁడు. ప్రభుత్వవిషయములన్నిటిలో నతఁడు రాజునకుఁ గుడిభుజము. రాజున కుపకారముగాని యపకారముగాని యొనర్చునంతటి సామర్థ్యమతని కుండెను. ఇష్టముండినయెడల రాజ్యమునుకూడ నపహరింపఁగలయంతటి యవకాశమతని కుండెడిది. యుద్ధకాలమందితనిమూలమునఁ బ్రభువునకెంతహానియైనఁ జేకూరవచ్చును; కావున నట్టిసమయమందు రాజు తనదోషమునొప్పుకొనియైన నమాత్యుని శాంతిపఱుపఁబ్రయత్నించుచుండువాఁడు. మహాపరాధముగావించినను పురోహితు

నికిని ప్రధానమంత్రికిని మరణదండనములేదు. అమాత్యపదవి యింతటిగౌరవముతోడను నధికారముతోడను కూడుకొనియుండినదగుటచే తనే ప్రభువునుండి యతనిని వేరుపఱచినయెడలఁ దమకుఁదప్పకజయములభించునని శత్రువులు నమ్ముచుండువారు. రాజ్యములోనిగూఢపురుషు లందఱిపై నమాత్యునికి నిరంకుశాధికార ముండెడిది (పు 360; 19).

పరిపాలనవిధానమందుఁ గార్యాలోచనకంటె కార్యనిర్వహణము ప్రధానతరమయినది. కౌటిల్యునికాలమందలి రాజకార్యనిర్వాహకులలో (1) రాజసముఖమందుండి రాజ్యమంతటిపై నధికారమువహించినవారొకొందఱు (central executive) (2) రాజ్యములోని యొక్కొకరాష్ట్రముపై నధికారము చెల్లించుచుండినవారు కొందఱు (Provincial executive) (3) రాష్ట్రములలోని గ్రామములమీదను గ్రామసముదాయములమీదను నధికారమువహించినవారు మఱికొందఱునుండిరి. ఈ మొదటితరగతిలో 1. మంత్రి, 2. పురోహితుఁడు, 3. సేనాపతి, 4. యువరాజు, 5. దౌవారికుఁడు, 6. అంతర్వంశికుఁడు, 7. ప్రశాస్త, 8. సమాహర్త, 9. సన్నిధాత, 10. ప్రదేష్ట, 11. నాయకుఁడు, 12. పౌరవ్యావహారికుఁడు, 13. కార్మాంతికుఁడు, 14. మంత్రిపరిషదధ్యక్షుఁడు, 15. దండపాలుఁడు, 16. దుర్గపాలుఁడు, 17. అంతపాలుఁడు, 18. ఆటవికుఁడనువారు నెనమండ్రుద్యోగస్థులు చేరియుండిరి. వీరికిఁ బదునెనిమిదితీర్థములనియుఁగూడ పేరుకలదు (పు 20). కానివీరిలో నొక్కొక రెట్టిపనులను చేయుచుండిరో కౌటిల్యుఁడుపూర్తిగా వివరించినవాఁడు కాఁడు. కొందఱినిగుఱించిమాత్రి మచ్చటచటఁ గొంతవర్ణనమున్నది. తక్కినవారినామములనుపట్టియే వారికార్యముల నూహింపవచ్చును.

వీరందఱిలో సమాహర్తయుద్యోగము గొప్పపూఁచీతోఁగూడుకొనినదని చెప్పుటకుఁదగియున్నది. సర్వారంభములు కోశపూర్వకములు (పు 67) గాన కోశసంగ్రహణపరిశోధకుఁడగు సమాహర్త

యధికమగు గౌరవాధికారములకుఁ బాత్రుఁడైయుండెను. ఆదాయ శరీరమునకంగములగు 1 దుర్గ, 2 రాష్ట్ర, 3 ఖని, 4 సేతు, 5 వన, 6 వ్రజ, 7 వణిక్పథములమంచిస్థితియందుంచి, యాదాయవృద్ధినొనర్చి వ్యయమును తగ్గించి విపర్యయములనివారించుచు సముదయమునుగావించుట యతనికి విధియైయుండెను (పు 63). పైయేడుమార్గములనుండి రాజునకురావలసిన యాదాయమును సుకరముగవసూలు చేయుటకై యతఁడు జనపదమునునాలుగుభాగములుగను, నొక్కొకభాగము ననేకగ్రామసముదాయములుగను విభజించి, వానిపైఁదగినయుద్యోగస్థులనియమించువాఁడు. వీరిలో గోపుఁడనువాఁడైదుగాని పదిగాని గ్రామములపై నధికారమువహించి, గ్రామములకు సంబంధించిన లెక్కలనన్నిటిని తయారుచేసి పన్నులువసూలుచేయుటయందు సమాహర్తకుఁ దోడ్పడువాఁడు. గోపునిపై స్థానికుఁడను మండలాధికారియు, స్థానికునిపైఁ బ్రదేష్టయనునధికారియునుండెను. ప్రదేష్టలు సాధారణముగ నొకచోటనుండక, రాష్ట్రాటనముగావించుచు గోపులయొక్కయు స్థానికులయొక్కయు పనులనువిచారించుచుండువారు (పు 144) వీరుగాక, గూఢపురుషులనేకులు జనపదమందంతటఁ దిరుగుచు వివిధవిషయములగురించి సమాహర్తకుఁదెలుపుచుండువారు (పు 145).

యుద్ధము దుర్భిక్షము లోనగునుపద్రవముల మూలమునకోశనష్టమొంది రాజు ధనమునకై శ్రమపడుచుండునపుడు సమాహర్త స్వబుద్ధినుపయోగించి నూతనోపాయములచేఁ గోశసంగ్రహణముచేయవలసియుండెను. అతఁడు సమర్థుఁడౌనా కాదాయని తెలిసికొనుటకప్పుడే యవకాశము. అట్టిసమయములం దతఁడేదియోమిషపెట్టి యాచనమూలమునఁగాని మోసముచేసిగాని బెదరించిగాని ప్రజలనుండి ధనమురాఁబట్టువాఁడు (పు 252-4). కావుననే ప్రభువుయొక్కప్రయత్నములు సఫలములగుటకు సమాహర్త కారణభూతుఁడైయుండెను.

ఈకాలమున మనదేశమందు రివిన్యూవ్యవహారములఁ బరిష్కరించుమండలాధికారులు దండనాధికారము (Magisterial power) గూడ వహించియుండుట సర్వసాధారణమైయున్నది. కౌటిల్యునికాలమందుఁగూడ నిట్లేజరుగుచుండెను. ప్రజలతో సమాహర్త కున్నంతటిసంబంధము ప్రధానోద్యోగులలో మఱెవ్వరికిలేనందున దేశములోనిదుర్మార్గులు పెట్టుబాధలనుండి ప్రజలనురక్షించుట యతనికివిధిగ నేర్పడియుండెను. ఇందుకై యతఁడు గూఢచారులననేకుల రహస్యముగఁబంపి గ్రామస్థులయొక్కయు నధ్యక్షులయొక్కయు శుచిత్వాశుచిత్వముల నెఱుంగుచు శంకితులగున్యాయాధికారులను లంచగొండ్లగు నమాత్యులను కూటసాక్షులను కపటపునాణెములఁ జేయువారిని రసదులను హింసించుతక్కినగూఢాజీవులను తగువిధముగశిక్షించుచుండెను (పు 217-19). ఇట్టివారందఱు దేశకంటకులై ప్రజలకును ప్రభుత్వమునకును నష్టముకలిగించుచుండువారగుటచే వారినిపట్టుకొని వారిదుష్కృత్యములఁ బ్రచురపరచుట యెంతయోయావశ్యకమగుకార్యము. ఇట్టిపనులను జాగరూకతతో నెరవేర్చుచు రాజుయొక్కసర్వజ్ఞత్వమును దేశమందంతట సమాహర్త ప్రకటించుచుండెను (పు 220).

ఇంతటియధికారమును గలవాఁడగుటచే నొక్కొకప్పుడుసమాహర్త సహితము ప్రజలనుపీడింపఁగలవాఁడై యుండెను. దీనినే కౌటిల్యుఁడీవిధముగఁ జెప్పియున్నాఁడు. 'సమాహర్త స్వార్థమునేముదటసంగ్రహించుకొని పిమ్మట రాజార్థముకొఱకుఁ బ్రయత్నించును, లేక రాజార్థమునకు వినాశముగలిగించును. మఱియుఁ బరధనమును తీసికొనుటలో స్వతంత్రుఁడై చరించును' (పు 345).

పైనిచెప్పిన పదునెనిమిదితీర్థములకులోఁబడి తక్కినయుద్యోగులందఱు (Civil Servants) వారివారికార్యముల నిర్వహించుచుండిరి. కాని రాజోద్యోగులనెప్పుడు నమ్మఁగూడదనియే కౌటిల్యుని యభిప్రాయము. మనుష్యులస్థిరచిత్తులగుటచేనిత్యమువీరిని పరిపను

లవిషయమై పరీక్షించుచుండవలెను (పు 70). ఇదిగాక, నాలుకచివరనుండు విషమునుకాని తేనెనుకాని తినకవీలుపడనట్లర్థాధికారికి రాజద్రవ్యమును స్వల్పముగనయిన నపహరింపకుండుట దుస్తరము. నీటిలోఁజరించుచుండు మత్స్యములెవ్వరికిఁదెలియక నీటిని త్రాగునట్లు కార్యవిధులందు నియుక్తులగు నుద్యోగులెవ్వరికిఁ దెలియక ధనము నపహరించుచుందురు. ఆకాశమునఁజరించు పక్షులగమనమునయిన నెఱుంగవచ్చునుకాని ప్రచ్ఛన్నభావులై సంచరించు నుద్యోగులప్రవర్తనము దెలిసికొనుట దుస్తరము' (పు 72). కౌటిల్యుఁడీవాక్యముల నువ్రాసి రెండువేలసంవత్సరములకంటె నధికమైనది. కానివ్యవహారానుభవముగలవారందఱు నివి ప్రస్తుతకాలమునకుఁగూడ ననువర్తించునవియని యొప్పుకొనకపోరు. అప్పటికినిప్పటికిని మనుష్యస్వభావమందు విశేషమగుమార్పు కలిగినట్లు తోఁపదు. కౌటిల్యుఁడనుభవజ్ఞుఁడనుటకు నిదియేగొప్పనిదర్శనము.

ఈకారణములచే మొదటినుండియు నుద్యోగులు న్యాయప్రవృత్తులై యుండుటకు వలయునేర్పాటులనేకము లాకాలమునఁ జేయఁబడుచుండెను. ఏదియోయొక పరీక్షయందుత్తీర్ణుఁడయినఁగాని ప్రస్తుతకాలమందు గొప్పయుద్యోగములుదొఱకనట్లు అమాత్యసంపదగలవారికే యాకాలమందు రాజోద్యోగము లభించుచుండెను. నౌకరులకుండవలసిన శక్తిసముదాయమే అమాత్యసంపద. దేశము కులము శీలములోనగు లక్షణములఁబట్టి యుద్యోగములోఁ బ్రవేశింపఁదలఁచినవారి కుద్యోగమిచ్చుచుండువారు (పు 14). ప్రారంభమున నుద్యోగము ననిత్యముగనిచ్చి (Temporary), కార్యములను లాభకరములుగఁ జేయఁగలవాఁడను నమ్మకతోఁచినపిమ్మట నుద్యోగిని ఖాయపరచుచుండిరి (పు 71-2). అధికారులపక్షపాతములమూలమున రాజకార్యములు చెడకుండనుండుటకై యుద్యోగులశక్తినిపట్టియే వారిని నుత్తమమధ్యమాధమకర్మలందు నియోగించువారు (పు 64). ఉపధలనేకములచే నుద్యోగుల శుచిత్వాశుచిత్వములఁ దెలిసికొని

హీనపదవులం దుండినవారి నున్నతపదవులలోనికి మార్చుచుండిరి (పు 17). సాధారణముగ నుద్యోగుల నొక యధికారమునుండి మఱియొకదానిలోనికి మార్చుటయు, నధికారులు నిరంకుశముగ నుండకుండుటకై యొక్కొక యధికారస్థానమం దనేకముఖ్యుల నుంచుటయు జరుగుచుండెను (పు 71). ప్రత్యధికారస్థానమందు నధ్యక్షుఁడే గాక యాతనికి సహాయముగ సంఖ్యాయక లేఖక రూపదర్శక నీవీగ్రాహకులును, రాజకార్యములకు విఘాతము గలిగించినవారిని వశపఱచుకొనుట కుత్తరాధ్యక్షులు నుండిరి (పు 71). క్రమముతప్పక యధికారులు వారి కార్యముల నెరవేర్చుచుండుటకై వలయు నేర్పాటులన్నియు గావింపఁబడియుండెను. ప్రజలయొక్క క్షేమముగాని ప్రభుత్వముయొక్క గౌరవముగాని యట్టియేర్పాటులపైనే కదా యాధారపడియుండుట? అన్యాయముగఁ బ్రజలను పీడించి రాజాదాయము ద్విగుణపఱచినవారిని, స్వలాభమును కోరి రాజద్రవ్యమునకు నష్టము గలిగించినవారినిగూడఁ గఠినముగ శిక్షించుచుండిరి (పు 69). ఇట్టి యక్రమముల బహిరంగపఱుపఁగోరు ప్రజలకుఁ దగిన ప్రోత్సాహమును సహాయమును ప్రభువులిచ్చుట కలదు. అధ్యక్షుల యజాగ్రత్తమూలమునఁ బ్రజలకు నష్టము సంభవించినపుడా నష్టమును వారే భరింపవలసియుండెను (పు 129). ధర్మస్థీయమందు న్యాయము నుతీర్పుచేయు న్యాయాధికారులు సహితము కార్యక్రమమం దెట్టి పొరపాటుపడినను కఠినశిక్షకుఁ బాత్రులగుచుండిరి (పు 231-2).

ఉద్యోగులచే న్యాయానుసారముగఁ బనిచేయించుటలోఁ బైవిధములగు నేర్పాటులవలన వారిని బెదరించుటకంటెఁ దగువిధమున వారిని సత్కరించుట మంచిమార్గమనియు, జీతములు స్వల్పములగుటచేతనే వారు లంచములు దీసికొనుటయుఁ బ్రజలను పీడించుటయు సంభవించుచున్నదనియుఁ బ్రస్తుతకాలమం దనేకు లభిప్రాయపడుచున్నారు. కౌటిల్యునియభిప్రాయము కూడ దీనికనుగుణముగ నేయున్నది. వానికాలమం దధికారుల జీతములు వారివారి మర్యాదకుఁ దగిన

ట్లుండెను. జీతములఁబట్టి యుద్యోగస్థులు పదునొకండుతరములుగ విభజింపఁబడియుండిరి. ఉత్తములకు సంవత్సరమునకు నలువదియెనిమిదివేలపణములును, నధములకఱువదిపణములునుజీతము. దూతలు లోనగువారికి సంవత్సరమున కింతయనిగాక వారిపనులఁబట్టి వేతనము నిర్ణయింపఁబడుచుండెను (పు 256-9). నిర్ణీతములగు జీతములఁ బొందుచున్నవారివిషయమునఁగూడ నధికమాసములగల సంవత్సరమందు మామూలుకంటె నధికమగుజీతము లొసఁగఁబడుచుండెను. రాజోద్యోగులయిండ్లలోఁ బ్రేతవ్యాధితసూతికాకృత్యములు వచ్చినపుడు, ప్రత్యేకముగ ధనసహాయము దొరకుచుండెను. ప్రభుకార్యములుచేయుచు మృతినొందినవారి దారపుత్రులకు భక్తవేతనములనిచ్చుటయేగాక వారికిసంబంధించిన బాలురు వృద్ధులు వ్యాధితులుకూడ ననుగ్రహపాత్రులగుచుండిరి (పు 258) మహోపకారముచేసిన నధ్యక్షులకు గొప్పబహుమానములిచ్చుటయు, సాధారణముగ భృత్యులందఱివిద్యాకర్మలనుపట్టి జీతములనధికముచేయుటయు నాచారమైయుండెనది (పు 67). కొందఱికిజీతములేగాక భూములనుకూడ నిచ్చుచుండిరి (పు 48). సాధారణముగ వేతనములన్నియు నాణెములరూపమున నుండెడివి; కాని యెప్పుడయినఁగోశమందు ద్రవ్యములేనపుడు కుప్యపశుక్షేత్రములనిచ్చుటయుఁగలదు. గ్రామాదులను ఇనాములుగ నిచ్చుట యోగ్యముకాదనియే కౌటిల్యుని మతము (పు 258). ఇన్నిసదుపాయములుండుటచేత నుద్యోగులందఱుసంతృప్తిఁజెంది వారిపనులనుమెలఁకువతోఁ జేయుచుండెడివారు.

రాజ్యమందు జనపదము, నగరమను రెండుభాగములుండెను. గ్రామములతోఁగూడినభాగము జనపదము. పట్టణములతోఁగూడినది నగరము. పరిపాలనసౌకర్యమునకై జనపదము నాలుగుభాగములుగ విభాజితమైయుండెను. ఒక్కొక చతుర్భాగములోని గ్రామములను ప్రభుత్వమునకుఁగల సంబంధమునుపట్టి నాలుగురకములుగ విభాగముచేసియుండిరి. కొన్నిగ్రామములు పరిహారకములు (పన్నులు

చెల్లింపనవసరము లేనివి); కొన్ని యాయుధీయములు; కొన్ని ధాన్యపశు హిరణ్యరూపములగు పన్నులు చెల్లించునవి, కొన్ని పన్నులకు బదులు దొరతనమువారికి వలసినకూలిపనులను చేయునట్టివి. విస్తీర్ణాతయందును జనసంఖ్యయందును గ్రామగ్రామమునకు భేదముండినను నుత్తమమగుగ్రామములలో నూరిండ్లకుఁదక్కువగాక యైదువందల యిండ్లకు నెక్కువగాక శూద్రకర్షకులుండవలయునని కౌటిల్యుని యభిప్రాయము (పు 46). గ్రామపరిపాలనము గ్రామికునియొక్కయు గ్రామవృద్ధులయొక్కయు వశమందుండెను. గ్రామికునికే గ్రామస్వామియనియు (పు 241) గ్రామాధ్యక్షుఁడనియు (పు 217)నామాంతరములు. గ్రామమందతఁడు రాజప్రతినిధియై యల్లగులేమియురాకుండఁ జూచుచుండెను. అతనియధికారము నిరంకుశమైనట్లగపడుచున్నది. చోరులను జారులను గ్రామమునుండి తొలఁగించు నధికారమితనికుండెను (పు 177). గ్రామకార్యమునిమిత్తమై మఱియొకచోటికతఁడు వెళ్లునపుడు గ్రామస్థులొక్కొక్క రొక్కొక్కమారతనికి సహాయపడుచుండిరి. ధనికులగుగ్రామస్థులపై లేనిపోనినేరముల మోపి వారిధనము నపహరించుటకీతని కవకాశముండెడిది. అట్లేమయినఁ జేసినపుడీతనిని గ్రామమునుండి తొలఁగించువారు (పు 217). ఇతనియుద్యోగము వంశపారంపర్యమైనదవునో కాదో తెలిసికొనుటకుఁ గౌటిల్యుని గ్రంథమం దాధారములు లేవు. ఇతనికి జీతమేమియు నుండినట్లు తోఁపదు. వ్యాపారమునకై గ్రామమునకువచ్చిన వర్తకులనురక్షించుట వీనికివిధియైయుండెను.

గ్రామాధ్యక్షుఁడుగాక ప్రతిగ్రామమందును గ్రామవృద్ధులు కొందఱుండిరి. వీరే గ్రామముపంచాయతీదార్లు. గ్రామములోని క్షేత్రములకు సంబంధించినట్టి వివాదములను వీరుపరిష్కరించువారు (పు 178). వీరు గ్రామములోని దేవద్రవ్యమును న్యాయముగ వ్యవహారముచేసికొనలేని బాలురయొక్కద్రవ్యమును తమస్వాధీనమందుంచికొని వృద్ధిపొందించువారు (పు 49). సేతుబంధనము లొనర్చుట,

భగ్నములగు చైత్యదేవతాయనముల బాగుచేయుట, ఉత్సవప్రదర్శనములఁగావించుట — లోనగు గ్రామమునకంతకు నుపయుక్తములగు కార్యములను వీరేచేయుచుండువారు.

గ్రామములైదింటిపైఁగాని పదింటిపైఁగాని గోపుఁడనునధికారియుండెను. ఇతఁడనేకవిధములగుపనులనుచేయువాఁడు(పు 144-5). గ్రామకరణమువలె క్షేత్రములకుసంబంధించిన లెక్కలుతయారుచేయుట, ఇన్కమ్టాక్సు (Incometax Collector) యధికారివలెనొక్కొకగృహస్థునియొక్క యాదాయవ్యయముల నిర్ణయించుట; సర్వేసెటిల్మెంటు (Survey and Settlement) యుద్యోగస్థులీకాలమునఁజేయుపనులను నెఱవేర్చుట; జనాభా (Census) లెక్కలసిద్ధపఱచుట, రిజస్ట్రారు (Registrar) వలె దానవిక్రయములయొక్క నిబంధనలుచేయుట, లోనగుకార్యములన్నియు గోపునిమూలమున జరుగుచుండెను. ప్రజలయొక్క యార్థిక (Economic), సాంఘిక (Social) స్థితిగతులగుఱించి యదార్థమును తెలిసికొనుటకీకాలమునఁ బ్రతిదేశమందును దొరతనమువారు ప్రత్యేకముగ నొకయధికారశాఖను (Statistical Department) పెట్టియున్నారు. కౌటిల్యునికాలమున గోపుఁడు చాలవఱకునిట్టిపనినేచేయుచుండెను. రాజ్యములోనిగోపులందఱు సంగ్రహించిన లెక్కలఁబట్టి యక్షపటలమందలి యధ్యక్షుఁడు సమస్త విషయములకు సంబంధించిన నిబంధనపుస్తకములు తయారుచేయుచుండెను (పు 64). ఈవిషయమై ప్రస్తుతకాలమందుఁ బూర్వమునవలె నధికారులు శ్రద్ధవహించుచున్నట్లగపడదు.

నగరముల పరిపాలనవిషయమున నాకాలమునఁ జేయఁబడిన యేర్పాటులుగూడ బహుప్రశంసనీయములుగ నున్నవి. ప్రతిపట్టణమొకపద్ధతిననుసరించి నిర్మింపఁబడుచుండెనుగాని, యెవరికిష్టమువచ్చినచోట వారిండ్లుకట్టుకొనుటయు, క్రమరహితముగను వ్యాపారానుకూలముగను వీధులనేర్పఱచుటయుజరుగునదికాదు. పట్టణములోపల విశాలములగుమార్గములు నమృద్ధములగు జలాధారములు వృ

త్రే జాతికులములననుసరించి యేర్పఱుపఁబడిన నివాసప్రదేశములు లోనగునవి యమర్పఁబడియుండెను (పు 56-7). పరిపాలనసౌకర్యమునకై ప్రతిపట్టణము నాలుగుభాగములుగ విభజింపఁబడి యొక్కొకభాగ మొకస్థానికుని యధీనమైయుండెను. అదేవిధముగఁ బ్రతి చతుర్థభాగములోని యిరువదిగాని నలువదిగాని కుటుంబములవ్యవహారమును చూచుటకొక గోపుఁడుండెను. నగరమంతను పాలించుటకు నాగరికుఁడనునధికారియుండెను. జనపదమందలిగోపులు చేయుచున్న పనులనే నగరములోని గోపులుకూడఁ జేయువారు. నగరవాసులక్షేమమునకును నారోగ్యమునకును ప్రస్తుతకాలమందు మునిసిపాలిటీవారొనరించు కార్యములనన్నిటి నాకాలమున నాగరికుఁడు చేయించుచుండువాఁడు. నగరములోని విదేశస్థుల రాకపోకలకుఁగల కారణములఁ దెలిసికొని వారిమూలమున రాజునకుగాని రాష్ట్రమునకుఁగాని ప్రమాదమురాకుండఁజూచుట; మార్గములను వీథులను శుభ్రముగనుంచుట, యగ్న్యుదకబాధలవలనఁ బ్రజలునష్టముపొందకుండుట, రాత్రికాలమందు దుర్మార్గులు ప్రజలనుబాధింపఁకుండ వారిని బంధించుట లోనగుపనులు నాగరికునిమూలమున జరుగుచుండెను. ఇదిగాక నగరములోని బంధనాగారములు రక్షకస్థానములుమున్నగు వానినీతఁడే చక్కఁబెట్టుచుండెను (పు 146-9). ఈకార్యములనెరవేర్చుటలో నిప్పటివలెనాకాలమందు స్వపరిపాలనపద్ధతియుండినదిలేదు. నాగరికునికి సహాయముచేయుటకై ప్రజలచేనెన్నుకొనఁబడిన సభలుండినవికావు. ఇదిగాక, పాటలీపుత్రపరిపాలనము వర్ణించుసందర్భమున మెగాస్తనీసుసూచించిన సభలగుఱించినప్రశంస కౌటిల్యునియందులేదు. కావున నాగరికునికి సర్వాధికారముండినట్లు చెప్పవచ్చును. నగరపరిపాలనమందే యేవిషయములనుముఖ్యముగ గమనింపనగునో యాకాలమువారికిఁ బాగ్గముగఁ దెలిసియుండెననుటకూడస్పష్టము.

## III

కౌటిల్యునినాఁటి పరిపాలనవిధానమునుగుఱించి చెప్పవలసినవి

షయమములింక ననేకములున్నవి. కాని గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాను. అర్థశాస్త్రమును శ్రద్ధతోఁజదువు పాఠకులు కొంతశ్రమపడినయెడల నీవిషయములన్నియుబోధపడఁగలవు. (1) ఈ కాలమున బ్రిటిషుప్రభుత్వమునకులోబడిన మైసూరు హైదరాబాదు మొదలగు సామంతరాజ్యములున్నట్లాకాలమునఁగూడ సామంత రాజ్యములనేకములుండెడివి. వానికిని సామ్రాజ్యచక్రవర్తికినిగల పరస్పరసంబంధమును కౌటిల్యుఁడచ్చటచట సూచించి, కొంతవిపులముగ పు 319-324 లో వివరించియున్నాఁడు. (2) క్రొత్తగజయించిన దేశములను పరిపాలించువిధమును పు 428-9 లో వర్ణించియున్నాఁడు. (3) ఆకాలమందలిప్రభువులు జనోపయుక్తమగు కార్యము లెట్టివానిసిచేయుచుండిరో తెలిసికొనుటకీగ్రంథములో ననేకములగునాధారములున్నవి. శూన్యప్రదేశములందు జనపదములనిర్మించి ప్రజలయైశ్వర్యాభివృద్ధికై వారెంతపాటుపడినది మనము తెలిసికొనవచ్చును. ఈకాలమునఁ బాశ్చాత్యులందఱు కాలనీలకై (Colonies) యెంతయోపాటుపడుచున్నారుకదా? (4) రాజుయొక్కయూదాయవ్యయములను తెలుపుభాగము లక్కడక్కడనున్నవి. వానినన్నిటినివిమర్శించి యిప్పటికాలపు రివిన్యూపద్ధతికిని నప్పటిపద్ధతికిని గలభేదమును గ్రహింపవచ్చును. (5) షాడ్గుణ్యాద్యధికరణముల సహాయమున నాకాలమందు సైనికపద్ధతియెట్లుండెనో యెట్టియుద్దేశములతోఁ బ్రభువులు యుద్ధములుచేయుచుండిరో కౌటిల్యుని యుద్ధమునవేమియో తెలిసికొనవచ్చును.

ఒకపరిపాలనవిషయముమునుగుఱించియేకాదు. ప్రజలు స్వపోషణమునకై యెట్టివృత్తులస్వీకరించిరో, వ్యవసాయము వ్యాపారము మున్నగువాని లక్షణము లెట్టివో, తామేయేవి దేశములతో నెందెందులకై మనపూర్వులు వ్యాపారముచేయుచుండిరో, కూలివాండ్రు దాసులు (Slaves) లోనగువారిస్థితి యెట్లుండెనో, యెట్టికళలు దేశమందు వృద్ధిగాంచియుండెనో కొంతవఱకు మనము తెలిసికొనుట కవకాశము

న్నది. ఇట్లే ధర్మస్థీయ కంటకశోధనాది యధికరణములమూలమున నాకాలపుసాంఘికాచారముల నిర్ణయింపవచ్చును. వివాహము, వర్ణములకుఁగల పరస్పరసంబంధము, దాయవిభాగములోనగు విషయములలో నప్పటికి నిప్పటికి నెంతో భేదమున్నది. రజోదర్శనానంతరవివాహము స్త్రీపునర్వివాహము, ఒకవర్ణములోనివారు మఱియొకవర్ణములోనివారిని వివాహమాడుట లోనగునాని నాకాలమందు సదాచారములుగఁ బరిగణించుచుండిరి. అప్పటికి నిప్పటికిమనసాంప్రదాయములం దెట్టిమార్పులుకలిగెనో కౌటిల్యునిగ్రంథముమూలమున స్పష్టపడుచున్నది.

ఇట్టివిమర్శకబుద్ధితోఁ జదువరులీగ్రంథమును పఠింతురుగాక.



# విషయసూచిక

—:(:o:):—



శ్రీరస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

—:(:o:):—

## కృతిపతిప్రశంస



శ్రీయువతీపదాంబుజరు ♦ చిన్, సితమయ్యును రాజువారి నా
రాయణు నీలదేహవిభ ♦ లంటుటఁ జామనకాంతి రాఁగ, మేల్
చాయలనందు శ్రీరమణి ♦ సచ్ఛుభవేది. పతీతు నల్కనా
రాయణసామజేంద్రుని, ని ♦ రంతరసౌఖ్యము లందఁజేయుతన్.

వ. శ్రీశ్రీశ్రీ విజయనగరసామ్రాజ్యాధిపత్యవిరాజితులును, వాసిష్ఠగోత్రకలశరత్నాకర పూర్ణిమాసుధాకరులును, నగు శ్రీపూషవాడలకనారాయణగజపతి మహారాజాధిరాజులవారి యాజ్ఞానుసారంబుగాఁ గౌటిల్యార్థశాస్త్రంబు శ్రీవారికంకితంబుగాఁ సమర్పింపంబూని తత్కృతిపతివంశక్రమంబభివర్ణించెద మెట్టులనిన.

సీ. ఏవేలు పలకల్మి ♦ యిండ్లకుఁ గలిమిని
ఘటియింపఁజాలు ని ♦ క్కంపుఁ బ్రోడ
ఏదేవవంద్యుఁ డ ♦ నాదివేదత్రయీ
మూలతిపాత్రకు ర ♦ త్నాలమేడ
ఏదివ్యుఁ డఖిలది ♦ శాదీపకప్రభ
కీరాజు నెలవులై ♦ యొసఁగువాఁడ
ఏకాంతిసిధి చక్రి ♦ వాకివియోగాబ్ధి
తరఁగనాఁపెసమయి ♦ పరగు నోడ

గీ. మూఁడుకాలములను ♦ మూఁడుమూర్తులగుచు
సారసదాక్షిణ్య నీతివి ♦ శారదమతి
మనుముఖాఖిలభూపాని ♦ జని నిదాన
మైన రుచిపుంజ మెవఁడట్టి ♦ యర్కుఁడలరు.

క. ఆరవికులమునఁ బరమో
దారులు చతురుదధివలయి,త ♦ ధరాభారో
ద్ధారులు భగీరథాది
జ్యారమణులు పెక్కురుదయ ♦ మందిరివరుసన్.

వ. అందు.

చ. జలజభవప్రసాదిత వి ♦ శాలవరాప్త్యసమాన వైభవో
జ్జ్వలులయి మానిమానస గ ♦ జంబులకుం ఘనకూటపాకలం
బులగు దశాననాద్యసుర ♦ పుంగవులంబొలియింపఁబూని భూ
స్థలి రఘురాముఁడై వెలసె ♦ నారసనేత్రుఁ డుదారశీలుఁడై.

క. ఆమహితచరిత వంశన
భోమండలి నుడుగణమ్ము ♦ పోల్కి వెలసి రు
ద్దామయశోనిధులై తగు
భూమీశులనూనసుగుణ ♦ భూషణులగుచున్.

తే-గీ. వారిలోఁ బ్రథమగణ్యు ల ♦ వార్యబాహు
బలసమృద్ధులు కొన్నిశా ♦ ఖలుగ, భరత
భూమికాంతకు మౌక్తిక ♦ భూషణముల
సాటిగనిరందు శ్రీపూస ♦ పాటివారు.

సీ. కోటియైనను విపత్ ♦ కోటికీయఁగ మారు
మాటలాడరు పూస ♦ పాటివారు
సూటిఁదప్పిన రిపుం ♦ గీటడంపమి యేటి
మాటలందురు పూస ♦ పాటివా

వేటలో సింగంపుఁ ♦ బోటునన్వేనుదీయఁ
బాటింపకీ పూస ♦ పాటివారు
మేటినిద్యలఁగూర్చ ♦ బాటలనిడ భోజు
సాటివారీ పూస ♦ పాటివారు

గీ. సర్వసర్వంసహాచక్రి ♦ సార్వభౌమగు
సార్వభౌమతఁగనియు న ♦ గర్వులగుచు
నుర్వి నిర్వక్రిముగ నేలు ♦ చున్న కనక
పర్వతంబులు శ్రీపూస ♦ పాటివారు.

వ. అట్లు సకలదిగ్విదితంబగు శ్రీపూసపాటి సద్వంశమ్మునకు ముక్తా ఫలంబులనందగు భూనాయకులందు.

సీ. ఈవిభు సుచరిత్రి ♦ మిలనువిశ్వామిత్రు
లకు సంప్రమోద దా ♦ యకము కాదు
ఈవిభు వర్తన ♦ మేవేళనైనను
శివధర్మభంగంబు ♦ చేయఁబోదు
ఈవిభు భుజశక్తి ♦ కేమువార్ధులు గడ
గడవడంకుచు నేము ♦ గడలనూఁదు
నీవిభు నవతార ♦ మించు కేనియుఁ బుణ్య
జనులను లోపమ్ము ♦ గనఁగనీదు

గీ. అనెడి నుతి, నూత్నవిజయరా ♦ మావనీశుఁ
డల్కరాజ్ఞీసతీయుతుం ♦ డగుచు నిఖిల
ధారుణీరాజ్యభర ధురం ♦ ధరతఁగాంచె
నన్నిదెసలను దనకీర్తి ♦ నెన్నుకొనఁగ.

సీ. ఆనందగజపతి ♦ ప్మానేత భువినొక్క
పక్క దిక్కరులొక్క ♦ పక్కమోవ

నానందగజపతి ♦ క్ష్మానేతయొకచో ఘ
నములొక్కచోట స్వ ♦ ర్ణములఁ గురియ
నానందగజపతి ♦ క్ష్మానేతయొకట న
బ్జప్రియుండొకటఁ దే ♦ జంబునెరప
నానందగజపతి ♦ క్ష్మానేతయొకట శ్రీ
రమణుఁడొక్కట శిష్ట ♦ రక్షఁ గూర్పఁ

గీ. ప్రజలకిష్టుఁడంతయేనిఁ గొ ♦ రంతయున్న
యనెడి జనముల వినుతిఁగాం ♦ చినఘనుండు
శ్రీమదానందగజపతి ♦ క్షితివరుండు
దిగ్విదితసద్యశుండయి ♦ తేజరిల్లె.

వ. ఆతని యనంతరంబున.

సీ. సద్గుణోత్కట విశా ♦ సముగూర్పి భూచక్ర
రంజనమొనరించు ♦ రాజవరుఁడు
సుప్రసన్నప్రభా ♦ దీప్తుఁడు నరిచయ
నాశకరుఁడు నౌని ♦ నప్రవరుఁడు
గర్జావిహీనమ్ము ♦ గా జీవనమ్ములఁ
గలకాలమొసఁగుచు ♦ వెలయుఘనుఁడు
వైరివిభీషణుఁ ♦ డైరహింబుణ్యాజ
నార్తిఁగూర్పని రామ ♦ మూర్తియగుచుఁ

గీ. దనరు శ్రీపూషవాడ్వంశ ♦ ధవళవార్ధి
కమ్ము సకలరాట్ఛిరోవతం ♦ సముగువిజయ
రామగజపతి సన్మహా ♦ రాజవరుఁడు
దివ్యతరకీర్తిమై భువిఁ ♦ దేజరిల్లె.

వ. ఆరాజచంద్రమునకుం బట్టపుదేవియై వెలయుచు.

సు. ఘనకారుణ్యపయోనిధానమని లో ♦ కంబెన్న సర్వాంగనా
జనమూర్ధన్యతఁగాంచి భర్తృపదకం ♦ జాతద్వయిన్మానసం
బునసేవించుచు నాశ్రితాళ్యవనసై ♦ పుణ్యంబులైనెంతయున్
మనురాజ్ఞీమణినేలుఁగాక లలితాం ♦ బన్ శ్రీశుఁడ ప్రశాంతమున్.

గీ. విమలతద్దంపతిసురద్రు ♦ మమునఁదగు ఫ
లత్రియంబన అల్కనా ♦ రాయణపతి
సుజననుతవిజయానంద ♦ గజపతియనఁ
దనయులిర్వురు నొకపుత్రి ♦ యును బొడమిరి.

వ. వారిలో నగ్రజన్ముండై.

మ. వనజాతాలయతోడఁగూడి జగముల్ ♦ పాలించువిష్ణుండునా
వినుతింగాంచి దయామయాత్మయగు శ్రీ ♦ విద్యావతీదేవితో
మనుజానీకమునేలు పూర్ణవిభవు న్మా ♦ అల్కనారాయణా
ఖ్యవరేంద్రుంబరమేశుఁడెల్లపుడు సౌ ♦ ఖ్యంబిచ్చిరక్షించుతన్

సీ. తనవర్తనమ్ము బీ ♦ దలపాలమృదువయ్యె
అరులపాలింట వ ♦ జ్రిసియనుచుఁ
దనయెదరాజ్యతం ♦ త్రములందుఁ బృధువయ్యెఁ
గొండెములిముడని ♦ కొలఁది దనుచుఁ
దనలేఖనమ్ము తి ♦ న్ననిదయ్యె నవిధేయు
లగుభృత్యులెడ వక్రి ♦ మగునటంచుఁ
దనదృష్టి బహుదూర ♦ దర్శనపటువయ్యెఁ
గానితోఁ త్రోవఁ జూడ ♦ లేనిదనుచుఁ

గీ. దన్ను జనులెన్న పూషవా ♦ ట్సన్నుతాన్వ
యాబ్ధివిధుఁడగు నల్కూనా ♦ రాయణగజ
పతి, శతాయురుపేతుఁడై ♦ యతులమతుల
సుతులఁగని మమ్ముదయతోడఁ ♦ జూచుఁగాక.

సీ. ఈరాజచంద్రు వ్య ♦ యారంభమురుకీర్తి
దములందెగాని య ♦ న్యములఁజనదు
ఈవిపులేశు గో ♦ ష్ఠీవిధానము పుణ్య
దములనెగాని య ♦ న్యములఁ గొనదు
ఈవసుభావకు ♦ భావంబు దీనావ
నములనెగాని య ♦ న్యములఁ గనదు
ఈవిభుబుద్ధి భా ♦ షావృద్ధిహేతుమా
ర్గములనెగాని య ♦ న్యముల వినద
గీ. టంచుజనులెన్న శ్రీయుతుం ♦ డైనవిష్ణు
దేవి విద్యావతీసతీ ♦ దేవితోడ
అల్కూనారాయణుండు చి ♦ రాయునగుచు
మించిరాజ్యమ్ము మమ్ముఁ బా ♦ లించుఁగాక.

సీ. భవ్యమాతాపితృ ♦ భక్తికల్మికి వీరిఁ
జెప్పివేరొక్కరిఁ ♦ జెప్పవలయు
భంగమ్ములేని సౌ ♦ భ్రాత్రమ్మునకు వీరి
నెన్ని వేరొక్కరి ♦ నెన్నవలయు
మంచిచెడ్డల విమ ♦ ర్శించియేలుట వీరిఁ
జూపి వేరొక్కరిఁ ♦ జూపవలయు
దీనదయాపర ♦ దృష్టిగల్గుట వీరిఁ
దెల్పివేరొక్కరిఁ ♦ దెల్పవలయు

గీ. ననుచు జనములు హితమున ♦ త్యమున దింప
రాజదౌవార్యసదృశో ♦ రాజినలరు
అల్కునారాయణగజేంద్రుఁ ♦ డఖిలసుఖస
మేతుఁడై ప్రజనెల్ల ర ♦ క్షించుఁగాక.

సీ. ఋగ్యజుస్సామస ♦ మిద్ధమై వేదోప
దేశకాలయము ప్రా ♦ గ్దిశను వెలయ
దేవభాషాంధ్రభా ♦ షావధూటీ నివా
సము కీర్తిదము దక్షి ♦ ణముననిలుప
వీణామృదంగాది ♦ వివిధవాద్యకలాల
యంబు పశ్చిమపార్శ్వ ♦ మందుఁదనర
నఖిలాంగ్లవిద్యాల ♦ యప్రథమాఖ్యేయ
మై కలాలయ ముత్త ♦ రాశనుండఁ

గీ. బలుచతుర్బాహుయుతమగు ♦ పద్మనయను
సురమునాఁదగు దుర్గముం ♦ దిరవుకొనిన
రాజ్యలక్ష్మివిగూడి నా ♦ రాయణుండన
అల్కునారాయణగజేంద్రుఁ ♦ డలరుఁగాక.

సీ. తనబుద్ధిబలము దు ♦ ర్మనుజాళి కాగ్రవే
యంబులకొక గారు ♦ డంబుగాఁగఁ
దనభూతదయ యార్త ♦ జనరక్షణమొనర్ప
దక్షమౌ శ్రీరామ ♦ రక్షగాఁగఁ
దనదానకీర్తి ది ♦ క్తటభిత్తికలయందుఁ
బూసినకపురంపు ♦ఁ బూతగాఁగఁ
దనదు భాషాభిలా ♦ షనిరంతరాశ్రిత
కవిజన కల్పవృ ♦ క్షంబుగాఁగఁ

గీ. ధరసిజాస్తిక్యబుద్ధి పాత్రి ♦ తనవతాధర్మ
పక్షములకుఁ బునశ్శోధన ♦ పరికరముగఁ
బ్రజలనెల్లరఁ దనకుటుం ♦ బముగ నెంచు
అలకనారాయణగజేంద్రుఁ ♦ డలరుఁగాక.

క. ఏతాదృశ సకలగుణో
పేతునకున్ సహజబుద్ధి ♦ భిదురాఖ్యాసి
త్రితాఖిల సద్విబుధ
వ్రాతునకు వసిష్ఠగోత్ర ♦ వరజాతునకున్.

క. శ్రీవిజయనగర రాజ్యర
మావిభుతాధరిత సకల ♦ మహీపాలునకున్
సేవకసురసాలునకు శ్రీ
తావనశీలునకు సద్గు ♦ ణావాలునకున్.

క. మోదప్రదాత్మునకు మ
న్వాది నృపాచరిత సత్ప ♦ థానుస్మృతునకున్
వేదతదంగావన కృ
త్యాదృతిమతియుతునకున్ బు ♦ ధాళినుతునకున్.

క. కీర్తివిశాలునకున్ బహు
సారయశఃకాంతివిజిత ♦ శరదభ్రసుధా
ధారాహేలునకు అలక
నారాయణగజపతీంద్ర ♦ నరపాలునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా సమర్పింపఁబడిన యిక్కౌటిల్యార్థ
శాస్త్రంబునకు సందర్భం బెట్టిదనిన.




శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము.

## వినయాధికారికమను ప్రథమాధికరణము.

ఓం నమశ్శుక్రబృహస్పతిభ్యాం.

భూసంపాదన పరిపాలనములగుఱించి పూర్వాచార్యులచే నెన్నెన్ని యర్థశాస్త్రములు చెప్పఁబడినవో వానినెల్ల సంగ్రహించి సంక్షేపముగ నీయర్థశాస్త్రము చేయఁబడినది. దానిలో నిది ప్రకరణాధికరణసముద్దేశమను నధ్యాయము.

విద్యాసముద్దేశము, వృద్ధసంయోగము, ఇంద్రియజయము, అమాత్యోత్పత్తి, మంత్రిపురోహితోత్పత్తి, ఉపధలచే నమాత్యుల శౌచాశౌచముల నెఱుంగుట, గూఢపురుషోత్పత్తి, గూఢపురుషప్రణిధి, స్వరాష్ట్రమందలి కృత్యాకృత్యపక్షరక్షణము, పరరాష్ట్రమందలి కృత్యాకృత్యపక్షోపగ్రహము, మంత్రాధికారము, దూతప్రణిధి, రాజపుత్రరక్షణము, అపరుద్ధవృత్తము, అపరుద్ధవిషయమువృత్తి, రాజప్రణిధి, నిశాంతప్రణిధి, ఆత్మరక్షితకము.

ఇది వినయాధికారికమను ప్రథమాధికరణము.

జనపదవినివేశము, భూమిచ్ఛిద్రవిధానము, దుర్గవిధానము, దుర్గనివేశము, సన్నిధాతృనిచయకర్మ, సమాహర్తృసముదయప్రస్థాపనము, అక్షపటలమందలి గాణనిక్యాధికారము, ఉద్యోగులపహరించిన ధనమును తిరిగివసూలుచేయుట, ఉపయుక్తపరీక్ష, శాసనాధికారము,

కోశమందుంపఁదగిన రత్నములపరీక్ష, ఆకరకర్మాంతప్రవర్తనము, అక్షశాలయందలి సువర్ణాధ్యక్షుఁడు, విశిఖయందలి సౌవర్ణికప్రచారము, కోష్ఠాగారాధ్యక్షుఁడు, పణ్యాధ్యక్షుఁడు, కుప్యాధ్యక్షుఁడు, ఆయుధాగారాధ్యక్షుఁడు, తులామానపౌతవము, దేశకాలమానము శుల్కాధ్యక్షుఁడు, సూత్రాధ్యక్షుఁడు, సీతాధ్యక్షుఁడు, సురాధ్యక్షుఁడు, సూనాధ్యక్షుఁడు, గణికాధ్యక్షుఁడు నావధ్యక్షుఁడు, గోధ్యక్షుఁడు, అశ్వాధ్యక్షుఁడు, హస్త్యధ్యక్షుఁడు, రథాధ్యక్షుఁడు, పత్త్యధ్యక్షుఁడు, సేనాపతిప్రచారము, ముద్రాధ్యక్షుఁడు, వివీతాధ్యక్షుఁడు, సమాహర్తృప్రచారము, గృహపతి వైదేహక తాపస వ్యంజన ప్రణిధులు, నాగరిక ప్రణిధి.

ఇది అధ్యక్షప్రచారమను రెండవయధికరణము.

వ్యవహారస్థాపన, వివాదపద నిబంధము, వివాహసంయుక్తము, దాయవిభాగము, వాస్తుకము, సమయానపాకర్మ, ఋణాదానము, ఔపనిధికము, దాసకర్మకరకల్పము, కలిసిపనులుచేయుట, విక్రీతక్రీతానుశయము, దత్తానపాకర్మ, అస్వామివిక్రయము, స్వస్వామిసంబంధము, సాహసము, వాక్పారుష్యము, దండపారుష్యము, ద్యూతసమాహ్వయము, ప్రకీర్ణకములు.

ఇది ధర్మస్థీయమను మూడవయధికరణము.

కారుకరక్షణము, వైదేహకరక్షణము, ఉపనిపాతప్రతీకారము, గూఢాజీవరక్ష, సిద్ధవ్యంజనుల మూలమున మాణవప్రకాశనము, శంకారూపకర్మాభిగ్రహము, ఆశుమృతకపరీక్ష, వాక్యకర్మానుయోగము, సర్వాధికరణరక్షణము, ఏకాంగవధనిష్క్రయము, శుద్ధచిత్రదండకల్పములు, కన్యాప్రకర్మ, అతిచారదండము.

ఇది కంటకశోధనమను నాలుగవయధికరణము.

దాండకార్మికము, కోశాభిసంహారణము, భృత్యభరణీయము, అనుజీవివృత్తము, సమయాచారికము, రాజ్యప్రతిసంధానము, ఏకైశ్వర్యము

ఇది యోగవృత్తమను పంచమాధికరణము.

ప్రకృతిసంపదలు, శమవ్యాయామికము.

ఇది మండలయోనియను నాలవయధికరణము.

షాడ్గుణ్య సముద్దేశము, క్షయ స్థాన వృద్ధినిశ్చయము, సంశ్రయ వృత్తి, సమహీనజ్యాయుల గుణాభినివేశము, హీనసంధులు, విగ్రహించినతర్వాత నాసనము, సంధిచేసికొనినతర్వాత నాసనము, విగ్రహించినపిమ్మట యానము, సంధిచేసికొనినపిమ్మట యానము, కలిసి ప్రయాణముచేయుట, యాతవ్యామిత్రుల యభిగ్రహచింత, ప్రకృతుల క్షయలోభవిరాగహేతువులు, సామవాయిక విపరిమర్శ, సంహితప్రయాణికము, పరిపణిత, అపరిపణిత, అపసృతసంధులు, ద్వైదీభావికములగు సంధివిక్రమములు, యాతవ్యవృత్తి, అనుగ్రాహ్యామిత్రవిశేషములు, మిత్రహిరణ్యభూమికర్మసంధులు, పార్ష్ణిగ్రాహచింత, హీనశక్తిపూరణము, బలవంతునితో విగ్రహించుసమయమున నుపరోధహేతువులు, దండోపనతవృత్తము, దండోపనాయివృత్తము, సంధికర్మ, సంధిమోక్షము, మధ్యమచరితము, ఉదాసీనచరితము, మండలచరితము.

ఇది షాడ్గుణ్యమను సప్తమాధికరణము.

ప్రకృతివ్యసనవర్గము, రాజరాజ్యముల వ్యసనచింత, పురుషవ్యసనవర్గము, పీడనవర్గము, కోశసంగవర్గము, బలవ్యసనవర్గము, మిత్రవ్యసనవర్గము.

ఇది వ్యసనాధికారికమను నెనిమిదవయధికరణము.

శక్తిదేశకాలబలాబలజ్ఞానము, యాత్రాకాలములు, బలోపాదాన కాలములు, సన్నాహగుణములు, ప్రతిబలకర్మ, పశ్చాత్కోపచింత, బాహ్యాభ్యంతర ప్రకృతికోప ప్రతీకారము, క్షయవ్యయలాభవిపరిమర్శము, బాహ్యాభ్యంతరాపదలు, దూష్యశత్రుసంయుక్తలు, అర్థానర్థసంశయములు, తదుపాయములం బట్టి వానివిషయమున సిద్ధులు.

ఇది అభియాస్యత్కర్మ యను తొమ్మిదవ యధికరణము.

స్కంధావారనివేశము, స్కంధావారప్రయాణము, బలవ్యసనావస్కంద కాలరక్షణము, కూటయుద్ధవికల్పములు, స్వసైన్యోత్సాహనము, స్వబలాన్యబలవ్యాయోగము, యుద్ధభూములు, పత్త్యశ్వరథహస్తికర్మలు, సైన్యముల పక్షకక్షోరస్యముల వ్యూహవిభాగము, సారఫల్గుబలవిభాగము, దండభోగమండలాసంహత వ్యూహనము, దానికి ప్రతివ్యూహస్థాపనము.

ఇది సాంగ్రామికమను పదియవ యధికరణము.

భేదోపాదానములు, ఉపాంశుదండము.

ఇది సంఘవృత్తమను పదునొకండవ యధికరణము.

దూతకర్మ, మంత్రయుద్ధము, సేనాముఖ్యవధ, మండలప్రోత్సాహనము, శస్త్రాగ్నిరసప్రణిధులు, వీవధాసారప్రసారవధ, యోగాతిసంధానము, దండాతిసంధానము, ఏకవిజయము.

ఇది ఆబలీయసమను పండ్రెండవ యధికరణము.

ఉపజాపము, యోగవామనము, అపసర్పప్రణిధి, పర్యుపాసనకర్మ అవమర్దనము, లబ్ధప్రశమనము.

ఇది దుర్గలంభోపాయమను పదుమూడవ యధికరణము.

పరఘాతప్రయోగము, ప్రలంభనము, స్వబలోపఘాతప్రతీకారము.

ఇది ఔపనిషదికమను పదునాలుగవ యధికరణము.

తంత్రయుక్తులు.

ఇది తంత్రయుక్తియను పదునైదవయధికరణము.

ఇది శాస్త్రసముద్దేశము.

పదునైదధికరణములు, నూటయేబది యధ్యాయములు, నూటయెనుబది ప్రకరణములు, ఆఱువేలశ్లోకములుకలుగునట్లుగను; గ్రంథవిస్తారము లేకుండునట్లుగను; తత్త్వార్థపదనిశ్చితమగునట్లుగను, సుఖముగ గ్రహింపఁదగునట్లుగను నీశాస్త్రము కౌటిల్యునిచే వ్రాయఁబడినది

ఇది కౌటిలీయార్థశాస్త్రమందలి వినయాధికారికములోని ప్రథమాధికరణమందు, రాజవృత్తియను ప్రథమాధ్యాయము.



## 1 ప్రకరణము.

### విద్యాసముద్దేశము

ఆన్వీక్షకి త్రయి వార్త దండనీతియని విద్యలు (నాలుగు).

ఆన్వీక్షకి త్రయీవిశేషముగాఁ ద్రయి, వార్త, దండనీతియను విద్యలు మూఁడేయని మానవులు.

లోకయాత్రావిదునికిఁ ద్రయి సంవరణమాత్రమేయగుటచే వార్త, దండనీతియను విద్యలు రెండేయని బార్హస్పత్యులు.

సర్వవిద్యలకు దండనీతియే మూలమగుటంబట్టియు, నన్నివిద్యలు దానియందే ప్రతిబద్ధములగుటఁబట్టియు దండనీతియొక్కటియే విద్యయని యౌశనసులు.

ధర్మార్థములఁ దెలుపునవిగావుననే విద్యలకు విద్యాత్వము (సంభవించుచున్నది. కావున) విద్యలునాలుగని కౌటిల్యుఁడు.

సాంఖ్య, యోగ, లోకాయతము లాన్వీక్షికినుండియు, ధర్మాధర్మములు త్రయినుండియు, నర్థానర్థములువార్తనుండియు, నయానయబలాబలములు దండనీతినుండియు (నేర్చికొనఁదగియున్నవి).

ఆలోచించిచూడ వీనిలో నాన్వీక్షికి లోకోపకారమును, వ్యసనాభ్యుదయములందు బుద్ధిస్థైర్యమును ప్రజ్ఞావాక్య క్రియానైపుణ్యములను కలిగించును.

(కావున) నిదియెల్లప్పుడు సర్వవిద్యలకుఁ బ్రదీపమనియు, సర్వకర్మలకు నుపాయమనియు, సర్వధర్మములకు నాశ్రయమనియు నంగీకరింపఁబడుచున్నది.

ఇది వినయాధికారికమందలి ప్రథమాధికరణమున విద్యాసముద్దేశమందాన్వీక్షికీస్థాపనయను ద్వితీయాధ్యాయము.



సామఋగ్యజుర్వేదములు మూటికిని త్రయి యని పేరు. (ఇవియును) అథర్వణవేదేతిహాస వేదములును వేదములనఁబడును. శిక్షా, కల్ప వ్యాకరణ నిరుక్త ఛందోవిచితి జ్యోతిషములంగములు.

చతుర్వర్ణ చతురాశ్రమ ధర్మస్థాపనమువలన నీత్రయీధర్మము పయోగించుచున్నది.

బ్రాహ్మణున కధ్యయనాధ్యాపన యజన యాజన ప్రతిగ్రహములును, క్షత్రియున కధ్యయన యజన దానశస్త్రాజీవభూతరక్షణములును, వైశ్యున కధ్యయన యజన దాన కృషి పాశుపాల్య వాణిజ్యములును, శూద్రునకు ద్విజాతిశుశ్రూష, వార్త, కారుకుశీలవకర్మలును స్వధర్మములు.

స్వకర్మాజీవనము, తుల్యులును నసమానఋషివంశజులునునగు వారితో వివాహము, ఋతుగామిత్వము, దేవ పిత్రతిథి భృత్యవిష యానమగుత్యాగము, శేషభోజనము, గృహస్థునకును; స్వాధ్యాయ ము, అగ్నికార్యాభిషేకములు, భైక్షవ్రతము, ఆచార్యులయెడను లేక గురుపుత్రసబ్రహ్మచారులయెడఁ బ్రాణాంతికియగు వృత్తి బ్ర హ్మచారికిని; బ్రహ్మచర్యము, భూశయ్య, జటాజినధారణము, అగ్ని హోత్రాభిషేకములు, దేవతాపితృతిథిపూజ, వన్యాహారము, వాన ప్రస్థునకును; సంయతేంద్రియత్వము, అనారంభము, నిష్కించనత్వ ము, సంగత్యాగము, అనేకత్రభైక్షము, అరణ్యవాసము, బాహ్యా భ్యంతరశౌచము, సర్వప్రాణ్యహింస, సత్యము, అనసూయ, అక్రూర త్వము, క్షమ, పరివ్రాజకునకును స్వధర్మములు.

స్వధర్మము (ననుసరించుట) స్వర్గమోక్షములకొఱకే. దాని నతిక్రమించినచో సాంకర్యమువలన లోకము నశించును. కావునఁ బ్రభువు ప్రజలను స్వధర్మమునుండి వ్యభిచరింపనీయఁ గూడదు.

స్వధర్మపరిపాలకుఁడును ఆర్యమర్యాదావ్యవస్థాపకుఁడును వ ర్ణాశ్రమస్థితికర్తయునునగు రాజిహపరసౌఖ్యములఁబొందుచున్నాఁడు. (అట్టివాని) లోకము త్రయిచేత రక్షితమై నశింపక వెలయఁగలదు.

ఇది వినయాధికారికమందలి ప్రథమాధికరణమున విద్యాసముద్దేశమందు దణ్డనీతిస్థాపనమను తృతీయాధ్యాయము.



కృషి పాశుపాల్య వాణిజ్యరూపమగు వార్త ధాన్యపశుప్యవిష్టి ప్రదానమువలన నుపయోగించుచున్నది. దానిచే లభించుకోశదండ ములవలన రాజు స్వపక్షపరపక్షముల నశపఱచుకొనుచున్నాఁడు.

ఆన్వీక్షకీత్రయీవార్తల యోగక్షేమసాధనమే దండము; దాని నీతియే దండనీతి. ఇది యలబ్ధలాభకారియు లబ్ధపరిరక్షణియు రక్షితవివర్ధనియు వృద్ధిని సత్పాత్రప్రతిపాదనముం జేయించునట్టిది యు నగుచున్నది. లోకయాత్ర దానికధీనమైయుండుటవలన లోకయాత్రార్థి యెల్లప్పుడు నుద్యతదండుండు కావలెను.

దండమువలెఁ బ్రాణులను వశపఱచునది మఱియొకటి లేదని యాచార్యుల యభిప్రాయము.

కౌటిల్యుని మతమిది కాదు. తీక్ష్ణదండము ప్రాణులకుద్వేజకము, మృదుదండము పరిభవకారి, యథార్హదండమే పూజ్యము. సువిజ్ఞాతప్రణీతమగు దండము ప్రజలకు ధర్మార్థకామముల నొసఁగుచున్నది. కామక్రోధాజ్ఞానములవలన దుష్ప్రణీతమగు దండము వానప్రస్థపరివ్రాజకుల సహితము కోపింపఁ జేయుచున్నది. గృహస్థుల మాటవేరుగఁ జెప్పనేల ? దండము లేనిచో మాత్స్యన్యాయము పుట్టుచున్నది. దండధరుఁడు లేనపుడు బలవంతుఁడు దుర్బలుని భక్షింపుచున్నాఁడు. దండధరునిచే రక్షింపఁబడి దుర్బలుఁడు బాగుపడుచున్నాఁడు.

చతుర్వర్ణ చతురాశ్రమములుగల లోకము రాజదండముచేఁ బాలింపఁబడి స్వధర్మకర్మాభిరతమై తమతమ మార్గములందుఁ బ్రవర్తించుచున్నది.

ఇది వినయాధికారికమను ప్రథమాధికరణమున విద్యాసముద్దేశమందు వార్తాస్థాపన దండనీతిస్థాపనయను చతుర్థాధ్యాయము.

విద్యాసముద్దేశ మింతటితో

సమాప్తము.



## 2 ప్రకరణము.

### వృద్ధసంయోగము.

కావున మొదటి మూఁడువిద్యలును దండమూలములు.

దండమన్ననో వినయమూలమై ప్రాణులకు యోగక్షేమము లఁ గూర్చుచున్నది.

కృతకము స్వాభావికమని వినయము (రెండు విధములు). క్రియయన్ననో ద్రవ్యమునేగాని యద్రవ్యమును శిక్షింపఁ జాలదు. శుశ్రూషా శ్రవణగ్రహణధారణ విజ్ఞానోహాపోహతత్త్వముల నభినివిష్టమగు బుద్ధినిమాత్రమే విద్యశిక్షించునుగాని తదితరుని శిక్షింపఁ జాలదు.

విద్యాహేతుకమైన వినయనియమము లాచార్యప్రామాణ్యమువలననే కలుగుచున్నవి.

చౌళకర్మానంతరమున లిపిసంఖ్యానముల నేర్చికొనవలెను.

ఉపనయనానంతరమున శిష్టులనుండి యాన్వీక్షికిత్రయులను, సభ్యాక్షులనుండి వార్తను, వక్తృప్రయోక్తలనుండి దండనీతిని నేర్చికొనవలెను.

పదియాఱవసంవత్సరమువఱకు బ్రహ్మచర్యమును, తదనంతరము గోదానదారకర్మలును విహితములు.

విద్యావృద్ధసంయోగము వినయమునకు మూలమగుటచే దీని వృద్ధికై రాజపుత్త్రున కాసంయోగము నిత్యమైయుండఁదగు.

పూర్వాహ్ణమున హస్త్యశ్వరథప్రహరణవిద్యలందును, నపరాహ్ణమున నితిహాసశ్రవణమందును, శిక్షనొందవలెను. పురాణ, ఇతివృత్త, ఆఖ్యాయిక, ఉదాహరణ, ధర్మశాస్త్ర, అర్థశాస్త్రము లితిహాసమనఁబడును.

అహోరాత్రములలో మిగిలిన భాగమున నపూర్వగ్రహణము ను గృహీతపరిచయమును అగృహీతముల మఱి మఱి వినుటను చేయవలెను.

శ్రవణమువలనఁ బ్రజ్ఞయు, దానివలన యోగము, యోగమువలన నాత్మవత్తయుఁ గలుగుచున్నది. విద్యాసామర్థ్యమన నిదియే.

విద్యావినీతుఁడగు ప్రభువు ప్రజలకు వినయముఁగూర్చుచు సర్వప్రాణిహితుఁడై భూమిని శత్రువశము గానీయక పరిపాలించుచుండును.

ఇది వినయాధికారికమందలి ప్రథమాధికరణమున వృద్ధసంయోగమను పంచమాధ్యాయము.



## 3 ప్రకరణము.

### ఇంద్రియజయము.

విద్యావినయహేతువగు నింద్రియజయము కామక్రోధలోభమానమదహర్షత్యాగమువలన సంపాదింపఁదగి యున్నది. కర్ణత్వగక్షిజిహ్వాఘ్రాణేంద్రియములకు శబ్దస్పర్శరూపరసగంధములందవిప్రతిపత్తి యింద్రియజయము. ఇంద్రియజయము సకల శాస్త్రాధీనమగుటచే శాస్త్రార్థానుష్ఠానముగూడ నింద్రియజయమే.

కామముచే బ్రాహ్మణకన్యనుకోరి బంధురాష్ట్రసహితముగ భోజవంశ్యుఁడగు దాండక్యుఁడును వైదేహుఁడగు కరాళుఁడును; కోపమువలన బ్రాహ్మణులయందు విక్రమించిన జనమేజయుఁడును; భృగువులయందు విక్రమించిన తాళజంఘుఁడును; లోభముచే చాతుర్వర్ణ్యమునుండి యమితముగ ధనాపహరణము చేసిన ఐలుఁడును; సౌవీరుఁడగు నజబిందుఁడును; మదమువలన భూతావమానము గా

వించినదంభోద్భవుఁడును, హైహయుఁడగునర్జునుఁడును; హర్షముచే నగస్త్యునిఁ జంపఁదలఁచిన వాతాపియు; ద్వైపాయనునిఁ జంపఁదలఁచిన వృష్ణిసంఘమును నశించినవిధమున శత్రువిరుద్ధవృత్తిగలిగియు నశ్యేంద్రియుఁడైనరాజు చతుర్దిగంతములకుఁ బతియైనను తక్షణము నశించుచున్నాఁడు.

శత్రుషడ్వర్గమునకాశ్రయులై యింద్రియజయము లేని (పైనఁ జెప్పఁబడిన) వీరును మఱికొందఱు రాజులును సబంధురాష్ట్రము గనశించిరి. శత్రుషడ్వర్గమును విడిచి జితేంద్రియులైన జామదగ్న్యుఁడగు నంబరీషుఁడును నాభాగుఁడును చిరకాలము భూమిఁ బాలించిరి.

ఇది వినయాధికారికమున నింద్రియజయము నరిషడ్వర్గత్యాగమను షష్ఠాధ్యాయము.



కావున నరిషడ్వర్గత్యాగముచే నింద్రియజయమును వృద్ధసంయోగముచే బ్రజ్ఞను, చారునిచే సృష్టిని, ఉత్థానముచే యోగక్షేమసాధనమును, కార్యానుశాసనముచే స్వధర్మస్థాపనమును, విద్యోపదేశముచే వినయమును, నర్థసంయోగముచే లోకప్రియత్వమును, హితముతో వ్యాపారమును చేయునగు (సంపాదింపనగు) ను.

ఇట్లు వశ్యేంద్రియుఁడై, పరస్త్రీద్రవ్యహింసలు, స్వప్నలౌల్యము, అనృతము, ఉద్ధతవేషము, అనర్థసంయోగము, అధర్మానర్థసంయుక్తమగు వ్యవహారము లోనగువానిని విడువవలయును.

ధర్మార్థావిరోధముగఁ గామమును సేవింపవలయునుగాని సుఖరహితుఁడు గాఁగూడదు. అన్యోన్యానుబంధముగల త్రివర్గమును సమముగ సేవింపవలెను. ధర్మార్థకామములలో నొక్కటినే యధికము

గ సేవించినచో నదిపీడనొంది తక్కినరెంటిని సహితము పీడించును.

ధర్మకామములర్థమూలము లగుటచే నర్థ మొక్కటియే ప్రధానమని కౌటిల్యుఁడు.

అపాయస్థానములనుండి రాజునెవరు వారింతురో, రహస్యప్రదేశములందుఁ బ్రమాదమొందుచున్నపుడు ఛాయానాళికాప్రతోదములచే రాజునెవరు ప్రబోధింతురో యట్టి యాచార్యామాత్యులను గౌరవింపవలెను.

రాజత్వము సహాయసాధ్యము. ఒకచక్రమెన్నఁడు నడువనేరదుగదా? కావున రాజు సచివులనిడికొని వారమతము ననుసరించి ప్రవర్తింపవలెను.

ఇది వినయాధికారికమున నింద్రియజయమందు రాజర్షివృత్తమను సప్తమాధ్యాయము.

ఇంద్రియజయమింతటితో సమాప్తము.

## 4 ప్రకరణము.

### అమాత్యోత్పత్తి.

దృష్టశౌచసామర్థ్యములు గలవారగుటచే సహాధ్యాయు లమాత్యులుగ నుంచవలెను. వారే రాజవిశ్వాసమున కర్హులని భరద్వాజుఁడు.

సహక్రీడితులగుటచే వారు రాజును పరిభవింతురు. కావున నట్టివారమాత్యులు కాఁగూడదు. గుహ్యసధర్ములనమాత్యులు కావలెను. ఏలన, వారు సమానశీలవ్యసనములఁ గలవారు. మర్మజ్ఞతా భయముచే వారు రాజునెడ నపరాధము చేయఁజాలరని విశాలాక్షుఁడు.

పై దోష ముభయసాధారణము. ఏలన, మంత్రులు మర్మ
జ్ఞభయముచే రాజు (విచారణలేక) వారి కృతాకృతముల నన్ని
యనువర్తించును. రాజు తనరహస్యముల నెందఱితోఁ జెప్పునో
యందఱికిఁ దాను వశ్యుఁడగుచున్నాఁడు. కావునఁ దన్నుఁ బ్రాణా
బాధకరములగు నాపదలందను గ్రహించుటచే దృష్టానురాగులయిన
వారినే యమాత్యులుగఁ జేసికోనఁదగునని పరాశరుఁడు.

ఇది భక్తిగాని బుద్ధిగుణముకాదు. కావున, సంఖ్యాతార్థ
ములగు వ్యాపారములందు నియుక్తులై యాదిష్టార్థమును దమా
ముగఁగాని సవిశేషముగఁగాని చేయునట్టివారు దృష్టగుణులగుట
వారినే యమాత్యులుగఁ జేసికొనవలయునని పిశునుఁడు.

వీరి కితరములగు నమాత్యగుణము లుండవు. కావున నిట్టి
వారినివిడిచి తన్త్రితాతలనుండి వచ్చువారినే యమాత్యులుగఁ జేయ
లెను. పూర్వవృత్తమెఱిఁగిన వారగుట చేతను సంబంధము గలవా
రగుటచేతను రాజపచరించినను వీరు వానిని విడువఁజాలరు. ఈథ
ము మనుష్యేతరములందు సహితమగపడుచున్నది. సంబంధము
ని గోగణము నతిక్రమించి సంబంధముగలదానినే గోవులనుసరిం
చుచుండునుకదా ? యని కౌణపదంతుఁడు.

వారు ప్రభువుయొక్క సర్వస్వము గ్రహించి తామే ప్రభు
వులవలెఁ జరింతురుగాన వారమాత్యులు కాఁగూడదు. కనుక నీతి
జ్ఞులగు క్రొత్తవారిని నమాత్యులుగ నియమింపవలెను. ఏలన,
క్రొత్తవారు శిక్షావిషయమున వీనిని యమునివలె భావించుచు వీని
యెడఁదప్పుచేయరని వాతవ్యాధి.

శాస్త్రమును మాత్రమెఱింగిన వాఁడదృష్టకర్మలందును మ
హ్యాలకర్మలందును విషాదముఁబొందును కావున నిట్లుచేయఁగూడదు. గు

ణాములే ప్రధానములుగావున, నభిజనప్రజ్ఞా శౌచ శౌర్యానురాగ యుక్తులనే యమాత్యులుగఁ జేయవలెనని బాహుదంతీపుత్రుఁడు.

ఇదియంతయు లెస్సగనేయున్నదని కౌటిల్యుఁడు. పురుషసామర్థ్యము కార్యసామర్థ్యము ననుసరించిగదా కల్పింపఁబడుచున్నది. కావున, సామర్థ్య దేశకాల కర్మలఁబట్టి యమాత్యవిభవమును విభజించి వీరినందఱిని నమాత్యులుగఁ జేయవచ్చును. మంత్రులుగమాత్రము (వీరిని) చేయరాదు.

ఇది వినయాధికారికమున నమాత్యోత్పత్తియందు సప్తమాధ్యాయము.



## 5 ప్రకరణము.

### మంత్రిపురోహితోత్పత్తి.

జానపదుఁడు, అభిజాతుఁడు, స్వావగ్రహుఁడు, శిల్పి, చక్షుష్మంతుఁడు, ప్రాజ్ఞుఁడు, ధారయిష్ణువు, దక్షుఁడు, వాగ్మి, ప్రగల్భుఁడు, ప్రతిపత్తిమంతుఁడు, ఉత్సాహప్రభావ యుక్తుఁడు, క్లేశసహుఁడు, శుద్ధుఁడు, మిత్రుఁడు, దృఢభక్తియుతుఁడు, శీలబలారోగ్యసత్త్వయుక్తుఁడు, స్తంభచాపల్యవర్జితుఁడు, అవైరికారి— ఇది యమాత్యసంపద (ఇట్టివాఁడమాత్యపదవి కర్హుఁడు.) ఈసంపదలోఁ బత్తుర్థాంశహీనుఁడు మధ్యముఁడు. అర్ధాంశహీనుఁడు డవరుఁడు.

అప్తులనుండి (అమాత్యుల) జనపదావగ్రహములను, సహాధ్యాయులనుండి వారిశిల్పశాస్త్ర చక్షుష్మత్తలను, కర్మారంభముల నుండి ప్రజ్ఞాధారయిష్ణుతాదాక్ష్యములను, కథాప్రసంగములనుండి వాగ్మిత్వప్రాగల్భ్యప్రతిభానవత్వములను, నాపత్సమయములనుండి యుత్సాహప్రభావక్లేశసహత్వములను, సవ్యవహారములనుండి శౌచమిత్త్వ

టొకఁడు 'ఈరా జసత్ప్రవృత్తుఁడు. వీనిని చంపి మఱియొకనిని నిర్ణయించుకొనెదము. ఇదియెల్లఱకు నిష్టము. నీయభిప్రాయమేమి?' అని వారిలో నొక్కొక్కని భేదపెట్టవలెను. దీనిని నిషేధించువాఁడు పరిశుద్ధుఁడు. ఇదియే భయోపధ.

పైవారిలో ధర్మోపధాశుద్ధులగువారిని ధర్మస్థీయ కంటకశోధనములందు నియోగింపవలెను. అర్థోపధాశుద్ధులగువారిని సమాహర్తలుగను సన్నిహితులుగను నిచయకర్మలందును నియోగింపవలెను. కామోపధాశుద్ధులను బాహ్యాభ్యంతరవిహారరక్షణములందును భయోపధాశుద్ధులను సన్నిహితములగు రాజకార్యములందును, సర్వోపధాశుద్ధులను మంత్రులుగను, సర్వోపధలలో నపరిశుద్ధులగువారిని ఖనిద్రవ్యహస్తివనకర్మాంతములందును నియోగింపవలయును.

ధర్మార్థభయోపధాశుద్ధులగువారినే వారివారి శుచిత్వమునకుఁదగినట్లు స్వకార్యములందు నియోగింపవలయునని యాచార్యుల సిద్ధాంతము.

అమాత్యుల శుచిత్వపరిశోధనమందుఁ బ్రభువు తన్నుఁగాని తనపట్టపుదేవినిగాని లక్ష్యముగఁ జేయరాదని కౌటిల్యునిమతము.

పరిశుభ్రమైన జలమును విషముచేతనువలె నిర్దుష్టుఁడగువానిని దూషింపరాదు.

అతిదుష్టుని మంచివానిఁగఁజేయుట కౌషధమొకప్పుడును లేదు.

సత్త్వవంతుల బుద్ధి, స్థిరమైనదైనను చతుర్విధములగు నుపధలచేఁ గలుషితమైనయెడల యథాస్థితిని మఱల నొందఁజాలదు.

కావునఁ జతుర్విధములగు కార్యములందును బాహ్యమునే యధిష్ఠానము (లక్ష్యము) గ నవలంబించి యమాత్యుల శుచిత్వాశుచిత్వము చారులచే నెఱుంగవలెను.

ఇది వినయాధికారికమున నమాత్యుల శౌచాశౌచముల నుపధలచేఁ దెలిసికొనుటయను దశమాధ్యాయము.



## 7 ప్రకరణము.

### గూఢపురుషోత్పత్తి

ఉపధాశుద్ధమగునమాత్యవర్గముగలవాఁడై ప్రభువు కాపటిక, ఉదాస్థిత, గృహపతిక, వైదేహక తాపస వేషధారులను, సత్త్రితీక్ష్ణ రసదభిక్షుకులను గూఢపురుషులుగఁ జేయవలెను.

పరమర్మజ్ఞుఁడును ప్రగల్భుఁడును నగునతఁడు కాపటికచ్ఛాత్త్రుఁడు. వాని నర్థమానములచేఁ బ్రోత్సాహపఱచి, 'రాజుపైని నాపైనిఁ బ్రమాణముచేసి యేయేయపాయమును కనిపెట్టుదువో దానినెల్లఁ దక్షణమే మాకెఱింగింపవలయును' అని మంత్రి వానితోఁ జెప్పవలెను.

ప్రజ్ఞాశౌచయుక్తుఁడగు సన్యాసి యుదాస్థితుఁడు. అతఁడు విస్తారమగు ధనమును, శిష్యులను కలవాఁడై వార్తాకర్మల కుపయుక్తములగు ప్రదేశములఁబనులఁ జేయింపవలెను. వీనివలనఁ గలిగిన ఫలితమునుసన్యాసులందఱి గ్రాసాచ్ఛాదనావసథములకుఁగావినియోగించుచు 'రాజార్థమునకు జరుగుదోషమిట్టిదని భక్తవేతనకాలమందువచ్చునప్పుడు మీరు నివేదింపవలెను.' అని వృత్తికాములకుఁ జెప్పవలెను. ప్రవ్రజితులందఱును స్వవర్గమున కిదేవిధముగ బోధింపవలెను.

ప్రజ్ఞాశౌచయుక్తుఁడును వృత్తిక్షీణుఁడునునగు కర్షకుఁడు గృహపతికుఁడు. ఇతఁడు కృషికర్మల కుపయుక్తములగు ప్రదేశములఁ బనులఁ జేయించుచు మిగిలినవిషయములలో నుదాస్థితునివిధముగనే ప్రవర్తింపవలెను.

ప్రజ్ఞాశౌచయుక్తుఁడును వృత్తిక్షీణుఁడునునగు వర్తకుఁడు వైదేహకుఁడు. వాణిజ్యముల కుపయుక్తములగు ప్రదేశములఁ బను

లం జేయుంచుచుం దక్కినవిషయములం బైవారివలెనడుచుకొనవలెను.

వృత్తికాముండగు ముండుండుగాని జటిలుండుగాని తాపసుండు. వాండు ముండులును జటిలులునునగు శిష్యులనేకులంగూర్చికొని పట్టణసమీపమునం జేరి గూఢముగ నిష్టాహారమును భుజించుచుం బ్రకాశముగ మాసమునకుంగాని రెండుమాసములకుంగాని యొకమారు శాకమునో యవసముష్టినో భుజింపవలెను. అప్పుడు వైదేహకుని శిష్యులు గొప్ప యోగములచే వీనిని సేవింప ఈతండమానుషప్రజ్ఞగలవాండని వీనిశిష్యులు ప్రకటించుచుండవలెను. మఱియు నతండు తనప్రజ్ఞాబలముచేతను, నంగవిద్యచేతను, శిష్యులసంజ్ఞలచేతను వారియభిజన విషయమున జరుగంబోవు నల్పలాభము, అగ్నిదాహము, చోరభయము, దూష్యవధము, తుష్టదానము, ఇప్పుడుగాని రేపుగాని యిదిజరుగును. దీనినిరాజు చేయంగలండని విదేశప్రవృత్తిని వైదేహకశిష్యులతోం జెప్పవలెను. దీనినివిని గూఢసహాధ్యాయులామోదింపవలెను. తర్వాత నతండు సత్త్వప్రజ్ఞావాక్య శక్తిసంపన్నులగు వారికిం గలుగంబోవు రాజగౌరవ మంత్రి సంయోగములం దెలుపవలెను.

మంత్రి వీరికి వృత్తికర్మలంగల్పింపం బ్రయత్నింపవలెను. వీరిలోం గారణక్రుద్ధుల నర్థమానములచేతను, నకారణక్రుద్ధులును రాజద్వేషులునునగువారిని రహస్యదండముచేతనుశాంతినొందింపవలెను.

గూఢపురుషు లర్థమానములచే రాజువలనం బూజింపంబడిన వారై రాజోపజీవుల శుచిత్వము నీవిధమున నెఱుంగవలయును. వీరే యైదువిధములగు చారసంస్థలు.

ఇది వినయాధికారికమున గూఢపురుషోత్పత్తియందు సంస్థోత్పత్తి యను నేకాదశాధ్యాయము.



# 8 ప్రకరణము.

గూఢపురుషప్రణిధి.

ఎట్టి బంధువులును లేనివారగుటచేత నవశ్యముగ రాజుచేఁ బోషింపఁదగినవారును, లక్షణము, అంగవిద్య, జంభకవిద్య, మాయాగతము, ఆశ్రమధర్మ నిమిత్తము అంతరచక్రములోనగువానిని నేర్చుకొనినట్టివారును సంసర్గవిద్యగల సత్త్రులు.

జనపదమందు శూరులును, ప్రాణభీతిలేనివారును ద్రవ్యసంపాదనమునకై హస్తివ్యాళముల నెదుర్కొనువారును తీక్ష్ణులు.

బంధువులయెడఁ బ్రీతిలేని క్రూరులును సోమరులును నగువారు రసదులు.

పరివ్రాజికయు వృత్తికామయు దరిద్రయు ప్రగల్భయు విధవయునగు బ్రాహ్మణి యంతఃపురసత్కారమును పొందినదై మహామంత్రులయిండ్లకుఁ బోవుచుండవలయును.

ముండులును వృషలులుగూడ నిట్లేచేయవలయును.

సంచారులన వీరే.

నమ్మఁదగి, దేశవేషశిల్ప భాషాభిజన సహితులగు చారులను వారిభక్తిసామర్థ్యముల కనుగుణముగ మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారికాంతర్వంశిక ప్రశాస్తృ సమాహర్తృ సన్నిధాతృ ప్రదేష్టృ నాయక పౌర వ్యావహారిక కార్మాంతిక మంత్రిపరిషత్ అధ్యక్ష దండపాల దుర్గపాలాంతపాలాటవికులు మొదలగువారికడ కంపవలెను.

ఛత్రభృంగారవ్యజనపాదుకాసనయానవాహనధారులై తీక్ష్ణులు పై యుద్యోగస్థుల బాహ్యచరిత్రము నెఱుంగవలెను. ఆచరిత్రము సత్త్రులు సంస్థల కర్పింపవలెను.

వారియాభ్యంతరచర్యను సూదారాళిక స్నాపకసంవాహకా స్తరక కల్పక ప్రసాధకోదక పరిచారికులైన రసదులును, కుబ్జ వామన కిరాత మూక బధిర జడాంధ వేషధారులును, నట నర్తక గాయన వాదక వాగ్జీవన కుశీలవులగు స్త్రీలును నెఱుంగనలయును. దానిని భిక్షుకులు సంస్థలకర్పింపవలెను.

సంస్థలశిష్యులు సంజ్ఞాలిపులచేత చారులచర్య నెఱుంగవలయును.

సంస్థలును వారిశిష్యులును పరస్పరమొకరితో నొకరుకలియఁగూడదు.

భిక్షుకులకుఁ బ్రతిషేధము కలిగినపుడు, ద్వారపాలకులు మాతాపితృవేషధారులు శిల్పకారిణులు కుశీలవులు దాసీజనము లోనగువారు వారికిఁ దెలిసినచర్యను గీతవాద్యభాండ గూఢలేఖ్య సంజ్ఞలచే సంస్థలకు నెఱిఁగింపవలెను. దీర్ఘరోగోన్మాదమిషలచేతఁగాని యగ్ని విసర్గ రసవిసర్గములచేతఁ గాని చారులు గూఢనిర్గమనముఁ జేయవలెను.

పై మూఁడువిధములవారివాక్య మేకీభవించినపుడది నమ్మఁదగినది. (ఇట్లేకీభవింపక) పలుమాఱు పొరబడినపుడు చారులకు దండోపాంశుశిక్షను కాని యుద్యోగమునుండి తొలఁగించుట గాని చేయవలెను.

కంటకశోధన ప్రకరణమునఁ జెప్పఁబడినచారులు శత్రువుల కడ వేతనముగొనవలెను. చోరులఁ బట్టుకొనుటకు వెళ్ళువా రుభయవేతనులుగ నుండవలెను.

ఉభయవేతనులగువారి భార్యాపుత్రులను తనయధీనములోనుంచుకొని, వారిని శత్రుపక్షమువారినిగ భావించుచు, పారశౌచ

త్వమును తత్సదృశుల మూలమున నెఱుంగవలయును.

ఈవిధముగ శత్రుమిత్రమధ్యమోదాసీనుల విషయమునను వారి పదునెనిమిదితీర్థములవిషయమునను చారుల నియోగించి వారి గృహములందుఁ గుబ్జులు వామనులు షండులు శిల్పవంతులు మూకలు పలువిధములగు మ్లేచ్ఛులు మొదలగువారిని సంచరింపఁ జేయవలయును.

దుర్గములందు వణిజులును, దుర్గాంతమందు సిద్ధతాపసులును రాష్ట్రమందుఁ గర్షకోదాస్థితులును, రాష్ట్రాంతమున వ్రజనివాసులును, వనమునందు వనచరులు శ్రమణులు ఆటవికులు మొదలగువారును సంస్థలుగ నుండవలెను.

చారపరంపరలు పరవృత్తిజ్ఞానముగలవారుగను శీఘ్రగాములుగనునుండవలెను. శత్రులచారులను స్వచారులెఱుంగవలయును.

గూఢులును నగూఢులును నగుసంస్థలు చారులసంచరింపఁ జేయుదురు.

కృత్యపక్షీయులచేఁ గార్యావసరమున నకృత్యులుగ నెఱుంగఁబడినముఖ్యులను శత్రుచారులచర్య నెఱుంగుటకై సీమాంతములందుంపవలెను.

ఇది వినయాధికారికమున గూఢపురుషోత్పత్తియందలి సంచారోత్పత్తి యను ద్వాదశాధ్యాయము.



## ౯ ప్రకరణము.

### స్వవిషయకృత్యాకృత్య పక్షరక్షణము.

గూఢపురుషప్రణిధికృతమగు మహామాత్య పరీక్షనొనర్చి (పిమ్మట రాజు) పౌరజానపదులఁ బరీక్షింపఁబోవలెను.

ద్వంద్వబుద్ధి గలిగించుకొనిన సత్త్రులు తీర్థసభాశాలాపూగ జనసంఘములఁజేరి ''సర్వగుణసంపన్నుఁడను ప్రసిద్ధి యీరాజునకుఁ గలదు. దండకరములచే లోకుల బాధించునట్టి గుణమొక్కటియు నీతనియందు లేదు.'' అని వివాదముఁ జేయవలెను. అప్పటిలో సచటనీ విషయమును ప్రశంసించువారిని నుపపాదించువారినికూడ మఱియొకఁడు ప్రతిషేధింపవలెను. అందుమీఁదట, 'మున్నుఁ బ్రజలో కప్పు మాత్స్యన్యాయాభిభూతులై వైవస్వతమనువును తమకేలికగ నెవరించుకొని యాతనికి ధాన్యషడ్భాగమును, పణ్యదశభాగమును హిరణ్యమును భాగధేయముగ నేర్పఱచికొనిరి. అట్టిభాగముచేభరింపఁబడినవారై రాజులు ప్రజలకు యోగక్షేమములఁ గూర్చుచును, నదండకరులైనపుడు ప్రజలొనర్చిన పాపములకుఁ బాత్రులగుచును నుందురు. (రాజులు) ప్రజలకు యోగక్షేమావహులగుటచే నారణ్యకులుసహితము 'రాజు మనలరక్షించుచున్నాఁడు, కానవానికిది భాగము' అని ఉంఛషడ్భాగము నర్పించుచున్నారు. ఇంద్ర యమస్థానీయులగు రాజులు ప్రత్యక్షహేడప్రసాదులు. అట్టిరాజుల నవమానించువారికి దైవకృతమగు దండము ప్రాప్తించుచున్నది. కావున రాజులు నవమానింపఁ దగర' ని పై క్షుద్రకులను ప్రతిషేధింపవలయును.

వీరు కింవదంతినిగూడఁ దెలిసికొనవలయును.

రాజుయొక్క ధాన్య పశు హిరణ్యములవలనజీవించుచు వానినివ్యసనాభ్యుదయములందు రాజునకర్పించుచుండువారును, రాజుపైఁ గోపముగల బంధునిఁగాని, రాష్ట్రమునుకాని, మరలించుచుండువారును, శత్రువగు నాటవికునిఁ బ్రతిషేధించుచుండువారును నగుసేవకుల తుష్టాతుష్టత్వములను ముండ జటిల వేషధారులు తెలిసికొన

వలయును. (వారిలో) తుష్టులను మఱియు గౌరవింపవలెను. అతు ష్టులను తుష్టికై త్యాగముచేతను సామముచేతను ననుగ్రహింపవల యును; లేదా వారిలో నొకరిని మఱియొకరినుండియు, నాయంత ఆట వికతత్కులీనఅవరుద్ధులనుండియు భేదపెట్టవలయు. అప్పటికిని తు ష్టినొందనివారికి దండకరసాధనాధికార మొసంగి (వారిపై) జనపదవి ద్వేషమును పుట్టింపవలయును. విద్వేషులగు వారిని రహస్యదండము చేతను జనపదకోపముచేతను సాధింపవలయును. శత్రువులకు వారు చోటొసంగకుండునట్లు వారి భార్యాపుత్రులం దనయధీనమందుంచు కొని వారిని గనులపనులలో నియోగింపవలయును.

క్రుద్ధులు లుబ్ధులు భీతులు నవమానితులు శత్రుపక్షమునఁ జేరుదురు. వీరి పరస్పరసంబంధమును వీరికి శత్రువులతోఁగల సం బంధమును కార్తాంతిక నైమిత్తిక మౌహూర్తిక వేషములుగలవా రెఱుంగవలయు.

తుష్టుల నర్థమానములచే గౌరవించుచు నతుష్టుల సామదా నభేదదండములచే సాధింపవలయును.

ఈరీతిగ వివేకియై స్వరాష్ట్రమందలి ప్రధానులును క్షుద్రు లును నగు కృత్యాకృత్యులను పరులొనరించు భేదమునుండి రక్షిం చుచుండవలెను.

ఇది వినయాధికారికమున స్వవిషయకృత్యాకృత్యపక్షరక్షణమను త్రయోదశాధ్యాయము.

10 ప్రకరణము.

పరవిషయకృత్యాకృత్యపక్షోపగ్రహము.

స్వవిషయకృత్యాకృత్య పక్షోపగ్రహము చెప్పఁబడినది;

పరవిషయమందలిదే చెప్పఁబడినది.

ధనపరముముగ సంపాదించఁబడిన వాఁడు, శిల్పముచేఁ గాని యుపకారకార్యములందుఁ గాని సమానులగువారిలో నవమానింపఁ బడినవాఁడు, రాజవల్లభునిచే నిరోధింపఁబడినవాఁడు, పిలువఁబడి పరాభవమొందినవాఁడు, ప్రవాసోపతప్తుఁడు, వ్యయముఁజేసియుఁ గార్యఫలమునొందనివాఁడు, స్వధర్మమునుండిగాని దాయమునుండిగాని నిరోధింపఁబడినవాఁడు, మానాధికారమునుండి తొలఁగింపఁబడిన వాఁడు, సమానులలో నధఃకృతుఁడైనవాఁడు, బలాత్కరింపఁబడిన స్త్రీగలవాఁడు, కారాభిన్యస్తుఁడు, పరోక్షదండితుఁడు, దుశ్చారివారితుఁడు, సర్వస్వమపహరింపఁబడినవాఁడు, బంధనపరిక్లిష్టుఁడు, దేశాంతరమునకంపఁబడిన బంధువులుకలవాఁడు — వీరు క్రుద్ధవర్గములోఁ జేరినవారు.

దురదృష్టమువలన నష్టమొందినవాఁడు, రాజవిరోధి, ప్రకటమైనపాపకర్మచేసినవాఁడు, తుల్యదోషుని శిక్షించుటచేత నుద్వేగమొందినవాఁడు, తీసికొనఁబడిన భూమిగలవాఁడు, శిక్షనొందినవాఁడు, సర్వాధికారమునుండి యచిరకాలమున ధనవంతుఁడైనవాఁడు, తద్వంశజుఁడై తద్ధనమునపేక్షించువాఁడు, రాజుచే ద్వేషింపఁబడినవాఁడు, రాజునందుద్వేషించువాఁడు — వీరు భీతవర్గములోఁ జేరినవారు.

చెడినవాఁడు, సర్వస్వము గోలుపోయినవాఁడు, లోభి, వ్యసనములుగలవాఁడు, అత్యాహితవ్యవహారుఁడు, — వీరు లుబ్ధవర్గములోఁజేరినవారు.

ఆత్మసంభావితుఁడు, మానకాముఁడు, శత్రుపూజామర్షితుఁడు, నీచుఁడనియుంచిపించుకొనినవాఁడు, తీక్ష్ణుఁడు, సాహసికుఁడు,

భోగమున్నను నసంతుష్టుఁడైనవాఁడు.—వీరు మానివర్గములోఁజే
రినవారు.

వారిలోఁ గృత్యపక్షీయుఁడగువాని తనయందుభక్తిగలవా
నిని ముండజటిలవ్యంజనులచే భేదపెట్టవలెను.

మదగజము మత్తునిచే నధిష్ఠింపఁబడి తనకడ్డమగు దానినెల్ల
నెట్లు త్రొక్కివేయుచుండునో యట్లే యశాస్త్రచక్షువగు నీరాజు పౌ
రజానపదవధకై యత్నించుచున్నాఁడు. ప్రతిహస్తిప్రోత్సాహనము
చే వీనికపకారము చేయవచ్చును. (కావున) ఓర్వఁగలిగి యుండవలె
నని క్రుద్ధవర్గమును భేదపెట్టవలెను.

లీనమగు సర్పమెవనివలన భయము నాశంకించునో వానిపై
విషమును విడుచును. అట్లే యీరాజు తనదోషము నాశంకించుకొని
మీపైఁ గోపవిషమును విడువఁగలఁడు. కావున మఱియొకచోటికిఁ
బొండని భీతవర్గమును భేదపెట్టవలెను.

కుక్కలఁ బెంచువారు గోవులక్షీరమును కుక్కలకే వినియో
గింతురుగాని బ్రాహ్మణుల కిత్తురా? అట్లే యీ మీరాజు సత్వప్ర
జ్ఞావాక్యశక్తిహీనులగువారికే ధనమునిచ్చునుగాని యాత్మగుణసంప
న్నులగువారికీయఁడు. కావునఁ బురుషవిశేషజ్ఞుఁడగు నీ(పర)రాజును
సేవింపుఁడని లుబ్ధవర్గమును భేదపెట్టవలెను.

చండాలుల నూయి చండాలులకేగాని యితరులకుపభోగ్యము
కానట్లు నీచుఁడగు మీరాజు నీచులకేగాని పూజ్యులగు మీవంటి
వారి కుపభోగ్యుఁడు కాఁడు. కావునఁ బురుషవిశేషజ్ఞుఁడగు నీ(పర)
రాజును సేవింపుఁడని మానివర్గమును భేదపెట్టవలెను.

పైవిషయముల కంగీకరించి, పణకర్మతోఁ గూర్పఁబడినట్టివా
రిని దనపనులలో స్వచారులతోఁగూడఁ గలుపవలెను.

శత్రురాజ్యమందలి కృత్యపక్షీయులను సామదానములచేతను, నకృత్యపక్షీయులను భేదదండములచేతను వశపఱచుకొని వారి ప్రభువుయొక్క దోషములను వారికిఁజూపవలయును.

ఇది వినయాధికారికమునఁ బరవిషయకృత్యాకృత్య పక్షోపగ్రహమను చతుర్దశాధ్యాయము.



## 11 ప్రకరణము.

### మంత్రాధికారము.

స్వపక్ష పరపక్షోపగ్రహము గావించి కార్యారంభముల నాలోచింపవలెను.

సర్వారంభములును మంత్రపూర్వములుగ నుండవలెను. కావున నాలోచన చేయు ప్రదేశముసంవృతముగను ప్రసంగములకెుకపడనిదట్టిదిగను, పక్షులకు సహితము చూడ వీలుపడనట్టిదిగను నుండవలెను. వలన, శుకశారికాశ్వానములచేతను మఱికొన్ని తిర్యగ్యోనులచేతను మంత్రముభిన్నమగునట్లు మనము వినుచున్నారము గదా ! కావునఁ దగినసంరక్షకుల నియమింపక మంత్రోద్దేశమును ప్రవేశింపరాదు.

మంత్రభేదమొనర్చినవానిఁ జంపవలెను.

దూతామాత్యస్వాముల యింగితాకారములచే మంత్రభేదముకలుగును. ఇంగితమనఁగా నన్యథావృత్తి. ఆకారమనఁగా (స్వభావవిరుద్ధమగు) నాకృతిని గ్రహించుట.

కార్యము పూర్తియగునంతవఱకు మంత్రసంరణము, ఆయుక్తపురుషరక్షణము నావశ్యకములు. ప్రమాదమదసుప్తప్రలాప

కామాసక్తిమాత్రము వెల్లడియగుటకుఁ గారణములు. ప్రచ్ఛన్నుఁడుగాని యవమానమొందినవాఁడుగాని మంత్రమును భేదించునుకాన (రాజు) మంత్రమును రక్షించుకొనవలెను. రాజుయొక్కయుఁ దదాయత్తపురుషులయొక్కయు మంత్రభేదము శత్రువులకు క్షేమము గూర్చును.

కావున రహస్యముగ నొక్కఁడే యాలోచింపవలెను. మంత్రులకును మంత్రులుందురు. వారికిమంత్రులుందురు. ఆయీ మంత్రిపరంపర మంత్రమును భేదించుచున్నది. కావున రాజుచేఁ జికీర్షితమగుకర్మ నితరు లెంతమాత్రమెఱుంగరాదు. ప్రారంభింపఁబడినదానినికాని ముగిసినదానినికాని యారంభించినవారే యెఱుంగవలయునని భారద్వాజుఁడు.

ఒకనిమంత్రమెప్పుడును సిద్ధినొందదు. రాజవృత్తి ప్రత్యక్షపరోక్షానుమేయమై యున్నదిగదా? అనుపలబ్ధవిషయము నెఱుంగుటయు, నుపలబ్ధనిశ్చయముల బలపఱచుటయు, అర్థద్వైధమునందు సంశయమునుపోఁగొట్టుకొనుట, విషయములలో నొక్కొక్క భాగము మాత్రమెఱింగినపుడు శేషమునుకూడఁ దెలిసికొనుట లోనగునవి మంత్రిసాధ్యములై యున్నవి. కావున జ్ఞానవృద్ధులతోఁగలిసి యాలోచించి యెట్టివారిని నవమానింపక నందఱిమతమును వినవలెను. అర్థవద్వాక్యము బాలభాషితమైనను పండితుఁడు దానిని గ్రహింపనగునని విశాలాక్షుఁడు.

ఇది మంత్రజ్ఞానముకాని మంత్రరక్షణముకాదు. తనచేఁ దలపెట్టఁబడినకార్యమునకుఁ బ్రతిరూపకమగు కార్యమును గుఱించి మంత్రులతో 'ఈకార్యమిట్టిదైనది; ఇదియీరీతిగ నైనచో నప్పుడేమిచేయవలెను' అని ప్రశ్నింపవలయును. పిమ్మట వారుచెప్పినట్లు

చేయవలెను. ఈవిధముగనైనచో మంత్రోపలబ్ధియుఁ దత్సంరక్షణమునుకూడ నగునని పారాశరుఁడు.

ఇదికూడదు. వ్యవహితార్థమునుకాని వృత్తావృత్తములఁగాని ప్రశ్నింపఁబడి మంత్రులనాదరముగ జవాబుచెప్పుదురు; మఱియు దానిని వెల్లడింతురు. అదియే దీనియందలిదోషము. కావున నెవరెవ రేపనులయందు నియోగింపఁబడుదురో వారితోడ నాపనులగుఱించి యాలోచింపవలయును. అట్లాలోచించినవాఁడై మంత్రజ్ఞానమును తత్సంవృతియును బొందుచున్నాఁడని పిశునుఁడు.

ఇట్లు చేయఁగూడదు. ఇది యనవస్థాదోషదూషితము. కావున ముగ్గురునలుగురు మంత్రులతో నాలోచింపవలెను. ఒక్కనితో నాలోచించినచో గొప్పకార్యములందు నిశ్చయము తేలకపోవచ్చును. మంత్రియొక్కఁడైనచో నతఁడు యథేష్టముగ స్వతంత్రుఁడై ప్రవర్తించును. ఇరువురితో నాలోచించినచో వారిరువురు కలిసి రాజును వశముచేసికొనెదరు. వారుకలియక కలహించినచో రాజువినాశముఁబొందును. ముగ్గురునలుగురు మంత్రులైనచో నిశ్చయముగ నెకప్పుడును మహాదోషము కలుగదు. మఱియునది కార్యసాఫల్యానుకూలమై యుండును. అంతకు నెక్కువగ మంత్రులుండినచో మంత్రనిశ్చయమును, మంత్రరక్షణమును నతికష్టములై కలుగును. (శ్లో॥) దేశకాల కార్యానుకూలముగ సామర్థ్యము ననుసరించి యొక్కనితోఁగాని యిరువురితోఁగాని లేక తానొక్కఁడేగాని కార్యాలోచనము చేయవలెనని కౌటిల్యుఁడు.

కార్యారంభోపాయము, పురుషద్రవ్యసంపత్తు, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారము కార్యసిద్ధియని మంత్రమున కైదంగములు.

మంత్రులలో (వేరువేరుగ) నొక్కొక్కరిని కాని లేక యొక్కమాఱుగ నందఱి కాని ప్రశ్నింపవలయును. (వారు చెప్పునట్టి) కారణములచే వారిబుద్ధివైశద్యముల నెఱుఁగవలయు. కార్యము సంప్రాప్తించినపుడు కాలవిళంబముఁ జేయఁగూడదు. ఎవరికిఁ దానపకారము చేయఁ దలఁచియుండునో వారిపక్షమువారితో దీర్ఘాలోచన చేయరాదు.

పండ్రెండుగురు మంత్రుల మంత్రిపరిషత్తుగఁ గూర్చవలయునని మానవులు. పదునార్గురుండవలయునని బార్హస్పత్యులు. ఇరువదిమంది మంత్రులుండవలయునని యౌశనసులు. సామర్థ్యానుసారముగనని కౌటిల్యుఁడు.

వారు రాజుయొక్క స్వపక్షపరపక్షముల గుఱించి లెస్సగనాలోచింపవలయును. అకృతకర్మారంభమును, ఆరబ్ధకర్మానుష్ఠానమును, అనుష్ఠితవిశేషమును నియోగసంపదను (మంత్రిపరిషత్తు) చేయవలయును. చెంతనున్నవారితో స్వయముగను, ననాసన్నులతోఁ బత్రప్రేషణమూలమునను కార్యముల నాలోచింపవలయు.

ఇంద్రునకు ఋషిసహస్రము మంత్రిపరిషత్తు. అదియే యాతనికిఁ జక్షువు. కావుననే యితఁడు ద్వినేత్రుఁడయ్యు సహస్రాక్షుఁడను పేరొందెను.

కార్యము లత్యావశ్యకములగునపుడు మంత్రులను మంత్రిపరిషత్తునుబిలిచి యాలోచింపవలెను. వారిలోఁ బలువురు (భూయిష్ఠులు) దేనిని గార్యసిద్ధికరముగఁ జెప్పుదురో దానినొనర్పవలయును.

ఈలాగు చేయుచుఁ దనరహస్యమును శత్రువుల కెఱుఁగఁడనీయక శత్రువులరహస్యముల నెఱుఁగుచు వివృతములగు ([illegible]) నంగములఁ గూర్మమువలె నిగూహనము చేయవలెను.

సజ్జనుల శ్రాద్ధమును భుజించుట కశ్రోత్రియుఁడనర్హుఁడైన

శ్లోకా ప్రస్తుతుఁడు మంత్రాధికారమున కనర్హుఁడు.

ఇది వినయాధికారికమున మంత్రాధికారమను

పంచదశాధ్యాయము

## 12 ప్రకరణము.

### దూతప్రణిధి

మంత్రసంపదారితేరినవాఁడు దూత. అమాత్యసంపదోపేతుఁడు నిసృష్టార్థుఁడు. పాదగుణహీనుఁడు పరిమితార్థుఁడు. అర్ధగుణహీనుఁడు శాసనహరుఁడు.

సుప్రతివిహితములగుయానవాహనపురుషపరివాపములుగలిగి ప్రయాణమై "రాజశాసనమిట్లు చెప్పఁదగియున్నది. దానికి శత్రురాజిట్లు జవాబుచెప్పును. దానికిది ప్రతివాక్యము. ఈవిధముగ వానిని వంచింపవలెను" అని యాలోచించుకొనుచు, దూత వెళ్లవలెను. (శత్రురాజుయొక్క) అటవ్యంతపాలపురరాష్ట్రముఖ్యులతో స్నేహమొనర్చి, తనరాజుయొక్కయు శత్రునియొక్కయు సనీకస్థానయుద్ధప్రతిగ్రహ అపసారభూములను పరీక్షించుచు, దుర్గరాష్ట్రప్రమాణములను సారవృత్తిగుప్తచ్ఛిద్రములను తెలిసికొని యనుజ్ఞాతుఁడై శత్రునగరమును ప్రవేశింపవలెను. పరునివాగ్వక్త్రదృష్టులయందలి ప్రసాదము, వాక్యపూజనము, ఇష్టపరిప్రశ్నము, గుణకథాసక్తి, ఆసన్నాసనము, సత్కారము, ఇష్టులస్మరణము, విశ్వాసగమనము లఁబట్టి శత్రుఁడు దుష్టుఁడైనట్లును, వీనికంటె విపరీతములగు లక్షణములఁబట్టి యతుష్టుఁడైనట్లును నూహింపవలెను. అతుష్టుఁడగువానితో 'నీవును తక్కినరాజులందఱునుకూడ దూతముఖులే కదా ? కావున శస్త్రములెత్తినను (శత్రురాజులయెదుట దూతలు) యథోక్త

ముగనే చెప్పుదును. దూతలలో నంత్యావసాయులు సహితము న వధ్యులు. బ్రాహ్మణులమాట వేరుగఁ జెప్పనేల? ఇది పరుసివాక్యము. మఱియుసది దూతధర్మము" అని చెప్పవలయును.

(శత్రు) రాజు తన్ను విడుచునంతవఱకు మరలిపోఁగూడదు. రాజగౌరవ మొందితినని గర్వింపఁగూడదు. శత్రువుబలవంతుఁడనితలఁపరాదు. అనిష్టవాక్యమును సహింపవలెను. స్త్రీ పానముల విడువవలెను. సుప్తులయు మత్తులయు భావజ్ఞానము స్పష్టపడును కావున నొంటరిగ శయనింపవలెను. కృత్యపక్షోపజాపము, అకృత్యపక్షవిషయిక గూఢప్రణిధానము, భర్తృవిషయక రాగాపరాగములు, ప్రకృతుల లోపములు లోనగువానిని తాపసవైదేహకవ్యంజనుల మూలమునఁగాని వారిశిష్యుల మూలమునఁగాని, చికిత్సకపాషండక వ్యంజనములుగల యుభయవేతనుల మూలమునఁగాని యెఱుంగవలయును. ప్రజలతో సంభాషించుటకవకాశము లేనప్పుడు యాచనకమత్తోన్మత్తను ప్తప్రలాపములచేతను పుణ్యస్థాన దేవగృహచిత్రలేఖ్యసంజ్ఞలచేతను ప్రజలచర్యనెఱుంగవలయును. (ఇట్లు) తెలిసికొనిన విషయమును భేదించిచూడవలయును. శత్రునిచేఁ బ్రశ్నింపఁబడినను స్వకీయ ప్రకృతులపరిమాణమును కార్యసాధనమును చెప్పఁగూడదు. సర్వమునీకే తెలియునని మాత్రము జవాబునీయవలెను.

కార్యముసిద్ధింపక యుపరుద్ధుఁడైనపుడు దూతయీవిధముగఁ దర్కింపవలయును. "నా ప్రభువునకు వ్యసనమేదైన నాసన్నముగునని తలంచియో, తనవ్యసనమునకుఁ బ్రతీకారముగోరియో, పార్ష్ణిగ్రాహాసారులఁగాని యంతఃకోలహామునకాని, యాటవికునిఁగానినా ప్రభువుపైఁ బ్రోత్సహింపఁదలఁచియో, ఈ క్రమముల మూలమున మిత్రునిఁ జంపింపఁదలఁచియో, (స్వరాష్ట్రమండలి) స్వకీయపరకీయ

ములగు విరోధములఁగాని, రాష్ట్రికలసామునుకాని యాటవికులవల నఁగలుగు నపాయమునుకాని ప్రతీకరించుకొనఁదలఁచియో, సిద్ధమ గు నాస్వామియొక్క యుద్ధయాత్రకు విఘ్నముఁ జేయనెంచియో, సస్యకుప్యపణ్యసంగ్రహమును దుర్గకర్మను బలసముద్ధానమును చేసి కొనఁదలఁచియో, స్వసైన్యవ్యాయామమున కనుకూలములైన దేశ కాలములఁ గోరియో, తనకుఁగలిగిన పరిభవప్రమాదములకై నా ప్రభువుతో సంసర్గానుబంధములఁ గోరియో నన్నిట్లునిరోధించుచు న్నాఁడు".

(వితర్కించి) తెలిసికొని తదనంతర ముండుటయో లేక వె నుకకుమరలుటయో చేయవలెను; లేదా, ఇష్టప్రయోజనమును కో రవలెను. అనిష్టశాసనమును చెప్పినందువలనఁగలుగు బంధవధభయ ములనుండి తప్పించుకొని వెనుకకుమరలవలెను; లేనియెడలఁ (దూత శత్రుని చే) గట్టఁబడును.

ప్రేషణము సంధిపాలత్వము ప్రతాపము మిత్రసంగ్రహ ము ఉపజాపము సుహృద్భేదము గూఢసైన్యసంపాదనము బంధుర త్నాపహరణము చారజ్ఞానము పరాక్రమము సమాధిమోక్షము శ త్రుదూతలయొక్కయు వారియొక్క స్థలయొక్కయు స్నేహాసం పాదనములోనగునవి దూతయొక్కకార్యములు.

ఈకార్యములను స్వదూతలచేఁ జేయించుచుఁ బ్రతిదూతా పసర్పమూలమున పరదూతలనుండి రాజు తన్ను రక్షించుకొన వలెను.

ఇది వినయాధికారికమున దూతప్రణిధియను
షోడశాధ్యాయము.

## 13 ప్రకరణము.

### రాజపుత్రరక్షణము.

రాజు తొలుత దారపుత్రులనుండి తన్నురక్షించుకొని పిద పఁ దనరాజ్యమును నాపన్నులనుండియుఁ బరులనుండియు రక్షించు చున్నాఁడు. దారరక్షణము నిశాంతప్రణిధియందును పుత్రరక్షణ మిచటను చెప్పుచున్నాము.

రాజపుత్రులు కర్కటకసధర్మలై జనకభక్షకులగుటచేతఁబు ట్టినదిమొదలు జాకరూకతతో వారినిరక్షింపవలెను.

పుత్రులకుఁ దండ్రియెడ ననురాగములేనపుడు వారినిరహ స్యముగఁ జంపుటమేలని భారద్వాజుఁడు. క్రూరమగు రహస్యవధ క్షత్రబీజవినాశకరముగావున రాజపుత్రునినిరోధించి యొకచోటనుం చుటమంచిదని విశాలాక్షుఁడు. ఇదిఅహిభయము. విక్రమభయ ముచేఁ దండ్రి తన్నిట్లరికట్టుచున్నాఁడని తెలిసికొని కుమారుఁడు తండ్రినే వశపఱచుకొనఁబోవును. కావున వాని.నంతపాలదుర్గమున నుంచుటమంచిదని పారాశరుఁడు. ఇదియౌరభ్రకభయము. ప్రత్యా పత్తికిఁగల కారణమును తెలిసికొని రాజపుత్రుఁడంతపాలునితో స ఖ్యమొనర్చును. కావున దేశమునకు దూరముందున్న సామంతదుర్గ మునందుంచుట మంచిదని పిశునుఁడు. ఇది వత్సస్థానము. వత్సము మూలమున ధేనువుపువలె వీనిమూలమున వీనితండ్రిని సామంతుఁ డు వశపఱచుకొనును. కావున మాతృబంధులకడ నుంచుటమంచి దని కౌణపదంతుఁడు. ఇది ధ్వజస్థానము. అదితికౌశికులవలె నాధ్వ జముచే వీనిమాతృబంధువులు భక్షింతురు. కావునవీనిని గ్రామ్యధ ర్మములలో విడిచిపెట్టవలయును. వీలన సుఖోపరుద్ధులగుపుత్రులు తండ్రికి ద్రోహముచేయరని వాతవ్యాధి.

ఇది జీవన్మరణము. ఘుణజగ్ధమగు కాష్ఠమువలె నవినీత పుత్త్రుఁడుగలరాజకుల మభియుక్తమాత్రమయినదై కొట్టఁబడును. కావున మహిషి ఋతుమతియగునపుడే ఋత్విక్కులైంద్రాబార్హస్పత్యమగు చరువునియ్యవలెను. గర్భిణియగు నామెయొక్క గర్భపోషణమందును ప్రజనన విషయమునను కౌమారభృత్యజనము నియమింపవలెను. సంతానముగలిగినపిమ్మటఁ బురోహితుఁడు పుత్త్రసంస్కార మొనర్పవలెను. మఱియుఁ బ్రాజ్ఞుఁడగుపుత్త్రునిఁ బండితులు శిక్షింపవలెనని కౌటిల్యుఁడు.

సహాధ్యాయులలో నొకఁడు మృగయాద్యూతమద్యస్త్రీజనములచే వశపఱచుకొని తండ్రిపైవిక్రమించి రాజ్యమునపహరింపుమని లోభపెట్టవలెను. దానిని మఱియొక సహాధ్యాయుఁడు నిషేధింపవలెనని ఆంభీయులు.

అబుద్ధబోధనమగునిది మహాదోషము. క్రొత్తవస్తువేయేవర్ణముతోఁ గూర్పఁబడునో దానినెల్ల నాకర్షించుకొనునట్లు నవబుద్ధియగునీతఁడు చెప్పినదానినంతను శాస్త్రోపదేశముగ గ్రహించును. కావున ధర్మార్థములనేగాని యధర్మానర్థముల నుపదేశింపగాదు. మఱియు వీనిసహాధ్యాయులు మేము నీవారమనిపలుకుచు జాగరూకతతో వీనిని పాలింపవలయునని కౌటిల్యుఁడు.

యౌవనగర్వముచేఁ బరస్త్రీలయెడ బుద్ధినుంచిన రాజపుత్త్రుని రాత్రులయందు శూన్యాగారములలో నార్యావ్యంజనులగునపవిత్రుల చేతను, మద్యకాముఁడగువానిని యోగపానము చేతను, ద్యూతకామునిఁ గాపటికులగు పురుషులచేతను, మృగయాకామునిఁ బ్రతిరోధకవ్యంజనులచేతను భయపెట్టింపవలెను.

తండ్రిపైఁ గలహింపనుద్దేశించినవాని నట్లేయని వశపఱచు

కొనితర్వాత, "రాజగుటనుకోరరాదు; అది చెడినపుడు హానియు సిద్ధించినపుడు నరకపాత ప్రజానంక్రోశములును దానిచేనేకలోష్టవధయు సంభవించు"నని భేదపెట్టవలెను.

ఏకపుత్త్రుఁడు ప్రియుఁడైనను విరాగుఁడైనచో వానినొకచోట బంధించియుంపవలెను. పుత్త్రులనేకులుండునపుడు సంతానయోగ్యతయు సంతానోత్పత్తియులేని ప్రత్యంతములగు నన్యదేశములరాజులవద్దకు వారిలోఁ గొందఱినిపంపవలెను. ఆత్మసంపన్నుఁడగుపుత్త్రుని సేనాపత్యమందుఁగాని యౌవరాజ్యమందుఁగానియుంపవలెను.

బుద్ధిమంతుఁడు ఆహార్యబుద్ధి దుర్బుద్ధియని పుత్త్రులు త్రివిధులు. శిక్షనుపొంది ధర్మార్థముల గ్రహించి వాని నాచరించువాఁడు బుద్ధిమంతుఁడు. గ్రహించియు నాచరణయందుంపనివాఁ డాహార్యబుద్ధి. నిత్యాపాయుఁడును ధర్మార్థద్వేషియునగువాఁడు దుర్బుద్ధి.

దుర్బుద్ధియొక్కఁడే పుత్త్రుఁడైనపుడు వానికిఁబుత్త్రులు కలుగునట్లు ప్రయత్నింపవలయును. లేదా పుత్త్రికలకైనఁ బుత్త్రులుకలుగునట్లు ప్రయత్నముచేయవలెను.

రాజు వృద్ధుఁడుగను రుగ్ణుఁడుగను నున్నప్పుడు మాతృబంధులలోఁగాని స్వకులమువారిలోఁగాని గుణవంతులగు సామంతులలోఁగాని యొకనిచే స్వక్షేత్రమున బీజమునుంపింపవలెను. అవినీతుఁడగు నేకపుత్త్రునిమాత్రము రాజ్యమునందుంపరాదు.

రాజనేకుల కాధారుఁడు కావునఁ బుత్త్రహితుఁడై యుండవలెను. ఆపద్విషయమునఁ దప్ప రాజ్యమునకు జ్యేష్ఠుఁడేయర్హుఁడు.

ఒకప్పుడు రాజ్యము కులమునందుఁగూడ సంక్రమింపవచ్చును. కులసంఘము దుర్జయమును, నరాజకవ్యసనము లేనిదియునయి

శాశ్వతముగ భూమి నేలఁగలిగియుండును.

ఇది వినయాధికారికమున రాజపుత్రరక్షణమను
సప్తదశాధ్యాయము.



## 14-15 ప్రకరణములు.

### అవరుద్ధవృత్తము, అవరుద్ధునియెడ వృత్తి.

రాజపుత్రుఁడు కృచ్ఛ్రవృత్తియై యసదృశకర్మలందు నియుక్తుఁడైనప్పటికిని ప్రాణాబాధకములును ప్రజాకోపకరములును పాపకారణములునునగు సమయములందుఁదప్పఁ దక్కిననపుడు తండ్రినను సరింపవలెను. పుణ్యకర్మలందు నియుక్తుఁడై తనకొకనినధ్యక్షునిగఁ గోరి వానిని యోగపురుషులనెల్లఁ బూర్ణాంగఁజేయుచు నభిరూపమగు కర్మఫలమును, నుపాయమునకుఁదగిన లాభమును, తండ్రికిఁగలుగఁ జేయుచుండవలెను. అట్లు చేసినను సంతుష్టుఁడుకాక మఱియొకపుత్రునియెడఁగాని భార్యయెడఁగాని ప్రియుఁడయినచో నపుడరణ్యవాసమున కనుజ్ఞతీసికొనవలయును. బంధవధభయములు కలిగినచో న్యాయవృత్తముగలవాఁడును ధార్మికుఁడును సత్యవాక్యుఁడును నవిసంవాదకుఁడును నభిపన్నులఁజేపట్టి గౌరవించువాఁడును నగు సామంతరాజును నాశ్రయింపవలెను. అచ్చటనుండి కోదండసంపన్నుఁడై ప్రవీరపురుష కన్యాసంబంధమును సంపాదించి యాటవికసంబంధమును కృత్యపక్షోపగ్రహమును చేయవలెను. (సామంతుని నాశ్రయింపక) ఏకచరుఁడై సువర్ణపాకమణిపాకమూలమునఁగాని హేమరూప్యపణ్య ఆకరకర్మల మూలమునఁగాని బ్రతుకవచ్చును: పాషండసంఘమును ధనవంతురాలగు భర్తృహీనను నోడవర్తకులను స్వాధీనముచేసికొని మద్యరసయోగముచే వారినివంచించి వారిద్రవ్య

మును, నశ్రోత్రియభోగ్యమగు దేవద్రవ్యమును నపహరింపవచ్చును. శత్రుగ్రామముల వశపఱచుకొనుటకుఁ దగినయుపాయములనాచరింపవచ్చును. మాతృసంబంధమువారి సహాయమును పొంది తండ్రిపైఁ బరాక్రమింపవచ్చును

లేక కారుశిల్పకుశీలవచికిత్సకవాగ్జీవనపాషండవేషములచే నిజరూపమును మార్చుకొని యట్టివేషములుగలవారిని వెంటఁబెట్టుకొని యవకాశముకలిగినపుడు రాజమందిరమును ప్రవేశించి శస్త్రరసప్రయోగముఁజేసి, ఇదిగో నేనునీపుత్త్రుఁడను. ఈ రాజ్యమునహభోగ్యముగాని యొక్కఁడనుభవింపఁదగదు అట్లనుభవింపఁగోరినవారు మరణార్హులు. ద్విగుణమగు భక్తవేతనమునకుఁగూడ నేనంగీకరింపనని తండ్రితోఁ బలుకవలయును.

ఇది యవరుద్ధవృత్తము.

అవరుద్ధుఁడగు ముఖ్యపుత్త్రుని చారులుగాని తల్లిగాని ప్రతిగ్రహీతగాని బోధించి (రాజువద్దకు) తీసికొనిరావలయును.

త్యక్తుఁడగువానిని గూఢపురుషులు శస్త్రరసములచేఁ జంపవలెను.

అత్యక్తుఁడగువానినిఁ దుల్యశీలలగు స్త్రీలమూలమునఁగాని, పానముచేఁగాని వేటచేఁగాని రాత్రివేళ బలాత్కారముగఁబట్టుకొని తీసికొనివచ్చి నాయనంతరము రాజ్యమునీదని శాంతిఁబొందించినిరోధింపవలెను. పెక్కుపుత్త్రులున్నప్పు డట్టివానిని బరదేశమున కంపవలెను.

ఇది వినయాధికారికమున అవరుద్ధవృత్తము, అవరుద్ధునియెడవృత్తియను నష్టాదశాధ్యాయము.



## 16 ప్రకరణము.



రాజప్రణిధి

రాజు కార్యోత్సాహము గలవాఁడయినచో భృత్యులుగూడఁ గార్యోత్సాహులై వానిననుసరింతురు. రాజు ప్రమత్తుఁడయినచో వారుగూడఁ బ్రమాదమునొంది వానికార్యములఁ జెడఁగొట్టుదురు; శత్రువులుగూడ వానిని మోసపెట్టెదరు. కావునఁ దాను గార్యోత్సాహముగలవాఁడై యుండవలెను.

నాళికలచేతఁగాని, ఛాయాప్రమాణముచేతఁగాని, యహోరాత్రములను రాజువిభజింపవలెను. త్రిపౌరుషి పౌరుషి చతురంగుళచ్ఛాయ మధ్యాహ్నము అనిపూర్వదివసముయొక్కయు మధ్యాహ్నము చతురంగుళచ్ఛాయ పౌరుషి త్రిపౌరుషి అని పశ్చిమదివసముయొక్కయు భాగములెనిమిది.

వీనిలో దివసముయొక్క మొదటిభాగమునరక్షావిధానమును నాయవ్యయములను వినవలెను. రెండవభాగమునఁ బౌరజానపదుల కార్యములఁ జూడవలెను. తృతీయభాగమున స్నానభోజనస్వాధ్యాయములను, చతుర్థమున హిరణ్యప్రతిగ్రహ అధ్యక్షనియోగముల ను చేయవలెను. పంచమభాగమునఁ బత్రసంప్రేషణ మూలమునగ మంత్రిపరిషత్తుతో నాలోచింపవలెను. మఱియు చారులుతెచ్చిన రహస్యవిషయములఁ దెలిసికొనవలయును. షష్ఠభాగమున స్వైరవిహారముగాని, కార్యాలోచనముగాని చేయువలెను. సప్తమభాగమున హస్త్యశ్వరథాయుధీయులను పరిశీలింపవలెను. అష్టమభాగమున సేనాపతిసహితుఁడై యుద్ధప్రయత్నముల నాలోచింపవలయును దినాంతమున సంధ్యావందనముఁ జేయవలెను.

రాత్రియందుఁ బ్రథమభాగమున గూఢపురుషులకు దర్శన

మీాయవలెను. రెండవభాగమున స్నానభోజనస్వాధ్యాయములఁ జేయవలెను. మూడవభాగమునఁ దూర్యఘోషముచే సంవిష్టుఁడై చతుర్థపంచమభాగములు పూర్తియగునంతవఱకు నిద్రింపవలెను. షష్ఠభాగమునఁ దూర్యఘోషముచే మేల్కొల్పఁబడి శాస్త్రములు నితికర్తవ్యమును చింతింపవలెను. సప్తమభాగమునఁ గార్యాలోచనముచేసి గూఢపురుషులఁ బంపవలెను. అష్టమభాగమున ఋత్విగాచార్యపురోహిత సహితుఁడై స్వస్త్యయనములఁ బ్రతిగ్రహించి, చికిత్సక మౌహూర్తికమాహానసికులఁజూచి, వత్సతోఁగూడిన ధేనువునకును వృషభమునకును ప్రదక్షిణ మొనర్చి యాస్థానమునకు వెళ్ళవలెను.

లేక యాత్మబలానుకూలముగ నిశాహర్భాగముల విభజించి కార్యములఁ జేయవచ్చును.

ఆస్థానగతుఁడై కార్యార్థులకు దర్శనమొసంగవలయును. రాజు దుర్దర్శుఁడైనచో నాసన్నులు కార్యాకార్యవిపర్యాసమును చేయుదురు. దానిచేరాజు ప్రజాప్రకోపమునకును శత్రువశమగుటకును పాత్రుఁడగుచున్నాఁడు. కనుక దేవతాశ్రమపాషండశ్రోత్రియపశుపుణ్యస్థానకార్యములను, బాలవృద్ధవ్యాధితవ్యసన అనాథలకార్యములను, స్త్రీలకార్యములను క్రమముగఁగాని కార్యగౌరవకార్యావసరములఁ బట్టిగాని చూడవలయును. అత్యాసన్నమగు కార్యమును కాలాతిక్రమముకాకుండ నొనర్పవలయును; లేనిచోనది చెడిననై కష్టసాధ్యమగుటకాని కాకపోవుటగాని సంభవించును.

నైద్యులయుఁ దపస్వులయుఁ గార్యములఁ బురోహితసహితుఁడై ప్రత్యుత్థానాభివాదములొనర్చి యగ్న్యగారమునఁ జూడవలెను.

తపస్వులును మాయాయోగవిదులును ప్రమాదముకలిగిన చో శపింతురుగాన వారికార్యముల స్వయముగఁ జేయక త్రైవిద్యులతోఁగూడి చేయింపవలెను.

రాజున కుద్ధానమే వ్రతము; కార్యానుశాసనమే యజ్ఞము; వృత్తిసామ్యమే దక్షిణావభృతస్నానములు.

ప్రజలు సుఖించినచో రాజునకు సుఖముకలుగును. ప్రజలకు హితమైనచో రాజునకు హితమగును. ప్రజలకుఁ బ్రియమైన దే రాజునకు హితముగాని స్వప్రియము హితముకాదు.

అర్థమూన కుద్ధానమును, ననర్థమున కనుద్ధానమును మూలములగుటచేత రాజెల్లప్పు డుద్ధితుఁడై కార్యానుశాసనము లొనర్పవలెను. ఉద్ధానము లేనిచోఁ బ్రాప్తించినట్టిదియుఁ బ్రాప్తింపఁబోవునట్టిదియు నశించుట సత్యము. ఉద్ధానమువలన ఫలమును నర్థసంపదయును లభించుచున్నవి.

ఇది వినయాధికారికమున రాజప్రణిధియను

పందొమ్మిదవ యధ్యాయము.



## 17 ప్రకరణము.

### నిశాంతప్రణిధి

వాస్తుశాస్త్రానుకూలమగు ప్రదేశమందుఁ బ్రాకారపరిఖాద్వారములతోడను ననేకకక్ష్యములతోడను గూడునట్లుగ నంతఃపురమును కట్టింపవలెను.

వాసగృహమును కోశగృహముఁరీతిఁగాని మోహనగృహమధ్యమున గూఢభిత్తిసంచారము కలుగునట్లుగఁగాని యాసన్నకాష్ఠచైత్యదేవతావిధానద్వారములును ననేకసురంగాసంచారములును కలిగి

నట్టి భూగృహముగఁగాని గూఢములగు భిత్తిసోపానములును సుషిర స్తంభప్రవేశాపసారములునుకలిగినట్టి ప్రాసాదముగఁగాని నిర్మించి యంత్రబద్ధమై తలాపపాతము గలుగునట్టిదానినిగఁ జేయవలెను. సహాధ్యాయులవలని భయముండినచో నప్పటప్పటియాపదను తొలఁగించుకొనుటకుఁ దగునట్లుగఁగాని మార్చుకొనవచ్చును.

మానుషాగ్నిచే ముమ్మారపసవ్యముగఁ బ్రదక్షిణము చేయఁబడిన యంతఃపురము మఱియేవిధమగు నగ్నిచేతను దహింపఁబడదు; మఱియు నందన్యమగునగ్నియే జ్వలింపదు. ఇదేవిధముగఁ గరకవారిచేతఁ దడుపఁబడిన మృత్సంయుక్తమగు వైద్యుతభస్మముచేఁ బూయఁబడిన యంతఃపురమున కగ్నిభయము కలుగదు. జీవంతి శ్వేత ముష్కక పుష్పవందాకలతలతోడను జాతాశ్వత్థములతోడనురక్షింపఁబడిన హర్మ్యమునకు విషసర్పభయము లేదు. విడువఁబడిన మార్జారమయూర నకులపృషతములు సర్పములభక్షించును. శుకశారికాభృంగరాజములు సర్పవిషశంకగలిగినపుడు మొఱవెట్టును. విషసమీపమునఁ గ్రౌంచము మూర్ఛనొందును. జీవంజీవకము వాడును. మత్తకోకిల మృతినొందును. చకోరములకు నేత్రములెఱ్ఱపడును. ఈ విధముగ నగ్నివిషసర్పభయములకుఁ బ్రతీకారమొనర్పవలెను.

అంతఃపురమునకు వెనుకవైపునందలికక్ష్యావిభాగమున గర్భవ్యాధులందుపయోగించు నౌషధములును ప్రఖ్యాత సంస్థావృక్షములును నుదకస్థానమును కల స్త్రీనివేశమును నిర్మింపవలెను. దీనికి వెలుపలఁ గన్యాకుమారపురమును, నెదుట నాస్థాన కుమారాధ్యక్షస్థాన, అలంకారమంత్రభూములను నిర్మింపవలెను. కక్ష్యాంతరములలో నంతర్వంశికసైన్యముల నిలుపవలెను.

అంతర్గృహగతుఁడై స్థవిరస్త్రీపరిశుద్ధయగుదేవిని చూడవల

యునుకాని యిచ్చకుశచ్చినదానిని పొందరాదు. ఏలన, దేవిగృహ మందడఁగియుండి భద్రసేనుని వానియన్నయు, దల్లిశయ్యలోనిమి డియుండి కారూశునివాని పుత్రుఁడును, తేనెయని విషమిశ్రితలాజ లఁదినిపించి కాశిరాజును విషదిగ్ధనూపురముచే వైరంత్యుని మేఖలా మణిచే సౌవీరుని, ఆదర్శముచే జాలూథుని, వేణీగూఢమగు శస్త్ర ముచే విదూరథుని వారివారిపట్టపుదేవులు చంపిరి. కావున నిట్టి యాపదలకవకాశ మియ్యరాదు.

ముండజటిల కుహాకసంసర్గమును బాహ్యాదాసీజనసంసర్గము ను నంతఃపురస్త్రీలకుఁ గలుగకుండఁ బ్రతిషేధింపవలెను. గర్భవ్యా ధి (గర్భిణీ) సంస్థలుతప్పఁ దక్కినకులస్త్రీలెవ్వరు వీరినిచూడరాదు. స్నానాదులచేఁ బరిశుద్ధలగువేశ్యలు వస్త్రాలంకారములధరించి వీరిని దర్శింపవలయును.

మాతాపితృవ్యంజనులగు నెనుబదిమందిపురుషులును, నేఁబ దిమంది స్త్రీలును, స్థవిరులును వర్షవీరులునునగునభ్యాగారికులును నవరోధజనుల శుచిత్వాశుచిత్వముల నెఱుంగుచు స్వామిహితము నందే వారిని నిలుపవలయును.

అంతఃపురజనమంతయు స్వప్రదేశమందే యుండవలయును కాని పరప్రదేశమునకు వెళ్ళఁగూడదు. మఱియు నాభ్యంతరు లె వ్వరు బాహ్యజనసంసర్గమునొందరాదు. అంతఃపురద్రవ్యమంతయు నిబద్ధమగు రాకపోకలుగలదై పరీక్షింపఁబడి ముద్రవేయఁబడినదై ప్రవేశనిర్గమనములఁ బొందవలయును.

ఇది వినయాధికారికమున నిశాంతప్రణిధియను
నిరువదవ యధ్యాయము.



## 18 ప్రకరణము.

### ఆత్మరక్షితకము

(రాజు) శయనమునుండి లేవఁగనే ధనుర్ధరులగు స్త్రీల చేతను, ద్వితీయకక్ష్యలోఁ గంచుకోష్ణీషులగు వర్షవరాభ్యాగారికుల చేతను, తృతీయకక్ష్యలోఁ గుబ్జవామనకిరాతుల చేతను, చతుర్థకక్ష్యలో మంత్రులుబంధులు నాయుధపాణులగు దౌవారికుల చేతను పరిగ్రహింపఁ బడవలెను.

తండ్రితాతలనుండివచ్చువారిని, గొప్పబంధుత్వముగలవారిని, శిక్షితులను, ననురక్తులను, నేర్పుగలవారిని, అనన్యజనముగ నియోగింపవలెను. అన్యదేశీయులును, అర్థమానములఁ బడయనివారును, అకృతోపకృహీతులగు స్వదేశీయులును, అంతర్వంశికసైన్యముగ నుండినచో, రాజునకును రాజాంతఃపురమునకును రక్షణము కలుగఁజాలదు.

మహానసికుఁడు రహస్యప్రదేశమునఁ బదార్థములనన్నిటి నాస్వాదబహుళములగునట్లు చేయింపవలెను. తొలుత నగ్నికిని బక్షులకును బలినిచ్చి పిదప రాజు వానిని రహస్యముగభుజింపవలెను.

అగ్నిజ్వాలాధూమములకు నైల్యశబ్దస్ఫోటనములు, పక్షులకు విపత్తి, అన్నపుటావిరికి నెమలికంఠపురంగును వేగముగఁ జల్లారిపోవుటయుఁ గఠినపదార్థమునకు వైవర్ణ్య, సోదకత్వ, అక్లిన్నత్వములు వ్యంజనముల శాఘశుష్కత్వము, క్వాథశ్యామఫేనపటలవిచ్ఛిన్నభావము, గంధస్పర్శరసహానియు, ద్రవ్యములందు హీనాతిరిక్తచ్ఛాయాదర్శనము ఫేనపటలసీమాంతోర్ధ్వరాజీదర్శనమును, రసమధ్యమున నీలరాజియుఁ, బాలకునెఱ్ఱనవమున, మద్యతోయములకు నైల్యము, పెరుగునకు శ్యామవర్ణము, తేనెకుతెల్లదనము, ఆర్ద్రద్రవ్యములకు

అను ప్రమ్లానత్వక్వాథశీలశ్యావతలును, శుష్కపదార్థములకు ఆశు శాతన వైవర్ణ్యములు, కఠినపదార్థములకు మృదుత్వంబుఁ మృదుపదార్థములకుఁ గాఠిన్యము, వానిదగ్గరనుండు క్షుద్రజంతువులకుమరణము, ఆస్తరణప్రావరణములకు మండలరూపమగు శ్యామలకాంతియుఁ దంతురోమపక్ష్మశాతనమును, లోహమణిమయపాత్రములకుఁ బౌకము పలని వైవర్ణ్యము స్నేహరాగగౌరవప్రభావ వర్ణస్పర్శహానియు, విషయుక్త చిహ్నములు.

శుష్కశ్యావవక్త్రత మాటలతొట్రుపాటు స్వేదము ఆవలింతలు మిక్కిలిగవణఁకుట ప్రస్ఖలనము వాక్యవిప్రేక్షణము కర్మావేశము స్వభూమ్యనవస్థానములు విషప్రదుని లక్షణములు.

గావున విషవేత్తలగు వైద్యులు రాజసమీపమందుండవలెను. ప్రైవద్యాగారమునుండి వైద్యుఁడు స్వాదవిశుద్ధమగు నౌషధమును దెచ్చి, తానును పాచికపోషకులును ముందుదానిని భుజించి పిమ్మట రాజునకీయవలెను. ఇట్లే పానపానీయముల విషయమున నెఱుఁగునది.

కల్పకప్రసాధకులు స్నానశుద్ధములగు వస్త్రహస్తములుగలవారై ముద్రలతోఁగూడిన యుపకరణములనంతర్వంశికహస్తముల నుండిపుచ్చికొని పరిచర్య చేయవలెను.

దాసీజనము స్నాపక సంవాహక ఆస్తరక రజక మాలాకారకర్మలను చేయవలెను. స్నానానులేపన ప్రఘర్షచూర్ణవాసస్నానీయపదార్థములను స్వవక్షోబాహునేత్రములఁ దొలుత నుంచుకొని దాసీజనముచే నధిష్ఠితులై శిల్పులు వస్త్రమాల్యముల రాజునకీయవలెను. అన్యపురుషులనుండివచ్చిన వస్తువులవిషయమునఁగూడ నిట్లేయని గ్రహింపనగు.

కుశీలవులు శస్త్రాగ్నిరసవర్జముగ రాజును సేవింపవలయును.

వీరి వాద్యవస్తువులును అశ్వరథద్విపాలంకారములును నంతఃపురము
దేయుండవలెను. (రాజు) మౌలపురుషాధిష్ఠితమగు యానవాహనా
రోహణము జేయవలెను. ఆప్తనావికాధిష్ఠితమును నన్యనౌప్రతిబద్ధ
మునగు నావనేగాని వాతవేగమునకు వశమగునావనధిష్ఠింపరాదు.
(నావారోహణసమయమున) తీరమున సైన్యమును నిలుపవలెను.
మత్స్యగ్రాహవిశుద్ధమగు నుదకమును, వ్యాళగ్రాహవిశుద్ధమగు ను
ద్యానమును, లుబ్ధకశ్వగణములచేతఁ దొలఁగింపఁబడిన స్తేనవ్యాళశ
త్రుబాధలుగలిగిన మృగారణ్యమును లక్ష్యపరిచయముకొఱకు రాజు
ప్రవేశింపవలెను. ఆప్తులగు శస్త్రగ్రాహుల వెంటనిడికొని సిద్ధతా
పసుల దర్శింపవలెను. మంత్రిపరిషత్తుతోఁగలిసి సామంతదూతను,
సన్నద్ధుఁడై అశ్వహస్తిరథములలో నొకదానినధిష్ఠించి సన్నద్ధమగు
సేనను నెదుర్కొనవలెను. రాకపోకలలో దండపాణులచేనిరుపార్శ్వ
ములఁ రక్షింపఁబడి యితరులగు శస్త్రహస్తులచే శూన్యమగురాజ
మార్గమునేగాని పురుషసమ్మర్దమగు రాజమార్గమును ప్రవేశింపరాదు.
దశవర్గికాధిష్ఠితుఁడై యాత్రాసమాజోత్సవయజ్ఞములకు వెళ్లవలెను.
యోగపురుషులసాధనమున నన్యులరక్షించునట్లాత్మవంతుఁడై యిత
రులబాధనుండి తన్ను రక్షించుకొనవలయును.

ఇది వినయాధికారికమున ఆత్మరక్షితకమను
నిరువదియొకటవ యధ్యాయము.

ఇట్లు కౌటిలీయార్థశాస్త్రమున వినయాధికరణమను
ప్రథమాధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము.

## అధ్యక్షప్రచారమను ద్వితీయాధికరణము.

### 19 ప్రకరణము.

జనపదనివేశము.

భూతపూర్వమగు ప్రదేశమందుఁగాని, యభూతపూర్వమగు ప్రదేశమందుఁగాని, పరదేశాపవాహనముచేనైనను స్వదేశాభిష్యందవమనముచేనైనను నూరిండ్లకుఁ దక్కువగాక యైదువందలయిండ్లకు నెక్కువగాక శూద్రకర్షకులతో నిండియుండునట్లుగను, రెండుమూఁడు క్రోసుల పరిమితిగలిగి యన్యోన్యారక్షణముతోఁ గూడియుండునట్లుగను జనపదము నేర్పాటుచేయవలెను. దాని సీమాంతములందు నదీశైలవనగృష్టిదరీసేతుబంధములుగాని శాల్మలీశమీక్షీరవృక్షములుగాని యుండవలెను.

ఎనిమిదివందల గ్రామములనడుమ స్థానీయమును, నాలుగువందల గ్రామములనడుమ ద్రోణముఖమును రెండువందలగ్రామముల నడుమ ఖార్వటికమును పదిగ్రామములనడుమ సంగ్రహణమును నిలుపవలెను. రాష్ట్రాంతములం దంతపాలదుర్గములనిలిపి జనపదద్వారముల నంతపాలాధిష్ఠితములుగఁ జేయవలెను. (జనపద) మధ్యప్రదేశములను వాగురిక శబర పుళింద చండాల ఆరణ్యచరులు రక్షింపవలెను.

ఋత్విగాచార్యపురోహితశ్రోత్రియులకు దండకరశూన్యము గ నభిరూపదాయకములగు బ్రహ్మదేయభూములనొసంగవలయును. అధ్యక్షసంఖ్యాయకాదులకును గోపస్థానిక అనీకస్థ చికిత్సక అశ్వదమక జంఘారికులకును విక్రయాధానవర్జముగ భూముల నొసంగవలయును. కృతక్షేత్రముల నొకతరమువఱకుఁ గరదులకియ్యవచ్చును. అకృతక్షేత్రములనుండి సాగుచేసినవారిని తొలఁగింపరాదు. కృషి చేయనివారిని వారిభూములనుండి తొలఁగించి వానినన్యులకునియ్యవలెను; లేదా, వానిని గ్రామభృతకులుగాని వైదేహకులుగాని సాగు చేయవలెను. అట్లుచేయనిచో నష్టమునచ్చుకొనవలెను. ఎవరు సుఖముగఁ పన్నులచెల్లించుచుందురో వారికి ధాన్యపశుహిరణ్యముల ననుగ్రహింపవలెను.

అల్పకోశుఁడగురాజు పౌరజానపదుల మ్రింగుచుండును కావునఁ గోశవృద్ధికి నష్టముకలిగింపని యనుగ్రహపరిహారముల నేగానికోశోపఘాతకరములగువాని నొనర్పరాదు. ప్రవేశసమకాలమందుగాని కాలానుగుణముగఁగాని పరిహారమునిచ్చి పరిహారానస్థులను తండ్రి వలె ననుగ్రహింపవలెను.

ఆకరకర్మాంతద్రవ్యహస్తివనవ్రజవాణిజ్యప్రచారములఁ జేయుచు వారిపథస్థలపథపణ్యపట్టణములను స్థాపింపవలెను. సహోదకములును, నాహార్యోదకములునునగు తటాకములనిర్మించి యట్టి పనులుచేయు నితరులకు భూమి మార్గవృక్షోపకరణములతో సహాయముచేయవలెను. పుణ్యస్థానారామముల విషయమునఁగూడ నిట్లే జరుపవలెను.

గ్రామస్థులందఱుగలిసి సేతుబంధమొనర్చునపు డందులకిష్టపడనివాని కర్మకరులును, బలీవర్దములును నాపని నొనర్పవలయు.

మఱియు నాతఁడు దానికగు వ్యయకర్తృయుంపు భాగముగలవాఁడై తల్లాభమమాత్రము నపేక్షింపఁగూడదు.

మత్స్యప్లవహారితపణ్యములందును సేతువులందును రాజునకే స్వామ్యముండవలెను.

దాస ఆహితకబంధువులహక్కులను లక్ష్యపెట్టనివారికి రాజు వినయమును నేర్పవలయును. బాలవృద్ధవ్యాధిత వ్యసని అనాథలను గర్భిణియగుస్త్రీని ప్రసవానంతరము పుత్రులను రాజు పోషింపవలయును.

దేవద్రవ్యమును, వ్యవహారదశవచ్చువఱకు బాలుని ద్రవ్యమును గ్రామవృద్ధులు వృద్ధినొందింపవలెను.

శక్తిమంతులైయుండియుఁ దారపుత్రులను తల్లిదండ్రులను వ్యవహారజ్ఞానములేని సోదరులను గన్యలను సోదరీజనమును పోషింపనిచో వారికిద్వాదశపణదండనముువిధింపవలెను. వారిలోఁదల్లితప్పఁదక్కినవారు పతితులైనపుడు వారినిపోషింపనక్కఱలేదు. దారపుత్రులకుఁదగినసదుపాయము నొనరింపక సన్యసించువానికిని స్త్రీనిసన్యసింపఁజేయువానికిని పూర్వసాహసదండము విధింపవలెను. లుప్తవ్యవాయుఁడు తనదియగు ధర్మస్వమును పంచిపెట్టి సన్యసింపవలెను; లేనిచోవాఁడు శిక్షాపాత్రుఁడగుచున్నాఁడు.

వానప్రస్థముకంటె నితరములగు నాశ్రమములనుండి సన్యసించువాఁడును సజాతీయములకంటె నన్యమగు సంఘమును, సాముత్థాయికముకంటె నన్యమగు సమయానుబంధమును, రాజుయొక్క జనపదమందుఁ బ్రవేశింపరాదు. జనపదమందలి యారామవిహారశాలలను వారుపయోగింపరాదు. గ్రామస్థులెల్లప్పుడు క్షేత్రాభిరతులు. వారికదియే యాశ్రమము. కనుకఁ గోశవిష్టిద్రవ్యధాన్యరసవృద్ధిని

గోరి నటనర్తకగాయనవాదకవాగ్జీవనకుశీలవులు గ్రామస్థులకార్యము లకు విఘ్నముగలిగింపరాదు.

శత్రుసేనాటవీగ్రస్తముగునట్టియు వ్యాధిదుర్భిక్షపీడితమగునట్టియు దేశమును రాజుపరిహారించి వ్యయకారణములగు క్రీడలను మాదుకొనవలెను. దండవిష్టికరాబాధలచేతఁ బీడింపఁబడుకృషి కార్యమును స్తేనవ్యాళవిషగ్రాహులచేతను వ్యాధులచేతను పీడింపఁబడు పశువ్రజములను రాజురక్షింపవలెను. వల్లభకార్మికస్తేన అంతపాలజనముచేఁ బీడింపఁబడి పశుసంఘములచేఁ బాడుచేయఁబడుచుండు వణిక్పథమును శోధింపవలయును.

రాజీవిధముగఁ బూర్వకృతములగు ద్రవ్యద్విపవనసేతుబంధాకరములను రక్షించుచుఁ గ్రొత్తవానిని ప్రవర్తింపఁజేయుచునుండవలెను.

ఇది అధ్యక్షప్రచారమను ద్వితీయాధికరణమున జనపదనివేశమను ప్రథమాధ్యాయము.

ఆదినుండి యిరువదిరెండవ యధ్యాయము.



## 20 ప్రకరణము.

### భూమిచ్ఛిద్రవిధానము.

అకృష్యములగు భూములలోఁ బశువులమేఁతకుఁగాను బీడులను విడువవలయును. స్థావరజంగమములవలన భయరహితములగు బ్రహ్మసోమారణ్యములను బ్రాహ్మణులకును, తపోవనములు తపస్వులకును గోత్రనామములతో నేర్పఱుపవలెను. అట్లే ఏకద్వారము ఖాతగుప్తము స్వాదుఫలగుల్మగుచ్ఛము అకంటకద్రుమము దాంతమృగచతుష్పదమగు నుత్తానతోయాశయము భగ్ననఖదంష్ట్రవ్యాళ

మార్గాయుకహస్తిహస్తినీకలభమృగమునునగు వనమును రాజవిహారముకొఱకై యేర్పఱుపవలయును (ఇదిగాక) అందఱకు నుపయోగించునట్టి మృగవనమును మఱియొకదానిని సమీపమునంగాని భూవివశముచే మఱియొకచోటంగాని నిర్మింపవలయును. కుప్యద్రవ్యములకుంగా నొకవనమునుకాని యనేకములనుకాని ప్రతిష్ఠింపవలయును. ద్రవ్యవనములనుండి వేఱుగ ద్రవ్యవనకర్మాంతములగు నడవులనుని లిపిరక్షించుచు వానిసమీపమున హస్తివనములం గూర్పవలెను.

నాగవనాధ్యక్షుండు పార్వతనాదేయసారసానూపములగు పర్వతప్రవేశనిష్కాసనములనెఱింగి నాగవనపాలురతోంగలిసి నాగవనమును పాలింపవలయును. హస్తిఘాతకులకు మరణదండము విధించుచు స్వయమృగ దండయుగమును తెచ్చినవారికి నాలుగున్నరపణమును లాభముగ నొసంగవలయును.

నాగవనపాలురు హస్తిపకపాదపాశికసౌమికవనచరకపారికార్మికులతోంగూడి హస్తిమూత్రపురీషచ్ఛన్నగంధులై భల్లాతకీశాఖలం గప్పుకొని, అయిదుగాని యేడుగాని ఆడేనుంగులతోంగూడి తిరుగుచు శయ్యాస్థానపద్యా ఆలండకూలపాతప్రదేశములమూలమున హస్తికులప్రదేశములం దెలిసికొనవలయును. శాస్త్రదృష్టిచే యూథచరమును నేకచరమును నిర్యూథమును యూథపతినినాస్తినివ్యాళమును మత్తమును పోతమును బద్ధముక్తమును తెలిసికొనవలయును. అనీకస్థులవాక్ప్రమాణ్యముచేం బ్రశస్తవ్యంజనాచారములుగల యేనుంగులం బట్టికొనవలయును.

రాజులవిజయము హస్తిమూలమేగదా ? మఱియు నధికశరీరప్రమాణముగలిగినట్టియుం బ్రాణహరకార్యముల నొనర్పునట్టియు నేనుంగులేగదా పరానీకవ్యూహ దుర్గస్కంధావారముల మర్దించునవి ?

కళింగ అంగకరూశప్రాగ్దేశజములగు గజములు శ్రేష్ఠములు. దశార్ణ అపరాంత దేశజములు మధ్యమములు. సౌరాష్ట్రపాంచజన దేశజములు పై రెండింటికంటె నవరములు. అన్నిటియొక్క వీర్యతేజోజవములు శిక్షచే నధికమగుచుండును.

ఇది అధ్యక్షప్రచారమనుద్వితీయాధికరణమున భూమిచ్ఛిద్రవిధానమను ద్వితీయాధ్యాయము.

ఆదినుండి యిరువదిమూడవ యధ్యాయము.



## 21 ప్రకరణము.

### దుర్గవిధానము.

జనపదాంతమున నాలుగువైపులందును శత్రుభయమునుండి రక్షించునట్టియు దైవకృతానుకూల్యమగునట్టియు దుర్గమును నిర్మింపవలెను. అంతర్ద్వీపస్థలమునుకాని నిమ్నావరుద్ధమగునట్టి దానినికాని ఔదకదుర్గముగను పాషాణమయప్రదేశమునుకాని గుహనుకాని పార్వతదుర్గముగను నిరూదకస్తంభమునుకాని యిరిణమునుకాని ధాన్వనదుర్గముగను ఖజనఉదకస్తంభగహనప్రదేశములలో నొకదానిని వనదుర్గముగను చేయవలెను. వీనిలో నదీపర్వతదుర్గములు జనపదారక్షస్థానములు. ధాన్వనవనదుర్గము లటవీస్థానమునకుఁ బోవుటలో నుపయోగించునట్టివి.

జనపదమధ్యమున వాస్తుకప్రశస్తదేశమందు నదీసంగమస్థలమునఁగాని సామాన్యహ్రదసమీపమునఁగాని సరస్తటాకసమీపమునఁగాని వర్తులముగనో దీర్ఘముగనో చతురశ్రముగనో వాస్తుకవశముచేఁ బ్రదక్షిణోదకమగునట్టియు స్థలపథవారిపథములతోఁ గూడినట్టియుఁ బణ్యాపుటభేదనమగు సముదయస్థానమును స్థానీయముగ (ముఖ్యపట్ట

ణముగ) నిర్మలపవనలయును దానిచుట్టును పదునాలుగుగాని పం
డ్రెండుగాని పదిగాని దండములవెడల్పును వెడల్పులో నాలుగవవం
తుగాని సగముగాని తక్కువగు లోతునుకలిగినట్టియుఁ బైభాగము
లోని మూడవవంతు విస్తీర్ణముకుగునఁగలిగినట్టియు అడుగుభాగము
నఁ జతురశ్రమైనట్టియుఁ బాషాణములతోఁ గూర్పఁబడినట్టియుఁ బా
షాణేష్టికలతోఁ గట్టఁబడిన పార్శ్వములుగలిగినట్టియు సహజోదకము
లుగాని యాగంతుకజలములుగాని కలిగినట్టియు మూడుపరిఖలను త్రి
దండాంతములుగఁ గట్టవలెను.

ఆఱుదండముల యెత్తును దానికి రెండురెట్లు వెడల్పునుగలిగిన
ట్టివప్రమును పరిఖకు నాలుగుదండములదూరమున నవరుద్ధముగ ని
ర్మింపవలెను. మఱియుదానిని ఊర్ధ్వచయముగను మంచపృష్ఠముగ
ను కుంభకుక్షికముగను హస్తివృషభములచే క్షుణ్ణముగను కంటకగు
ల్మవిషవల్లీప్రతానవంతముగను చేయవలెను. దానిలోని వాస్తుచ్ఛి
ద్రములఁ బాంసువిశేషములచేఁ బూరింపవలయును.

వప్రోపరిస్థలమున వెడల్పుకంటె రెండురెట్లు పొడవుగలిగినట్టి
యు నిటికలతోఁ గూర్పఁబడినట్టియుఁ బ్రాకారమును, నోజముగగాని
యుగ్మముగఁగాని పండ్రెండుమొద లిరువదినాలుగు హస్తములయవ
కాశముగలుగునట్లుగ నిర్మింపవలయును. తాళమూలమురజాకృతు
లతోడను కపిశీర్షకములతోడను నాచితాగ్రమై పృథుశిలాసహితమ
గుకట్టడమును రథ్యామార్గముగ నేర్పఱచికొనవలయునుకాని యెప్పు
డును కాష్ఠమయముగ నొనర్పరాదు. ఏలన నందగ్నిభయ మొకప్పు
డువాటిల్లును.

విష్కంభచతురశ్రమగు నట్టాలకమును, దానియాన్నత్యము
నకు సమానమైనట్టియు, నోశప్రదేశమునుండి. మఱియొకప్రదేశము

సముఁ దీసికొనిపోవుటకువీలగునట్టియు సోపానసహితముగఁ గట్టవలెను. అట్టి రెండట్టాలకములకునడుమ రెండంతస్తులుగలిగినట్టియు వెడల్పు కంటె రెండున్నరరెట్లధికముగఁ బొడవుగలిగినట్టియుఁ బ్రతోళీనిత్రిం శద్దండాంతరమగునట్లుగ నిర్మింపవలెను. అట్టాలకప్రతోళీలమధ్య మున ముగ్గురు ధానుష్కులుండఁదగినట్లుగ ఛిద్రఫలకములతోఁ గప్ప బడిన యింద్రకోశమును కట్టవలెను. నడుమ రెండుమూరలునుపా ర్శ్వముల నాలుగుమూరలును ప్రాకారముదగ్గర నెనిమిదిమూరలును కలుగునట్లుగ దేవపథమును నిర్మింపవలెను. (ప్రాకారారోహణమున కై) ఒకటిరెండు దండముల యంతరముగల మార్గమునొకదాని నే ర్పరుపవలెను. అగ్రాహ్యప్రదేశమునఁ బ్రధావితికనిష్కురద్వారముల నిలుపవలెను. ప్రాకారబహిఃప్రదేశమునఁ ద్రిశూలప్రాకారకూ టావపాతకంటకప్రతిసరాహిపృష్ఠతాళపత్రశృంగాలకశ్వదంష్ట్రార్గళో పస్కందనపాదుకాంబరీషోదపానకములచే జానుభంజన మగునట్లుగ మార్గమును కప్పివేయవలెను.

ప్రాకారమున కిరుప్రక్కల నర్ధ్యర్ధదండమగు మండలమును చేసి ప్రతోళిలో నాలవవంతు వైశాల్యముగలద్వారమును నేర్పఱు పవలెను.

అయిదుదండములు మొద లెనిమిదిదండములవఱకు కొక్కొక దండముఁజేర్చుటవలనఁగాని లేక పొడవులో నాఱవవంతుమొద లెని మిదవవంతువఱకుఁ జేర్చుటవలనఁగాని చతురశ్రమేర్పడును. పదు నైదుమూరలనుండి పదునెనిమిదివఱకొక్కటిగ హెచ్చించినయెడలఁ దలోద్దేశమగును.

స్తంభపరిక్షేపము షడాయామముగను నిఖాతము దానికి రెం డురెట్లుగను చూళికదానిలో నాలవవంతుగను నుండవలెను.

ఆదితలములో నైమభాగములను శాలావాపీసీమాగృహము లక్రిందఁ వినియోగింపవలెను. రెండు పదియవభాగములలో నెదురెదురుగ రెండు మంచలను, మధ్యను పొడవులో సగము వెడల్పుగల మణిహర్మ్యమును స్థూణాబంధమును సగముగాని ముప్పాతికగాని వైశాల్యముగల యుత్తమాగారమును, దానిపార్శ్వమున నిటికకట్టడములను, యెడమవైపునఁ బ్రదక్షిణసోపానము, కుడివైపున గూఢభిత్తిసోపానము రెండుహస్తములుగల తోరణశిరస్సు మూఁడో అయిదోభాగములుగల రెక్కతలుపులు, రెండేసిపరిఘలు, అరత్ని పరిమితిగలయింద్రకీలము, అయిదుహస్తముల పరిమితిగల అణిద్వారము, హస్తిపరిఘలు నాలుగు, ఒకమనుష్యప్రమాణమగునట్టియుఁ గదల్చుటకుఁ దగినట్టియుఁ నిరూదకప్రదేశ భూమిమయమగునట్టియుఁ గూర్చుండుటకుఁ దగినట్టియు హస్తినఖములు లోనగువానిని నిర్మింపవలయును.

ప్రాకారసమముగ ద్వారమునుంచి త్రిభాగగోధాముఖమగు గోపురమును కట్టవలయును. ప్రాకారమునడుమ పుష్కరిణి, ద్వారము, చతుశ్శాల, గర్భగృహముకంటె సగమెక్కువగు వైశాల్యముగల కుమారీపురము, ముండకద్వారము, ద్వితలమగు ముండహర్మ్యము, భూమిద్రవ్యముల ననుసరించి వెడల్పుకంటె మూఁడింతలుపొడవుగలిగినట్టియు భాండముల వహింపఁగలిగినట్టియుఁగుల్యములులోనగువానిని నిర్మింపవలయును.

ఆకుల్యములలోఁ బాషాణములు కుద్దాలములు కుఠారులు పలువిధములగు కత్తులు ముసృంఠులు ముద్గరములు దండచక్రయంత్ర శతఘ్నులు ఇనుములోఁజేసిన శూలాయుధములు ఈటెలు ఉష్ట్రగ్రీవ్యములు అగ్నిసంయోగములు ఆటవిద్రవ్యములతోఁ జేయఁదగిన వ

జీర్ణోన్నిసామగ్రులు మొదలగువాని నుంపవలెను

ఇది అధ్యక్షప్రచారమున ద్వితీయాధికరణమున దుర్గవిధానమను తృతీయాధ్యాయము.

ఆదినుండి యిరువదినాలుగవ యధ్యాయము.



## 22 ప్రకరణము.

### దుర్గనివేశము.

ప్రాచీనములగు రాజమార్గములుమూఁడును ఉదీచీనములగు నవిమూఁడును కలిగియుండునట్లు దుర్గప్రదేశమునువిభాగముచేయవలెను. దుర్గమునకు రహస్యమగు నుదకపథభూపథములతోఁగూడిన ద్వారములు పండ్రెండుండవలెను. రథమార్గములు రాజమార్గములు ద్రోణముఖస్థానీయవివీతపథములు చతుర్దండాంతరములుగను, సయోనీయవ్యూహశ్మశానగ్రామపథము లష్టదండాంతరములుగను, సేతువనపణములు చతుర్దండాంతరములుగను, హస్తిక్షేత్రపథములు ద్విదండాంతరములుగను, రథపథములు పంచారత్నులుగను, పశుపథములు చతురత్నులుగను, క్షుద్రపశుమనుష్యపథములు రెండురత్నులుగలవిగను నేర్పాటుచేయవలెను.

ప్రవీరమగు ప్రదేశమున రాజనివేశమును నిర్మింపవలెను. చతుర్వర్ణములువారుండు ప్రదేశమునకునుమ దుర్గమధ్యమమున కుత్తరదిక్కునఁ దొమ్మిదవభాగమునఁ బ్రాఙ్ముఖముగఁగాని యుదఙ్ముఖముగఁగాని యథోక్తవిధానముగ నంతఃపురమును గట్టవలెను. దానికిఁ బూర్వోత్తరముగ నాచార్యపురోహిత ఇజ్యాతోయస్థానములను, మంత్రులనివాసములను, బూర్వదక్షిణముగ మహానసహస్తిశాలాకోష్ఠాగారములను, దానికిఁ బైఁగాఁ బూర్వపుదిక్కున గంధమా

ల్యధాన్యక్రసవతః కులయుఁ బ్రధానకారువులయు క్షత్రియులయు నివాసస్థానములను నిర్మింపవలయును.

దక్షిణపూర్వభాగమునఁ భాండాగారము అక్షపటలము కర్మనిషద్యలును, దక్షిణపశ్చిమమునఁ కుప్యగృహ ఆయుధాగారములును నుండవలయును దానికిఁబైఁగా దక్షిణదిక్కున నగరాధ్యక్షబలాధ్యక్షులును, పక్వాన్న సురామాంసములనమ్ము వారును వేశ్యలును తాళాచరులును వైశ్యులును నివసింపవలయును.

పశ్చిమదక్షిణభాగమున ఖరోష్ట్రస్థానకర్మగృహములును, పశ్చిమోత్తరమున యానరథశాలలును, దానికిఁబైఁగాఁ బశ్చిమదిక్కున ఊర్ణాసూత్రవేణుచర్మవర్మశస్త్ర ఆవరణకారులును శూద్రులునుండవలయును.

ఉత్తరపశ్చిమభాగమునఁ బణ్యభైషజ్యగృహములును, నుత్తరపూర్వభాగమునఁ గోశగవ అశ్వగృహములును, దానికిఁబైఁగా నుత్తరదిక్కున నగరదేవతయు లోహమణికారువులును బ్రాహ్మణులునుండవలెను.

అచ్చటచ్చట మూలలందు శ్రేణులు ప్రవహణనికాయములును స్థానముల నేర్పఱచుకొనవలయును.

పురమధ్యమున అపరాజిత అప్రతిహత జయంత వైజయంత శివవైశ్రవణ అశ్విని దేవతల యాలయములును, శ్రీమదిరాగృహమును కట్టవలెను. ప్రదేశానురూపాలయమునఁ గోష్ఠకాలయమునందు వాస్తుదేవతల నిలుపవలెను. బ్రాహ్మైంద్రయామ్యసేనాపత్యద్వారముల నేర్పఱచి పరిఖకు నూరుధనుస్సులమీఁద ముఁ చైత్యపుణ్యస్థానవన సేతుబంధములు నిర్మించి దిగనుసారముగ దిగ్దేవతల నిలుపవలెను.

ఉత్తరమునఁగాని తూర్పునఁగాని (సామాన్యులకును)

దక్షిణదిక్కున వర్ణోత్తరులకును శ్మశానవాటమును నిర్మింపవలెను. దీనినతిక్రమించినవారికిఁ బూర్వసాహసదండనము. శ్మశానాంతమునందుఁ బాషండులు చండాలురునుండవలయును.

క్షేత్రవశముచేఁగాని కర్మాంతవశముచేఁగాని వచ్చినకుటుంబులకు స్థలమునియ్యవలెను. రాజానుజ్ఞాతులై వారు పుష్పవాటఫలవాట షండకేదారముల నాప్రదేశములందేర్పఱచుకొని ధాన్యపణ్యములఁ గూర్చుచుండవలెను.

పదికుటుంబముల కొకనూతిని నిర్మింపవలయును.

నెయ్యి నూనె ధాన్యము క్షారము లవణము ఔషధములు శుష్కశాకములు ఎండుగడ్డి శుష్కమాంసము పచ్చిగడ్డి కట్టెలు లోహము చర్మము బొగ్గు స్నాయువు విషములు విషాణములు వేణువులు వల్కలములు ఱాళ్లు మొదలగువానిని పెక్కువత్సరములకు సరిపడునట్లుగఁ గ్రొత్తవానిచేఁ బ్రాతవానిని పరిహరించుచు దుర్గమునఁ జేర్చికొనవలయును.

పెక్కురధ్యక్షులుండినచోఁ బరస్పరభయమువలన శత్రూపజాపముకలుగదుగనుక హస్త్యశ్వరథపదాతుల ననేకాధ్యక్షులు కలుగునట్లొనర్పవలెను. అంతపాల దుర్గసంస్కారుల విషయమునఁగూడ నిట్లేయని యూహింపనగు.

పురరాష్ట్రోపఘాతకులగు బాహిరికులను దుర్గములందు నిలువనీక జనపదమునకుఁ దఱిమివేయవలెను; లేక వారినుండి పన్నులవసూలుచేయవలెను.

ఇది అధ్యక్షప్రచారమున సన్నివేశమను
చతుర్థాధ్యాయము.
ఆదినుండి యిరువదిరెండవ యధ్యాయము.



## 23 ప్రకరణము.

### సన్నిధాతృ చేయకర్మ.

సన్నిధాత కోశగృహ పణ్యగృహ కోష్ఠాగారకుప్యగృహాయు ధాగార బంధనాగారములఁ గట్టింపవలెను.

చతురశ్రమైనట్టియు నుదకస్నేహములేనట్టియు బావినొకదా నిని త్రవ్వించి పృథుశిలలతో నిరుప్రక్కలను నడుగుభాగమును క ట్టించి సారమగు దారుపంజరమును మూడంతస్తులును పెక్కువిధాన ములును కుట్టిమదేశస్థానతలమును ఏకద్వారమును యంత్రయుక్త సోపానమును దేవతావిధానమును కలిగినట్టి భూమిగృహమును భూ నమముగ నిర్మింపవలెను.

దానిపై నిరుప్రక్కలఁ బ్రతిషేధములుగలిగి ప్రగ్రీవముల తోఁగూడి భాండవాహినులతో వ్యాప్తమైనట్టి కోశగృహప్రాసాదము ను నిటికలతోఁ గట్టవలెను.

ఆపత్సమయములం దుపయోగించుటకై నభివ్యక్తులగు పురు షులచే జనపదాంతమున ధ్రువనిధినొకదానిని కట్టింపవలెను.

పక్వేష్టకాస్తంభములును ఏకద్వారమును పెక్కుగదులును కలిగి యిరుప్రక్కల వివృతస్తంభాపసారమైనట్టి పణ్యగృహమును, దీర్ఘమగు పెక్కుశాలలుగలిగిన కోష్ఠాగారమును, దానిలోపలి ప్ర దేశమునఁ గక్ష్యావృతకుడ్యములుగల కుప్యగృహమును, అందే భూ మిగృహముతో సంబంధముగలుగునట్లుగ నాయుధాగారమును, మఱి యొకప్రదేశమున ధర్మస్థీయమహామాత్రీయములను, వేఱువేఱుగ నేర్పాటుచేయఁబడిన స్త్రీపురుషస్థానముల వరుసయు రహస్యకక్ష్య ములును కలిగినట్టి బంధనాగారమును కట్టవలెను.

అన్నిటియందును శాలలు ఖాతములు నూతులు స్నానగృ

హములు అగ్నివిషత్రాణములు మార్జాలములు నకులములు దేవతాగృహములు లోనగువానిని నుంచవలెను.

ఒకయరత్ని వైశాల్యముగు ద్వారముగల వర్షమానకుండమును కోష్ఠాగారముయొక్క యెదుటఁబెట్టింపవలెను.

విషయజ్ఞుల సహాయముఁబొంది వలయుసాధనములతోఁగూడినవాఁడై సన్నిధాత నవీనపురాణములగు రత్నములను సారాసారములగు కుప్యములను పరిగ్రహింపవలెను. అప్పుడు రత్నవిషయమున మోసముజరిగినయెడల గలిగించినవానికి కారయితకును నుత్తమదండమును, సారకుప్యవిషయమున మధ్యమదండమును ఫల్గుకుప్యవిషయమున తద్ద్విగుణదండమును విధింపవలెను. రూపదర్శకులచే శోధింపఁబడిన హిరణ్యమునే తీసికొనవలెను. అశుద్ధమగువానిని ఛేదింపవలెను. అట్టిదానిని తెచ్చినపురుషునికిఁ బూర్వసాహసదండమును విధింపవలెను. శుద్ధమును పూర్ణమును క్రొత్తదియునునగు ధాన్యమును పరిగ్రహించి దానికివిరుద్ధముగఁ దెచ్చినవానికి మూల్యద్విగుణదండమును విధింపవలెను ఇట్లే కుప్యపణ్యాయుధముల విషయమున నెఱుంగునది.

సర్వాధికరణములందును యుక్త ఉపయుక్త తత్పురుషులలో నెవరైన నొకటిమొదలు నాలుగుపణములపహరించినచో మొత్తము ననుసరించి వరుసగఁ బూర్వమధ్యమోత్తమదండములను వధయును విధింపవలెను.

కోశమును చెడఁగొట్టిన కోశాధికారికి ఘాతశిక్షయు, వానికి సహాయమొనర్చినవాని కర్ధదండమును, అజ్ఞానమువలన జరిగినచో నిందామాత్ర శిక్షయును విధింపవలయును.

చోరులకు సహాయమునొనర్చు వానికిఁ జిత్రఘాతమే దండము.

కావున నాత్మపురుషాధిష్ఠితుండై సన్నిధాత ధనములం గాపాడవలెను. నూరుసంవత్సరముల కిందటియాయమునుకూడం దెలిసికొని, యడుగంబడినతక్షణమే శంకింపక వ్యయశేషముం జెప్పంగలిగియుండవలెను.

ఇది అధ్యక్షపరిచారమున సన్నిధాతృచేయ కర్మయను
పంచమాధ్యాయము.
ఆదినుండి యిరువదియాఱవయధ్యాయము.



## 24 ప్రకరణము.

### సమాహర్తృసముదయపరిస్థాపనము.

దుర్గరాష్ట్రఖనిసేతువనవ్రజవణిక్పథములను సమాహర్తపరిశోధించుచుండవలెను.

శుల్కము దండము పౌతవము నాగరికుండు లక్షణాధ్యక్షుండు ముద్రాధ్యక్షుండు సుర మాంసము సూత్రము తైలము ఘృతము క్షారము సువర్ణకారుండు పణ్యసంస్థ వేశ్యలు ద్యూతము వాస్తుకము కారుశిల్పిగణము దేవతాధ్యక్షుండు ద్వార బాహిరికాదేయములు— ఇవి దుర్గమునకు సంబంధించినవి.

సీత భాగము బలి కరము వర్తకము నదీపాలుండు పడవలు నావలు పట్టణము వివీతము వర్తని రజ్జువులు చోరరజ్జువులు— ఇవి రాష్ట్రమునకు సంబంధించినవి.

సువర్ణరజతవజ్రమణిముక్తాప్రవాళశంఖలోహలవణభూమిప్రస్తరధాతువులు— ఇవి ఖనులకు సంబంధించినవి.

పుష్పవాటఫలవాట షండ కేదారములు మూలవాపజాతులు ఫలించు ప్రదేశములు— ఇవి సేతువునసంబంధించినవి.

పశుమృగద్రవ్యహస్తివనములు— వనమునుసంబంధించినవి.

గోవులు మహిషములు మేకలు ఖరములు ఉష్ట్రములు అశ్వములు వేసడములు— ఇవి వ్రజమును సంబంధించినవి.

స్థలపథవారిపథములు వణిక్పథమును సంబంధించినవి.

ఇవియే ఆయశరీరము.

మూలముభాగము వ్యాజిపరిఘము క్లృప్తమురూపికము అత్యయము— ఇవి ఆయముఖములు.

దేవపితృపూజాదానసమయములందు జరుగు స్వస్తివాచనము అంతఃపురము మహానసము దూతప్రావర్తిమము కోష్ఠాగారము ఆయుధాగారము పణ్యగృహము కుప్యగృహము కర్మాంతము విష్టి పత్త్యశ్వరథద్విపపరిగ్రహము గోమండలము పశుమృగపక్షివ్యాళప్రదర్శనశాలలు కాష్ఠతృణవాటములు— ఇవి వ్యయశరీరము.

రాజవర్షము మాసము పక్షము దివసము వ్యుష్టము దివసోనములగు వర్ష హేమంత గ్రీష్మ ఋతువులలోని తృతీయసప్తమపక్షములు పూర్ణములగునితరపక్షములు అధికమాసము అని కాలవిభాగము.

సమాహర్త కరణీయసిద్ధశేషఆయవ్యయముల నెఱుంగవలయును. సంస్థానము దూతప్రచారము జీవనాధారవస్తుసంగ్రహము ఆదానము సర్వసముదయపరిశోధనమునువి కరణీయములు. కోశార్పితము రాజుచేహరింపఁబడినది అప్రవిష్టమగుపురవ్యయముపరమసంవత్సరానువృత్తమగు పురవ్యయము పుస్తకములలో నెక్కించు విషయమున (రాజుస్వయముగ వ్రాయక) నొకరిచేవ్రాయించినట్టియు లిఖితముగఁగాక నోటితోఁ జెప్పినట్టియు రాజశాసనము— ఇవి సిద్ధములు.

కార్యసిద్ధికై చేయఁదగు నేర్పాటులు, దండశేషము, వసూలు చేయవలసినపన్నులు బలవత్ప్రయత్నముచేసినను, వసూలుకాక నిలిచి యుండుపన్నులు లెక్కలపరిశోధనము— ఇవి యసారమగునట్టిగాని యల్పసారమగునట్టిగాని శేషము.

వర్తమానము పర్యుషితము అన్యజాతము అని ఆయము మూఁడువిధములు. అందు దివసానువృత్తము వర్తమానము. వెనుకటిసంవత్సరమునుండివచ్చినది ఇతరులవద్దనుండునది ఇతరులనుసంక్రమించినదియు పర్యుషితము. నష్టప్రస్మృతము ఆయుక్తదండము పార్శ్వము పారిహీణికము ఔపాయనికము అంటువ్యాధులవలన మృతినొందినయపుత్రకులద్రవ్యము నిధిలబ్ధము— ఇవి అన్యజాతములు.

విక్షేపము వ్యాధితాంతర శేషము ఆరంభశేషమునననవి వ్యయప్రత్యయములు.

పణ్యవిక్రయమున మానోన్మానవిశేషములచేఁగలిగిన నర్ఘవృద్ధిరూపమగువ్యాజియుఁ గ్రయసంఘర్షణచేఁ గలిగిన వృద్ధియుఁ గూడ ఆయములే.

నిత్యోత్పాదికమైనిత్యములాభోత్పాదికమైలాభము అని వ్యయము రెండుభాగములు. దివసానువృత్తమునిత్యము. పక్షమాససంవత్సరలబ్ధములాభము. వానివలనఁబుట్టినవే నిత్యోత్పాదిక లాభోత్పాదికములు.

వ్యయముచేయఁగాఁగలిగిన నాదాయవ్యయములనుండి తేలిననీవి ప్రాప్తయనియు ననువృత్తయనియు రెండువిధములు.

ప్రాజ్ఞుఁడీవిధముగ నాదాయవృద్ధినొనర్చి వ్యయమునుతగ్గించి విపర్యయములనివారించుచు సముదయమును కావింపవలయును.

ఇది అధ్యక్షప్రచారమున సమాహర్తృసముదయప్రస్థాపనమను షష్ఠాధ్యాయము.

ఆదినుండి యిరువదియేడవయధ్యాయము.

## 25 ప్రకరణము.

### అక్షపటలమునందలి గాణనిక్యాధికారము

అక్షపటలాధ్యక్షుఁడు అక్షపటలమును ప్రాఙ్ముఖముగఁగాని యుదఙ్ముఖముగఁగాని నిర్మించి దానియందు వేఱువేఱుగ నుపస్థానములను నిబంధపుస్తకస్థానములను నేర్పఱుపవలయును. అచట నుద్యోగస్థుల సంఖ్యను కర్మాంతములయొక్క ప్రచారసంజాతాగ్రములను ద్రవ్య ప్రయోగములవలనఁ గలిగిన వృద్ధిక్షయవ్యయప్రయామవ్యాజులను ఉద్యోగస్థులస్థాన వేతనములను విష్టిప్రమాణమును సారఫల్గురత్నములయొక్కయుఁ గుప్యములయొక్కయు అర్ఘప్రతివర్ణకప్రతిమానమానఉన్మానఅవమానభాండములను దేశగ్రామజాతికులసంఘముల ధర్మవ్యవహారచరిత్రసంస్థానమును రాజోపజీవులప్రగ్రహప్రదేశభోగపరిహారభక్తవేతనలాభములను రాజుయొక్క దారపుత్రులరత్నభూమిలాభములను వారియధికారములను వారికిఁగలుగు నుత్పాతముల కొనర్చిన ప్రతీకారమువలనిలాభములను మిత్రామిత్రులతోడి సంధివిక్రమప్రదానాదానములను నిబంధపుస్తకములలో వ్రాయించుచుండవలెను. సర్వాధికారుల కరణీయసిద్ధశేషఆయవ్యయములను నీవినిఉపస్థానమును ప్రచారచరిత్రసంస్థానమును నిబంధపుస్తకముల ననుసరించి తెలుపవలెను.

ఉత్తమమధ్యమాధమకర్మలలో నాయాజాతియధ్యక్షులనునిలుపవలెను.

లాభకరకార్యములలో నిర్ణీతములగు వ్యయములనొనర్పనిచో రాజునష్టపడి విచారింపవలసివచ్చును.

అధ్యక్షునివలనఁ గలిగినకష్టమును వానిసహగ్రాహులగుజామీనుదారులు వానిమూలమునజీవించుపుత్రులు అన్నదమ్ములు

భార్యలుకోమార్తెలుభృత్యులు లోనగువారుభరింపవలెను.

మూడువందలయేఁబదినాలుగు రాత్రింబవళ్ళకర్మ సంవత్సరము. దానికినాషాఢమాసాంతముగ నెక్కువతక్కువలఁజూచి వేతనము లియ్యవలెను. అధికమాసమువచ్చినపుడు దానికి వేఱుగ వేతనము నియ్యవలెను.

చారాధిష్ఠితమగుప్రచారమును ప్రచారచరిత్రసంస్థానములను తెలిసికొననివివేకహీనుఁడును, సోమరియగుటచే నుద్యానక్లేశములనుసహింపనివాఁడును, శబ్దాదీంద్రియార్థములఁ బ్రమత్తుఁడును భయముచే సంక్రోశ అధర్మఅనర్థభీరువును, కామముచేఁగార్యార్థులయెడ ననుగ్రహబుద్ధిగలవాఁడును, విద్యావల్లభులును ద్రవ్యవల్లభులును నాశ్రయించుటచే గర్వించినవాఁడును, లోభముచేఁ దులామానతర్కగణికాదులలో వంచకుఁడునునగునధ్యక్షుఁడు రాష్ట్రసముదయమును నష్టపెట్టుచున్నాఁడు. వీరిలోఁ గ్రమముననుసరించి యెన్నిదోషములవలన నష్టముసంభవించునో యన్నిటిచే నానష్టమును హెచ్చించి దండమునువిధింపవలయునని మానవులును, అన్ని విధములగుదోషములకు నెనిమిదిరెట్లు దండమనిపారాశరులును, పదిరెట్లని బార్హస్పత్యులును, ఇరువదిరెట్లని యౌశనసులును చెప్పెదరు. కాని యథాపరాధమని కౌటిల్యుఁడు.

ఆషాఢమాసమున గాణనిక్యులందఱు నధ్యక్షునివద్దకు రావలెను. ఆలాగునవచ్చినవారిలో ముద్రతోఁగూడిన పుస్తకములను భాండములను నీవులను తెచ్చినగాణనిక్యుల నొకచోటఁబరస్పర సంభాషణావర్జముగ నుంపవలెను. ఆయవ్యయనీవుల మొత్తములను చేయువేఱుగఁబరిశోధించి నీవినిపరిగ్రహింపవలెను. ఆదాయమును వృద్ధిపఱచుటచేఁగాని వ్యయమునుతగ్గించుటచేఁగాని నీవియొక్కవృద్ధిని కలుగఁజేసినచో నావృద్ధి కెనిమిదిరెట్లు బహుమానమధ్యక్షునికొసంగవలయును. దానికి వ్యత్యాసముగ నష్టముకలుగఁజేసినచో నష్టమున కెనిమిదిరెట్లు దండమును విధింపవలెను.

సమకాలమునకు రానివారికిని పుస్తకములను నీవులను తేని వారికిని వారియ్యవలసినదానికంటెఁ బదిరెట్లధికమగుదండమును విధింపవలెను.

కార్మికుఁడు నచ్చినప్పుడు కారణికుఁడు వానిపనిని బరీక్షింపనిచో నాతనికిఁ బూర్వసాహసదండమును, కార్మికుఁడు సిద్ధముగ లేనిచో దానికి రెండు రెట్లు దండమును విధింపవలెను.

జరిగినది జరిగినట్లుగ మహామాత్రులందఱు రాజునకు విని పింపవలెను.

అవిషమమంత్రులకును ఒక్కరితోఁగూడ నేకీభవింపక వేఱుగనుండువానికిని మిథ్యావాదికిని నుత్తమదండము విధింపవలయును.

రోజువారీలెక్కలు తయారుచేయనివాని కొకనెలగడువియ్యవలెను. మాసముగడచినపిమ్మటఁగూడఁ దయారుకానప్పుడు నెలనెలకు రెండువందలచొప్పున దండమువిధింపవలెను. కొంచెముమిగిలిన నీవీలేఖనముగలవాని కైదురాత్రులు గడువియ్యవలెను. అటుపిమ్మట ధర్మవ్యవహారచరిత్రసంస్థానసంకలననిర్వర్తన అనుమానప్రచారప్రయోగములచేఁ గోశపూర్వమగు రోజువారీలెక్కనుపరిశోధించి దివసపంచరాత్రపక్షమాస చాతుర్మాస్యసంవత్సరపులెక్కలచే. సమన్వయము చేయవలెను. వ్యుష్టదేశకాలముఖ ఉత్పత్తిప్రమాణ అనువృత్తిప్రమాణములచేతను దాయకదాపకనిబంధక ప్రతిగ్రాహకుల మూలమునను ఆయమును, వ్యుష్టదేశకాలముఖ లాభ కారణ దేయ యోగపరిమాణములచేతను, ఆజ్ఞాపకఉద్ధారకవిధాతక ప్రతిగ్రాహకులమూలమునను వ్యయమును, వ్యుష్టదేశకాలముఖఅనువర్తన రూపలక్షణపరిమాణములచేతను నిక్షేపభాజనరక్షకుల మూలమునను నీవిని, పరిచూడవలెను.

రాజద్రవ్యవిషయమున రాజాజ్ఞననుసరింపనట్టియు దానినిని షేధించునట్టియు దానికిఁ బ్రతికూలముగ నాయవ్యయములనొనర్చునట్టియు నర్థకారణికునకుఁ బూర్వసాహసదండమును విధింపవలెను.

క్రమహీనముగను ఉత్కృష్టముగను అవిజ్ఞాతముగను పునరుక్తముగ
ను లెక్కలవ్రాయువానికిఁ బండ్రెండుపణములుదండము. సీవిని రద్దు
చేసినవానికి దీనికిద్విగుణముగుదండము. నీవినిభక్షించినవాని నష్టగు
ణదండము; దానినిపాడుచేసినవానినుండి నష్టమునసూలుచేసి నష్టము
నకై దింతలుదండమును విధింపవలెను. మిథ్యావాదికి స్తేయదండము.
క్రమమునననుసరింపక వ్రాసినవానికిని మఱచిమఱియొకచోట వ్రాసిన
వానికిని ద్విగుణదండము.

అల్పమగు నపరాధమునుసహింపవలెను. లాభముస్వల్పముగ
గలిగినప్పుడుసహితము సంతోషింపవలెను. మహోపకారియగు న
ధ్యక్షుని గొప్పబహుమానముచే గౌరవింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున అక్షపటలమందలి గాణనిక్యాధికారమను

సప్తమాధ్యాయము.

ఆదినుండి యిరువదియొనిమిదవ యధ్యాయము.



## 26 ప్రకరణము.

### ఉద్యోగులపహరించినధనమును తిరిగివసూలుచేయుట.

సర్వారంభములును కోశపూర్వకములగుటచేఁ దొలుతఁగోశ
మును పరిక్షింపవలెను.

ప్రచారసమృద్ధి మంచివారిననుగ్రహించుట చోరులనుపట్టు
కొనుట, (అవసరములేని) ఉద్యోగస్థులఁ దొలఁగించుట సస్యసంపత్తి
నతఃకబాహుళ్యము రాష్ట్రబాధలులేమి పరిహారక్షయము హిరణ్యో
పాయనము లోనగునవి కోశవృద్ధికిమూలములు. ప్రతిబంధము ప్ర
యోగము వ్యవహారము అవస్తారము పరిహాపణము ఉపభోగము పరి
వర్తనము అపహారము లోనగునవి కోశక్షయకారణములు.

కార్యసిద్ధికి యత్నముచేయకుండుటయు ఫలసముదయమును
పరీక్షింపకుండుటయుఁ బ్రాప్తఫలిలేమను లెక్కఁజేకుండుటయుఁ బ్ర

బంధమనఁబడును. అట్లొనర్చినవానికిఁ బదిరెట్లుదండము.

కోశద్రవ్యముల వడ్డికనిచ్చుట ప్రయోగము. వానినివర్తకమునఁబెట్టుట వ్యవహారము. అట్టిపనులఁజేసినవానికిఁదత్ఫలద్విగుణ దండము.

వానినిహరించు నుపాయములు నలువది. పూర్వసిద్ధమును పశ్చాత్సిద్ధముగవ్రాయుట, పశ్చాత్సిద్ధమును పూర్వసిద్ధముగవ్రాయుట సాధ్యమును సిద్ధముచేయకుండుట, అసాధ్యమును సిద్ధించినట్లువ్రాయుట, సిద్ధము నసిద్ధముగఁజూపుట, అసిద్ధమును సిద్ధముగఁజూపుట, అల్పసిద్ధము నధికముగఁజూపుట, బహుసిద్ధము నల్పసిద్ధముగఁజూపుట, ఒకటిసిద్ధించిన మఱియొకదానినివ్రాయుట, ఒకరినుండిసిద్ధించిన దానిని మఱియొకరినుండి సిద్ధించినట్లువ్రాయుట, దేయమునియ్యకుండుట, అదేయమునిచ్చుట, కాలమందియ్యకుండుట, అకాలమందిచ్చుట, అల్పమునిచ్చి యధికముగవ్రాయుట, అధికమునిచ్చి అల్పముగవ్రాయుట, ఒకటియ్యఁబడిన మఱియొకటియ్యఁబడినట్లు వ్రాయుట, ఒకరివలననియ్యఁబడిన మఱియొకరివలననియ్యఁబడినట్లు వ్రాయుట, ప్రవిష్టము నప్రవిష్టముగఁజేయుట, అప్రవిష్టమును ప్రవిష్టముగఁజేయుట, అదత్తమూల్యమగుకుప్యమును లెక్కలలోవ్రాయుట, దత్తమూల్యమగుదానిని వ్రాయకుండుట, మొత్తపురాఁబడిని చిల్లరపద్దులుగమార్చుట, చిల్లరపద్దులను మొత్తముగమార్చుట, మహార్ఘవస్తువు నల్పార్ఘవస్తువునకును అల్పార్ఘమును మహార్ఘమునకును మార్చుట, ఖరీదులనుహెచ్చించుట, తగ్గించుట, దినములహెచ్చించియుఁ దగ్గించియు లెక్కచెప్పుట, సంవత్సరమును మాసవిషమముగను మాసమును దివసవిషమముగనుచేయుట, సమాగమవిషమము, ఆయముఖవిషమము, ధర్మకార్యవిషమము, వర్ణ (బంగారు వెండి మొదలగువానివన్నె) విషమము, అర్ఘవిషమము, మానవిషమము, మాపనవిషమము, భాజనవిషమము, ఇవి హరణోపాయములు.

వైపిమయమున యుక్తనిభాయక నిబంధక ప్రతిగ్రాహకదా

యకదాపకమంత్రిభృత్యులను వేఱువేఱుగఁ బరీక్షించి, వీరిలో మిథ్యా వాదులకు యుక్తునికి విధింపఁబడిన దండముతో సమముగ దండమును విధింపవలెను. మఱియు, "వీరివలన నష్టపడిన వారందఱు రాజుతో మనవి చేసికొనుఁడు" అని చాటించి మనవి చేసికొనిన వారికి నష్టముననుసరించి ముజరాయిప్పింపవలెను. ఉద్యోగస్థుఁడొకఁడు పెక్కువిధములగు నభియోగములకుఁ బాత్రుఁడై ఒక్కదానియందుఁ బరోక్తుఁడైనను వాఁడన్నియభియోగములకు బద్ధుఁడైయుండవలెను. అట్లు (పరోక్తుఁడు) కానప్పుడీయభియోగముల వేఱువేఱుగ విచారింపవలెను. గొప్పమొత్తములోఁ గొంచెమపహరించినను మొత్తమునంతయు నిచ్చుకొనవలెను. (ఉద్యోగస్థునివలన) కలుగుచున్న నష్టమును సూచించి దానిని ఋజువుపఱచిన సూచకునికి షష్ఠాంశమునియ్యవలెను. సూచకుఁడు భృత్యుఁడైనచో ద్వాదశాంశము చాలును. ప్రభూతాభియోగమును తెచ్చి కొంచెమును మాత్రము ఋజువుచేయునపుడందాఱవవంతు నియ్యవలెను. ఏమియు ఋజువుచేయలేనప్పుడు సూచకునికి శరీరదండహిరణ్యదండములలో నొక్కదానిని విధింపవలెను కాని వానిననుగ్రహింపరాదు.

అభియోగము ఋజువైనప్పుడు సూచకుఁడు వాదమును తనపైనుంచుకొనవచ్చును లేదా తన్నుఁ దొలఁగించుకొనవచ్చును; కాని అభియుక్తుని యుపజాపములకు వశుఁడైనచో మరణశిక్షను పొందవలెను.

ఇది అధ్యక్షప్రచారమున ఉద్యోగులపహరించినధనమును తిరిగివసూలు
చేయుటయను అష్టమాధ్యాయము.
ఆదినుండి యిరువదితొమ్మిదవ యధ్యాయము.



## 27 ప్రకరణము.

### ఉపయుక్తులను పరీక్షించుట.

అమాత్యసంపదతోఁ గూడిన యధ్యక్షులందఱు సామర్థ్యాను

సారముగఁ గార్యములందు నియోగింపఁబడవలెను. మనుష్యులస్థిరచిత్తులగుటచే నిత్యమువీరిని వీరిపనులవిషయమై పరీక్షించుచుండవలెను. మనుష్యులశ్వసమానధర్ములగువారుగనుకఁ గర్మలయందు నియుక్తులై వికారమునొందుచుందురు. కావునఁగర్తను, కరణమును, దేశమును, కాలమును, కార్యమును, ప్రక్షేపమును, లాభమును తెలిసికొనవలయును. ఉద్యోగులేకీభవించినచో రాజద్రవ్యమును భక్షింతురు; విరోధించినచోఁ గార్యవినాశముచేయుదురు. కావున నేకీభావవిరోధములులేక రాజాజ్ఞనతిక్రమింపక వారు పనులొనర్పవలెను. ఆపత్ప్రతీకారములందుఁదప్పఁ దక్కినప్పుడు వారు ప్రభువుతో మనవిచేయక యెట్టికార్యారంభమును చేయరాదు. వారు తప్పొనరించునపుడు వారినుండి దివసవేతనవ్యయద్విగుణముగ నష్టమును పుచ్చుకొనవలెను. ఎవ్వరైన రాజాజ్ఞానుసారముగఁగాని యంతకెక్కుడుగఁగాని కార్యమును ఫలింపఁజేయునపుడు వారికి స్థానమానముల నొసంగవలెను.

అధికవ్యయమునొనర్చి అల్పాయతిని తెచ్చుచుండు నుపయుక్తుఁడు రాజుయొక్క ఆయమును భక్షించుచున్నాఁడు. దీనికివిరుద్ధముగఁజేయువాఁడును వ్యయముతో సమానముగ నాయము దెచ్చువాఁడును నాదాయమును భక్షింపరని ఆచార్యులు. ఉపయుక్తులకృత్యములను చారులమూలముననే తెలిసికొనవలయునని కౌటిల్యుఁడు.

ఆదాయమును నెవ్వఁడుతగ్గించుచున్నాఁడో వాఁడురాజద్రవ్యమునుతినుచున్నాఁడు. వాఁడజ్ఞానాదులచే నష్టపెట్టినపుడు యథాగుణముగ నానష్టమును వానినుండి వసూలుచేయువలెను.

ఆదాయమునెవ్వఁడు ద్విగుణముగ వృద్ధిపఱచుచున్నాఁడో వాఁడు జనపదమును తినివేయుచున్నాఁడు. (ఇట్లుచేయువారిలో) అల్పాపరాధమొనర్చి రాజద్రవ్యమును వృద్ధిపఱచినవారిని వారింపవలెను. అపరాధము గొప్పదైనచో నపరాధానుసారముగ శిక్షింపవలెను.

లాభమును వ్యయపఱచువాఁడు పురుషకర్మలఁ దినివేయుచున్నాఁడు. వానికిఁ గర్మదివసద్రవ్యమూల్యపురుషవేతనముల ననుసరించి యపరాధమునకుఁదగినట్లు దండమునువిధింపవలెను.

కావుననెవ్వఁడేపనిలో శాసనాధికారియై నియోగింపఁబడునో వాఁడా కార్యమందలి యాదార్థ్యమును నాయవ్యయములను వేఱువేఱుగను మొత్తముగను పరిశోధించిచెప్పవలెను.

మూలహరతాదాత్వికలుబ్ధులను ప్రతిషేధింపవలెను. పితృపైతామహముగుద్రవ్యము నన్యాయముగ భక్షించువాఁడు మూలహారుఁడు; వచ్చినలాభమంతయుఁ దినువాఁడు తాదాత్వికుఁడు; భృత్యులను తన్నును కష్టములపాలుగావించుకొని ద్రవ్యమును వృద్ధిపఱచువాఁడు కదర్యుఁడు. వీరికిఁదగిన సహాయులున్నప్పుడు వీరినుపేక్షించియుండవలెను; లేనియెడల వీరిద్రవ్యమునంతను పుచ్చుకొనవలెను.

కదర్యుఁడెవఁడైన నధికధనమునార్జించి స్వగృహమున దాచినను పౌరజానపదులకడనుంచినను లేక పరదేశమునకుఁబంపినను వానియొక్కసత్త్రిమంత్రిమిత్రభృత్యబంధుపక్షమునువానిద్రవ్యమునుపొక్కరాకపోకలను నెఱింగి, పరదేశమున వానిపక్షమున వ్యవహారము చేయుచున్న భృత్యునిమూలమున నాతనిరహస్యములఁ దెలిసికొని శత్రుశాసనాపదేశముచే వానిని చంపింపవలెను.

సంఖ్యాయక లేఖకరూపదర్శకనీవీగ్రాహకఉత్తరాధ్యక్షులతోఁగూడి యధ్యక్షులందఱు వారివారిపనుల నొనర్పవలెను.

ఉత్తరాధ్యక్షుఁడును హస్త్యశ్వరథారోహకులును వారిశిష్యులును శిల్పశౌచయుక్తులై సంఖ్యాయికాదుల వ్యాపారములఁ గనిపెట్టుచుండవలెను

ఒక్కొకయధికారస్థానమందు ననేకముఖ్యుల ననిత్యముగనుంపవలెను.

నాలుకచివరనుండు విషమునుకాని తేనెనుకాని తినకవీలుపడ

నట్లు అర్థాధికారికి రాజద్రవ్యమును స్వల్పముగనైన నపహరింపకుండుట దుస్తరము.

నీటిలోఁజరించుచుండు మత్స్యము లెవ్వరికిఁదెలియక నీటిని ద్రాగునట్లు కార్యవిధులందు నియుక్తులగు నుద్యోగులెవ్వరికిఁదెలియక ధనమునపహరించుచుందురు.

ఆకాశమునఁజరించు పక్షులగమనమునైన నెఱుఁగవచ్చును కాని ప్రచ్ఛన్నభావులై సంచరించు నుద్యోగుల ప్రవర్తనము దెలిసికొనుట దుస్తరము.

ఉద్యోగులు ధనమునపహరింపకుండునట్లును నపహరించినధనమును మఱలఁగ్రక్కునట్లునుచేసి వారినినొకపనినుండిమఱొకపనికి మార్చుచుండవలెను.

ధనమునపహరింపక న్యాయముగ నాదాయమును వృద్ధిపఱచుచు రాజునకుఁబ్రియమొనర్చునట్టివారిని నిత్యాధికారులుగనియోగింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున ఉపయుక్తపరీక్షయను
నవమాధ్యాయము.
ఆదినుండి ముప్పదవయధ్యాయము.



## 28 ప్రకరణము.

### శాసనాధికారము.

రాజాజ్ఞకే శాసనమనిపేరు. సంధివిగ్రహములు శాసనమూలములగుటచే రాజులు శాసనప్రధానులు. కావున నమాత్యసంపదతోఁగూడినట్టియు సర్వాచారముల నెఱింగినట్టియు వేగముగవాక్యరచన చేయఁగలిగినట్టియు అక్షరములు చక్కఁగవ్రాయునట్టియు ఉత్తరములఁ జదువుటయందు సమర్థుఁడైనట్టివానిని లేఖకునిఁగనియమింపవలెను. వాఁడవ్యగ్రచిత్తుఁడై రాజసందేశమునువిని నిశ్చితార్థమును

లేఖముగ వ్రాయవలెను.

ఈశ్వరు (ప్రభువు)నికి వ్రాయు లేఖలలో దేశవంశనామధేయో పచారములను సాధారణులకు వ్రాయువానిలో దేశనామధేయోపచారములను పేర్కొనవలయును. జాతి కులము అధికారము వయస్సు పాండిత్యము వృత్తి వృద్ధిశీలము బంధుత్వసంబంధము దేశము కాలములో నగువానిని సందర్భానుసారముగ నుదాహరించి పురుషానురూపముగ లేఖను వ్రాయవలెను.

అర్థక్రమము సంబంధము పరిపూర్ణత మాధుర్యము ఔదార్యము స్పష్టత్వమనునవి లేఖసంపదలు. ముఖ్యవిషయములబోధించు వాక్యములను ప్రాధాన్యముననుసరించి క్రమముగ వ్రాయుట అర్థక్రమము. సమాప్తివఱకుఁ బూర్వోత్తరసంబంధములుచెడకుండునట్లుగఁ బ్రస్తుతవిషయమును వ్రాయుట సంబంధము. అర్థపదాక్షరముల హెచ్చుతగ్గులు లేమియు హేతూదాహరణదృష్టాంతములతో నర్థమునువర్ణించుటయుఁ బటుత్వములగుపదములవాడుటయుఁ బరిపూర్ణత. సుఖోపనీతముగఁ జక్కనిపదములతో మంచివిషయమునువర్ణించుట మాధుర్యము. గ్రామ్యశబ్దములవాడకుండుట ఔదార్యము. ప్రసిద్ధశబ్దప్రయోగము స్పష్టత్వము.

అకారాదివర్ణములు ఏబదిమూఁడు. వర్ణసంఘాతమే పదము. అది నామము ఆఖ్యాతము ఉపసర్గము నిపాతము అని నాలుగు విధములు. అందు ద్రవ్యవాచి నామము. అవిశిష్టలింగమై క్రియాబోధకమగునది ఆఖ్యాతము. క్రియావిశేషముల నెఱిఁగించు ప్రాదులు ఉపసర్గలు. అవ్యయములగుచాదులు నిపాతములు.

అర్థసమాప్తిగల పదసమూహము వాక్యము. ఒకటికంటెఁ దక్కువగాక మూఁటికంటెనెక్కువగాక పదములను పరస్పరసంబంధము దోలఁగనీయక కూర్చుట వర్గము.

లేఖపరిసమాప్తియందును లేఖనుసంబంధించిననోటిమాటచివరను ఇతి (అని) శబ్దముపయోగింపవలెను.

నింద ప్రశంస పృచ్ఛ ఆఖ్యానము అర్థన ప్రత్యాఖ్యానము ఉపాలంభము ప్రతిషేధము చోదన సాంత్వము అభ్యవపత్తి భర్త్సనము అనునయములను వానినిసంబంధించి లేఖార్థములుండును. అభిజనశరీరకర్మలసంబంధించిన దోషవచనము నింద. వీనినిగుఱించి సగుణవచనము ప్రశంస ఇదియేమియని యడుగుటపృచ్ఛ. ఈలాగనిచెప్పుట ఆఖ్యానము. ఇమ్మనికోరుట అర్థన. ఇయ్యననిచెప్పుట ప్రత్యాఖ్యానము. నీకిదితగదనిచెప్పుట ఉపాలంభము. ఇట్లుచేయఁగూడదనిచెప్పుట ప్రతిషేధము. ఈలాగుచేయఁబడుఁగాక యనిప్రేరించుట చోదన. నేనునునీవును నొక్కటియే, నాద్రవ్యమునీదిఅని వశపఱచుకొనుట సాంత్వము. వ్యసనమందు సాహాయ్యమొనర్చుట అభ్యవపత్తి. నీకిట్టిదోషమిఁకమీఁదటఁ గాఁగలదనిసూచించుట భర్త్సనము. అర్థవిషయికము అతిక్రమకార్యవిషయికము పురుషాదివ్యసనవిషయికమని అనునయము మూఁడువిధములు.

ప్రజ్ఞాపనము ఆజ్ఞ పరిదానము పరిహారము నిసృష్టి ప్రావృత్తికము ప్రతిలేఖను సర్వత్రగము అనియుఁగూడశాసనవిషయములు. 'వీనిచేనిట్లుమనవిచేయఁబడినది. అతఁడిట్లుపలికెను. ఇదియదార్థమైనచో వీనికి దీనినియ్యవలెను. రాజసమీపమందు శత్రుకార్యమంతయుఁజెప్పఁబడెను' ఇదియే ప్రజ్ఞాపన. ఇది పెక్కువిధములుగనుండును. అందఱివిషయమునను ముఖ్యముగ భృత్యులవిషయమునను నిగ్రహానుగ్రహసూచకమగురాజాజ్ఞను బోధించునది ఆజ్ఞాలేఖము. ఆధినివారకమును, దానసూచకమునునై యర్హగుణులసంబంధించిన రాజసన్మానమునుబోధించునది పరిదానలేఖ. జాతివిశేషములయెడను నగరగ్రామదేశములయెడను రాజానుగ్రహమునుసూచించునది పరిహారలేఖ. కార్యవిషయమున వాచకముగఁగాని లేఖనరూపముగఁగాని యధికారదానమును బోధించునది నిసృష్టిలేఖము. తత్వ్యాజదైవికమనుష్యజములగు నాపదలలో వివిధములగు ప్రతీకారమార్గములఁజూపునది ప్రావృత్తికలేఖము. ఇతరులు వ్రాసినలేఖనులెస్సగఁజదివి

బాగుగనాలోచించి పిమ్మటరాజాజ్ఞానుసారముగ దానికి జవాబువ్రాయుట ప్రతిలేఖమనఁబడును. (ప్రజల) రక్షోపకారోపయోగముల నిమిత్తమైసర్వదేశసర్వమార్గములందు నీశ్వరులను నధికృతులనుద్దేశించి రాజు తెలుపువిషయమునుబోధించునది సర్వత్రగము.

సామఉపప్రదానభేదదండములని యుపాయములు నాలుగు. అందుసామము గుణసంకీర్తనసంబంధోపాఖ్యాన పరస్పరోపకారసందర్శన ఆయతిప్రదర్శన ఆత్మోపనిధానమని యైదువిధములు. అభిజనశరీరకర్మప్రకృతిశ్రుతిద్రవ్యాదులయొక్క గుణాగుణగ్రహణాప్రశంశాస్తుతులు గుణసంకీర్తనమనఁబడును. జ్ఞాతియౌనమౌఖస్రౌవకులహృదయమిత్రసంకీర్తనముసంబంధోపాఖ్యానము. స్వపక్షపరపక్షముల యన్యోన్యోపకారసంకీర్తనము పరస్పరోపకారసందర్శనము. దీనిలోనిట్లుచేయఁబడినచో మనలకిట్టిలాభము కాఁగలదని యాశనుబుట్టించుట ఆయతిప్రదర్శనము. నేనేనీవు; నాద్రవ్యమునునీకృత్యములలోనుపయోగించుకొనుమని తన్నుసమర్పించుటఆత్మోపనిధానము.

ధనదాన ముపప్రదానమనఁబడును. శంకాజనన నిర్భర్త్సనములు భేదమనఁబడు. వధపరిక్లేశార్థహరణములు దండమనఁబడు.

అకాంతి వ్యాఘాతము పునరుక్తము అపశబ్దము సంప్లవమనునవి లేఖాదోషములు. అందు నల్లనిపత్రమునువాడుటయుఁ జక్కగనుండనట్టియు విషమవిరాగములైనట్టియునక్షరములవ్రాయుట అకాంతి. పూర్వోత్తరసంబంధవిరోధము వ్యాఘాతము. చెప్పినదానినేమఱల నవిశేషముగఁజెప్పుట పునరుక్తము. లింగవచనకాలకారకముల యన్యథాప్రయోగమపశబ్దము. వర్గముచేయవలసినచోటఁ జేయకుండుటయుఁ జేయరానిచోటఁజేయుటయు గుణవిపర్యాసమొనర్చుటయు సంప్లవమనఁబడును.

సర్వశాస్త్రములను ప్రయోగముల ననుసరించి నరేంద్రుల యుపయోగమునకై కౌటిల్యునిచే నీశాసనవిధి కావింపఁబడినది.

ఇది అధ్యక్షప్రచారమున శాసనాధికారమను
దశమాధ్యాయము.
ఆదినుండి ముప్పదియొకటవయధ్యాయము.



## 29 ప్రకరణము.

### కోశమందుంపఁదగిన రత్నములపరీక్ష.

కోశాధ్యక్షుఁడు నిపుణులగువారితోడను కావలసినసామగ్రులతోడనుకూడి కోశమందుంపఁదగిన రత్నసారఫల్గుకుప్యములను ప్రతిగ్రహింపవలయును.

తామ్రపర్ణికము పాండ్యకవాటకము పాశిక్యము కౌలేయము చౌర్ణేయము మాహేంద్రము కార్దమికము స్రౌతసీయము హ్రాదీయము హైమవతమని మౌక్తికభేదములు. శుక్తులు శంఖములు లోనగుద్రవ్యములు వీనికి జన్మస్థానములు.

మసూరకము త్రిపుటకము కూర్మకము అర్ధచంద్రకము కంచుకితము యమకము కర్తకము ఖరకము సిక్తకము కామండలుకము శ్యావము నీలము దుర్విద్ధములగు ముత్యము లప్రశస్తములు. స్థూలము వృత్తము నిస్తలము భ్రాజిష్ణువు శ్వేతము గురువు స్నిగ్ధము దేశవిద్ధము ప్రశస్తములు.

శీర్షకము ఉపశీర్షకము ప్రకాండకము అవఘాటకము తరళప్రతిబంధమనునవి మౌక్తికసరభేదములు.

వేయు నెనిమిదిసరములుగలది ఇంద్రచ్ఛందము. దానిలోసగము విజయచ్ఛందము. అఱువదినాలుగు సరములుగలది అర్ధహారము. ఏఁబదినాలుగుగలది రశ్మికలాపము. ముప్పదిరెండుగలది గుచ్ఛము. ఇఱువదియేడుగలది నక్షత్రమాల. ఇఱువదినాలుగు సరములర్ధగుచ్ఛము. ఇఱువదిసరములుగలది మాణవకము. దానిలో సగమర్ధమాణవకము. ఇవి మణిమధ్యములగునప్పుడు తత్తన్మాణవకసంజ్ఞలతో వ్యవహరింపఁబడుచున్నవి.

శుద్ధమగుహారమున కేకశీర్షకమని పేరు. అట్లే మిగిలినవా ని నేకశీర్షకపదముతోఁ గలిపి వ్యవహరింపనగును.

మణిమధ్యమగుహారమర్ధమాణవకము. మూఁడుఫలకలుగాని అయిదుఫలకలుగాని గలహారము ఫలకహారము. ఒక్కటేసరము గల దిశుద్ధైకావళి. మణిమధ్యయగునేకావళికి యష్టియనిసంజ్ఞ. హేమ మణిచిత్రయగునది రత్నావళి. హేమమణులును ముత్యములునుక లిపికూర్పఁబడినది అపవర్తకము. సువర్ణసూత్రాంతరమగునది సో పానకము. అది మణిమధ్యమైనచో మణిసోపానకమగును

ఇదేవిధముగ శిరోహస్తపాదకటికలాపహారముల విషయమును గ్రహింపనగు.

కౌటములు మాలేయకములు పారసముద్రకములని మణుల లోని భేదములు.

పద్మపారిజాతబాలసూర్యులవర్ణమువంటి దోషరహితమగు వర్ణమునుకలది సౌగంధికము. ఉత్పలశిరీషపుష్ప ఉదకవంశశుకప త్రవర్ణములుగలమణి వైడూర్యము. పుష్యరాగగోమూత్రకగో మేధికములు వైడూర్యభేదములే. నీలకాంతులు కళాయపుష్పవర్ణ ము అధికనైల్యము జంబూఫలజీమూతకాంతులను కలిగినమణి యిం ద్రనీలము. నందకము స్రవన్మధ్యము సీతవృష్టి సూర్యకాంతమని మణులలోనియితరభేదములు.

షడశ్రత్వము చతురశ్రత్వము వర్తులత్వము తీవ్రరాగము స్వ చ్ఛత స్నిగ్ధత గురుత్వము అర్చిష్మత అంతర్గతప్రభ ప్రభానులేప మను వి మణిగుణములు. మందరాగప్రభ సశర్కరత పుష్పచ్ఛిద్రత ఖండములగుట దుర్విద్ధత లేఖాకీర్ణతయనునవి మణిదోషములు.

విమలకము సస్యకము అంజనమూలకము పిత్తకము సులభ కము లోహితకము అమృతాంశుకము జ్యోతీరసకము మాలేయక ము అహిచ్ఛత్రకము కూర్పము ప్రతికూర్పము సుగంధికూర్పము క్షీ రపకము శుక్తిచూర్ణకము శిలాప్రవాలకము పులకము శుక్రపులక

మని మణులలో నంతరజాతులు.

తక్కినవన్నియుఁ గాచమణులు.

సభారాష్ట్రికము మధ్యమరాష్ట్రికము కాశ్మకరాష్ట్రికము శ్రీకటనకము మణిమంతకము ఇంద్రవానకమని వజ్రభేదములు. గనులు ప్రవాహములు లోనగునవి వీనిజన్మస్థానములు.

మార్జారాక్షకము శిరీషపుష్పకము గోమూత్రకము గోమేధకము శుద్ధస్ఫటికము మూలాటీపుష్పకవర్ణము మణివర్ణాన్యతమవర్ణములు వజ్రవర్ణములు.

స్థూలము గురువు ప్రహారసహము సమకోటికము భాజనలేఖితము వక్రీకృతకరణము భ్రాజిష్ణువునగు వజ్రములు శ్రేష్ఠములు. నష్టకోణకము నిరశ్రికము పార్శ్వాపవృత్తమగునవియు ప్రశస్తములు.

పగడములు అలకంధకవైవర్ణికములని రెండువిధములు. ఎఱుపు పద్మవర్ణము కఠినత్వము గర్భదోషరాహిత్యములు వానిలక్షణములు.

<u>చందనము:</u>— సాతనచందనము రక్తవర్ణభూమిగంధములను, గోశీర్షకము కాలతామ్రవర్ణమత్స్యగంధములను, హరిచందనవర్ణనములు శుకపత్రివర్ణ ఆమ్రగంధములను, గ్రామేరుకము రక్తరక్తకాలవర్ణబస్తమూత్రగంధములను, దైవసభేయజాపకచందనములు రక్తవర్ణపద్మగంధములను. జోంగకతౌరూపచందనములు రక్తరక్తకాలవర్ణస్నిగ్ధతలను, మాలేయకము పాండురక్తవర్ణమును, కుచందనము అగరువంటి నల్లదనమును రక్తరక్తకాలవర్ణరూక్షత్వములను, కాలపర్వతకము అనవద్యవర్ణమును, కోశాకారపర్వతకము కాళకాళచిత్రవర్ణములను, శీతోదకీయము పద్మగంధకాళవర్ణస్నిగ్ధతలను, నాగపర్వతకము శైవలవర్ణరూక్షత్వములను, శాకలచందనము కపిలవర్ణమును కలిగియుండును.

లఘుత్వము స్నిగ్ధత అశ్యానత సర్పిస్నేహలేపిత గంధసుఖము త్వగనుసారిత అనుల్బణత్వము అవిరాగిత ఉష్ణసహత్వము దాహ

గ్రాహిత్వము సుఖస్పర్శము చందనగుణములు.

అగరు:— జోంగకము కాలకాలచిత్రవర్ణ మండలప్రదేశముల ను, దోంగకము శ్యామవర్ణమును, పారసముద్రకము చిత్రరూపము ను ఉశీరగంధనవమాలికాగంధములను కలిగియుండును. గురుత్వ ము స్నిగ్ధత పేశలగంధము నిర్హారిత అగ్నిసహత్వము అసంప్లుతధూ మము సమగంధము విమర్ధసహత్వములు అగరుగుణములు.

తైలపర్ణికము:— అశోకగ్రామికము మాంసవర్ణపద్మగంధ ములను, చోంగకము రక్తపీతవర్ణ ఉత్పలగోమూత్రగంధములను, గో మేరుకము గోమూత్రస్నిగ్ధతలను, సౌవర్ణకుడ్యకము రక్తపీతవర్ణ మాతులుంగగంధములను, పూర్ణకద్వీపకము పద్మగంధ నవనీతగం ధములను, భద్రశ్రీయపారలౌహిత్యకములు జాతీవర్ణమును, అంత రపత్యము ఉశీరవర్ణమును, పైరెండును కుష్ఠగంధమును, స్వర్ణభూమి జమగు కాలేయకము పీతవర్ణస్నిగ్ధతలను, ఔత్తరపర్వతకము రక్తపీత వర్ణములను కలిగియుండును. సారములనినివియే. ముద్దచేసినను వే చినను గంధవిహీనతనుచెందక ధూమమునుసహించుటయు విరాగ మునుపొందకుండుటయు నితరవస్తుసంబంధమును సహించుటయు వీ నిలక్షణములు. వీనిగుణములు చందనాగరులవలెనుండును.

చర్మములు:— కాంతనావకము ప్రైయకము ఔత్తరపర్వతక ములని చర్మములుమూడువిధములు. కాంతనావకము నెమిలికంఠ పుకాంతిని, ప్రైయకము నీలపీత శ్వేత రేఖాబిందుచిత్రవర్ణమును కలి గియుండును. వీనిపొడుగెనిమిదియంగుళములు.

బిసీ మహాబిసులు ద్వాదశగ్రామభవములు, అవ్యక్తరూప ము బహుతరరోమాపేతత్వము చిత్రవర్ణముగలది బిసి. పరుషయు శ్వేతప్రాయయు నగునది మహాబిసి. ఈరెండును ద్వాదశాంగుళా యామములు.

శ్యామికకాళికకదళికచందోత్తరశాకుల అను చర్మములారో హజములు. ఇంద్రుంగపిలయు బంధుచిత్రయునగునది శ్యామిక. కపి

లయుఁ గపోతవర్ణయునగునది కాళిక. ఈరెండును అష్టాంగుళాయామములు. పరుషయు హస్తాయతయునగునది కదళి. మఱియు దీని చంద్రచిత్రమై మూఁడవవంతుపాదవు గలిగియుండినయెడలఁజంద్రోత్తరయగును. కోష్ఠమండలచిత్రయుఁ గృతకర్ణికయు అజినచిత్రయునగునది శాకుల.

సామూరము చీనసి సామూలీచర్మములు బాహ్లవేయములు. అంజనవర్ణమును ముప్పదియాఱంగుళములపొడవునుగలది సామూరము. రక్తకాళిగాని పాండుకాళిగానియగునది చీనసి. గోధుమవర్ణయగునది సామూలి.

సాతిన నలతూల వృత్తపుచ్ఛచర్మములు ఔదరములు. కృష్ణవర్ణముగలది సాతిన. నళతూలవర్ణముగలది నలతూల. కపిలవర్ణముగలది వృత్తపుచ్ఛ.

ఇవి చర్మజాతులు. మృదుత్వము స్నిగ్ధత బహుళరోమత్వముగలచర్మములు ప్రశస్తములు.

ఆవికములు:— శుద్ధశుద్ధరక్త పద్మరక్తములగు ఆవికములు స్యూతవానచిత్రఖండసంఘాత్యతంతువిచ్ఛిన్నములగు కంబళ్లుగఁ జేయనగు. కాచపకములు కులమితికలు సౌమితికలు తురగాస్తరణములు కర్ణకములు తలచ్ఛకములు వారవాణములు పరిస్తోమములు సమంతభద్రకములని ఆవికభేదములు. వీనిలోఁ దడిసినదివలె నున్ననై సూక్ష్మముగను మృదువుగనునుండునది శ్రేష్ఠము. అష్టప్లోతిసంఘాతముగలిగి కృష్ణవర్ణమైన భింగిసీ అపసారకములను కంబళ్లు వర్షవారణములు. ఇవి నేపాళదేశజములు. సంపుటిక చతురశ్రిక లంబరకటవానకప్రావరక సత్తలిక లవి మృగరోమభేదములు.

దుకూలములు.— శ్వేతమును స్నిగ్ధమును నగుదుకూలములు వంగదేశమందును, శ్యామమణిస్నిగ్ధమగునవి పౌండ్రకమందును, సూర్యవర్ణమును మణిస్నిగ్ధమును చతురశ్రవానవ్యామిశ్రవానములును నగునవి సౌవర్ణకుడ్యమందును ఁయుదురు. వీనిలో ఏకాంశుక

అర్ధాంశుక ద్వ్యంశుక త్ర్యంశుక చతురంశుకములను భేదములుకలవు. ఇట్లేకాశిక క్షౌమపౌండ్రక క్షౌమముల విషయమునఁగూడ నెఱుంగునది.

మాగధికములు పౌండ్రికములు సౌవర్ణకుడ్యకములని పత్త్రోర్ణములు మూఁడువిధములు. నాగవృక్షము లికుచము వకుళము వటము వీనికి జన్మస్థానములు. నాగవృక్షకములు పీతవర్ణములుగను లైకుచములు గోధుమవర్ణములుగను వకుళములు శ్వేతములుగను తక్కినవి నవనీతవర్ణములుగను నుండును. వీనిలో సౌవర్ణకుడ్యకములు శ్రేష్ఠములు. కౌశేయములయు చీనభూమిజములగు చీనపట్టములయు విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

మాధురములు అపరాంతకములు కాళింగకములు కాశికములు వాంగకములు వాత్సకములు మాహిషికములు నగుదూదిబట్టలు శ్రేష్ఠములు.

కావున నితరరత్నములయొక్క ప్రమాణము మూల్యలక్షణము జాతి రూపము నిధానము నవకర్మ పురాణప్రతిసంస్కారము తెలియునుండునట్లుత్తమానుత్తమములగలుపుట దేశకాలములవలనఁగలుగునష్టము హింసా ప్రతిక్రియలను నధ్యక్షుఁడు తెలిసికొనవలయును.

ఇది అధ్యక్షప్రచారమునఁ గోశమందుంపఁదగిన రత్నములపరీక్షయను
పదునొకండవ యధ్యాయము
ఆదినుండి ముప్పదిరెండవ యధ్యాయము.



## 30 ప్రకరణము.

### ఆకరకర్మాంత ప్రవర్తనము.

ఆకరాధ్యక్షుఁడు శుల్బాదిధాతుశాస్త్రజ్ఞుఁడును రసపాకమణిరాగజ్ఞుఁడునై తచ్ఛాస్త్రజ్ఞులతోఁ గూడి దాని నెఱిఁగినకర్మకరులను నుపకరణములను సంగ్రహించి కిట్టమూష అంగారభస్మలింగములు గలిగిన ప్రాతగనులను రసధాతువులుగలభూమిప్రస్తరములం దధిక వర్ణగౌరవమును అత్యుగ్ర గంధరసములును చిహ్నలుగఁ గలిగినట్టి

స్త్రోత్రగనులను పరీక్షింపవలెను.

అభిజ్ఞాత ప్రదేశములగుపర్వతములయొక్క బిలగుహోపత్యకాలయనిగూఢ ఖాతములలోపల స్రవించునట్టియు జంబూచూతతాళఫలములయుఁ బక్వహరిద్రాహరితాళములయు శుకమయూరపత్రములయు వర్ణముగలిగినట్టియు, సమవర్ణములగు నుదకౌషధీపర్యంతము లయినట్టియు బంకగను విశదముగను బరువుగ నున్నట్టి రసములు కాంచనికములు. మఱియు నివి నీటిపైఁజల్లఁబడి తైలమువలె బిందురూపముగ వ్యాపించుచు నందలి మలపంకముల గ్రహించి తామ్రరూప్యములలోఁ బూర్తిగాఁ గలిసిపోవు శక్తిని కలిగియుండును.

తత్ప్రతిరూపకమై యుగ్రగంధము గలిగినది శిలాజిత్తని తెలిసికొనఁదగు

పీత, తామ్ర, తామ్రపీతములయినట్టియు, భూమిప్రస్తరములందుఁ బుట్టినట్టియు, భిన్నములై నీలరేఖలఁ గలిగినట్టియు, ముద్గమాషకృసరవర్ణములను హారిద్రాహారితకీ పద్మపత్రశైవల యకృత్ ప్లీహముల యనవద్యవర్ణములను కలిగినట్టియు, భిన్నములై వాలుకారేఖలను బిందుస్వస్తికములను కలిగినట్టియు, గుళికలతోఁ గూడి జ్వాలావంతములైనట్టియుఁ, గాల్చినప్పుడుగూడ బ్రద్దలుగాక బహు ఫేనధూమములతోఁ గూడి యుండునట్టి ధాతువులు సువర్ణధాతువులు. ఇవి తామ్రరూపముతో సంయోగమునొంది ప్రతివాపములుగ నుపయోగింపఁబడును.

శంఖ కర్పూర స్ఫటిక నవనీత కపోత పారావత విమలక మయూరగ్రీవవర్ణములను సస్యక గోమేధక గుడ మచ్ఛండిక వర్ణములఁను గోవిదారపద్మపాటలీకలాయక్షౌమాతసీ పుష్పవర్ణములను కలిగి సీసముతోఁడను ఇనుముతోఁడను గలిసి విస్రగంధములును భిన్నములునుకృష్ణవర్ణములును కృష్ణమిశ్ర శ్వేతవర్ణములునునై రేఖాబిందువులచేఁ జిత్రములై మృదుత్వముగలిగి కాల్పఁబడినపుడుగూడ

బ్రద్దలుకాక బహుఫేనధూమములు వెడలునట్లు చేయుచుండునవి రూప్య (వెండి) ధాతువులు.

ధాతువులన్నిటికి బరువెక్కువగుకొలఁది సత్వమధికమగుచుండును. వానిలో నపరిశుద్ధములును మూఢగర్భములును నగునవి తీక్ష్ణమూత్రక్షారభావితములై రాజవృక్ష వట పీలు గోరోచన మహిష ఖర కరట మూత్ర లండ పిండ బద్ధములై తత్ప్రతీవాపములుగఁగాని తదవలేపములుగఁగాని సంస్కరింపఁబడినచో విశుద్ధమగును.

యవ మాష తిల పలాశ పీలుక్షారములతోను గోక్షీరాజక్షీరములతోను మిశ్రితములగు కదళీ వజ్రకంద ప్రతీవాపములు లోహములకు మృదుత్వమును గూర్చును.

శతసహస్రశకలములుగ భిన్నమైనట్టి లోహముసహితము మధుమధుకఅజాక్షీర తైలఘృతగుడకిణ్వకందళీప్రతీవాపమందు మూఁడుమారులు త్రిప్తమువఁబడి మెత్తనగును. గోదంత శృంగప్రతీవాపము మృదుత్వమును స్థిరముగ నిలుపును.

బరువుగలిగి స్నిగ్ధమై మృదువై పింగళహారితపాటలలోహితవర్ణములుగలిగి భూమిభాగములందుఁగాని ప్రస్తరభాగములందుఁగాని యుండునవి తామ్రధాతువులు.

కాక మేచక కపోత గోరోచన వర్ణములను శ్వేతరేఖలను విస్రగంధమును కలది సీసధాతువు.

ఊషర కర్బుర వర్ణమునుకాని పక్వలోష్టవర్ణమునుకాని కలది త్రపుధాతువు (తగరము.) శ్లక్ష్ణపాషాణప్రాయమై పాండురోహితవర్ణముగాని సింధువారపుష్పవర్ణముగాని కలది తీక్ష్ణ (ఇనుము) ధాతువు. కాంశపత్ర భుజపత్ర వర్ణములుగలది వైకృంతక ధాతువు. స్వచ్ఛములు స్నిగ్ధములు ప్రభాసహితములు ఘోషవంతములు శీతతీవ్రములు స్వల్పరాగములు నగునవి మణిధాతువులు.

ధాతువులను తత్కాలమందనుభవములోనున్న కర్మాంతము

లం దుపయోగింపవలెను.

లోహభాండవ్యాపారము నేకముఖముగఁజేసి యితరస్థలము ందు భాండములఁ జేయువారిని గొనువారిని అమ్మువారిని దండింప వలెను.

రత్నములఁదప్పఁ దక్కిన యాకరపదార్థముల నపహరించు వానికి అష్టగుణదండమును విధింపవలెను.

ఖనిజముల దొంగలించువానిని రాజాజ్ఞను పొందక ఆకర కర్మలఁ జేయువానిని పట్టుకొని గనులలోఁ బనిచేయింపవలెను.

భాండములఁ జేయుటయం దుపకరించునట్టియు నధికవ్యయ క్రియాభారములుగలిగినట్టియు గనిఁ నితరులకు భాగపద్ధతిగఁగాని నిర్ణీతప్రక్రియ పద్ధతిగఁగాని యియ్యవలెను. సులభముగఁ ద్రవ్యదగిన గనిని సొంతముగఁ దానే త్రవ్వింపవచ్చును.

లోహాధ్యక్షుఁడు తామ్ర సీస త్రపు వైకృంతక ఆరకూట వృత్త కంస తాళ లోధ్ర కర్మాంతములను తయారైన లోహభాం డములను విక్రయమును చేయింపవలెను.

లక్షణాధ్యక్షుఁడు (టంకశాలాధికారి) నాలుగవవంతు తా మ్రమును పదునాఱవవంతు తీక్ష్ణత్రపుసీసాంజనములలో నొకదానిని (వెండితో) మిశ్రముచేసి వెండినాణెములఁ దయారుచేయవలెను. పణము అర్థపణము పాదము అష్టభాగమనునవి వెండినాణెములు. నాలుగవవంతాజీవపదార్థము గలిపి మాషకము కాకణి అర్థకాకణి యనుతామ్రనాణెములఁ జేయవలెను.

రూపదర్శకుఁడు వ్యావహారికములగు నాణెములయొక్కయుఁ గోశప్రవేశ్యములగు నాణెములయొక్కయుఁ బణయాత్రను నిర్ణ యింపవలెను. కోశమందుఁ జెల్లింపఁబడు నాణెములను నూటికెనిమి దివంతున రూపికమును అయిదవవంతున వ్యాజిని ఎనిమిదవంతున పారీక్షికమును పుచ్చుకొని కర్తృ క్రేతృ విక్రేతృ పరీక్షితలుతప్ప

మిగిలిన నేరముచేసినవారినుండి యిరువదియైదుపణములదండమును వసూలుచేయవలెను.

ఖన్యధ్యక్షుఁడు శంఖ వజ్ర మణి ముక్తాప్రవాళక్షారకర్మాంతములను వానినిగుఱించిన పణనవ్యవహారమును చేయింపవలెను. లవణాధ్యక్షుఁడు పాకముచేయఁబడిన లవణసంబంధమగు భాగప్రక్రయములను విక్రయమునుండి వ్యాజీరూపికమూల్యములను వసూలుచేయవలెను.

విదేశమునుండి తెచ్చినలవణమున నాఱవవంతును, తక్కిన భాగమున్ను నూటికైదువంతున వ్యాజీరూపికములను రాజునకియ్యవలెను. (విదేశలవణమును) కొనువాఁడు రాజవ్యాపారమునకుఁ గలిగిన నష్టమునకనురూపముగ వైధరణము నిచ్చికొనవలెను. లేనియెడల నాతనిపై నాఱువందల దండమును విధింపవలెను. శ్రోత్రియులు తపస్వులు కూలివాండ్రు భక్తలవణమును తీసికొనిపోవచ్చును. దీనికంటె నితరములగు క్షారలవణములకు శుల్కము నిచ్చికొనవలెను.

ఈవిధముగ మూల్యమును విభాగమును వ్యాజిని పరిఘమును అత్యయమును శుల్కమును వైధరణమును దండమును రూపమును రూపికమును వసూలుచేసి ధాతుపణ్యముల స్వాధీనమందుంచుకొని వాన్నిపై నిర్ణీతములగు పన్నుల విధింపవలెను.

కోశ మాకరమువలనఁ బుట్టుచున్నది. దండమునకట్టి కోశమే మూలము. కోశభూషణయగుభూమి కోశదండములచేఁ బ్రాప్తించుచున్నది.

ఇది అధ్యక్షప్రచారమున ఆకరకర్మాంతప్రవర్తనమను పండ్రెండవ యధ్యాయము.

ఆదినుండి ముప్పదిమూడవయధ్యాయము.



## 31 ప్రకరణము.

### అక్షశాలయందలి సువర్ణాధ్యక్షుఁడు.

సువర్ణాధ్యక్షుఁడు సువర్ణ రజత కర్మాంతములకు వేఱువేఱుగ నాలుగుశాలలను నొకద్వారమును కల అక్షశాలను నిర్మించి శిల్పవంతుఁడును అభిజాతుఁడును విశ్వాసపాత్రుఁడునునగు సౌవర్ణికుని విశిఖామధ్యమున నిలుపవలెను.

జాంబూనదము శాతకుంభము హాటకము వైణవము శృంగశుక్తిజము జాతరూపము రసవిద్ధము ఆకరోద్గతమని సువర్ణభేదములు. కింజల్కవర్ణము స్నిగ్ధత నాదము కాంతియుఁగలసువర్ణము శ్రేష్ఠము. రక్తపీతకసువర్ణముమధ్యమము. రక్తసువర్ణమవరము.

పాండుశ్వేతవర్ణము దోషసూచకము. ఈదోషముండునపుడు నాలుగురెట్లుపరిమాణముగల సీసముతో బంగారమును పరిశోధింపవలెను. సీసముతోఁ గలిసి గట్టిపడినసువర్ణమును నెండు పిడకలలోఁబుటముఁ బెట్టవలెను. గట్టిబడుటవలనభిన్నమైనచో దానిని తైలముతోఁగూడిన గోమయమందుఁదడుపవలెను.

ఆకరోద్గతసువర్ణము సీసముతోఁగలిసి గట్టిపడినపుడు దానిని మూసగాఁజేసినవస్త్రములోనుంచి కాల్చి పట్టెడపైఁబెట్టి కొట్టవలెను. లేక కందళవజ్రకందకల్కమునఁ దడుపవలెను.

తుద్ధోద్గతము గౌడికము కామమలము కుబుకము చాక్రవాళికమని వెండిలోనిభేదములు. శ్వేతము స్నిగ్ధము మృదువునునగు వెండి శ్రేష్ఠము. ఇట్లుండక బద్దలైనది దుష్టము. దానిని సీసచతుర్భాగముచే శోధింపవలెను. మీఁదుభాగమునఁజూళికలుగలిగి స్వచ్ఛమును కాంతియుక్తమును దధివర్ణమును నగునది శుద్ధము.

శుద్ధమగుహారిద్ర వర్ణముగల బంగారము సువర్ణము. పదునాఱుమాషకములపరిమితి గలదానినుండి యొకకాకణి మొదలు

పదునాఱుకాకణులవఱకు నొక్కొక్కకాకణిగ బంగారమునుతీసి దానిస్థానమున నంతపరిమాణముగల తామ్రమును కలిపిన యెడలఁబదునాఱు వన్నెలేర్పడును.

గీటురాయిపై మొదట సువర్ణమును గీటుపెట్టి తర్వాత శోధింపవలసినబంగారముయొక్కగీటు పెట్టి దానివన్నెను కనుఁగొనవలయును. సమస్థలమునఁనికషితమగు సమరాగరేఖతుడిచి వేయుటకుఁదగియున్నప్పుడు నఖక్షిప్తమగు గైరికచూర్ణముచే మోసము గావింపఁబడినదని యెఱుంగవలెను. గోమూత్రభావితములగు జాతీహింగుళికపుష్పికాసీసములను పూసిన చేతితో సువర్ణమును దాకిన యెడలనది తెల్లఁబడును.

కేసరస్నిగ్ధమై మృదువుగను భ్రాజిష్ణువుగను నుండునట్టి నికషము శ్రేష్ఠము. అట్లే కళింగదేశజమును ముద్గవర్ణమునునగు నికషముగూడ శ్రేష్ఠమే.

సమరాగముగలనికషము (సువర్ణ) క్రయవిక్రయముల రెండింటికిని, హస్తిచ్ఛవికహరితవర్ణములుగలిగి కాంతిని ప్రతిఫలింపఁజేయుశక్తిగలనికషము విక్రయసమయమునను, స్థిరమై పరుషమైవిషమవర్ణమునుకలిగి కాంతిని ప్రతిఫలింపఁజేయలేనిది క్రయసమయమునను ననుకూలించును. శ్వేతముచిక్కణముసమవర్ణము శ్లక్ష్ణముమృదువు భ్రాజిష్ణువునగునది శ్రేష్ఠము.

కాల్చినప్పుడుగూడ వెలుపలనులోపలను సమానవర్ణముగలిగి కింజల్కపుష్పవర్ణమునుకాని కారండపుష్పవర్ణమునుకాని గలిగిన సువర్ణము శ్రేష్ఠము. శ్యావనీలవర్ణములు దోషములు.

పౌతవాధ్యక్షప్రకరణమునఁ దులాప్రతిమానములగూర్చిచెప్పినాము. ఆమానములననుసరించి రూప్యసువర్ణములక్రయవిక్రయము లొనర్పవలెను.

ఆయుక్తుఁడుకానివాఁడక్షశాలకుఁబోరాదు. అట్లుపోవువానికి

నుచ్ఛేదమేళికమ్. ఆయుక్తునిసహితము వెండిబంగారములతో నక్ష శాలను ప్రవేశించినయెడల వానినచటనే విడిచిపెట్టవలయును. కాంచనపృషితత్వష్టృతపనీయములఁజేయువారును ధ్మాయక చరకపాంసుధావకులునుదమ వస్త్రహస్తగుహ్య ప్రదేశములు శోధింపఁబడినవారై రాకపోకలొనర్పవలెను. వారి యుపకరణములనువారు పూర్తిగాపనిచేయని సువర్ణభూషణములను వారచటనేయుంచి పోవలయును. వారుతీసికొను సువర్ణమును చేసిన నగలను నధికారస్థానమధ్యముననుంపవలెను. (వస్తువులను) ప్రాతః సాయంకాలములందుఁ బరీక్షించి కర్తృకారయితల ముద్రలను వేసి లోపలనుంపవలెను.

క్షేపణములు గుణములు క్షుద్రములని కర్మలు మూఁడువిధములు. కాచార్పణాదులు క్షేపణములు. తీగెలుదీసియల్లుట మొదలగునవి గుణములు. గట్టిపని గుల్లపని ముత్వాలపని క్షుద్రములు.

కాచకర్మల కైదువంతులు కాంచనమును, పదివంతులబంగారముతో నాలుగువంతులుతామ్రమునుకాని వెండినికాని కలుపఁగా నేర్పడిన సువర్ణమును నుపయోగించి శుద్ధసువర్ణమును (అపరిశుద్ధముగుదానితోఁ గలియనీయక) వేఱుగనుంపవలెను.

పృషితకాచకర్మలలో మూఁడుభాగములు భాండముగను రెండుభాగములు వాస్తుకముగను, లేక నాలుగుభాగములువాస్తుకముగను మూఁడుభాగములు భాండముగను చేయవలెను.

త్వష్టృకర్మకు సువర్ణతామ్రములను సమముగఁగలిపి యుపయోగింపవలెను. గట్టిదిగాని గుల్లదిగాని యగువెండివస్తువును సగముబరువుగలబంగారముతోఁగలిపి చేయవచ్చును; లేక నాలుగవవంతుబంగారమును వాలుకాహింగిలీక రసముతోఁగాని చూర్ణముతోఁగాని కలిపి పైపూయవచ్చును.

శ్రేష్ఠమైమంచి కాంతిగలసువర్ణము తపనీయము. సమసీసముతోఁగలిసి సైంధవికములతోఁబాకపత్రపక్వముగఁగాలిన తపనీయము నీలపీతశ్వేతహరితశుకకపోత వర్ణములకుఁ బ్రకృతియగును.

మయూరగ్రీవకాంతియు శ్వేతరేఖను కలిగి మెఱయుచున్న పీత (తామ్ర) పూర్ణితమగు నొకకాకణి తీక్ష్ణలోహము సువర్ణమునకు మంచి కాంతినిచ్చును.

శుద్ధాశుద్ధమగు వెండిని అస్థితుత్థ శుష్కతుత్థ సమసీసములతో నాలుగేసిమారులును కపాలమందు మూఁడుమారులును గోమయమున రెండుమారులును కాల్చి యిట్లు పదునేడుమారులు శోధించిన దానిని సైంధవిక జ్వాలితముగఁజేసి కాకణి మొదలు రెండుమాషములసువర్ణముతోఁ గలిపినచోఁ గాంతివంతమగు తెల్లని వెండి సిద్ధమగును.

మూఁడుభాగముల తపనీయమును ముప్పదిరెండు భాగముల శ్వేతతారము (వెండి) తోఁ గలిపినచో శ్వేతలోహితక ప్రతీవాపమును ముప్పదిరెండుభాగముల తామ్రముతోఁ గలిపినచోఁ బీతకమును సిద్ధమగుచున్నవి. మూఁడుభాగముల రాగమును తపనీయముతోఁగలిపి కాల్చినచోఁ బీతరాగమగును రెండుభాగముల శ్వేతతారము నొక్కభాగము తపనీయముతోఁ గలిపి కాల్చినయెడల ముద్గవర్ణమగును. కాలాయసార్ధభాగముతోఁ గలిపిన తపనీయము కృష్ణవర్ణమగును. ప్రతిలేపితమగు పాదరసముతో ద్విగుణాభ్యక్తమగునది శుకపత్రవర్ణముగను నగుచున్నది.

కార్యారంభమందు రాగవిశేష సంబంధమగువాని వన్నెను కనుఁగొనవలెను.

తీక్ష్ణతామ్రముల సంస్కరించువిధమును వజ్రమణిముక్తా ప్రవాళ రూప్యముల మానములను రూప్యసువర్ణభూషణములకు వలయు ప్రమాణములను నెఱుంగవలయును.

సమరాగము సువర్ణసమకాంతి అసక్తపృషితత్వము స్థిరత స్నిగ్ధత శుద్ధత ధారణసుఖము అభినీతము ప్రభ సమసంస్థానమాధుర్యము మనోనేత్రాభిరామతలు తపనీయగుణములు.

ఇది అధ్యక్షప్రచారమున అక్షశాలయందలి సువర్ణాధ్యక్షుఁడను
పదుమూఁడవ యధ్యాయము
ఆదినుండి ముప్పదినాలుగవ యధ్యాయము.



## 32 ప్రకరణము.

### విశిఖయందలి సౌవర్ణికుని ప్రచారము.

పౌరజానపదులిచ్చిన రూప్యసువర్ణములను పనివాండ్రచే సౌవర్ణికుఁడు (నాణెములుగనుభూషణములుగను) చేయింపవలెను. కార్యకార్యము లనిర్దిష్టములను మిషచేఁ గార్యమును మఱియొకవిధముగఁ జేయుపనివాండ్రకు వేతననాశము, వేతనద్విగుణ దండమును కాలాతిపాతమొనర్చినపుడు వేతనములో నాలుగవవంతును తద్విగుణ దండమును విధింపవలెను. కర్మకరుఁడెట్టి వర్ణప్రమాణములుగల నిక్షేపమును తీసికొందురో యట్టిదానినేమరల నర్పింపవలెను. కాలాంతరమందువానిని క్షీణపరిశీర్ణములు కాకయుండినచోఁ దిరిగి పుచ్చుకొనవచ్చును.

కర్మకరుల సహాయముచే సువర్ణ పుద్గల (భూషణములు) ప్రయోగము (పరివర్తనము) ల నెఱుంగవలయును.

బంగారు వెండివస్తువుల కొకకాకణిసువర్ణము క్షయముగ నిచ్చుకొనవలెను. రాగప్రక్షేపమునకు రెండుకాకణుల తీక్ష్ణము కావలయును. అంనుషడ్భాగము క్షయమగును.

మాషమునకన్నఁ దక్కువగునాణెముల వన్నెనుతగ్గించినపుడు పూర్వసాహసదండమును ప్రమాణము తగ్గించినపుడు మధ్యమదండమును, తులాప్రతిమానముల విషయమువను తయారైనవస్తువుల పరివర్తనమందును వంచించినపు డుత్తమదండమును విధింపవలెను.

సౌవర్ణికుని కప్రత్యక్షముగను సౌవర్ణికశాలగాక మఱి

రొకప్రదేశమందును ప్రయోగము జేయించినవానికి ద్వాదశపణ దండమును చేసినవానికిఁ దద్ద్విగుణదండమును విధింపవలెను. నేర ము చేసినవారు దొరకనపుడు కంటకశోధనమునకు యత్నించి దొర కినతర్వాతఁ గర్తనకు ద్విశతదండమును పణచ్ఛేదనమును విధింప వలెను.

తులాప్రతిమానభాండములను పౌతవమునందుండి కొనవలె ను. అట్లు కొననివానికి ద్వాదశపణదండము.

ఘనము ఘనసుషిరము సంయూహ్యము అవలేప్యము సం ఘాత్యము వాసితకమనునవి కారుకర్మలు. తులావిషమము అపసార ణము విస్రావణము పేటకము పింకమనునవి హరణోపాయములు. సన్నామినీ ఉత్కీర్ణిక భిన్నమస్తక ఉపకంఠి కుశిక్య సకటుకక్ష్య పారివేలి అయస్కాంతలు దుష్టతులలు (త్రాసులు).

రెండుభాగముల వెండియు నొకభాగము తామ్రమును కలిసిన చో నది త్రిపుటకము. ఆకరోద్గత సువర్ణస్థానమునఁ దిప్రుటకము నుంచి సువర్ణమును హరించినచో నది త్రిపుటకావసారితము ; వే ల్లకముచేత హరించినచో వేల్లకావసారితము; శుల్బార్ధముతోఁ గలిసిన బంగారముచే హరించిన యెడల హేమావసారితమని యెఱుంగునది.

మూకమూష, పూతికిట్టము, కరటకముఖము, నాలీసందంశ ము, జోంగని, సువర్చికాలవణము లోనగునవి సువర్ణాపహరణ మార్గములు.

అగ్నిలోనుంచిన మూసను బ్రద్దలగునట్లుచేసి దానిలోనుండి క్రిందఁబడిన యిసుకవంటి బంగారపు ముక్కలతో నంతకుమునుపు చ్చట దాచియుంచికొనిన మఱియొక లోహముయొక్క శకలములఁ జేర్చుట, ఆచితకపత్రపరీక్షయందు బంగారమును వెండితో మార్చు ట, బంగారుశకలములను లోహశకలములతో మార్చుటలోనగునవి విస్రావణములు.

సంయూహ్య అవలేప్య సంఘాత్యకర్మలందు గాఢము అభ్యుద్ధార్యములను పేటకములు చేయఁబడుచున్నవి. లోపల మైనముచేఁ దూర్పఁబడిన సీసరూపమునుపై బంగారు రేకుపొదుగుట గాఢ పేటకము. అదియే పటలసంపుటబద్ధమైనచో నభ్యుద్ధార్యము. అవలేప్యములందుత్తమలోహముయొక్క యొకటిరెండు రేకులతో హీనలోహము పొదుగఁబడును. సంఘాత్యములందు శుల్బముగాని తారముగాని పత్రిగర్భమున నుంపఁబడును. రాగినాణెమును సువర్ణపత్రిసంహతముచేఁ బ్రిమృష్టముగను సుపార్శ్వముగను జేసర్పవచ్చును. అట్లే తామ్రితారరూపమును యమకపత్రిసంహతముగను ప్రమృష్టముగను చేసి శ్రేష్ఠమగు నాణెముగ జూడవచ్చును. తదుభయమును తాప నికషముల మూలముననఁగాని నిశ్శబ్దోల్లేఖనమూలముననఁగాని తెలిసికొనవచ్చును. బదరామ్ల లవణోదకములయందుంచి యభ్యుద్ధార్యమును నెఱుంగవచ్చును. ఇంతటితోఁ బేటకసమాప్తి.

ఘనసుషిరమగు నాణెమునందు సువర్ణమువంటి మృన్మాలుకయు నింగిలీక కల్కమును తప్తమై దానియంటుకొనిపోవును. దృఢవాస్తుకమగు నాణెమునందుఁగూడ వాలుకామిశ్రమగు జతుగాంధారసంకము తప్తమై యంటుకొనిపోవును. వానిని బాగుగఁ గాల్చి కొట్టినయెడల నవి విశుద్ధమగును. భూషణమందును నాణెమందును కటుశర్కరచే లవణముతప్తమై యంటుకొనిపోవును. ఉడుకఁబెట్టినచో నది విశుద్ధమగును. అభ్రకపు రేకులను మైనముతోఁ బొదిగి దానిని బంగారు రేకులతోఁ గప్పి నాణెమును చేయవచ్చును. ఇట్టి నాణెమునుకాని కాచగర్భమగు నాణెమునుకాని యుదకమందుంచినచో దానిలో నొక్కభాగవ్యత్యయమాత్రము మునుఁగును. ఇదిగాక పటలాంతరములందు సూచి చేప భేద్యమగును.

ఘనసుషిరములలో మణిరూప్యసువర్ణములు గలుపుట పింకము. తాపనవిధ్వంసనములచే దానిని శుద్ధి చేయవచ్చును. ఇది పింకము.

కావున వజ్రమణిముక్తా ప్రవాళరూపాదులయొక్క జాతిరూపవర్ణప్రమాణపుద్గలలక్షణముల నెఱుంగవలయు.

కృతభాండపరీక్షాసమయమందును పురాణభాండ ప్రతిసంస్కారసమయమందును పరికుట్టన అవచ్ఛేదన ఉల్లేఖన పరిమర్దనములు హరణోపాయములు.

పేటికాప్రదేశమూలమునఁ బృషితగుణపిటకములను సుత్తితోఁ గొట్టుట పరికుట్టనము

వాస్తుకద్విగుణమగు సీసపుఱాతెమును మంచిఱాతెమునకు బదులుగనుంచి దానిని భేదించుట యవచ్ఛేదనము.

ఘనవస్తువులను తీక్ష్ణముచే నుల్లేఖించుట యుల్లేఖనము.

హరితాల మనశ్శిల ఇంగిలీకచూర్ణములలో నొక్కదానిని కాని, కురువిందచూర్ణమునుకాని, వస్త్రమునకుఁబూసి దానితో సువర్ణాదులను మర్దించుట పరిమర్దనము. దీనిచే సౌవర్ణరాజతములగు భాండములు క్షీణములగునుకాని మఱియేవిధమగు లోపమును నొందఁజాలవు.

భగ్నఖండఘృష్ట సంయుక్తాహ్యములకుఁ గలిగినదోషమును సదృశవస్తువులతోఁ బరీక్షించి తెలిసికొనవలెను. అవలేప్యవస్తువులలో నెంతఖండింపఁబడెనో యంతపరిమితముగ ఖండించి దానితో సరిచూడవలెను. రూపముమారినదానికిఁ దాపనమును ఉదకపేషణమును పలుమారొనర్పవలెను

అవక్షేపము ప్రతిమానము అగ్నిగుండిక ఉపకరణము స్థానము పిచ్ఛము సూత్రము బట్టను ముడుచుట శిరస్సు ఉత్సంగము మక్షిక స్వకాయమును చూచుకొనుటయందాసక్తి ఉదకపాత్రము కుంపటి— వీనియందలి కర్మకారుల చేష్టితములనుబట్టి వారిమోసము తెలియంగవలయును.

విస్రగంధము మలగ్రాహిత్వము పరుషత్వము ప్రస్తీవత వివర్ణతలు వెండిలోనిదోషములని యెఱుంగునది.

ఈలాగు నవజీర్ణవిరూపభాండములఁబరీక్షించి వానివిషయమున యథోద్దిష్టముగ దండమును విధింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున విశిఖయందలి సౌవర్ణప్రచారమను చతుర్దశాధ్యాయము.

ఆదినుండి ముప్పదియైదవ యధ్యాయము.



## ౩౩ ప్రకరణము.

### కోష్ఠాగారాధ్యక్షుఁడు.

సీతా రాష్ట్ర క్రయిమ పరివర్తక ప్రామిత్యక అపమిత్యక సింహానిక అన్యజాత వ్యయప్రత్యాయ ఉపస్థానములను కోష్ఠాగారాధ్యక్షుఁడెఱుంగవలయును.

సీతాధ్యక్షునిచేఁ దేఁబడిన సస్యజాతిసమూహము సీత.

పిండ (నిర్ణీతమగు) కరము షడ్భాగము సేనాభక్తము బలికరము ఉత్సంగము పార్శ్వము పారిహీణికము ఔపాయనికము కౌష్ఠేయకములు రాష్ట్రము.

ధాన్యమూల్యముకోశనిర్హారము ప్రయోగప్రత్యాదానములు క్రయము.

సస్యజాతులను వస్త్వంతరములతో మార్చుటపరివర్తనము.

అన్యులనుండి సస్యములయాచించుట ప్రామిత్యకము. వానినిమఱల నిచ్చివేయునుద్దేశముతోఁదీసికొనుట అపమిత్యకము.

దంపుట బాగుచేయుట వేచుట ఆసవములఁజేయుట పిండివిసరించుట గొల్లలు(?) తెలికవాండ్రు పీరిమూలమునఁ దెచ్చుకొనుట చెఱకునుండి చక్కెరఁజేయుటలోనగునవి సింహానిక.

నష్టప్రస్మృతిము లన్యజాతములు.

విక్షేపము వ్యాధితాంతరము అరంభశేషములు వ్యయప్రత్యాయము.

తులామానాంతరహస్తపూరణమువలనఁ గలిగిన లాభము వ్యాజి

వెనుకటిబాకీవసూలు క్రొత్తగవసూలుచేసిన సైకము—ఇవి ఉపస్థానము.

ధాన్య స్నేహ క్షార లవణ ధాన్యకల్పములగుఱించి సీతాధ్యక్షప్రకరణమందుఁ జెప్పఁబడును.

నెయ్యి నూనె వస మజ్జలు స్నేహపదార్థములు.

కషాయములు బెల్లము మత్స్యండిక ఖండశర్కరలు క్షారవర్గములోనివి.

సైంధవ సాముద్ర బిడ యవ క్షార సౌవర్చల ఉద్భేదజములు లవణవర్గములోనివి.

తేనె ద్రాక్ష మధువర్గములోనివి.

ఇక్షురస గుళ మధు ఫాణిత జంబూరస పనసరసములలోనొకటిని మేషశృంగపిప్పలులతోఁగలిపి యుడుకఁబెట్టి శుద్ధముగఁగాని చిర్భట ఉర్వారుక ఇక్షుకాండ ఆమ్రఫల ఆమలకరసములతోఁ గలిపిగాని మాసషణ్మాససంవత్సరములవఱకు నుండునట్లు చేయఁబడుపదార్థములు శుక్తవర్గములోనివి.

ఆమ్లవృక్ష కరమర్ద ఆమ్ర విదలామలక మాతులుంగ కోల బదర సౌవీరక పరుషకాదులఫలములు ఆమ్లవర్గములోఁజేరినవి.

దధి ధాన్యములనుండితీయఁబడిన ఆమ్లాదులు ద్రవామ్లవర్గములోనివి.

పిప్పలీ మరీచ శృంగిబేర జాజి కిరాతతిక్త గౌరసర్షప కుస్తుంబురు చోరక దమనక మరువక శిగ్రువులు, వానికాండములు కటుకవర్గములోఁజేరినవి.

శుష్కమత్స్య మాంస కందమూల ఫల శాకాదులు శాకవర్గములోనివి.

పైవానిలో సగము జానపదుల యాపదలకొఱకు నిలువఁజేయవలెను; తక్కిన సగమును వినియోగింపవచ్చును. పాతవానిని క్రొత్తవానిచే శోధించుచుండవలెను.

క్షుణ్ణ ఘృష్ట పిష్ట భ్రష్టములుగఁ జేయఁబడినట్టియు ఆర్ద్రము లై శుష్కింపఁబడినట్టియు ధాన్యముల వృద్ధిక్షయప్రమాణములను కోష్ఠాగారాధ్యక్షుఁడు స్వయముగఁ బరిశోధింపవలెను.

కోద్రవవ్రీహులలో నర్ధభాగము సారము. శాలిధాన్యముల లోనిసారమంతకంటె నెనిమిదవవంతుతక్కువ. వరకములలోనిసారమంతకంటె మూఁడవవంతుతక్కువ. ప్రియంగువులలోనర్ధభాగము సారద్రవ్యముగనుండును. చమసీముద్గమాషములలోనిసార మంత కంటె నెనిమిదవవంతు తక్కువ. శైబ్యములలోనర్ధభాగముసారము. మసూరములలోని సారమంతకంటె మూఁడవవంతుతక్కువ.

పిండియుఁ గుల్మాషము (అన్నము) ను అసలుకంటె నొకటిన్నర హెచ్చుగనుండును. యావకమును జానచేసినను పిండిచేసినను రెండింతలగును. కోద్రవ వరక ఉదారక ప్రియంగువులను వండినచో నన్నము మూఁడురెట్లును వ్రీహులయన్నము నాలుగురెట్లును శాలిధాన్యపులన్న మైదురెట్లును వృద్ధియగును.

ధాన్యములను నానఁబెట్టినచో రెండురెట్లును మొక్కవచ్చునంతవఱకును నానఁబెట్టినచో రెండున్నరరెట్లును హెచ్చగును. ధాన్యములు భ్రష్టములైనపుఁ డైదవవంతు వృద్ధియగును. కలాయము లాజలు బొరుగులు రెండింతలు వృద్ధియగును.

అవిసెగింజలనుండి యాఱవవంతును నింబకుశామ్రకపిత్థముల నుండి యైదవవంతును నువ్వులు కుసుంబములు మధూకములు ఇంగుదీబీజములు వీనినుండి నాలుగవవంతును తైలముతీయవచ్చును.

అయిదుపలముల కార్పాసక్షౌమములనుండి యొకపలమునూలును తీయవచ్చును.

అయిదుద్రోణముల శాలులనుండి పదియాఢకముల తండులములఁదీసి కలభమునకును, పదునొకండాఢకములఁదీసి మత్తగజమునకును, పదియాఢకములఁదీసి ఔపవాహ్యములకును, ఎనిమిదియాఢకములఁదీసి పదాతులకును, ఏడాఢకముల ముఖ్యులకును, ఆఱాఢకముల దేవీకుమారులకును, అయిదాఢకముల రాజునకును నాహారయోగ్యముగఁ జేయవలెను.

ఖండములుగాక పరిశుద్ధములగు తండులము లొకప్రస్థము, దానిలోనాలుగవవంతు సూపము, సూపములోఁబదునాఱవభాగము లవణము, నాలుగవభాగము నెయ్యిగాని నూనెగాని యొక ఆర్యభక్తము (ఒకపూటకువలసిన భోజనము). అవరజాతిపురుషునకార్యుఁడు భుజించు సూపములో నాఱవవంతును అర్ధభాగము తైలమును నుండవలెను. పురుషులయాహారములో నాలుగవవంతుతగ్గించి స్త్రీలకును సగముతగ్గించి బాలురకును నియ్యవలెను.

ఇరువదిపలముల మాంసమునువండుటకు నర్ధకుడుంబము తైలము, ఒకపలము లవణము, ఒకపలము క్షారము, రెండుధరణికలకటుకము అర్ధప్రస్థముపెరుగు నుండవలెను. ఎక్కువ పరిమాణముగల మాంసమును వండునప్పుడుకూడ దీనినిబట్టి యితరపదార్థముల పరిమాణమును నిర్ణయింపవలెను. శాకముల కధ్యర్ధగుణముగను శుష్కశాకములకు ద్విగుణముగను పైపదార్థములఁ జేర్పవలెను.

హస్త్యశ్వముల యాహారపరిమితి తత్తత్ప్రకరణములలోఁ జెప్పఁబడును.

వృషభముల కొక ద్రోణము మినుములుగాని యొకద్రోణము యవలపులాకముగాని యాహారము. తక్కినవిషయములందశ్వములకువలెనేయని యెఱుంగునది. ఇదిగాక ఒకతులము నువ్వులపిండియు దశాఢకములపొట్టునువేయువలెను. మహిషములకును నుష్ట్రములకును

దీనికి రెండింతలయాహారము నియ్యవలెను. ఖరపృషతరోహితముల కర్ధద్రోణమాహారము. ఏణకురంగముల కొకయాఢకము. అజ ఏడకవరాహముల కొకయాఢకముగాని అర్థాఢకముగాని ధాన్యమాహారము. కుక్కలకొక ప్రస్థమోదనమును హంసక్రౌంచమయూరముల కర్థప్రస్థమును నాహారము. దీనినిపట్టి తక్కినమృగపశుపక్షివ్యాళముల కొకపూటకుఁగావలసిన యాహారమునూహించుకొనునది.

బొగ్గులను ఊకను లోహకర్మాంతములకును సున్నపురాళ్ళను కాల్చుటకుఁ గోష్ఠాగారాధ్యక్షుఁ డియ్యవలెను.

కణికల (నూకలులోనగువానిని) దాసకర్మకర సూపకరులకును వారికియ్యఁగ మిగిలినదానిని ఔదనిక అపూపకరులకు నియ్యవలెను.

త్రాసు మానభాండములు తిరగలి సన్నికల్లు రోకలిరోలు కుట్టక (ధాన్యమునుదంపు) యంత్రము రోచక(పిండివిసరు) యంత్రము పత్రికము చేట జల్లెడ గంప పెట్టె చీపురు లోనగునవి గృహోపకరణములు.

(ఇంటిని) శుభ్రముచేయువారు రక్షకులు మోయువారు కొలుచువారు కొలిపించువారు ఇచ్చువారు ఇప్పించువారు కొలతలలోఁగలిగిన నష్టమును వసూలుచేయువారు దాసులు కర్మకరులు— విష్టివర్గములోఁ జేరినవారు.

ధాన్యమును పాతరవేయవలెను. క్షారవస్తువులను గట్టివెంటులలోఁ జుట్టియుంపవలెను. తైలమును కుండలందును కాష్ఠకోష్ఠములందును లవణమును నేలమీఁదను నుంపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున కోష్ఠాగారాధ్యక్షుఁడను పదునైదవయధ్యాయము.

ఆదినుండి మొప్పదియాఱవ యధ్యాయము.



## 34 ప్రకరణము.

### పణ్యాధ్యక్షుఁడు.

స్థలపథజలపథములనుండి వచ్చునట్టి నానావిధములగు స్థలజ లజపణ్యములయొక్క సారాసారమూల్యభేదములను ప్రియాప్రియత్వ ములను విక్షేపసంక్షేపక్రయవిక్రయములను పణ్యాధ్యక్షుఁ డెఱుఁ గవలయును.

పలుచోట్లనుండి పణ్యముల నొకచోటికిఁ దెప్పించి వానిఖరీదు నుహెచ్చించి యాఖరీదులోనవి చెల్లుచున్నప్పుడు దీనికంటె హెచ్చు ఖరీదును పెట్టవచ్చును.

స్వభూమిజములగు రాజపణ్యములను నేకముఖముగఁ జేసి వ్య వహారమును స్థాపింపవలెను; పరభూమిజములగువానిని ననేకముఖ ములుగఁ జేసి వ్యవహరింపవలెను. ఉభయవిధములగు నీపణ్యముల ను ప్రజలకనుకూల మగునట్లమ్మించి ప్రజోపఘాతకరమగు నధికలా భమును వారింపవలెను. నిత్యముగావలసినవస్తువులకుఁ గాలోపరో ధమును ఏకముఖవ్యవహారమును కలిగింపరాదు. రాజపణ్యమును నై దేహకులు బహుముఖముగ నిర్ణీతక్రియమునకు విక్రయించి యం దువలన రాజునకువచ్చినవష్టమునకై వైధరణమునిచ్చికొనవలెను.

కొలిచియమ్ము పణ్యములనుండి పదునాఱవవంతును తూని కప్రకారమమ్ము వానినుండి యిరువదవవంతును లెక్కించివిక్రయిం చువానినుండి పదునొకండవవంతును వ్యాజినిపుచ్చికొనవలెను.

పరభూమిజములగు పణ్యములఁదెచ్చువారి ననుగ్రహించి వా నిఁదెప్పింపవలెను. నావికులకును సార్థవాహులకును లాభముకలుగు నట్లు పరిహారము నియ్యవలెను. సహకారులైనవారికిఁ దక్కినవిదే శవర్తకులపై ధనవిషయకములగు నభియోగములఁ దేరాదు.

పణ్యాధిష్ఠాతలు ఏకచ్ఛిద్రవిధానమగు కఱ్ఱపెట్టెలోఁ బణ్య మూల్యమునంతను నేకముఖముగఁ జేసి దివసాష్టభాగమందు 'ఇంతవి క్రయింపఁబడినది ఇంతమిగిలినది' అని పణాధ్యక్షునికిఁ ముద్రాముద్రా

భాండసహితముగ నరికింపవలెను.

ఇదియంతయు స్వరాష్ట్రమందలి వ్యాపారమును సంబంధించి నవిషయము.

పరరాష్ట్రములతోఁ జేయఁబడువ్యాపారము— పణ్యప్రతిప ణ్యముల యర్ఘమూల్యమును దెలిసికొని పరరాష్ట్రమందియ్యవలసి న శుల్కవర్తని అతివాహిక గుల్మ తరదేయములును భక్తభాగవ్య యములును పోఁగాశేషించు ధనలాభమెంతయో చూడవలెను. ధన లాభములేనిపక్షమున భాండనిర్వహణరూపమగు పణ్యప్రతిపణ్యలాభ మేమైననుండిన దానిని తెలిసికొనవలెను. పిమ్మట నాలుగవవంతుప ణ్యమును భయరహితమగుమార్గమున స్థలవ్యవహారమునకై పంపవ లెను. (ఇట్లు పణ్యమును కొనిపోవువాఁడు) అటవీ అంతపాలపురము ఖ్య రాష్ట్రముఖ్యులతో వారియనుగ్రహము సంపాదించుటకు స్నేహ ము చేయవలెను. పన్నును పణ్యమును నాపదలనుండి రక్షించుకొన వలెను. తాను వెళ్లఁదలఁచిన ప్రదేశమును చేరలేనపుడు (మఱియె క్కడనైన) సర్వదేయవిశుద్ధముగ (పణ్యమును) విక్రయింపవచ్చును. లేక వారిపథమున దానిని మఱియొక రాష్ట్రమునకుఁ దీసికొనపో వచ్చును.

(వెళ్లునపుడు) యానమునకగుఖర్చులు మార్గమందువలయు బత్తెము పణ్యప్రతిపణ్యార్ఘప్రమాణము యాత్రాకాలము భయప్రతీకారము పణ్యపట్టణచరిత్రములు వీనినిగుఱించిన విషయములనెఱుంగవలెను.

నదీపథములందలి వ్యవహారచరిత్రముల నెఱింగి ఏపట్టణముల నుండిలాభమువచ్చునో యాపట్టణములకువెళ్లి లాభములేనిపట్టణము ల వదలిపెట్టవలెను.

ఇది అధ్యక్షప్రచారమునఁ బణాధ్యక్షుఁడను

పదునాఱవయధ్యాయము.

ఆదినుండి ముప్పదియేడవ యధ్యాయము.



## 35 ప్రకరణము.

### కుప్యాధ్యక్షుడు.

కుప్యాధ్యక్షుండు ద్రవ్యవనపాలుర మూలమునఁ గుప్యమును తెప్పించి ద్రవ్యవనములందుఁ గర్మాంతములఁ జేయించుచు ఆపత్ప్రమయములందుఁ దప్పఁ దక్కినప్పుడు ద్రవ్యవనములను హాని చేయువారియెడఁ దగిన దండమును అత్యయమును నిర్ణయింపవలెను.

### కుప్యవర్గము.

శాక (టేకు) తినిశ ధన్వన అర్జున మధూక తిలక సాల శింశుప అరిమేద రాజాదన శిరీష ఖదిర సరళ తాల సర్జ అశ్వకర్ణ సోమవల్క కశామ్ర ప్రియక ధవాదులు సారదారువర్గము. ఉటజ చిమియ చవ వేణు వంశ సాతిన కంటక భల్లూకాదులు వేణువర్గము. వేత్ర శీకవల్లి వాశి శ్యామలతా నాగలతాదులు వల్లీవర్గము. ముంజ బల్బజాదులు రజ్జుసామగ్రినిచ్చును. తాళీ తాళ భూర్జములు పత్రవర్గము. కింశుక కుసుంభ కుంకుమములు పుష్పవర్గము. కందమూలఫలాదులు ఔషధవర్గము. కాలకూట వత్సనాభ హాలాహల మేషశృంగ ముస్త కుష్ఠ మహావిష వేల్లితక గౌరార్ద్ర బాలక మార్కట హైమవత కాళింగక దారదక అంకోల ఉష్ట్రకాదులు విషవర్గము. కుంభగతములగు సర్పములు కీటములుగూడ విషవర్గములోనివే. గోధా సేరక ద్వీపి శింశుమార సింహ వ్యాఘ్ర హస్తి మహిష చమర సృమర ఖడ్గ గోమృగ గవయములయొక్కయు మఱికొన్నివిధములగు మృగపశుపక్షివ్యాళములయొక్కయుఁ జర్మాస్థిపిత్తస్నాయుదంతశృంగఖురపుచ్ఛములు కుప్యద్రవ్యములు.

కాలాయస తామ్ర వృత్త కాంస్య సీస త్రపు వైకృంతక ఆరకూటాదులు లోహములు.

విదళ (బెరడు) మృత్తికామయములు భాండములు అంగార తుషభస్మములు మృగపశుపక్షివ్యాళీవాటములు కాష్ఠతృణవాటములుకూడ కుప్యవర్గములోనివి.

జీవనాధారమగునట్టియుఁ బురరక్షకుపయుక్తమగునట్టియుఁ బహువిధములగు కర్మాంతములను కుప్యాధ్యక్షుఁడు బహిరంతఃప్రదేశములందుఁ గుప్యోపజీవులచేఁ జేయింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున కుప్యాధ్యక్షుఁడను
పదునేడవయధ్యాయము
ఆదినుండి ముప్పదియొనిమిదవయధ్యాయము.



## 36 ప్రకరణము.

### ఆయుధాగారాధ్యక్షుఁడు.

ఆయుధాగారాధ్యక్షుఁడు యుద్ధోపయుక్తములును దుర్గకర్మోపయుక్తములును పరపురాభిఘాతికములునునగు చక్రయంత్ర ఆయుధప్రావరణ ఉపకరణములను వానిని తెలిసిన కృతకర్ములగు కారుశిల్పులచే నియమితప్రమాణకాలవేతనములకుఁ జేయింపవలెను. వానిననుకూలమగు ప్రదేశమునందుంచి అప్పుడప్పుడు స్థానపరివర్తనమును ఆతపప్రదానమును చేయుచు ఊష్మోపస్నేహక్రిములచే నుపహతములగు వానిని మఱియొకప్రదేశమునకు మార్చుచుండవలెను. వాని జాతిరూపలక్షణప్రమాణ ఆగమమూల్యనిక్షేపములను తెలిసికొనవలెను.

సర్వతోభద్ర జామదగ్న్య బహుముఖ విశ్వాసఘాతి సంఘాటీ యానక పర్జన్యక అర్ధబాహు ఊర్ధ్వబాహువులు స్థిరయంత్రములు. పంచాలిక దేవదండ సూకరికా ముసల యష్టి హస్తివారక తాలవృంత ముద్గర గదా స్పృక్తలా కుద్దాల ఆస్ఫాటిమ ఔద్ఘాటిమ శతఘ్ని త్రిశూల చక్రములు చరయంత్రములు. శక్తి ప్రాస కుంత హాటక భిండివాల శూల తోమర వరాహకర్ణ కణయ కర్పణ త్రాసికాదులు హలముఖములు. తాల చాప దారవ శార్ఙ్గమయములకు వరుసగ కార్ముక కోదండ ద్రూణ ధనుస్సులను నామములు.

మూర్వ అర్క శణ గవేధు వేణు స్నాయువులనుండి అల్లెత్రాళ్లు చే యఁబడును. వేణు శర శలాకా దండాసన నారాచములు ఇషుభేద ములు. ఛేదన భేదన తాడనములకై వానిముఖములు ఆయస అస్థి దారుమయములై చేయఁబడును.

నిస్త్రింశ మండలాగ్ర అసియష్టులు ఖడ్గభేదములు. ఖడ్గమ హిషవారణవిషాణములు దారువు వేణుమూలములు. వీనిని కత్తిపి డులకై యుపయోగింతురు.

పరశు కుఠార పట్టస ఖనిత్ర కుద్దాల చక్ర కాండచ్ఛేదనము లు చూరకత్తివర్గములోనివి.

యంత్రపాషాణ గోష్పణపాషాణ ముష్టిపాషాణములును తిర గలియు సన్నికల్లును (తక్కిన) ఆయుధములు.

ఖురశృంగసహితములగు కర్కట శింశుమార ఖడ్గ ధేనుకహ స్తిగోచర్మములచే జేయఁబడు పట్టకవచసూత్రకములు లోహజాలి కలును వర్మములలోని భేదములు. శిరస్త్రాణ కంఠత్రాణ కూర్పాస కంచుక వారవారణ పట్టనాగోదరిక వేరి చర్మ హస్తికతాలమూలధ మనికా కవాట కిటిక అప్రతిహతవలాహకాంతములు ఆవరణములు.

హస్తిరథాశ్వముల కుపకరించు నలంకారములును సన్నాహ కల్పనాసాధకములును ఉపకరణము లనఁబడును.

ఐంద్రజాలిక ఔపనిషదికకర్మలను కర్మాంతకర్మలను శోధిం చుచుండవలెను.

ఆయుధేశ్వరుఁడాయుధములగుఱించి యవసరమును సంగ్ర హితమును ప్రయోగమును చెడిపోవుటను క్షయవ్యయములను తెలి సికొనవలెను.

ఇది అధ్యక్షప్రచారమున ఆయుధాగారాధ్యక్షుఁడను
పదునెనిమిదవ యధ్యాయము
ఆదినుండి ముప్పదితొమ్మిదవయధ్యాయము.



## 37 ప్రకరణము.

### తులామానపౌతవము.

పౌతవాధ్యక్షుఁడు పౌతవకర్మాంతములను చేయింపవలెను.

పదిమాషములుగాని అయిదు గురివిందగింజలుగాని యొకసువర్ణమాషకము. పదునారుమాషములు లోకసువర్ణము లేక యొక కర్షము. నాలుగుకర్షములు లోకపలము. యెనుబదియెనిమిది తెల్లావాలు ఒకరూప్యమాషకము. పదునారు తెల్లావాలుగాని ఇరువది శైబ్యములుగాని ఒకధరణము. ఇరువది తండులము లోకవజ్రధరణము.

అర్థమాషకము మాషకము రెండుమాషకములు నాలుగుమాషకములు ఎనిమిదిమాషకములు రెండుసువర్ణములు ఎనిమిది సువర్ణములు పదిసువర్ణములు ఇరువదిసువర్ణములు ముప్పదిసువర్ణములు నలువదిసువర్ణములు నూఱుసువర్ణములు— ఇవి తులామానభేదములు. ధరణముల విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

ఇనుముతోఁగాని మగధమేకలదేశజములగు ఱాళ్లతోఁగాని యెండతగులుటచే క్షయముచెందనట్టియు నీటిలోఁదడుపుటచే వృద్ధిని పొందనట్టియుఁ [illegible]ాంతరములతోఁగాని ప్రతిమానములను (తూచుటకై కావలసినగుండ్లు) చేయవలెను.

ఆఱంగుళములపొడవును ఒకపలముబరువునుగలలోహముతో నొకత్రాసునుచేసి, పొడవునెనిమిదేసి యంగుళములచొప్పునను బరువునొక్క పలముచొప్పునను వృద్ధిపఱచి పదివిధములగు త్రాసులను తయారుచేయవలెను వానికి రెండువైపులనుకాని ఒకవైపున మాత్రముగాని శిక్యము (తక్కెడ) నుంచవచ్చును.

ముప్పదియైదుపలములబరువును డెబ్బదిరెండంగుళముల పొడవునుగల లోహముతో సమవృత్తమను త్రాసును చేయింపవలెను. దానికి అయిదుపలముల బరువుగల మండలము (తక్కెడ) నొక

దానినికట్టి సమకరణమొనర్పవలెను. పిమ్మటఁ గవణమునుమొదలుకొని యొకకర్షముచొప్పున హెచ్చించుచు పలమువఱకును, పలము మొదలు పదిపండ్రెండు పదునైదు ఇరువదిపలములవఱకు నొక్కొక పలముచొప్పున వృద్ధి చేయుచు నటుతర్వాతఁ బదేసిపలములచొప్పు ననూటివఱకు హెచ్చించుచు సమకరణముగావించి, అక్షములందు (అయిదు పది మొదలగు స్థానములందు) నాందీ రేఖను గీయవలెను.

దీనికంటె ద్విగుణమగు లోహభారమును తొంబదియాఱంగుళముల పొడవునుకల పరిమాణియను మఱియొక త్రాసును చేయించి దానిపై నిరువది యేఁబది నూఱు పలములపరిమితిని తెలుపుగుర్తులను పెట్టవలెను.

ఇరువదిపలము లొకభారము. పదిధరణము లొకపలము. అట్టిపలములు నూఱైనచో నొకఆయమాని.

వ్యావహారికీ భాజనీ అంతఃపురభాజనీ యనుత్రాసులు క్రమముగ నొకటికంటెనొకటి అయిదేసిపలములు తక్కువగనుండును. వానిసంబంధమైన పలముకూడ సగము ధరణమంతటను దగ్గుచుండును. దానిలోనియుత్తరలోహపుబరువు రెండేసిబలముల చొప్పునను వానిపొడవు ఆఱేసియంగుళములచొప్పునను తగ్గియుండును.

మాంసము లోహము లవణము మణులు నుతప్పఁ దక్కినవానిని మొదటిరెండుత్రాసులలోఁ దూచినప్పుడు (రాజునకు) అయిదు పలము లధికముగనియ్యవలెను.

ఎనిమిదిమూరలపొడవునుకలిగి గుర్తులతోను ప్రతిమానములతోనుకూడినట్టి కాష్ఠముతోఁ జేయఁబడిన త్రాసును మయూరపదాధిష్ఠితముగఁ జేయవలెను.

ఇరువదియైదుపలముల వంటచెఱుకొక ప్రస్థముతండులముల నుడికించును. ఎక్కువతక్కువలకు నిష్పత్తినిచూచుకొనవలెను.

తులాప్రతిమానము లిట్లెటింగింపఁబడినవి. తర్వాత, రెండువందలపలముల ధాన్యమాషము లొకఆయమానద్రోణము. నూట

మెనుబది యేడున్నరపలముల ధాన్యమాషము లోకవ్యావహారికద్రోణము. నూటయెబ్బదియైదుపలము లోకభాజనీయద్రోణము. నూటయఱువది రెండున్నరపలము లోక అంతఃపురభాజనీయద్రోణము. వీనిలో ఆఢకప్రస్థకుడుంబములు క్రమముగ నొకదానికంటె మఱియొకటి నాలుగవవంతు తక్కువగనుండును.

పదునాఱుద్రోణము లొకవారి. ఇరువదిద్రోణము లొకకుంభము. పదికుంభము లొకవహము.

శుష్కసారదారుమయముగను సమముగను కొలువఁబడుపదార్థములోని నాలుగవవంతు శిఖయందుఁబట్టునట్లుగను కొలపాత్రిమును నిర్మింపవలెను. రసపదార్థము నంతఃశిఖముగఁ గొలుచుకొనవలెను. సురా పుష్ప ఫల తుషాంగారసుధలను కొల్చునపుడు శిఖామానమునకు ద్విగుణముగ వృద్ధినిచ్చుకొనవలెను.

ఒకద్రోణముయొక్క ఖరీదొకటింబావుపణము. ఆఢకము ఖరీదు ముప్పావుపణము. ప్రస్థముయొక్క ఖరీదు ఆఱుమాషకములు. ఒకకుడుంబము ఖరీదొకమాషకము. రసాదులమానముల మూల్యములు వీనికి రెండురెట్లు. ప్రతిమానముల ఖరీదిరువదిపణములు. తులయొక్క మూల్యము దీనిలో మూడవవంతు. తులామానములపైముద్రవేయుటకు నాలుగుపణములఁ బుచ్చుకొనవలెను. ముద్రలేనిమానముల నుపయోగించువారిపై నిరువదియేడుంబావు పణముల దండమును విధింపవలెను. ముద్రవేయుటకై ప్రతిదినము నొకకాకణిని పౌతవాధ్యక్షుని కిచ్చుకొనవలెను.

తప్తఘృతమునకు ముప్పదిరెండవభాగమును, తైలమునకు అఱువదినాలుగవభాగమును తప్తవ్యాజిగ నిచ్చుకొనవలెను. ద్రవపదార్థముల కేఁబదియవవంతు మానస్రావముగ నిచ్చుకొనవలెను.

కుడుంబ అర్ధకుడుంబ పాదకుడుంబ అష్టభాగకుడుంబ మానములనుకూడఁ జేయింపవలెను.

ఎనుబదినాలుగు కుడుంబములనెయ్యి అఱువదినాలుగుకుడుం

ఖములనూ నెయు నొకవారకము. వారకములో నాలుగవవంతొక ఘటిక.

ఇది అధ్యక్షప్రచారమున తులామానపౌతవమను
పందొమ్మిదవయధ్యాయము.
ఆదినుండి నలువదియవ యధ్యాయము.



## 38 ప్రకరణము.

### దేశకాలమానము.

మానాధ్యక్షుఁడు దేశకాలమానముల నెఱుంగవలయును.

ఎనిమిది పరమాణువులొక రథచక్రవిప్రుట్టు

ఎనిమిది విప్రుట్టులు ఒకలిక్ష.

ఎనిమిదిలిక్షలు ఒకయూకామధ్యము.

ఎనిమిదియూకామధ్యములు ఒకయవమధ్యము.

ఎనిమిది యవమధ్యములు ఒకయంగుళము; లేక మధ్యమపరిమితిగల పురుషుని మధ్యమాంగుళియొక్క మధ్యప్రకర్షము గూడ నొకయంగుళమే.

నాలుగంగుళములు ఒకధనుర్గ్రహము.

ఎనిమిదియంగుళములు ఒకధనుర్ముష్టి.

పండ్రెండంగుళములు ఒకవితస్తి, (లేక) ఒకఛాయాపౌరుషము.

పదునాలుగంగుళములు ఒకశమము, (లేక) ఒకపరిరయము, (లేక) ఒకపదము.

రెండువితస్తులు ఒకయరత్ని (లేక) ఒకప్రాజాపత్యహస్తము.

ధనుర్గ్రహముహెచ్చుగల రెండువితస్తులు ఒకపౌతవవివీతమానహస్తము.

ఒకధనుర్ముష్టితోఁగూడిన రెండువితస్తులకు కిష్కువనియుఁ గంసమనియుఁ బేర్లు.

ఱంపపుఁగోఁతగాండ్రు కమ్మఱపుఁబనివాండ్రును నుపయోగించుకిష్కువు నలువది రెండంగుళములు. స్కంధావారదుర్గ రాజాంతఃపురములఁ గొలుచుటలో నుపయోగింపఁబడు కిష్కువుకూడ నిదియే

కూప్యవనహస్తము ఏఁబదినాలుగంగుళములు. రజ్జుమానఖాతపౌరుషమును వ్యామము ఎనుబదినాలుగంగుళములు. నాలుగరత్నులకు దండమనియు ధనుస్సనియు నాళికయనియుఁ బౌరుషమనియుఁ బేర్లు. నూటయెనిమిదియంగుళములొక గార్హపత్యధనుస్సు పథిప్రాకారమానముకూడ నిదియే. అగ్నిచిత్యుల పౌరుషముకూడ నిదియే. బ్రహ్మదేయసత్రాది ధర్మక్షేత్రముల మానమగు దండము షట్కంసపరిమితము.

పదిదండములు ఒకరజ్జువు. రెండురజ్జువులు ఒకపరిదేశము. మూఁడురజ్జువులు ఒకనివర్తనము. ఒకపరిక్ష ద్విదండాధికమగు త్రిరజ్జుకము ఒకబాహువు. వేయిధనుస్సులు ఒకగోరుతము. నాలుగు గోరుతములు ఒకయోజనము.

దేశమానములిట్లు తెలుపఁబడినవి. ఇటుపైఁ గాలమానములు చెప్పఁబడును.

త్రుటి లవము నిమేషము కాష్ఠ కల నాళిక ముహూర్తము దివసపూర్వాపరభాగములు రాత్రి పక్షము మాసము ఋతువు అయనము సంవత్సరము యుగమని కాలమానములు. రెండు త్రుటులొక లవము. రెండులవములొక నిమేషము. అయిదునిమేషములొక కాష్ఠ. ముప్పదికాష్ఠలొక కళ. నలువదికళలొక నాళిక; (లేక) నాలుగు సువర్ణమాషకములనుండి నాలుగంగుళములు పొడవుగల తీగెనుదీసి దానివలయపుమధ్యరేఖయంతటి వలయముగల కుంభచ్ఛిద్రమునుండి ఆఢకపరిమితిజలము క్రిందఁబడుటకుఁ బట్టుకాలము నాళిక. రెండు నాళికలొక ముహూర్తము. పదునైదుముహూర్తముల పరిమితిగల దినరాత్రములు చైత్ర ఆశ్వయుజమాసములందుండును. తర్వాత

ఆఱుమాసములలో మూఁడుముహూర్తముల కాలముచొప్పున హెచ్చుచుఁ దగ్గుచునుండును.

నీడ యెనిమిదిపౌరుషములు పొడవున్నప్పుడు పగటిలోఁ బదునెనిమిదవభాగము, ఆఱుపౌరుషములున్నప్పుడు పదునాలుగవభాగము. నాలుగుపౌరుషములున్నప్పుడు యెనిమిదవభాగము, రెండు పౌరుషములున్నప్పుడు ఆఱవభాగము, ఒకపౌరుషమున్నప్పుడు నాలుగవభాగము, ఎనిమిదంగుళములున్నప్పుడు పదిలో మూఁడవభాగము, నాలుగంగుళములున్నప్పుడు యెనిమిదిలో మూఁడవభాగము, ఛాయ లేనప్పుడు మధ్యాహ్నము. దినముపరావృత్తమగునప్పుడుగూడ నిట్లే యని యెఱుంగునది.

ఆషాఢమాసమందలి మధ్యాహ్నముమాత్రము నష్టచ్ఛాయముగనుండును. తర్వాత శ్రావణాదిషణ్మాసములలోని మధ్యాహ్నచ్ఛాయ రెండేసియంగుళములచొప్పున వృద్ధియగును. మాఘాది మాసములలో నిది రెండేసి యంగుళములచొప్పున క్షయమగుచుండును.

పదునైదహోరాత్రములొక పక్షము. చంద్రవృద్ధిగలది శుక్లపక్షము. చంద్రక్షయముగలది బహుళపక్షము. రెండుపక్షములొకమాసము. ముప్పదియహోరాత్రము లొకప్రకర్మ మాసము. ముప్పదిన్నరయహోరాత్రము లొకసౌరమాసము. ఇరువదితొమ్మిదిన్నర యహోరాత్రము లొకచంద్రమాసము. ఇరువదియేడహోరాత్రము లొకనక్షత్రమాసము. ముప్పదిరెండహోరాత్రము లొకమలమాసము. ముప్పదియైదహోరాత్రము లశ్వవాహులమాసము. నలువది యహోరాత్రములు హస్తివాహులమాసము.

రెండుమాసము లొకఋతువు. శ్రావణభాద్రపదములు వర్ష ఋతువు, ఆశ్వయుజకార్తికములు శరదృతువు, మార్గశీర్షపుష్యములు హేమంతము, మాఘఫాల్గునములు శిశిరము, చైత్రవైశాఖమాసములు వసంతము, జ్యేష్ఠాషాఢములు గ్రీష్మము. ఉత్తరాయ

ణము శిశిరముతోఁ బ్రారంభమగును. దక్షిణాయనము వర్షఋతు వుతోఁ బ్రారంభమగును. సంవత్సరమునకు రెండయనములు. ఐయిదుసంవత్సరము లొకయుగము.

సూర్యుఁడొక్కొకదినములో నఱువదవభాగముచొప్పున నెకఋతువులో నొకదినము హరించును. చంద్రుఁడుకూడ నట్లేచేయును. ఈవిధముగ మూఁడుసంవత్సరములకుమధ్యనొక యధికమాసము వచ్చుచుండును. అధికమాసము తొలుత గ్రీష్మములో వచ్చి నఘొడలఁదిరిగి అయిదవసంవత్సరాంతమందు వచ్చును.

ఇది అధ్యక్షప్రచారమున దేశకాలమానము
నిరువదవ యధ్యాయము
ఆదినుండి నలుపదియొకటవయధ్యాయము.



## 39 ప్రకరణము.

### శుల్కాధ్యక్షుఁడు.

శుల్కాధ్యక్షుఁడు ప్రాఙ్ముఖముగఁగాని యుదఙ్ముఖముగఁగాని మహాద్వారసమీపమున శుల్కశాలను తత్సూచకధ్వజమును స్థాపింపవలెను. నలుగురైదుగురు శుల్కగ్రాహకులు, సార్థోపయాతులగు వణిజులను ‘‘మీరెవరు ? ఎక్కడివారు? ఎంతవిలువగల పణ్యమును తెచ్చియున్నారు ? మీపణ్యముల కభిజ్ఞానముద్ర యెచ్చట వేయఁబడినది?’’ అనువిషయములగుఱించి ప్రశ్నలడిగి జవాబుల వ్రాసికొనవలెను.

ముద్రలేనివారివద్దనుండి దేయద్విగుణమును, కూటముద్రగలవారివద్దనుండి యెనిమిదిరెట్లును వసూలుచేసి ముద్రను చెడఁగొట్టిన వారిని ఘటికాస్థానమందుంపవలెను. రాజముద్రను పరివర్తనము చేసినపుడును పణ్యమునకు వేఱగునామమిడినపుడును ఒక్కొకమాటకు ఒకటింబావుపణము దండము

ధ్వజమూలమందుంపఁబడిన పణ్యవస్తువులయొక్క ప్రమా

మును విలువను వైదేహకులు, ఇది దీనిప్రమాణము, ఇదిదీనిఖరీదు, దీనినెవరుకొనెదరు ? అని మూఁడుమార్లుపలికి కావలసినవారికి దాని నియ్యవలెను. కొనువారిపోటీవలన మూల్యమువృద్ధిమైనయెడల శుల్కముతోఁగూడనామూల్యవృద్ధినికోశమునకర్పింపవలెను. శుల్కభయమువలనఁబణ్యప్రమాణపణ్యమూల్యములను తగ్గించిచెప్పినపుడు తదతిరిక్తమునుకాని శుల్కాష్టగుణమునుకాని రాజునకియ్యవలెను. పణ్యమునుంచినభాండము తక్కువరకమైనదని మూల్యమును తగ్గించినపుడును సారభాండమును ఫల్గుభాండమని మోసముచేయునపుడును శుల్కాష్టగుణమునిచ్చుకొనవలెను. ప్రతిక్రేతభయమువలనఁ బణ్యమూల్యమును హెచ్చుచేయునపుడా హెచ్చుమూల్యమునుకానిశుల్కద్విగుణమునుకాని రాజుతీసికొనవలెను. దానిని కప్పిపుచ్చిన శుల్కాధ్యక్షునికి శుల్కాష్టగుణము దండము. కావునఁ బణ్యములను (హెచ్చుతగ్గులులేక) తూఁచియుఁగొలిచియు లెక్కించియు విక్రయింపవలెను.

ఫల్గుభాండములవిషయమునను అనుగ్రాహ్యులవిషయమునను తర్కించిపనిచేయవలెను. శుల్కమునియ్యక శుల్కస్థానమునతిక్రమించివెళ్లువారికి శుల్కమున కెనిమిదిరెట్లు దండము.

పథికులును ఉత్పథికులును దీనినంతయుఁ దెలిసికొనవలెను.

వైవాహికము అన్వాయనము (అరణము) ఔపయానికముల గుభాండములను యజ్ఞకృత్యప్రసవనైమిత్తిక దేవతారాధన చౌళ ఉపనయన గోదానవ్రత దీక్షాదులం దుపయోగింపఁబడు భాండములను శుల్కముఁబుచ్చుకొనక విడిచిపెట్టవలెను.

వ్రిక్కమార్గములనుండి వెళ్లువారికి స్తేయదండము. కృతశుల్కమగు పణ్యముతోఁగలిపి యకృతశుల్కమగుదానిని తీసికొనిపోవునట్టియుఁ (ముద్రలేని) బణ్యపుటమునుభేదించి ముద్రగలిగినదానితో గలిపి తీసికొనిపోవునట్టియువర్తకులు పణ్యద్రవ్యమునేగాక దానికిసమానమగుమూల్యమునుకూడ రాజునకిచ్చుకొనవలెను. గోమయ

పలాలములతోఁ బరిమాణముచేసి శుల్కస్థానములందుండి పణ్యము లఁదీసికొనిపోవువానికి నుత్తమసాహసదండము.

శస్త్ర వర్మ కవచ లోహ రథ రత్న ధాన్య పశువులనుఁ దీసికొనిపోఁగూడదని శాసింపఁబడినవానినితీసికొనిపోవువానికిశిక్షనువిధించి పణ్యనాశనముచేయవలెను. వీనిలో దేనినైనఁ దీసికొనివచ్చినప్పుడు ఉచ్ఛుల్కముగ శుల్కశాలకుబయటనే విక్రయింపవలెను.

పణ్యవహనము (బండి) పైనొకటింబావుపణమును నేకఖురముపై నొకపణమును పశువులపై నర్ధపణమును క్షుద్రపశువులపైఁబాదపణమును అంశభారముపైనొకమాషికను అంతపాలుఁడు పుచ్చుకొనవలెను. వర్తకులనష్టాపహృతద్రవ్యముల నంతపాలుఁడు పుచ్చుకొనవలెను.

విదేశములనుండివచ్చుపణ్యముల సారఫల్గుతలను పరిశీలించి వానిపైనభిజ్ఞానముద్రనుచేసి అధ్యక్షునికడకుఁబంపవలెను; లేక వైదేహకవ్యంజనునొకనిని అర్ఘపరిమాణములను తెలుపుటకై రాజుకడకంపవలెను. దీనినెఱింగినతర్వాత రాజుతనసర్వజ్ఞత్వప్రకటనమునకై శుల్కాధ్యక్షునకు సార్థపరిమాణముగ నీవిషయమును తెలుపవలెను. తర్వాతనధ్యక్షుఁడు వర్తకసంఘముతో, ఇదివీనిసారభాండము. కావున దీనిని దాపరాదు. రాజపరిభావమిట్టిదని తెలిసికొనుఁడు, అని చెప్పవలెను. ఫల్గుభాండమునుదాచినప్పుడుశుల్కాష్టగుణమును సారభాండమునుదాచినప్పుడు సర్వాపహారమును దండములు

రాష్ట్రపీడాకరమైనట్టియు ఫలరహితమైనట్టియు భాండములను దేశములోనికి రానియకుండఁ జేయవలెను. మహోపకారములగు పణ్యములను దుర్లభబీజములను శుల్కమును పుచ్చుకొనకయే దేశములోనికిఁ బ్రవేశపెట్టవలెను.

ఇది అధ్యక్షప్రచారమున శుల్కాధ్యక్షుఁడను
నిరువదియొకటవయధ్యాయము
ఆదినుండి నలుబదిరెండవయధ్యాయము.



## 40 ప్రకరణము.

### శుల్కవ్యవహారము.

బాహ్యాభ్యంతరములగు విదేశీయపణ్యములపై నిష్క్రమప్రవేశములందు శుల్కమును వసూలుచేయవలెను. ప్రవేశ్యము (ఇతరదేశములనుండివచ్చునట్టివి) లపై మూల్యపంచభాగమును పుష్పఫలశాకమూలకందపల్లిక్య బీజశుష్కమత్స్యమాంసములపై నాఱవభాగమును వసూలుచేయవలెను. శంఖవజ్రమణిముక్తాప్రవాళహారములవిషయమున వానినిగుఱించిన కర్మపరిమాణకాలవేతనఫలనిష్పత్తులనెఱింగినపురుషులచే శుల్కనిర్ణయమును చేయింపవలెను. క్షౌమదుకూలక్రిమితాన కంకట హరితాళ మనశ్శిలాహింగులుక లోహవర్ణధాతువులపైని చందనఅగరు కటుకకిణ్వ ఆవరణములపైని, సురా దంత అజినీ క్షౌమదుకూలనికర ఆస్తరణ ప్రావరణ కిమిజాతములపైని, అజైళకరోమవంతములపైని దశభాగముగాని పంచదశభాగముగాని శుల్కము. వస్త్ర చతుష్పద ద్విపద సూత్ర కార్పాస గంధ భైషజ్య కాష్ఠ వేణు వల్కల చర్మ మృద్భాండములకును, ధాన్య స్నేహ లవణ క్షార మద్య పక్వాన్నాదులకును నిరువదవభాగముగాని యిరువదియైదవభాగముగాని శుల్కము.

శుల్కమందైదవభాగము ద్వారాదేయము. దేశోపకారమగునపుడీద్వారాదేయమును వసూలుచేయరాదు. పణ్యములను వాని జన్మస్థలములందమ్మరాదు. జన్మభూములగుగనులదగ్గఱనే ధాతుపణ్యములను గొనునప్పుడాఱువందలపణములు దండము. పుష్పఫలవాటములనుండి పుష్పఫలములఁగొనునపుడు ఏఁబదినాలుగు పణములును, తోటలనుండియే శాకకందములఁగొనునపుడు ఏఁబదియొకటిముప్పావుపణములును, క్షేత్రములనుండియే సర్వసస్యములఁగొనునపుడు ఏఁబదిమూఁడుపణములును దండము. వ్యవసాయమువలనఁగలుగు ఫలితముపై నొకటిగాని యొకటిన్నరపణముగాని దండము విధింపవలెను.

కావున దేశ జాతి చరిత్రభేదములననుసరించి క్షేత్రపాత్ర పణ్యములకు శుల్కమునేర్పఱచి నేరముఁజేయువారిపై దండనమును విధింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున శుల్కవ్యవహారమను
యిరువదిరెండవయధ్యాయము.
ఆదినుండి నలువదిమూఁడవ యధ్యాయము.

## 41 ప్రకరణము.

### సూత్రాధ్యక్షుఁడు

సూత్రాధ్యక్షుఁడు నిపుణులగువారిచే సూత్రవర్మవస్త్రరజ్జు వ్యవహారములను చేయింపవలెను.

విధవలు అంగహీనులు కన్యలు ప్రవ్రాజితలు దండప్రతీకారమునుకోరువారలు వేశ్యమాతలు వృద్ధులగురాజదాసీజనము సేవచేయలేనిదేవదాసీజనము మొదలగువారిచేత ఊర్ణా వల్క కార్పాస తూల శణ క్షౌమములఁ జేయింపవలెను.

సూత్రములయొక్క శ్లక్ష్ణత స్థూలతమధ్యమతల ననుసరించి వేతనములు గల్పింపవలయును. మఱియు సూత్రముల బహ్వల్పప్రమాణములఁబట్టి వీరికి తైలామలకోద్వర్తనముల ననుగ్రహించుచుండవలెను. సెలవురోజులలోఁ బ్రత్యేకముగ వేతనగౌరవములనొసంగి వారిచేఁ బనులఁజేయింపవచ్చును. సూత్రములుతగ్గునపుడుతద్ద్రవ్యానుగుణముగ వేతనమునుతగ్గింపవలెను.

కర్మప్రమాణముఁబట్టి యింతకాలములో నింతవేతనమునకై పనిచేయుదుమని యంగీకరించిన కారువులచేఁగూడ నధ్యక్షుఁడువారితోఁగలిసి యీపనులను చేయింపవచ్చును.

క్షౌమదుకూలక్రిమితానరాంకవకార్పాససూత్రములను వస్త్రములను చేయువారికి గంధమాల్యములనిచ్చి మఱికొన్ని బహుమానములఁగూడఁజేసి గౌరవించుచుఁ బనిచేయింపవలెను. వివిధములగు

వస్త్రాస్తరణప్రావరణములను తయారుచేయించుచు నిపుణులగుశిల్పులచేఁ గవచములఁ జేయింపవలెను.

తమ్ముఁదామె పోషించుకొనవలసిన ప్రోషితవిధవలు అంగహీనులు కన్యకలు స్వగృహములనుండి వెలుపలికివచ్చు స్థితియందు లేనప్పుడు దాసీజనులమూలమున వారికిఁబనులఁ గల్పింపవచ్చును. ప్రతిప్రాతఃకాలమునందును స్వయముగ సూత్రశాలకు సూత్రములఁ దెచ్చినవారికి వేతనములనిచ్చి వారిసూత్రభాండములఁ బుచ్చుకొనవలెను.

సూత్రపరీక్షకుఁ గావలసినంత వెలుతురుమాత్రము నిలుపవలెను. (అధ్యక్షుఁడు) స్త్రీలముఖసందర్శనమును చేసినప్పుడును అన్యకార్యములగుఱించి వారితో సంభాషించినప్పుడును పూర్వసాహసదండమునకుఁ బాత్రుఁడగును. వేతనకాలాతిపాతముగావించునప్పుడును పనిచేయనివారికిఁగూడ వేతనములనిచ్చునప్పుడును మధ్యమదండమునకుఁబాత్రుఁడు.

వేతనముదీసికొని పనిచేయనివారికిని (వారికిచ్చినసూత్రముల విషయమై) భక్షణ అపహరణ అవస్కందనములఁ జేయువారికిని అంగుష్ఠచ్ఛేదనమే దండము. కర్మకరులపరాధముచేసినప్పుడు అపరాధమునకనుగుణముగ వారివేతనములు తగ్గింపవలెను.

రజ్జువులను వర్మములనుచేయువారితో నధ్యక్షుఁడుకలిసి వారిచే వరత్రాదులఁజేయింపవలెను. సూత్రములతో రజ్జావరత్రములను వేత్రవేణువులతో యానయుగ్యోపయుక్తములగు సాన్నాహ్య బంధనీయములను చేయింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున సూత్రాధ్యక్షుఁడను
నిరువదిమూడవ యధ్యాయము.
ఆదినుండి నలువదినాలుగవ యధ్యాయము.



## 42 ప్రకరణము.



### సీతాధ్యక్షుఁడు.

సీతాధ్యక్షుఁడు కృషితంత్రగుల్మవృక్షాయుర్వేదజ్ఞుఁడై తన్ని పుణులతోఁ గలిసి సర్వధాన్యపుష్పఫలశాకకందమూల వాల్లిక్యక్షౌమ కార్పాసబీజములను కాలాతిక్రమణముగాకుండ సంపాదించి పలుమా బహుశః దున్నఁబడిన స్వభూమియందు దాసకర్మకరదండప్రతికర్తలచేఁ జల్లింపవలెను. కర్షణయంత్ర ఉపకరణబలీవర్దములను కర్మారకుట్టాక (వడ్రంగి) మేదకరజ్జువర్తక సర్పగ్రాహులయొక్క సహాయమును తగుసమయములందుఁ గర్షకులకిచ్చి వారిపనులకు నష్టములేకుండున ట్లు ప్రవర్తింపవలయును. వారి (లోపము) వలనఁ గృషిఫలముచెడినప్పుడు ఫలహానికిసమముగ దండమును విధింపవలెను.

జాంగలప్రదేశములందుఁ బదునాఱుద్రోణముల వర్షమును అనూపములందిరువదినాలుగు ద్రోణములును వ్యవసాయోపయుక్తములగు నశ్మకదేశములందుఁ బదుమూఁడున్నరద్రోణములును అవంతీదేశమందిరువదిమూఁడు ద్రోణములును అపరాంతమందును హిమవత్పర్వతప్రాంతమందును కాలువలమూలమున వ్యవసాయముజరుగు ప్రదేశములందును కాలానుగుణముగ నపరిమితముగను కురియుచుండును. (కావలసినవర్షములో) మూఁడవవంతు శ్రావణకార్తికములందును తక్కిన రెండువంతులు నీరెంటికిమధ్యనుండు మాసములందును పడినచో దానినిసుషమారూప (సమరూపవర్షము) మని వ్యవహరింతురు.

బృహస్పతియొక్క స్థానగమనగర్భాధానములనుండియు శుక్రుని ఉదయాస్తమయచారములనుండియు సూర్యునిప్రకృతివికృతులనుండియు వర్షోపలబ్ధి నెఱుఁగవలయును. సూర్యునిఁబట్టి బీజసిద్ధిని బృహస్పతినిఁబట్టి స్తంభకారిత్వమును శుక్రునిఁబట్టి వర్షమును తెలిసికొనవలయును.

సప్తాహిక మేఘములు మూఁడు; కణశీకరములగునవి యెనుబది; ఆతపమేఘము లఱువది. ఇవి యేవృష్టికారణములు. వాతాతపయోగములు లేక మూఁడుమార్లు దున్నుటకువీలగునట్లుగ వర్షమే ప్రదేశమందుఁబడునో యాప్రదేశము సస్యసమృద్ధమగునని చెప్పవచ్చును.

కావున నధ్యక్షుఁడధికోదకాల్పోదకములఁబట్టి సస్యములఁ జల్లింపవలెను.

శాలివ్రీహికోద్రవతిలప్రియంగుదారకవరాకములు పూర్వసస్యములు (వర్షకాలారంభమునఁజల్లఁదగినవి). పెసలు మినుములు శైబ్యములు మధ్యసస్యములు. కుసుంభ మసూర కుళుద్థ యవ గోధుమ కలాయ అతసి సర్షపములు అపరసస్యములు. లేక ఋతువులననుసరించియైనను సస్యముల నేయవచ్చును.

వాపాతిరిక్తములగుభూములను సగముభాగమున కిచ్చి వేయవచ్చును.

స్వవీర్యోపజీవులగు కర్షకులు మిక్కిలికష్టపడి సాగుచేయవలసిన స్వభూములనుండితప్పఁ దక్కినవాపాతిరిక్తములగు పొలములనుండి నాలుగవవంతుగాని అయిదవవంతుగాని తమకునష్టము లేకయుండునట్లు యథేష్టముగఁగాని యియ్యవచ్చును.

వ్యవసాయమునకై నీటిని కూడలు వేసి చేతితోఁదీసికొనిపోవువారు ఫలితమందయిదవభాగమును, భుజములపైఁ దీసికొనిపోవువారు నాలుగవభాగమును, నదులు సరస్సులు కూపములు తటాకములు మొదలగువానినుండి యేతములమూలమునఁ దీసికొనిపోవువారు నాలుగవభాగమును ఉదకభాగమును పన్నుగనిచ్చికొనవలెను.

అధ్యక్షుఁడు కర్మకరులసంఖ్యనుపట్టియు ఉదకపరిమాణముననుసరించియుఁ గేదారహైమనగ్రైష్మికసస్యముల సేవ్యముచేయింపవలెను.

శాల్యాదులు శ్రేష్ఠములగుసస్యములు. షండములు మధ్యములు. చెఱకు మిక్కిలిహీనమైనది; దీనినిసాగుచేయుట మిక్కిలి

బాధకరము గను వ్యయకరముగను నుండును.

ఫేనాఘాతప్రదేశములందు వల్లీ (దోసబీర మొదలగు) ఫలములను, ప్రివాహాంతప్రదేశములందు బిప్పలి మృద్వీక ఇక్షువులను కూపపర్యంతములందు శాకమూలములను, లోతగు (తటాకములయడుగుభాగములు) ప్రదేశములందు హారీతకములను సేద్యము చేయవలెను. దుక్కి చాళ్ళ రెంటికిని నడుమ గంధభైషజ్యఉశీర హీరబేర పిండాలుకాదులను వేయవలెను. స్థల్యములును అనూపములునునగు ఔషధులను వానికిఁదగినభూములందుఁ బెంపవలెను.

ధాన్యబీజముల నేడురాత్రులు మంచునందును నెండయందును నుంపవలెను కోశీధాన్యముల నిట్లే మూఁడురాత్రులనుంపవలెను. చెఱకులోనగు కాండబీజములకు మధుఘృత సూకరవసలను పేడనుపూయవలెను. కాల్చినగోతులలోఁ బశువులయెముకలను పేడనువేసి వృక్షజాతులకు దోహదముఁజేయవలెను. కటువులును పచ్చివియునగు మత్స్యములను స్నుహిక్షీరమునుకలిపి మొలకలు పుట్టినతర్వాతఁ జల్లవలెను.

ప్రత్తిగింజలను పాముపొరను కాల్చి వానిధూమమును వ్యాపింపఁజేసినచో నచటసర్పములుండవు.

బీజములఁ జల్లుటకుఁబూర్వము సువర్ణోదకసంపృక్తమగు నొక పిడికిలిబీజములఁ జేతిలోనుంచుకొని, "ప్రజాపతయేకాశ్యపాయ దేవాయనమః; సదా సీతామేధ్యతాం దేవీబీజేషు ధనేషు చండవాతహా" అనుమంత్రము నుచ్చరించిచల్లవలెను.

చేసినకృషికిఁదగినట్లు పాలకదాసకర్మకరులకు భక్తమునియ్యవలెను. వారికి నెలకొకటిఁబాప్రపణముజీతము. కర్మానురూపముగఁ గారువులకు భక్తవేతనముల నొసఁగవలెను. దేవకార్యములనిమిత్తము ప్రకీర్ణములగుపుష్పఫలములను, ఆగ్రాయణకర్మలనిమిత్తము ప్రకీర్ణములగు వ్రీహియవములను శ్రోత్రియులు తపస్వులు తీసికొనవచ్చును. ఉంఛవృత్తులగువారు రాశిమూలమును గ్రహింప

వచ్చును.

వృష్టిఫలించిన సస్యములనెల్లఁ గాలాతిక్రమము సేయక వేఱొక చోటికిఁ దీసికొనిపోవలయును. తెలివిగలవాఁడు కొంచెము పొట్టునైనను క్షేత్రమందుంచఁగూడదు. (సస్యముల) కోసినవెంటనే మఱియొక చోట నొకదానితో నొకటి కలియకుండునట్లును శిఖరము లెత్తుగనుండునట్లును కుప్పలవేయవలయును. కళ్ళములన్నిటి నొకచోట చేర్పుచుకొని అందలివారు అనగ్నికులుగను సోదకులుగను నుండవలెను.

ఇది అధ్యక్షప్రచారమున సీతాధ్యక్షుఁడను
నిరువదినాలుగవ యధ్యాయము.
ఆదినుండి నలువదియైదవ యధ్యాయము.



## 43 ప్రకరణము.

### సురాధ్యక్షుఁడు.

దుర్గజనపదస్కంధావారములందు సురాధ్యక్షుఁడు నిపుణులగు సురాకిణ్వవ్యవహారులచే సురాకిణ్వములఁ దయారు చేయింపవలెను. విక్రయక్రయములననుసరించి వ్యవహారము నేకముఖముగఁగాని, యనేకముఖముగఁగాని చేసి (నిర్ణీతప్రదేశముఁ దప్ప) వేఱుచోట వ్యవహరించు కర్తృక్రేతృవిక్రేతల కాఱువందల పణములు దండము విధింపవలెను. సురను గ్రామములనుండి వెలుపటికిఁ దీసికొనిపోఁగూడదు. సురనమ్మునట్టి దుకాణము లొకటి నొకటి కలియక యుండవలెను.

కర్మలందు నిర్దేశింపఁబడిన నౌకరులు పరిహానము పొందకుండునట్లుగను ఆర్యులగువారు మర్యాదాతిక్రములు కాకుండునట్లుగను తీక్ష్ణులత్యంతోత్సాహులు కాకుండునట్లుగను పావుకుడుంబముగాని, ఒకకుడుంబముగాని అర్థకుడుంబముగాని, అర్థప్రస్థముగాని వారుపానాగారములలోఁ దాగవచ్చును. జ్ఞాతశౌచులగువారు సురనింటికిఁ దీసికొనిపోవచ్చును.

(సాధారణముగ) అందఱును పానాగారమందే త్రాగవలెను. (మోసపుచ్చి యపహరించిన) నిక్షేప ఉపనిధి ప్రయోగ అపహృత అనిష్టోపగతద్రవ్యములఁ బట్టుకొనుటకై పానముచేసినతర్వాత వారి నచటనే నిలిపి అస్వామికములగు హిరణ్యకుప్యముల నపహరించినవారి నేదియో యొకమిష చేఁబైకిఁ బిలిచి పట్టుకొనవలెను. అతివ్యయకర్తల ను అనాయతివ్యయులనుకూడ నిక్షేపచేయవలెను.

క్రీతసురను తక్కువఖరీదునకమ్మఁగూడదు. దుష్టసురను వేఱొకచోటనమ్మవచ్చును; లేక వేతనములకుబదులుగ దాసకర్మకరులకుఁగాని (గుఱ్ఱములు మొదలు) వాహనపానీయముగఁగాని సూకరపోషణమునకైగాని యుపయోగింపవచ్చును.

అనేకకక్ష్యములను విభక్తములగు శయనాసనములను గంధమాల్యోదకములను తత్తదృతువునకనుగుణమగు సుఖవస్తువులను కలిగియుండునట్లుగఁ బానాగారముల నిర్మింపవలెను. పానాగారములందు గూఢచారులుదాగియుండి క్రేతలుచేయువ్యయము నిత్యమా నైమిత్తికమా యనువిషయమును ఆగంతువులచర్యను మత్తసుప్తులగువారి యలంకారాచ్ఛాదనహిరణ్యములను తెలిసికొనవలెను. అలంకారాదులలోనేదైన పోయినపుడు వర్తకుఁడు దానినిచ్చుకొనుటయే గాక దానిమూల్యమంతటి దండమునుకూడ భరింపవలెను. సంవృతములగు కక్ష్యావిభాగములందు వర్తకులుండి వేశలరూపులగు స్వదాసీజనములమూలమున అవాస్తవ్యులు ఆర్యరూపులు మత్తసుప్తులగునాగంతువుల భావములను తెలిసికొనవలెను

మేదక ప్రసన్న ఆసవ అరిష్ట మైరేయ మధువులలో:- ఒకద్రోణముదకము అర్ధాఢకము తండులములు మూఁడుప్రస్థములుకిణ్వమును కలిపితయారుచేసినచో మేదకమగును. పండ్రెండుప్రస్థములపిండి అయిదుప్రస్థములకిణ్వము పుత్రకత్వక్ఫలము జాతిసంభారమును కలిపి తయారుచేసినచో ప్రసన్నయోగమేర్పడును. ఒకతులము వెలగపండు అయిదుతులములపంచదార ఒకప్రస్థముతేనెయుఁ గలిపినచో

ఆసవమగును. ఇందొక్కొకపాలెక్కన నాసిపచ్చో శ్రేష్ఠమగు నాసవము నియు నొక్కొకపాళ్ళుతగ్గించిన చోఁ గనిష్టముగు నాసవమనియు నెఱుంగనగు.

వ్యాధులలో నుపయోగింపఁదగిన యరిష్టములఁ బ్రత్యేకముగఁ జికిత్సకులనుండి తెలిసికొనునది.

మేషశృంగీవృక్షపుబెరడుకషాయము గుడము పిప్పలి మరీచి త్రిఫలములఁగలిపిన చో మైరేయమగును. గుడయుక్తములగు సురలన్నిటిలోఁ ద్రిఫలసంభారము గలుపవలెను.

ద్రాక్షపండ్లరసము మధువు. ఆయా దేశములఁబట్టిదానికిఁగాపిశాయనము హారహూరకమనునామధేయములు గలవు.

పచ్చిదిగాని యుడుకఁబెట్టినదిగాని యొకద్రోణముమినుపపిండి మూఁడు రెట్లు తండులములు ఒకకర్షము మోరటాదులును కలిపిన చోఁగిణ్వమగును.

పాఠ లోధ్ర తేజోవతి ఏలా వాలుక మధు మధురసా ప్రియంగు దారుహరిద్రా మరీచీ పిప్పలీప్రభృతులు అయిదుకర్షములు మేదకప్రసన్నములలో సంభారములుగ నుపయోగింపవలెను. మధూకనిర్యూహయుక్తమగుకటుశర్కర ప్రసన్నమున కింపగురంగును కలుగఁజేయును. ఒకకర్షము చోచచిత్రకవిలంగగజపిప్పలులు, రెండుకర్షములు క్రముకమధుకముస్తాలోధ్రములుకలిపి తయారుచేసిన చో ఆసవసంభారమగును. పైవానిలోఁ బదియవభాగమును జేర్చి తయారుచేసిన చో బీజబంధమగును. శ్వేతసురకుఁ బ్రసన్నాసంభారమును కూర్పవలెను.

మామిడిపండ్లతోఁజేసినసుర రసోత్తరముగఁగాని బీజోత్తరముగఁగాని యుండవచ్చును. అది సంభారముతోఁ గలిసినప్పుడు మహాసురయగును.

మోరటా పలాశ దత్తూర కరంజ మేషశృంగి క్షీరవృక్షకషాయములతో భావనచేయఁబడినట్టియు, లోధ్ర చిత్రక విలంగ పాఠా

ముస్తా కళాయ యవ దారుహారిద్రి ఇందీవర శతపుష్ప అపామార్గ సప్తపర్ణ నింబములకల్కము సగము చేర్పఁబడినట్టియు, ఒకపిడికిలి దగ్ధకటశర్కరతోఁ గూడినట్టియు రాజపేయమగునొకకుంభము సుర త్రాగుటకుఁ జాలరుచిగ నుండును. అయిదుపలములశర్కర దీనికి రసవృద్ధినికలిగించును.

ఏవైనగొప్పకార్యములసమయమున గృహస్థులు వారిగృహములందే శ్వేతసురనుకాని ఔషధములనిమిత్తమై అరిష్టమునుకాని మఱియేవిధమగుసురనుకాని తయారుచేసికొనవచ్చును. ఉత్సవసమాజయాత్రాసమయములందు నాలుగుదినములవఱకు సుర నుతయారుచేయునధికారమును నలయువారికియ్యవచ్చును. అట్టివారినుండి ప్రవ్యాణాంతముగదినమునకింతయని యత్యయమునుపుచ్చుకొనవలెను.

స్త్రీలునుబాలురును సురాకిణ్వవిచయములఁ జేయవలెను.

సురాధ్యక్షుఁడుగాక తక్కినవారు తయారు చేసినసురనమ్మువారు నూటికైదుచొప్పున శుల్కమునిచ్చుకొనవలెను.

సురమేదకఅరిష్టమధుఫలామ్లఆమ్లసీధువుల దినవిక్రియమును మానహిరణ్యములవలనఁ గలిగినవ్యాజిని తెలిసికొని, యుచితమగు వైధరణమునువిధించి వ్యాపారమును (అధ్యక్షుఁడు) నడిపింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున సురాధ్యక్షుఁడను
నిరువదియైదవయధ్యాయము.
ఆదినుండి నలువదియాఱవ యధ్యాయము.



## 42 ప్రకరణము.

### సూనాధ్యక్షుఁడు.

రాజసంరక్షణలోనున్నట్టియు రాజసంరక్షితవనములో నివసించునట్టియు మృగపశుపక్షిమత్స్యములకు బంధవధహింసలుగలిగించువారికి నుత్తమదండమును, అభయవనములఁ బ్రవేశించుగృహస్థులకు

మధ్యమదండమును విధింపవలెను. క్రౌర్యస్వభావములేని మత్స్యపక్షులకు బంధవధహింసలు గలిగించువారికి నిఱువదియాఱుముప్పావుపణముల దండము మృగపశువుల నీవిధముగఁ జేయువారి కింతకు రెండురెట్లు దండము.

[క్రూరస్వభావముగలజంతువు లితరులచేఁ బట్టుకోఁబడినయెడల వానిలో నాఱవవంతును శుల్కముగఁ దీసికొనవలెను. మత్స్యపక్షుల పైని మృగపశువుల పైని దశభాగముగాని యంతకంటెనధికముగాని శుల్కమును విధింపవలెను.

పక్షిమృగములలో నాఱవవంతును నభయవనములందు స్వేచ్ఛగనుండుటకై విడిచిపెట్టవలెను.

సముద్రమునందలి హస్త్యశ్వపురుషవృషగర్దభాకృతిగలిగిన మత్స్యములను, సారసనాదేయతటాకకుల్యోద్భవములగు మత్స్యములను, క్రౌంచఉత్క్రోశకదాత్యూహహంసచక్రవాకజీవంజీవకభృంగరాజచకోరమత్తకోకిలమయూరశుకమదనశారికలులోనగు విహారపక్షులను, మంగళకరములగు నితరపక్షిమృగములను హింసాబాధలనుండి రక్షింపవలెను. దీనినతిక్రమించినవారికిఁ బూర్వసాహసదండము.

అప్పటికప్పుడు చంపఁబడిన మృగపశువులమాంసము నెముకలనుండి వేఱుపఱచి యమ్మవలెను. ఎముకలతోఁగలిపి యమ్మినచోఁ బ్రతిపాతము నిచ్చుకొనవలెను. తూనికలో మోసపుచ్చినయెడల నష్టమున కెనిమిదిరెట్లిచ్చుకొనవలెను.

పైవానిలో వత్సములు వృషభములు గోవులు నవధ్యములు. వీనిని వధించువానికి నేఁబదిపణములు దండము. ఇతరమృగములను సహితము క్లిష్టపఱచి చంపువానికి నేఁబదిపణములుదండము.

సూనాగారమునకు వెలుపలఁ జంపఁబడిన మృగములయొక్క మాంసమును శిరస్సు పాదము ఎముకలు లేనట్టిమాంసమును దుర్గంధమగునట్టిదానిని స్వయముగఁ జచ్చినట్టిదానిమాంసమును విక్రయింపరాదు. వీనిని విక్రయించువారికిఁ బండ్రెండుపణములుదండము.

అభయవనములలోని పశుమృగవ్యాళమత్స్యములు దుష్టము లైనప్పుడు వానినచటనుంపక బయిటికిఁదీసికొనివెళ్ళి బంధించి వధింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున సూనాధ్యక్షుఁడను
నిరువదియాఱవ యధ్యాయము.
ఆదినుండి నలువదియేడవయధ్యాయము.



## 43 ప్రకరణము.

### గణికాధ్యక్షుఁడు.

గణికాన్వయమందుఁ బుట్టినదానిఁగాని అట్లుపుట్టనిదానిఁగాని రూపయౌవనశిల్పసంపన్నయగునొకతెను వేయిపణములిచ్చి గణికనుగాఁ జేయవలెను. అందులో సగము వేతనమునిచ్చి ప్రతిగణికనొకదానిని నియోగింపవలెను. అట్టిగణిక పాఱిపోయినప్పుడును మృతి చెందినప్పుడును దానికుమార్తెగాని చెల్లెలుగాని దానిస్థానమందుఁజేరి యావేతనమును పుచ్చుకొనవచ్చును. లేక దానితల్లి ప్రతిగణికనొకదానిని నేర్పఱుపవచ్చును. వీరెవ్వరు లేనప్పుడు దానియాస్తినిప్రభువు హరింపవచ్చును.

ఛత్రభృంగారవ్యజనశిబికాపీఠికారథసేవలలో విలాసాతిశయముకలుగుటకై వేశ్యాజనమును సౌభాగ్యాలంకారములఁబట్టి కనిష్ఠమధ్యమోత్తమవిభాగములుగ నేర్పఱచి వేలకొలఁదిపణముల వేతనమును వారికియ్యవలెను.

సౌందర్యముచెడినగణికను వేశ్యమాతగనొనర్పవలెను.

గణికానిష్క్రయ మిరువదినాలుగువేలపణములు. గణికాపుత్రనిష్క్రయము పండ్రెండువేలపణములు.

ఎనిమిదివత్సరముల వయస్సునుండి గణిక రాజునొద్దఁగుశీలవకర్మ (గానము) చేయుచుండవలెను.

భగ్నభోగలగు గణికలచేతను, దాసీజనముచేతను కోష్ఠాగారమహానసములందుఁ బనులఁజేయింపవలెను.

రాజసేవనుమాని మఱియొకనికి స్వాధీనమైనగణిక నెలకొకటింబావుపణముచొప్పున (దండము) నిచ్చుకొనవలెను.

గణికల భోగమును దాయమును ఆయవ్యయములను ఆయతిని గణికాధ్యక్షుఁడు నిర్ణయించి వారుచేయు నతివ్యయకర్మల వారింపవలెను.

మాతృహస్తమందుఁదప్ప దక్కినచోట నెక్కడనైనఁదనయాభరణములనుంచినగణికకు నాలుగుంబావుపణములు దండము. తనయాస్తినివిక్రయించినప్పుడును తాకట్టుఁబెట్టినపుడును పఁబదింబావుపణముల దండము. వాక్పారుష్యము గావించినగణిక కిరువదినాల్గుపణములును దండపారుష్యమొనర్చినదానికి ద్విగుణమును కర్ణచ్ఛేదముచేసినదాని కేఁబదింబావు పణములును వేఱుగ నొకటిన్నరపణమును దండము.

అకామయుఁ గుమారియు నగుగణికను బలాత్కరించినవానికుత్తమసాహసదండము. సకామయగు గణికాకుమారితో సంబంధముగలిగినవానికిఁ బూర్వసాహసదండము. అకామయగుగణికను నిర్బంధపఱచువానికిని అట్టిదానినిబలాత్కరించి తీసికొనివెళ్ళిపోవువానికినిఁ బ్రాణవిదారణముచే విరూపిగఁజేయువానికిని సహస్రపణములదండము. మఱియు స్థానవిశేషములఁబట్టి నిష్క్రియద్విగుణమువఱకు దండమువిధింపవచ్చును. అధికారస్థానమందుండుగణికను కొట్టినవానికి నిష్క్రియత్రిగుణమును, వేశ్యమాతను వేశ్యాకుమార్తెను రూపదాసీజనమును కొట్టినవానికి నుత్తమసాహసమును దండములు.

అన్నిదండవిషయములందును తొలిమాఱొనర్చిన యపరాధమునకుఁ బ్రథమశిక్షయు రెండవమాఱుచేసినచో ద్విగుణమును మూఁడవమాఱుచేసినచోఁ ద్రిగుణమును నాలుగవమాఱిట్టానుసారముగను దండము విధింపవచ్చును.

రాజాజ్ఞచేఁ (రాజు చేను హాహరింపఁబడిన) బురుషునిఁ బొందుటకిష్టపడని గణికను వేయి దెబ్బలుకొట్టవలెను, లేక అయిదు వేలపణములదండమునైన విధింపవలెను. భోగద్రవ్యము గ్రహించియుఁ బురుషునిఁబొందుట కిష్టపడనిగణికకు నాద్రవ్యమునకు ద్విగుణముగు దండము పురుషుఁడు వ్యాధితుఁడుగను దోషిగను నుండునపుడు తప్పదక్కినపుడు నింటనుండియు వానితో భోగింపనిగణికకు భోగద్రవ్యాష్టగుణదండము.

పురుషునిఁ జంపుగణికకు నగ్నిప్రవేశముగాని యుదకప్రవేశముగాని దండము.

గణికయొక్క ఆభరణద్రవ్యములనపహరించు పురుషునికి భోగద్రవ్యమునియ్యని వానికిని అష్టగుణదండము.

గణిక తనభోగద్రవ్యమును ఆయతిని భోగపురుషుని యధ్యక్షునకుఁ దెలుపవలెను.

నటనర్తకగాయక వాదక వాగ్జీవనకుశీలవప్లవకసౌభికచారణులవిషయమునను స్త్రీలను కార్చు వారివిషయమునను వ్యభిచరించు స్త్రీలవిషయమునను కూడ నిట్లేయని యెఱుంగునది.

పైఁజెప్పిన నటనర్తకాదులు విదేశములనుండి వచ్చినపుడు పంచపణములనిచ్చికొని ప్రదర్శనాధికారమును పొందవలెను.

రూపాజీవలు నెలకు రెండురోజుల భోగద్రవ్యమును రాజున కిచ్చికొనవలెను.

గణికలకును దాసీజనమునకును రంగోపజీవులకును గీత వాద్య పాఠ్యనృత్తనాట్యాక్షరచిత్రవీణా వేణుమృదంగపరచిత్తజ్ఞాన గంధమాల్యసంయూహానసంపాదనసంవాహన వేశికకలాజ్ఞానముల బోధించువానికిని రాజమండలమునుండి యాజీవము చేర్చుచుండవలెను.

గణికాపుత్రులను సర్వతాళాపచారులలో ముఖ్యులగు రంగోపజీవులుగఁ దయారుచేయవలెను.

సంజ్ఞాభాషాంతరజ్ఞులైనవారిభార్యలను వారివంటి మఱికొందఱిని శత్రుప్రచారులకుఁ బ్రమాదఘాతములు గలిగించుటకై ప్రయోగింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున గణికాధ్యక్షుఁడను
నిరువదియేడవ యధ్యాయము.
ఆదినుండి నలువదియెనిమిదవ యధ్యాయము.

## 44 ప్రకరణము.

### నావధ్యక్షుఁడు

నావధ్యక్షుఁడు సముద్రసంయానతరప్రచారములను నదీముఖతరప్రచారములను స్థానీయాదుల సమీపమందుండు దేవసరముల యొక్కయు విసరములయొక్కయు నదులయొక్కయుఁ దరప్రచారములను పరీక్షించుచుండవలెను.

వీనితీరమందుండు గ్రామములవారు క్లృప్తమగుపన్నును, మత్స్యబంధకులు షడ్భాగమగునౌకహాటకమును, వర్తకులు పట్టణములలో మామూలుగనుండు శుల్కభాగమును, రాజనౌకలలోఁ బ్రయాణము చేయువారు యాత్రావేతనమును నిచ్చికొనవలెను.

ముక్తాగ్రాహకులును (రాజనౌకనుపయోగించునపుడు) నౌకహాటకమునియ్యవలెను, లేదాస్వనౌకలనుపయోగించుకొనవలెను. శంఖముక్తాధ్యక్షులు ఖన్యధ్యక్షుఁడొనర్చుపనులఁ జేయవలెను. పట్టణాధ్యక్షుని నిబంధనలను పణ్యపట్టణముల యాచారముల ననుసరించుచు (నావధ్యక్షుఁడు) వానిపనుల నెరవేర్పవలెను.

మూఢవాతాహతమగునావను (దరిజేరినపుడు) తండ్రివలె రక్షింపవలెను. ఉదకమువలన నష్టపడినపణ్యములను శుల్కరహితములుగఁగాని అర్ధశుల్కములుగఁగానిచేసి యాత్రాకాలమందుఁ బణ్యపట్టణములకంపవలెను.

ప్రయాణముచేయుచు (దారిలో) రేవునుచేరినట్టి నౌకలనుండి శుల్కమును పుచ్చుకొనవలెను. హింసాకరములును, శత్రుదేశ

మునుపట్టిపోయినట్టియుఁ బణ్యాపట్టణసాంప్రదాయములకువిరుద్ధముగఁ బ్రవర్తించునట్టియు నౌకలను నాశముగావింపవలెను.

హేమంతగ్రీష్మఋతువులందుసహితము పూర్తిగఁబ్రవహించునదులలో నడచునావలందు శాసనికనియామకదాత్రరశ్మిగ్రాహకఉత్సేచకు లధిష్ఠించియుండవలెను. వర్షాకాలమునందుమాత్రము ప్రవహించు క్షుద్రనదులలోనినావలను క్షుద్రులునడిపింపవచ్చును.

రాజద్రోహులు దాటకుండునట్లు రేవులందుఁ గట్టుదిట్టముల నేర్పఱుపవలెను.

అకాలమందును అతీర్థమందును చరించువానికిఁ బూర్వసాహసదండము. కాలమందును తీర్థమందునుకూడ రాజాజ్ఞ లేకదాటువానికి నిరువదియాఱుముప్పావుపణములు దండము. కైవర్తకులును, కాష్ఠతృణభారపుష్పఫలవాటషండములఁ దీసికొనిపోవువారికిని గోపాలకులకును దూతలననుసరించుటకై పోవువారికిని సేనలకువలయు భాండపరియోగపరిచారములఁదీసికొనిపోవువారికిని సొంతపడవలలో దాటువారికిని అనూపగ్రామములవారికిని బీజభక్తద్రవ్యోపస్కారములను తీసికొనిపోవువారికిని పైదండము విధింపరాదు.

బ్రాహ్మణపరివ్రజితబాలవృద్ధవ్యాధితశాసనహారులును గర్భిణులును నావధ్యక్షునిముద్రనుపొంది (అత్యయమునియ్యకయే) దాటవచ్చును.

మామూలుగ రాష్ట్రములలోనికివచ్చు విదేశవర్తకులు వారియర్థప్రమాణములతోఁగూడ రేవుపట్టణములఁ బ్రవేశింపవచ్చును.

పరునిభార్యను, కన్యను, ధనమును నపహరించినవానిని శంకితుని ఆవిగ్నుని భాండము లేవియులేనివానిని బరువగు గొప్పభాండమునుకప్పి మోసికొనిపోవువానిని అప్పటికప్పుడు క్రొత్తవేషమువేసికొనినవానిని అదివఱకుండినవేషమును దీసివేసికొనినవానిని ప్రవ్రజితుని వ్యాధితునివలెనటించువానిని భయమునటించువానిని సారభాండశాసనశస్త్రాగ్నుల గూఢముగఁ గొనిపోవువానిని విషహస్తుని

ముద్ర లేక దీర్ఘప్రయాణము చేయువానిని పట్టుకొనవలెను.

భారముతోఁగూడిన క్షుద్రపశువునకును మనుష్యునకును శుల్కము ఒకమాషకము. శిరోభార కాయభారములకును గవాశ్వములకును రెండుమాషకములు. ఉష్ట్రమహిషములకు నాలుగుమాషకములు. లఘుయానమున కయిదుమాషకములు. గోలింగము (ఎద్దు బండి) న కాఱుమాషకములు. పణ్యభారమునకుఁ బావుమాషకము. దీనినిపట్టియితరభారముల శుల్కము నెఱుంగునది. మహానదులయందు దీనికిరెండురెట్లు శుల్కము.

అనూపగ్రామములలోనివారు క్లృప్తముగుభక్తవేతనమును నావికులకు నియ్యవలెను. ప్రాంతదేశములలోఁ బడవలనడుపువారుశుల్కమును అతివాహికమును వర్తనిని పుచ్చుకొనవలెను. ముద్రలేక ప్రయాణముచేయువారిభాండములను వారుతీసికొనవచ్చును.

అతిభారమువలనఁగాని అకాలాతీర్థములందు నడుపుటచేతఁగాని పురుషోపకరణహీనమగుటచేతఁగాని అసంస్కృతమగుటచేతఁగాని నావభగ్నమగునపుడు (ప్రయాణికులకుఁగలుగు నష్టవినష్టముల నధ్యక్షుఁడిచ్చుకొనవలెను.

ఆషాఢశుద్ధాష్టమి మొదలు కార్తీకమాసములోపుగఁ బడవలునడుపవలెను. అధ్యక్షుఁడు కార్మికునినుండి తద్వ్యవహారమును తెలిసికొని రోజువారిగ నాదాయమును పుచ్చుకొనుచుండవలెను.

ఇది అధ్యక్షప్రచారమున నావధ్యక్షుఁడను
నిరువదియెనిమిదవ యధ్యాయము.
ఆదినుండి నలువదితొమ్మిదవ యధ్యాయము.



## 45 ప్రకరణము.

### గోధ్యక్షుఁడు.

గోధ్యక్షుఁడు వేతనోపగ్రాహికము కరప్రతికరము భగ్నోత్సృష్టకము భాగానుప్రవిష్టకము వ్రజపర్యగ్రము నష్టము వినష్టము క్షీర

ఘృతసమూహములను పరిశోధించుచుండవలెను.

నూరేసిధేనువులకొక గోపాలుఁడు, ఒకపిండారకుఁడు (గడ్డిని వేయువాఁడు), ఒకదోహకుఁడు, ఒకమంథకుఁడు, ఒకలుబ్ధకుఁడు చొప్పున వేతనములనుపుచ్చుకొనుచు గోవులఁబాలింపవలెను. క్షీరఘృతములఁబుచ్చుకొనుపద్ధతినైనచో వీరు వత్సలనుహింసింతురుగావున వేతనోపగ్రాహికము యుక్తము.

సంవత్సరమున కెనిమిదివారకములఘృతము, ఒకపణికము పుచ్ఛము, ఒకపణికమంకచర్మము నిచ్చునియమముతో సమానసంఖ్య గలజరద్ధేనుగర్భిణీప్రష్ఠౌహీవత్సతరులనునూటిని పాలించుపద్ధతిఁ గరప్రతికరమని పేరు.

సమానసంఖ్యగల వ్యాధిత న్యంగ అన్యదోహ దుర్దోహ పుత్రఘ్నులగు ధేనుశతమును వానినుండిలభించు క్షీరాదులలో భాగమిచ్చుపద్ధతిని పాలించుట భగ్నోత్సృష్టకము.

పరచక్రాటవీభయమువలనఁ బశువుల గోధ్యక్షుని స్వాధీనము చేసి వానికిదశభాగమిచ్చుట భాగానుప్రవిష్టకము.

వత్సలు వత్సతరులు దమ్యములు వహులు వృషములు ఉక్షములు పుంగవములు యుగవాహనములు శకటవహములు వృషభములు మాంసమునకుపయుక్తములగుమహిషములు పృష్ఠస్కంధవాహులగుమహిషములు వత్సికలు వత్సతరులు ప్రష్ఠౌహులు గర్భిణులు ధేనువులు అప్రజాతలు వంధ్యలు బత్తెలు ఒకటిరెండునెలలుగానిదానికంటెఁదక్కువుగాని వయస్సుగల వత్సలు వత్సికలు— అనిపశువులఁ దరిగతివారిగవిభజించుట; మాసద్విమాసజాతచోరహృతము, అన్యయూథప్రవిష్టము, అవలీనము (అగపడకుండుట)— ఇట్టివి నష్టములు.

పంక విషమ వ్యాధి జరాతోయాధారములవలనను వృక్షతట కాష్టశిలలవలనను పిడుగు కూరమృగములు సర్పములు వ్యాళములు దావాగ్ని;— వీనివలనను ప్రమాదమునంభవించుట వినష్టము.

అట్టిప్రమాదమునుండి (గోవుల) తప్పించుచుండవలెను. హానిప్రము ట్టినదియని యెఱుఁగవలయును.

(పశువుల) చంపినవాఁడు చంపించినవాఁడు హరించినవాఁడు హరింపఁజేసినవాఁడును వధ్యులు. రాజాంకముగలపశువుల నితరపశువులకై మార్చునపుడు నాంకితకదాని విషయమునఁ బూర్వసాహసదండము విధింపవలెను.

చోరులచే నపహరింపఁబడిన పశువులలో స్వదేశీయములవానిఁ దెచ్చువానికిఁ బణితరూపమును పరదేశీయములఁ దెచ్చువానికి న ర్ధమును నియ్యవలెను.

బాలవృద్ధవ్యాధితములగు పశువులకు గోపాలకులు చికిత్సచేయవలెను.

శ్వగణసహాయముగల లుబ్ధకులచే స్తేనవ్యాళపరబాధాభయములు లేకుండఁజేసి, అరణ్యములను ఋత్వనుసారముగవిభజించి పశువులను వానియందు మేపవలెను. సర్పవ్యాళముల భయపెట్టుటకును మేయుప్రదేశము తెలియుటకును పిఱికిపశువులకు గంటలఁగట్టవలెను.

సమవ్యూఢతీర్థములును అకర్దమములును అగ్రాహములును (మొసళ్లులేనివి) నగు జలప్రదేశములలో నీటికొఱకై పశువులనుదింపి వానిని పాలింపవలెను.

స్తేనవ్యాళసర్పగ్రాహములచేఁ బట్టుకొనఁబడినట్టియు వ్యాధిజరలచే క్షీణించుచున్నట్టియుఁ బశువులనుగుఱించి యధ్యక్షునితో మనవిచేయవలెను; లేనిచోఁ బశుమూల్యము నిచ్చుకొనవలెను.

కారణమృతములగు గోమహిషముల యంకచర్మమును, అజావికముల కర్ణలక్షణసహితమగుచర్మమును, అశ్వఖరోష్ట్రముల పుచ్ఛమును అంకచర్మమును చిన్నజంతువులచర్మమును, (అన్నిటియొక్క) వస్తిపిత్తస్నాయుదంతఖురశృంగ అస్థులను (అధ్యక్షునకు) సమర్పింపవలెను.

పచ్చిదియు లేక యెండినదియునగు మాంసమునమ్మవలెను. మజ్జిగను కుక్కలకును పందులకును నుపయోగించుచుఁ గొంతభాగమును మాత్రము భోజనమునకై కంచుపాత్రలలో నుంచుకొనవలెను. శేషార్థమైన జున్నును తెలకపిండితోఁగలిపి యుపయోగించుకొనవలెను. పశువులనమ్మువాఁడు వెండినాణెములలో నాలుగవవంతును రాజున కియ్యవలెను. వర్షాశరద్ధేమంతఋతువులలో రెండుపూటలందును శిశిరవసంతగ్రీష్మములలో నొకపూటమాత్రముపితుకవలెను. ఈ ఋతువులలో రెండవమారుపితుకువానికిఁ అంగుష్ఠచ్ఛేదముదండము. కాలమునతిక్రమించిపితుకువానికిఁ దత్ఫలనష్టదండము విధింపవలెను. నస్య దమ్య యుగపింగన (అంగపింగన?) వర్తనకాలముల విషయమునఁగూడ నిట్టిదండమేయని తెలిసికొనవలెను.

ఒకద్రోణము గోక్షీరమునుండి యొకప్రస్థముఘృతమును, గేదెపాలనుండి యైదవవంతధికముగను మేకపాలనుండి యర్ధభాగమధికముగను లభించును. మఱియు భూమిత్తృణోదకవిషయములఁబట్టి క్షీరఘృతవృద్ధియగును, కావునఁ బైవానిక్షీరఘృతముల ప్రమాణమును మథించి తెలిసికొనవలెను.

యూథమందలివృషభమును మఱియొక వృషభముతోఁ బోట్లాడించినవానికిఁ బూర్వసాహసదండము; గాయము గలిగించినచో నుత్తమసాహసదండము

వర్ణమునను సరించి పదేసిగోవులనొకగుంపుగఁజేసి పాలింపవలెను.

గోపాలకులు తమరక్షాసామర్థ్యమునుపట్టియు గోవులసంచారబలమునుపట్టియు మేపుటకొఱకై వానిని సమీపదిగ్భాగములకుఁ దీసికొనిపోవలెను.

ఆఱుమాసములకొకమాఱు అజాదులబొచ్చును కత్తిరింపవలెను. అశ్వఖరోష్ట్రవరాహవ్రజములగుఱించిన విషయములఁ బైవానిచే నెఱుఁగునది.

నస్య అశ్వాభద్రగతివాహులగు బలీవర్దముల కర్షభారము యవసస్యము, తద్ద్విగుణముతృణము, ఒకతులము తెలకపిండి, పదియాఢకములపొట్టు, అయిదుపలములలవణము, ముక్కుపైనఖూయు ఒకకుడుంబము తైలము, ఒకప్రస్థముపానము, ఒకతులముమాంసము, ఒకయాఢకముపెరుగు, ఒకద్రోణముయవలు లేక మాషపులాకము, ఒకద్రోణముక్షీరము లేక అర్ధాఢకముసుర, ఒకప్రస్థముస్నేహము, పదిపలములక్షారము, ప్రతిపానముగనొకపలముశృంగబేరరసము నాహారముగ నుపయోగింపవలెను. అశ్వతరగోఖరములకిందుఁ బాదోనముగను మహిషోష్ట్రములకు ద్విగుణముగను నుపయోగింపవలెను. కర్మకరబలీవర్దములకు వానికర్మకాలములఁబట్టియుఁ బాలిచ్చు గోవులకుఁ బాలనుబట్టియు నాహారమేర్పఱుపవలెను. అన్నిటికిని యథేచ్ఛగఁదృణోదకముల నిచ్చుచుండవలయును. గోమండలమునుగుఱించి యిట్లు తెలుపఁబడినది.

ఖరాశ్వములయూథమునకుఅయిదవవంతునను అజావులయూథమునకుఁ బదవవంతునను గోమహిషోష్ట్రయూథములకు నాలుగవవంతునను పురుషపశువుల నేర్పఱుపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున గోధ్యక్షుఁడను
నిరువదితొమ్మిదవయధ్యాయము.
ఆదినుండి యేఁబదియవయధ్యాయము.



## 46 ప్రకరణము.

## అశ్వాధ్యక్షుఁడు.

అశ్వాధ్యక్షుఁడశ్వములను పణ్యాగారికములు క్రయోపాగతములు ఆహవలబ్ధములు ఆజాతములు సాహాయ్యకాగతములు పణస్థితములు తాత్కాలికములుగ విభజించి, వానికులవయోవర్ణచిహ్నవర్గాగమములను పుస్తకములందులిఖించి, వానిలో నప్రశస్తములను

న్యంగ వ్యాధితములును నగువానినిగుఱించి (రాజునకు) విన్నవించుచుండవలెను.

కోశకోష్ఠాగారములనుండి తీసికొనినవస్తువులకు నష్టమురాకుండునట్టియేర్పాటుల నశ్వవాహులాలోచింపవలయును.

అశ్వములసంఖ్యకుఁ దగినంతవైశాల్యమును అశ్వాయామద్విగుణమగు వెడల్పును నాలుగుద్వారములును మధ్యభాగమం దుపావర్తనమును (దొర్లుటకువీలగు ప్రదేశము) ఆసనఫలకయుక్తములగు ప్రద్వారములనుకలిగి సప్రగ్రీవమైనట్టియు వానర మయూర పృషత నకుల చకోరశుకశారికాకీర్ణమైనట్టియు శాలనునిర్మింపవలెను.

అశ్వాయామమునకుఁదగి చతురశ్రమైన మెత్తనిఫలకాస్తరణమును ఖాదనకోష్ఠకమును మూత్రపురీషోత్సర్గమును కలిగినస్థానము నొక్కొకదానికొక్కొకటిచొప్పునఁ బ్రాఙ్ముఖముగఁగాని యుదఙ్ముఖముగఁగాని యేర్పఱుపవలెను. కాలమునుపట్టి మఱియొకవిధముగనైన దిగ్విభాగమును చేయవచ్చును. బడబావృషకిశోరములను రహస్యముగ (వేఱొకప్రదేశమున) నుంపవలెను.

ఈనినగుఱ్ఱమునకు మూఁడురాత్రులొకప్రస్థము ఘృతపానమును, పిమ్మటఁబదిరాత్రులు సక్తువొకప్రస్థము మందుతోఁగలిపిననూనెను పిమ్మటఁ దత్తదృతువులకనుగుణముగఁ బులాకయవసముల నాహారముగ నియ్యవలెను.

గుఱ్ఱముపిల్లకుఁ బదిరోజులయినపిమ్మట నొకకుడుంబము సక్తువు నాలవభాగముఘృతము ఒకప్రస్థముక్షీరము నియ్యవలెను. ఇట్లాఱుమాసములవఱకు జరుపవలెను. అటుతర్వాత మూఁడుసంవత్సరములవఱకు మొదటినెలలో నొకప్రస్థమునేర్పఱచి యొక్కొకనెలకర్థప్రస్థముచొప్పున వృద్ధిచేయవలెను. పిమ్మట నాలుగవసంవత్సరమువఱకొకద్రోణము. తదనంతరము నాలుగైదుసంవత్సరములవయస్సునఁ బూర్ణప్రమాణముగలదియై పనులకన్నిటికి నుపయోగించును.

ఉత్తమాశ్వము ముప్పది రెండంగుళముల పాదపుముఖమును దానికైదు రెట్లుపొడవును ఇరువదియంగుళములజంఘమును జంఘమునకు నాలుగు రెట్లౌన్నత్యమును కలిగియుండును. మధ్యమావరాశ్వములకొలత క్రమముగ మైవానికంటె మూఁడేసియంగుళములు తక్కువగనుండును. ఉత్తమాశ్వముయొక్క పరిణాహము (చుట్టుకొలత) నూరంగుళములు. మధ్యమావరముల పరిణాహము క్రమముగనిందులో నైదవభాగము తగ్గియుండును.

అర్ధశుష్కములును అర్ధసిద్ధములునగు శాలివ్రీహియవప్రియంగువులలో నేదయినను పులాకముగఁ జేయఁబడిన ముద్గమాషములైనను రెండుద్రోణములును, ఒకప్రస్థమునూనె అయిదుపలములు లవణము ఏఁబదిపలములు మాంసము ఒకయాఢకము రసములేక రెండాఢకములు పెరుగు రుచినికలిగించుట కయిదుపలములక్షారము ఒకప్రస్థముసుర లేక రెండుప్రస్థములపాలు — ఇవి యుత్తమాశ్వమునకాహారము. చాలదూరము బరువుమోయుటచేనలసినగుఱ్ఱమునకు వీనినిముఖ్యముగ నియ్యవలెను. మఱియు అనువాసనమునకొకప్రస్థముస్నేహము నస్యకర్మకొకకుడుంబము స్నేహము అర్ధభారముయవసము ఒకభారము తృణమునుకూడనుపయోగింపవలెను. ఆఱరత్నులవైశాల్యముగలుగునట్లొకపరిక్షేపము (మెత్త) లేక పుంజీలగ్రాహము నేర్పఱుపవలెను.

పైనస్తువులలో నాలుగవవంతుతగ్గించి మధ్యమావరములకు నియ్యవలెను. రథ్యమును వృషమునునగు మధ్యమాశ్వమునకు నుత్తమాశ్వముతో సమానముగను అట్టి అవరాశ్వమునకు మధ్యమాశ్వముతో సమానముగను నాహారమియ్యవలెను. బడబలకును పారశమములకును నాలుగవవంతు తగ్గింపవలెను. కిశోరములకిందులోసగము. ఇది వానియాహారవిధానము.

ఆహారపదార్థములలో నొకభాగమును ఆహారములపచనము చేయువానికిని సూత్రగ్రాహకచికిత్సకులకును నియ్యవలెను.

యుద్ధవ్యాధిజరాకర్మలచే క్షీణించి సమరోపయోగములుగాక తిండితినుచుండు గుఱ్ఱములను పౌరజానపదులయుపయోగార్థమై వారిబడబలకు వృషములుగ నేర్పఱుపవలెను.

సమరోపయోగములకు నశ్వములలోఁ గాంభోజసైంధవఆరట్టజ వనాయుజములు ఉత్తమములు. బాహ్లికపాపేయకసౌవీరకతైతలములు మధ్యమములు. తక్కినవి అవరములు. వీనియొక్క తీక్ష్ణభద్రమందగతులననుసరించి కొన్నిటిని సాన్నాహ్యములుగను కొన్నిటి నౌపవాహ్యములుగను నుపయోగింపవలెను.

అశ్వముయొక్క చతురశ్రిమే (బాగుగతయారుచేయుటయే) సాన్నాహ్యకర్మ.

వల్గనము నీచైర్గతము లంఘనము ధోరణము నారోష్ట్రము అని ఔపవాహ్యములు (సవారిచేయువిధములు). ఉపవేణుకము వర్ధమానకము యమకము ఆలీఢప్లుతము వృథాట్టము త్రిచాలి యుని వల్గనభేదములు. శిరస్సును జెవులను గదల్పక వల్గనమొనరించుట నీచైర్గతము. ఇది పదునాఱువిధములు—— ప్రకీర్ణకము ప్రకీర్ణోత్తరము నిషణ్ణము పార్శ్వానువృత్తము ఊర్మిమార్గము శరభక్రీడితము శరభప్లుతము త్రితాళము బాహ్యానువృత్తము పంచపాణి సింహాయతము స్వాధూతము క్లిష్టము శ్లాఘితము బృంహితము పుష్పాభికీర్ణమని నీచైర్గతములు. కపిప్లుతము భేకప్లుతము ఏకప్లుతము ఏకపాదప్లుతము కోకిలసంచారి ఉరస్యము బకసంచారియని లంఘనములు. కాఙ్కము వారికాఙ్కము మయూరము అర్ధమయూరము నాకులము అర్ధనాకులము వారాహము అర్ధవారాహమని ధోరణము. సంజ్ఞనుపట్టి పరుగెత్తుట నారోష్ట్రము.

రథ్యములు (రోజునకు) ఆఱు తొమ్మిది పండ్రెండుయోజనములచొప్పునను, పృష్ఠవాహ్యములు అయిదు యెనిమిది పదియోజనముల చొప్పునను పరుగిడును.

విక్రమము భద్రాశ్వాసము భారవాహ్యమని మార్గములు. (నడకలోనిభేదములు). విక్రమము వల్గితము ఉపకంఠము ఉపజవము జవమని ధారలు.

అశ్వములబంధించుటకుఁ గానలయుపకరణములఁ దచ్ఛాస్త్రజ్ఞులును, యుద్ధోపయుక్తములగు రథాశ్వాలంకారములను సూతులును, శరీరహానివృద్ధిప్రతీకారములను ఋత్వనుకూలమగు నాహారమును చికిత్సకులును నిర్దేశింపవలెను.

సూతగ్రాహక అశ్వబంధక యావసిక విధాపాచక స్థానపాల కేశకార జాంగులీవేత్తలు అశ్వవిషయకములగు తమతమకృత్యములను లోపములేక చేయుచుండవలెను. కృత్యాతిక్రమముచేయునపుడు వేతనచ్ఛేదమే వారికిదండము.

నీరాజనకర్మకైగాని చికిత్సకైగాని లోపలనుంచఁబడియుండు గుఱ్ఱమును వాహనముగ నుపయోగించుకొనుటకుఁ జేసిన నిరోధప్రవారికి ద్వాదశపణదండము. వైద్యునియజాగ్రత్తవలనఁగాని ఔషధమువలనఁగాని వ్యాధివృద్ధియగునపుడు ప్రతీకారద్విగుణదండము. వైద్యలోపముచే వైలోమ్యముకలిగినచో నశ్వమూల్యముదండము.

దీనిచే గోమండలము ఖరోష్ట్రమహిషములు ఆజావికములు లోనగువానివిషయమునఁగూడ నిశ్చయమయియెఱుంగునది.

రోజునకు రెండుమార్లశ్వమునకు స్నానగంధమాల్యముల నర్పింపవలెను. అమావాస్యనాఁడు భూతయాగములను పౌర్ణమినాఁడు స్వస్తివాచమును కావింపవలెను.

ఆశ్వయుజనవమినాఁడును యాత్రారంభమందును యాత్రనుండిమఱలునపుడును వ్యాధివచ్చినపుడును అశుభశాంతికై నీరాజనము చేయవలెను.

ఇది అధ్యక్షప్రచారమున అశ్వాధ్యక్షుఁడను
ముప్పదియవయధ్యాయము
ఆదినుండి యేఁబదియొకటవ యధ్యాయము.



## 47 ప్రకరణము.

### హస్త్యధ్యక్షుఁడు

హస్త్యధ్యక్షుఁడు హస్తివనరక్షను దమ్యకర్మ వలననలసినట్టిహస్తిహస్తినీకలభములకుఁ గావలసిన శాలాస్థానశయ్యాకర్మవిధాయవసములపరిమాణమును వానికర్మాయోగమును బంధనోపకరణమును సాంగ్రామికాలంకారమును చికిత్సక అనీకస్థ ఔపస్థాయికవర్గమును పరీక్షింపఁజేయవలెను.

హస్త్యాయామమునకు ద్విగుణమగు నుత్సేధవిష్కంభాయామములుగలిగినట్టియు హస్తినులకు వేఱుగఁ బ్రదేశముగలిగినట్టియుఁ బ్రగ్రీవముతోఁ గూడినట్టియుఁ గుమారీసంజ్ఞక స్తంభములు గలిగినట్టి శాలను ప్రాఙ్ముఖముగఁగాని యుదఙ్ముఖముగఁగాని నిర్మింపవలెను. హస్త్యాయామచతురశ్రమగు బల్లకట్టుపై నున్నని స్తంభమునకుదగ్గఱగ మూత్రపురీషస్థానము నేర్పఱుపవలెను. మఱియునందు స్థానసమశయ్యను అర్ధాపాశ్రయము (ఆనుకొనుటకు సగమెత్తుగలప్రదేశము)ను నిలిపి, సాన్నాహ్య ఔపవాహ్యములను దుర్గములోపలను దమ్యవ్యాళములను బయటనుకట్టవలెను.

పగటియెనిమిదిభాగములలోఁ బ్రథమసప్తమభాగములు స్నానకాలములు, తదనంతరకాలము భోజనకాలము, పూర్వాహ్ణము వ్యాయామకాలము, పశ్చాహ్నము పానకాలము, రాత్రియందు రెండు భాగములు నిద్రాకాలములు, రాత్రిలో మూఁడవవంతు సంవేశనఔత్థాసికకాలము.

గ్రీష్మఋతువునందే నేనుఁగులఁ బట్టుకొనవలయును.

ఇరువదిసంవత్సరములదానిని పట్టుకొనఁదగు. విక్కము (పాలుత్రాగుచుండునది), మూఢము (ముగ్ధము), మత్కుణము (నిర్దంతము), వ్యాధితము, గర్భిణి, ధేనుక, హస్తిని— ఇట్టిగజములను పట్టుకొనఁగూడదు.

ఏడురత్నులయెత్తును తొమ్మిదియరత్నులపొడవును పదియరత్ను

లచుట్టుకొలతను నలుబదిసంవత్సరముల వయస్సుకలది ఉత్తమగజము. ముప్పదివర్షముల వయస్సుగలది మధ్యమము. ఇరువదియైదువర్షములువయస్సుగలది అవరము. ఉత్తమగజములకు వేయు నాహారములో నాలుగవవంతుతగ్గించి వీనికి వేయవలెను.

ఏడరత్నులయెత్తుగల గజమునకాహారము:— ఒకద్రోణము తండులములు, అర్ధాఢకము తైలము, మూడుప్రస్థములునెయ్యి, పదిపలములులవణము, ఏఁబదిపలములమాంసము, ఆఢకమురసము లేక రెండాఢకములపెరుగు, రుచికొఱకు ఏఁబదిపలములు క్షారము, ఆఢకము మద్యము లేక రెండాఢకములుపాలు, గాత్రావసేకమునకొకప్రస్థము తైలము, శిరస్సునకు దీనిలో రెండవభాగము, రెండుభారములయవసము, రెండున్నరభారముల తృణము, మూడున్నరభారముల యెండుగడ్డి, నియమరహితముగఁ గడంగరము (పెసరమొక్కలులోనగునవి). ఎనిమిదియరత్నులయెత్తుగల మదపుటేనుఁగునకుఁగూడనీయాహారమునే వేయవలెను. ఆయిదారురత్నులయెత్తుగల గజములకు వానికొలతకుఁదగినట్లుగ నాహారమేర్పఱుపవలెను. క్రీడార్థమైపట్టుకొనఁబడిన విక్కమునకుఁ బాలుగడ్డియునాహారము.

సంజాతలోహిత ప్రతిచ్ఛన్న సంలిప్తపక్ష సమకక్ష్య అతికీర్ణ మాంస సమతల్పతల జాతద్రోణిక యనిగజశోభలు.

ఋతువులనుపట్టియు శోభలనుపట్టియు భద్రమంద్ర మృగసంకీర్ణలింగములగు గజములకుఁగర్మలయందు వ్యాయామముగల్పింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున హస్త్యధ్యక్షుఁడను
ముప్పదియొకటవ యధ్యాయము.
ఆదినుండి యేఁబదిరెండవ యధ్యాయము.



## హస్తిప్రచారము.

అవి చేయుపనులఁబట్టి యేనుఁగులు దమ్యములు సాంనాహ్యములు ఔపవాహ్యములు వ్యాళములని నాలుగువిధములు. అందు

దమ్యములు స్కంధగతములు స్తంభగతములు వారిగతములు అవపాతగతములు యూథగతములని యైదువిధములు; వానికి విక్కర్మను మొదట నేర్పవలెను. ఉపస్థానము సంవర్తనము సంయానము వధావధము హస్తియుద్ధము నాగరాయణము సాంగ్రామికమను నేడు కర్మలందుఁ బ్రవర్తించునది సాన్నాహ్యము. కక్ష్యాకర్మ గ్రైవేయకర్మయూథకర్మలను వీనికి మొదట నేర్పవలెను. ఆచరణము కుంజరౌపవాహ్యము ధోరణము ఆధానగతికము యష్ట్యుపవాహ్యము తోత్రోపవాహ్యము శుద్ధోపవాహ్యము మార్గాయుకములని యౌపవాహ్యము లెనిమిదివిధములు. శారదకర్మ హీనకర్మ నారోష్ట్రకర్మలను వీనికి మొదట నేర్పవలెను. వ్యాళమేకక్రియాపథము. శిక్షయొక్కటి యేదాని కుపవిచారము. అది కర్మశంకితము అవరుద్ధము విషమము ప్రభిన్నము ప్రభిన్నవినిశ్చయము మదహేతువినిశ్చయమైయుండును. శిక్షించినను లొంగనివ్యాళములు శుద్ధములు సువ్రతములు విషమములు సర్వదోషప్రదుష్టములని పలువిధములుగనుండును.

వానికిఁ గావలసిన ఆలానగ్రైవేయకక్ష్యాపారాయణపరిక్షేపణఉత్తరాదికములగు బంధనోపకరణములను వనీకస్థునినుండి తెలిసికొనవలెను.

అంకుశవేణుయంత్రాదికము లుపకరణములు. వైజయంతిక్షురప్రమాల ఆస్తరణకుథాదికములు భూషణములు. వర్మతోమరశరావాపయంత్రాదికము సాంగ్రామికాలంకారము.

చికిత్సక అనీకస్థ ఆరోహక ఆధోరణ హస్తిపక ఔపచారిక విధాపాచక యావసిక పాదపాశిక కుటీరక్షక ఔపశాయికాదులు ఔపస్థాయికవర్గము.

చికిత్సక కుటీరక్ష విధాపాచకులు ప్రస్థమోదనమును రెండు పలములు స్నేహలవణములను ఒకచేరెడు నూనెను తీసికొనవచ్చును. చికిత్సకులు తప్పఁ దక్కినవారు పదిపలముల మాంసమునుకూడఁ దీసికొనవచ్చును.

మార్గమున వ్యాధికర్మమదజరాభితప్తములగు గజములకుఁ జికిత్సకులు ప్రతీకారము చేయవలెను.

స్థానమును శుద్ధిచేయకపోవుట యవసమును తీసికొనిరాకపోవుట నేలమీఁదఁబరుండఁజేయుట అపాయస్థలములందుఁగొట్టుట పరులనెక్కించుట అకాలమందు సవారిచేయుట తగనిభూములందును రేవులందును దింపుట చెట్లగుంపులలోఁదోలుట — ఇవి నేరములు. వీనివలనఁగలిగిననష్టమును వేతనములనుండి తీసికొనవలయును.

చాతుర్మాస్యమందును ఋతుసంధులందును మూఁడుమార్లునీరాజనమును, అమావాస్యాపౌర్ణమీలలో సేనానులు భూతేజ్యలను చేయవలెను.

పర్వతజములకైదుసంవత్సరములకొకమారును నదీజములకు రెండుసంవత్సరములకొకమారును, పరిణాహద్విగుణరహితముగ దంతచ్ఛేదముగావింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున హస్తిప్రచారము
ముప్పదిరెండవయధ్యాయము.
ఆదినుండి యేఁబదియూఁడవయధ్యాయము.



## 48.49 ప్రకరణములు.

### రథాధ్యక్షుఁడు, పత్త్యధ్యక్షుఁడు, సేనాపతిప్రచారము.

అశ్వాధ్యక్షునివిషయమునఁ జెప్పినకార్యములు రథాధ్యక్షునివిషయమునఁగూడ వర్తించునని యెఱుంగునది.

రథాధ్యక్షుఁడు రథములను చేయింపవలెను. (ఉత్తమమగు) రథము పదిపురుషములయెత్తును పండ్రెండుపురుషముల వెడల్పును కలిగియుండవలెను. అదేవిధముగ వెడల్పునందొక్కొకపురుషముతగ్గించి ఆఱుపురుషములవెడల్పుగలుగునంతవఱకేడువిధములగు రథములను దేవరథ పుష్పరథ సాంగ్రామిక పారియాణిక పరపురాభియానిక

వైనయకరథములను చేయింపవలెను.

సారథులయొక్కయు రథికులయొక్కయు ఇష్వస్త్రప్రహరణావరణోపకరణకల్పనములను కర్మయోగమును పరిశోధింపవలెను. పనులుపూర్తియగువఱకు భృత్యాభృత్యులకు భక్తవేతనమును బహుమానములనియ్యవలెను. మార్గముల కొలతలనుకూడ నతఁడు దెలిసికొనవలెను.

పత్త్యధ్యక్షునికృత్యములుగూడ నిట్టివేయని యెఱుంగునది. మౌలబల భృతబల శ్రేణిబలమిత్రామిత్రబలఅటవీబలముల సారఫల్గుతలను, నిమ్నస్థల ప్రకాశ కూటఖనక ఆకాశదివారాత్రియుద్ధవ్యాయామములను, యుద్ధకర్మలందు సైన్యములు పనిచేయగలవా లేవాయనునంశమును, నతఁడు తెలిసికొనవలెను.

సేనాపతియు సర్వయుద్ధప్రహరణవిద్యావినీతుఁడై హస్త్యశ్వరథచర్యాసంబంధముగలిగి చతురంగబలము ప్రతికొంపఁజేయవలెను. మఱియు స్వభూమిని యుద్ధకాలమును శత్రుబలమును అభిన్నభేదనమును భిన్నసంధానమును సంహతభేదనమును భిన్నవధమును దుర్గవధమును యాత్రాకాలమును తెలిసికొనవలెను.

స్థానయానప్రహరణములందు సైన్యములకు వినయమునేర్పుచుఁ దూర్యధ్వజపతాకలనుపట్టి వ్యూహసంజ్ఞలఁగల్పింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున రథాధ్యక్షుఁడు, పత్త్యధ్యక్షుఁడు, సేనాపతి ప్రచారమను ముప్పదిమూఁడవయధ్యాయము.

ఆదినుండి యేఁబదినాలుగవయధ్యాయము.



## 50.51 ప్రకరణములు.

### ముద్రాధ్యక్షుఁడు, వివీతాధ్యక్షుఁడు.

ముద్రాధ్యక్షుఁడొకమాషకమును పుచ్చుకొని ముద్రనియ్యవలెను. ముద్రగలవాఁడు జనపదమునఁ బ్రవేశించుటకును దానినుండి

వెళ్ళిపోవుటకును స్వాతంత్ర్యముకలిగియుండును. ముద్రలేని జానపదుఁడు పండ్రెండుపణముల దండమునియ్యవలెను. కూటముద్రకు జానపదునికిఁ బూర్వసాహసదండము, తిరోజనపదునికుత్తమదండము. వివీతాధ్యక్షుఁడు ముద్రను పరిశోధింపవలెను.

భయప్రదేశములనడుమ వివీతములస్థాపించి నిమ్నారణ్యములలోని చోరవ్యాళములవలని భయమునుకనిపెట్టవలెను. అనూదకప్రదేశములందుఁ గూపసేతుబంధములను చిన్నకాలువలనుకట్టించిపుష్పఫలవాటముల నేర్పఱుపవలెను.

లుబ్ధకులు శ్వగణములతోఁగూడి యరణ్యములందంతటఁదిరుగుచుండవలెను. తస్కరులు అమిత్రులు ప్రవేశించినపుడు వారిని తప్పించుకొని శైలవృక్షారూఢులై శంఖదుందుభిధ్వనులమూలమునఁగాని శీఘ్రవాహనులైగాని ముద్రాయుక్తములగు గృహకపోతములనువిడిచిగాని ధూమాగ్నిపరంపరలమూలమునఁగాని వారిసంచారమును రాజునకెఱింగింపవలెను.

ద్రవ్యహస్తివనపరిపాలనము మార్గరక్షణము చోరనివారణము సార్థాతివాహ్యము గోరక్షణము లోనగువానినికూడఁ (అధ్యక్షులు) జేయింపవలెను.

ఇది అధ్యక్షప్రచారమున ముద్రాధ్యక్షుఁడు, వివీతాధ్యక్షుఁడను
ముప్పదినాలుగవ యధ్యాయము.
ఆదినుండి యేఁబదియైదవయధ్యాయము.



## 52-53 ప్రకరణములు.

{ సమాహర్తృప్రచారము, గృహపతివైదేహకతాపస వ్యంజనులగు ప్రణిధులు. }

సమాహర్త జనపదమును నాలుగుభాగములుగ విభజించి యొక్కొకభాగమందలి గ్రామములను జ్యేష్ఠమధ్యమకనిష్ఠములుగనేర్పఱచి వానిలో నేవిపరిహారకములో యేవియాయుధీయములో యేవి

ధాన్యపశుహిరణ్యకుప్యవిష్టికరపరిహారములో విన్యసింపవలెను.

వానిచేననుజ్ఞాతుఁడై గోపుఁడు పదిగ్రామములనుకాని అయిదుగ్రామములనుకాని పరీక్షించుచుండవలెను.

గ్రామాగ్రమందెల్లలనేర్పఱచి క్షేత్రమందలి కృష్టాకృష్ట స్థలకేదార ఆరామషండవాటవనవాస్తుచైత్యదేవగృహసేతుబంధశ్మశానసత్రప్రపాపుణ్యస్థానవివీతపథములను సంఖ్యానముగావించి క్షేత్రారణ్యమార్గముల పరిమాణమర్యాదలనిర్ణయించి సంప్రదానవిక్రయానుగ్రహపరిహారములయొక్క నిబంధనలను చేయింపవలెను.

పన్నులఁ జెల్లించుచుండునట్టియుఁ జెల్లింపనట్టియు గృహములయొక్కయు వానిలోని నాలుగుజాతులవారియొక్కయుఁ గర్షకగోరక్షకవైదేహకకారుకర్మకరదాసులయొక్కయు ద్విపదచతుష్పదజంతువులయొక్కయుసంఖ్యను, కళలయొక్కయు స్త్రీపురుషులయొక్కయు బాలవృద్ధులయొక్కయుఁ గర్మచరిత్ర ఆజీవవ్యయపరిమాణమును (గోపుఁడు) తెలిసికొనవలెను.

ఇదేవిధముగ జనపదచతుర్భాగమునుగుఱించి స్థానికుఁడు తెలిసికొనవలెను

ప్రదేష్టలు గోపులు స్థానికులు చేయుపనులను విచారించుచు బలిప్రగ్రహము (బలియనుపన్ను) ను చేయవలెను.

సమాహర్తచే నియమింపఁబడిన గృహపతికవ్యంజనులు గ్రామములోని క్షేత్రముల మానసంజాతములను గృహములభోగపరిహారములను కులములవర్ణకర్మలను మృగములను ఆయవ్యయములను వచ్చుచుఁబోవుచుండువారి రాకపోకలకుఁ గారణములను దుష్టస్త్రీపురుషుల చారప్రచారములను తెలిసికొనవలెను.

ఇట్లే వైదేహకవ్యంజనులు స్వభూమియందుత్పత్తియైన ఖనిసేతువనకర్మాంతక్షేత్రజములగు రాజపణ్యముల పరిమాణార్ఘములఁ దెలిసికొనవలెను.

విదేశజములును వారిపథ స్థలపథములనుండి వచ్చినవియునగు సారఫల్గుపణ్యములయొక్క శుల్క వర్తని అతివాహిక గుల్మతర దేయ భాగభక్తపణ్యాగారప్రమాణముల నెఱుంగవలయును.

ఇట్లే సమాహర్తచే నాజ్ఞప్తులైన తాపసవ్యంజనులు కర్షక గోరక్షకవైదేహకులయొక్కయు అధ్యక్షులయొక్కయు శుచిత్వాశుచిత్వముల నెఱుంగవలయును.

పురాణచోరవ్యంజనులు శిష్యసహితులై చైత్యచతుష్పథశూన్యపదోదపాన నదీనిపాన తీర్థ ఆయతన ఆశ్రమ అరణ్య శైలవన గహనములందుండి స్తేనామిత్రప్రవీరపురుషుల ప్రవేశనస్థానగమనప్రయోజనముల నెఱుంగవలయును.

ఈవిధముగ సమాహర్త జాగరూకుఁడై జనపదమును బరిశీలించుచుండవలెను; వానిచారులు శిష్యులతోఁగూడి వారివారి కార్యముల నొనర్చుచుండవలెను.

ఇది అధ్యక్షప్రచారమున గృహపతివైదేహకతాపసవ్యంజనప్రణిధులను ముప్పదియైదవ యధ్యాయము.
ఆదినుండి యేఁబదియాఱవయధ్యాయము.



## 54 ప్రకరణము.

### నాగరికప్రణిధి

సమాహర్తవలె నాగరికుఁడు నగరమును పాలించుచుండవలెను. ఇట్లే గోపుఁడు పదిగాని యిరువదిగాని నలువదిగాని కుటుంబములఁ బరిశీలించుచు వానిలోని స్త్రీపురుషులను వారి జాతిగోత్రనామకర్మలను వారిపశువులను ఆయవ్యయములను తెలిసికొనవలెను. ఈరీతిగనే స్థానికుఁడు దుర్గములోని నాలుగవభాగమునుగుఱించి తెలిసికొనవలయును.

ధర్మాదికారులు, పాషండులను పథికులను తెలిసికొని వారికి

నివాసముల శోధింపుచుండవలెను. సమ్మానింపఁదగిన తపస్విలను శ్రోత్రియులను నివసింపఁ జేయవలెను.

కారువులును శిల్పులును స్వకర్మస్థానములందు స్వజనము నుంచుకొనవచ్చును. వర్తకులును స్వకర్మస్థానములందు స్వజనము నుంచుకొని అదేశకాలములందుఁ బణ్యవిక్రయమును చేయువారిని స్వకృత్యములో లేనివారిని (నాగరికునికి) నివేదించుచుండవలెను. శౌండికపాక్వమాంసిక ఔదనికరూపాజీవులు వారికిఁ దెలిసినవారి నింట్లలో నుంచుకొని, అతివ్యయకర్తలను అత్యాహితకర్మలఁ జేయువారిని నివేదింపవలెను.

రహస్యముగ వ్రణప్రతీకారము చేయువానిని చికిత్సకుఁడును, అపథ్యకారుని గృహస్వామియు గోపస్థానికులకుఁ దెలియఁజేసినచో దోషము నొందరు; లేనియెడలఁ దుల్యదోషులగుదురు.

(గృహస్వాములు) తమయింటికి వచ్చినవారిని తమయింటనుండి పోయినవారిని నివేదింపవలెను. లేనియెడల రాత్రిదోషము (దొంగతనముల దోషము) ను పొందుటయేగాక క్షేమరాత్రులందుఁ గూడ మూఁడుపణముల నిచ్చుకొనవలెను.

పథికోత్పథికులు నగరముయొక్క బహిరంతర్భాగములందలి దేవగృహ పుణ్యస్థాన వనశ్మశానములందుండు వ్రణసహితుని అనిష్టోపకరణుని బరువుచే నలసినవానిని ఆవిగ్నుని అపరిమితముగ నిద్రపోవువానిని మార్గాయాసము నొందినవానిని క్రొత్తవానిని పట్టుకొనవలెను. ఈవిధముగనే శూన్యనివేశనావేశములందును శౌండిక ఔదనిక పాక్వమాంసిక ద్యూతపాషండావాసములందును వెతుకవలెను.

నాలుగు భాగములుగల పగటిలో నడిమి రెండు భాగములందు గ్రీష్మఋతువులో నగ్నిఁ జేయరాదు; చేసినవారికిఁ బణములో నెనిమిదవవంతు దండము. ఇంటివెలుపలనే పొయ్యిపెట్టుకొనవలెను.

గృహస్థులు తమయింట నైదుకుండలు, ఒకకుంభము, ఒకద్రోణము, ఒకనిచ్చెన గొడ్డలి చేట అంకుశము కచగ్రహణి దృతిని ఉంచుకొనవలెను; లేనిచో పాదపణము దండము. గడ్డికప్పులను విప్పివేయవలెను. (కుమ్మర్లు మొదలగు) అగ్నిజీవులందఱు నొక్కచోటనే నివసింపవలెను.

గృహస్వాములు స్వగృహద్వారములందే (రాత్రులలో) యుండవలెను. రథ్యలందును చతుష్పథద్వారములందును రాజగృహములందును వేలకుండల నచ్చటచ్చట వరుసగ నిలుపవలెను.

అగ్ని పుట్టినచోటికి వెళ్ళని గృహస్వామికిఁ బండ్రెండుపణములును, అద్దెకుఁగా నున్నవాని కాఱుపణములును దండము.

ప్రమాదవశమున నిప్పుపెట్టినవాని కేఁబదినాలుగుపణములును, బుద్ధిపూర్వకముగ నిప్పుపెట్టినవాని కగ్నివధయు దండము.

రథ్యలందు మన్ను (చెత్త) పోసినవానికిఁ బణాష్టభాగమును, నీటికిఁగాని బురదకుఁగాని యడ్డుగలుగఁ జేసినవానికిఁ బాదపణమును దండము. ఈ నేరములు రాజమార్గమునఁ జేయువారికి ద్విగుణదండము.

పుణ్యస్థాన ఉదకస్థాన దేవగృహ రాజపరిగ్రహములందుఁ బురీషోత్సర్జనము చేయువానికిఁ బణోత్తరదండము, మూత్రోత్సర్జనమున కర్ధదండము. భైషజ్య, వ్యాధిభయములవలననిట్లుజరిగినచో దండము లేదు.

మార్జాల శ్వనకుల సర్పప్రేతముల నగరమధ్యమునఁ బడవేయువారికి మూఁడుపణములు దండము. ఖర ఉష్ట్ర అశ్వతర అశ్వపశుప్రేతములఁ బడవేయువారి కాఱుపణములు; మనుష్యప్రేతములఁ బడవేయువారి కేఁబదిపణములు.

నిర్ణీతములుగాని ద్వారములనుండియుఁ ద్రోవలనుండియు శవమును తీసికొనిపోవువానికిఁ బూర్వసాహసదండము, ద్వారపాలకులకు రెండువందలపణములు దండము.

శ్మశానముకాని చోట ఖననదహనములఁ జేసినచో ద్వాదశపణ దండము.

ఆఱుగడియల రాత్రి మొదలు ఆఱుగడియల రాత్రి యుండునంత వఱకు జనులు వీథులవెంటఁ దిరుగరాదని తూర్యశబ్దమును చేయవలెను. దానికి విరుద్ధముగఁ బ్రథమపశ్చిమయామములందు రాజగృహసమీపమునఁ దిరుగువానికి సపాదపణము అక్షణతాడనము దండము. మధ్యమయామమునఁ దిరుగువానికి ద్విగుణదండము. వెలుపలఁ దిరుగువానికి నాలుగురెట్లు దండము.

శంకింపఁదగు ప్రదేశములందుండువానిని, శిక్షితపూర్వునిఁ బరీక్షింపవలెను.

రాజగృహసమీపమునఁ దిరుగువానికి (కోట) ప్రాకారమునెక్కువానికిని మధ్యమసాహసదండము.

సూతికాచికిత్సక ప్రేతనాగరిక తూర్య ప్రేక్ష అగ్నినిమిత్తము వెళ్లువారును, దీపముతోఁగూడ వెళ్లువారును, ముద్రికలవారునగ్రాహ్యులు.

స్వేచ్ఛగఁ జరింపఁదగిన రాత్రులందుసహితము ప్రచ్ఛన్నవిపరీతవేషులును ప్రవ్రజితులును దండశస్త్రహస్తులును దోషానుగుణముగ శిక్షింపఁదగియుందురు.

అవార్యులను వారించునట్టియు వారింపఁదగినవారిని వారింపనట్టియు రక్షకుల కకాలమందుఁ జరించువారికి విధింపఁబడుదండమునకు ద్విగుణమగుదండము.

(జారులగు) రక్షకులు దాసిని పట్టుకొనినచోఁ బూర్వసాహసదండము, అదాసిని పట్టుకొనినచో మధ్యమదండము, కృతావరాధలను పట్టుకొనినచో నుత్తమదండము. కులస్త్రీని పట్టుకొనినచో వధ.

చేతనాచేతనవిషయకమగు రాత్రిదోషమును రాజునకెఱింగింపకున్నను జాగరూకుఁడు గాకున్నను నాగరికునికి దోషమునకుఁదగిన దండము విధింపవలెను.

ఉదకస్థానమార్గభూమిచ్ఛన్నపథవప్రప్రాకార రక్షావేక్షణమును నిత్యము చేయవలెను. నష్టప్రస్మృత అపస్మృతములగు ద్రవ్యముల రక్షింపవలెను.

బంధనాగారమందలి బాలురువృద్ధులువ్యాధితులుస్త్రీలుఅనాథలునగువారిని రాజు జన్మదినమందును పౌర్ణమాసులయందును విడువవలెను. పుణ్యశీలురును సమయనిబద్ధులునునగువారు దోషనిష్క్రయము నిచ్చుకొనవచ్చును.

ప్రతిదినమునఁగాని అయిదురాత్రులకొకమారుగాని బంధనస్థులనుశోధించివారిపనులను శరీరశిక్షను హిరణ్యమును పట్టివారినివిడువవచ్చును.

క్రొత్తదేశమును జయించినపుడును యువరాజపట్టాభిషేకసమయమునను పుత్రజన్మసమయమునను బంధనస్థులవిడువవలెను.

ఇది రెండవయాధికరణమగు అధ్యక్షప్రచారమున నాగరికప్రణిధియను

ముప్పదియారవ యాధ్యాయము.

ఆదినుండి యేఁబదియేడవయధ్యాయము.

ఇంతటితో కౌటిలీయార్థశాస్త్రమం దధ్యక్షప్రచారమను

ద్వితీయాధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## మూఁడవయధికరణము — ధర్మస్థీయము.

### 55.56 ప్రకరణములు.

వ్యవహారస్థాపన; వివాదపదనిబంధనము

ధర్మస్థులు ముగ్గురును అమాత్యులు ముగ్గురును కలిసి జనపదసంధులందును సంగ్రహణములందును ద్రోణముఖములందును స్థానీయములందును వ్యవహారముల నడిపింపవలెను.

తిరోహితములును అంతరాగార నక్తారణ్యాప్రదేశములందు జరిగినట్టివియును రహస్యముగను మోసముగను చేయఁబడినట్టివియు నునగు వ్యవహారములఁ బ్రతిషేధింపవలెను. అందుఁగర్తకుఁ గారయితకును పూర్వసాహసదండము. శ్రోతలొక్కొక్కరికి దానిలోసగము దండము. శ్రద్ధేయులకు (వానినంగీకరించినవారికి) ద్రవ్యనష్టమే దండము.

ఇతరుల వినికిడిలో జరిగినట్టివియుఁ బ్రతిషేధార్హములు లేనట్టియుఁ దిరోహితములగు వ్యవహారములు సిద్ధించును.

దాయ నిక్షేప ఉపనిధి వివాహముల సంబంధించినట్టియు అనిష్కాసినులును స్వస్థచిత్తులునగు స్త్రీలనుసంబంధించినట్టియు వ్యాధితులసంబంధించినట్టియు వ్యవహారము లంతరగారములయందైనప్పటికిని సిద్ధించును.

సాహస అనుప్రవేశ (చౌర్యము) కలహవివాహరాజనియోగముల సంబంధించినట్టియు సందెజామున వ్యవహారములఁ జేయునట్టి వారిని సంబంధించినట్టియు వ్యవహారములు రాత్రికృతములైనను సిద్ధింపఁగలవు.

అరణ్యములందుండు సార్థవ్రజాశ్రమవ్యాధచారణులను సంబంధించినవ్యవహారము లరణ్యకృతములైనను సిద్ధింపఁగలవు.

ఉపధికృతములగు వ్యవహారములుసహితము గూఢాజీవుల యెడ సిద్ధింపఁగలవు.

సమవాయము (సంఘ) సభ్యులలో నొకరొకరికిజరిగిన వ్యవహారములు రహస్యములైనను సిద్ధింపఁగలవు.

వైవిధములజరుగని తిరోహితాదివ్యవహారములు సిద్ధింపఁజాలవు.

పితృమాతృ పుత్రుఁడు పుత్రులుగలతండ్రి కులభ్రష్టుఁడగు భ్రాత అవిభక్తాంశముగల కనిష్ఠుఁడు పతియుఁబుత్రులుఁగలస్త్రీ దాసులు ఆహితకులు అప్రాప్తవ్యవహారులు అతివ్యవహారులు శిక్షితులు ప్రవ్రజితులు అంగహీనులు వ్యసనులు లోనగువ్యవహారానధికృతులొనర్చు వ్యవహారములు సిద్ధింపవు. అధికారమునుపొంది వీరు వ్యవహారములనుచేసినచో నదిసిద్ధించును. ఇట్టియధికారమును పొందని వారుసహితము క్రుద్ధులు ఆర్తులు మత్తులు ఉన్మత్తులు అపగృహీతులుగనుండినచో వారివ్యవహారములు సిద్ధింపవు. ఇట్టి సందర్భముల లోఁ గర్తలకును కారయితలకును శ్రోతలకును ప్రత్యేకముగ యథోక్తదండముల విధింపనగును.

స్వవర్గస్వదేశస్వకాలముల సంబంధించినట్టి వ్యవహారములన్నియు స్వయముగఁజేయఁబడినప్పుడును సంపూర్ణాచారములు గలిగినప్పుడును శుద్ధదేశమునందు జరిగినప్పుడును నమ్మఁదగిన రూపలక్షణ ప్రమాణగుణములు గలిగియుండునప్పుడును సిద్ధింపఁగలవు.

ఆదేశములు అధులుతప్పఁదక్కినవి స్వవర్గములోనివాఁడుగాక మఱియొకఁడు చేసినను సిద్ధించును.

—ఇది వ్యవహారస్థాపన.—

ఋణమునకు సంబంధించిన సంవత్సరము ఋతువు మాసము పక్షము దివసము కరణము అధికరణములను వ్యవహారసమర్థులగు వాదిప్రతివాదులయొక్క దేశగ్రామజాతిగోత్రనామకర్మలను వ్రాసి కొని వాదిప్రతివాదుల ప్రశ్నోత్తరముల నర్థానుపూర్వ్యముగ లిఖించి వానిని పరిశీలింపవలెను.

సంబంధించిన ప్రశ్నమునువిడిచి మఱియొకవిషయములోనికిఁ బోవుట, పూర్వోక్తమగుదానిని పశ్చిమోక్తముచే విరుద్ధపఱచుట, అనభిగ్రాహ్యమగు పరవాక్యమునుగుఱించి యాలోచింపమనిచెప్పుట, ఒకవిషయముచెప్పుటకొప్పుకొని చెప్పుమనికోరినపుడు చెప్పకుండుట, తాను చెప్పుదునన్న ప్రస్తుతవిషయమునువిడిచి వేఱువిషయమునుచెప్పుట, తాను చెప్పినవిషయము సరిగాదని విడువఁజూచుట, తనసాక్షులుచెప్పినది సరిగాదనివాదించుట, సంభాషింపరానిచోటసాక్షులతో రహస్యముగ మాట్లాడుట— ఇవి పరోక్తమునేరమునకు హేతువులు.

పరోక్తదండము దావామొత్తమున కైదురెట్లు, తగుసాక్ష్యము లేక స్వయంవాదము గావించువానికిఁ బదిరెట్లు. సాక్షిబత్తెము మొత్తములో నెనిమిదవవంతు. త్రోవబత్తెమును మొత్తమునుపట్టి నిర్ణయింపవలెను. ఈ రెంటిని నియమ్యుఁడి (ఓడినవాఁడు) చ్చుకొనవలెను.

కలహ సాహస సార్థ సమవాయములందుఁదప్ప నభియుక్తుఁడు (ప్రతివాది) వాదిపైఁ బ్రత్యభియోగమును దేరాదు. అభియుక్తునిపై (మఱియొక) నభియోగముండఁగూడదు. అభియోక్తకృతకార్యనిశ్చయుఁడగుటచేతను అభియుక్తుఁడట్టివాఁడుకాకపోవుటచేతను ప్రతివాదిచెప్పినవిషయముల కారోజుననే వాదిజవాబియ్యనపుడువాఁడు (అభియోక్త) పరోక్తుఁడగును. ప్రతివాది జవాబుచెప్పలేనపుడు వానికిమూఁడురోజులుగాని యేడురోజులుగాని యవకాశమియ్యవలెను. అప్పటికిఁగూడ జవాబునియ్యలేనిచో వానికి మూఁడు మొదలు

పంచాశత్పణములవఱకు దండమును విధింపవలెను. మూఁడుపక్షములు గడచినపిమ్మటఁ గూడ జవాబు ఇయ్యనివానికిఁ బరోక్తదండమును విధించి దావామొత్తమును వానినుండి యభియోక్తకిప్పింపవలెను. ప్రత్యభియోగమునందు మాత్రమిది యక్కఱలేదు. నిష్ప్రతిభుఁడగు నభియుక్తునిఁ గూడ నిర్లేచేయవలెను. కాలమునకుసరిగ జవాబు చెప్పనియభియోక్త పరోక్తుఁడగును.

బ్రాహ్మణుఁడుతప్పఁ దక్కినయభియోక్త లోపిపోఁగానపుడు రక్షోఘ్నరక్షితకర్మను చేయింపవలెను.

లోకములోని చతుర్వర్ణ చతురాశ్రమములను ఖిలమగుచుండు స్వధర్మములను రక్షించుటచేతనే రాజు ధర్మప్రవర్తకుఁడగుచున్నాఁడు.

ధర్మము వ్యవహారము చరిత్రము రాజశాసనము— ఇవి వివాదార్థములకాధారములు. ఈనాలుగింటిలోఁ బశ్చిమములు పూర్వములను బాధింపఁగలిగియుండును. (మొదటివానికంటెఁ దరువాతివి బలవత్తరములు.)

ధర్మమునకు సత్యమును వ్యవహారమునకు సాక్షులును చరిత్రకుఁ బురుషులసాంప్రదాయమును శాసనమునకు రాజాజ్ఞయు మూలములు.

ధర్మముననుసరించి ప్రజలనురక్షించుట రాజునకు స్వధర్మమై యున్నది. అట్టివాఁడు స్వర్గము నొందును. ఇట్లుగాక ప్రజలనురక్షింపక వారికిఁ బాధకము గలిగించు రాజుయొక్క దండము మిథ్యావంతమే.

పుత్రునియందును శత్రునియందును సమముగ దోషముననుసరించి ధరింపఁబడిన దండమొక్కటియే ఇహపరలోక రక్షకముగ నున్నది.

ధర్మవ్యవహారచరిత్రశాసనముల ననుసరించి పరిపాలించు రాజు చతురంతమగు భూమిని జయింపఁగలిగియుండును.

చరిత్రకు ధర్మశాస్త్రముతోడను ధర్మశాస్త్రమునకు వ్యవహారముతోడను విరోధముగలిగినపుడు కార్యవిషయమును ధర్మశాస్త్రమునుబట్టియే నిర్ణయింపవలెను.

కాని, రాజశాసనమునకును ధర్మమునకును పరస్పరవిరోధము కలుగునపుడు రాజశాసనమేయచ్చటఁ బ్రమాణమగును. ధర్మశాస్త్రములోనిపాఠ మాదరణీయముకాఁజాలదు.

(అభియోగములందు) స్వపక్షపరపక్షముల స్వయంవాదమెల్లప్పుడు దోషసహితముగనే యుండును. కావునఁ బరిశోధనము సత్యము సాక్ష్యము శపథము — ఇవియే కార్యసాధకములు.

సాక్ష్యమునుబట్టి యొకరివాదము పూర్వోత్తరసందర్భవిరోధముగనుండునో, చారులమూలమున నొకరివాదమసత్యమని యేర్పడునో వారికిఁ బరాజయమును కల్పింపవలెను.

ఇది మూఁడవయధికరణమగు ధర్మస్థీయమున వివాదపదనిబంధమను మొదటియధ్యాయము.

ఆదినుండి యేఁబదియెనిమిదవ యధ్యాయము.



## 59 ప్రకరణము.

### వివాహవిషయము, వివాహధర్మము, స్త్రీధనకల్పము, అధివేదనికము.

ప్రపంచవ్యవహారమునకంతకు వివాహముమూలము. కన్యనలంకరించి కన్యాదానముచేయుట బ్రాహ్మవివాహము. సహధర్మచర్యయే ప్రాజాపత్యవివాహము. రెండుగోవులను పుచ్చుకొని కన్యనిచ్చుట ఆర్షము. యజ్ఞమునందు ఋత్విజునకుఁ గన్యనిచ్చుట దైవము. దంపతుల పరస్పరసమవాయము గాంధర్వము. శుల్కము నిచ్చికన్యనుపరిగ్రహించుట ఆసురము. బలాత్కరించితీసికొనిపోవుట రాక్షసము. నిద్రించియుండునపు డెత్తికొనిపోవుట పైశాచము.

వీరిలో మొదటి నాలుగును పితృప్రమాణములై (తండ్రిచే సంగీకరింపఁబడి) ధర్మ్యములగుచున్నవి. తక్కినవి మాతాపితృప్రమాణములు, ఏలన వారిద్దఱు మహితరయొక్కశుల్కహరులు.

వీరిలో నొకరు లేనపుడు తక్కినవారును, ఇద్దఱు లేనపుడు కన్యయును శుల్కము దీసికొనవచ్చును.

పైవివాహములన్నిటిలో నందఱికిని ప్రీతినికలిగించునది యప్రతిషిద్ధము.

(జీవనాధారమగు) వృత్తియు ఆబధ్యము (అలంకారము) ను స్త్రీధనమనఁబడు. రెండువేలకంటె నెక్కువగ వృత్తియుండవలెను. ఆబధ్యమునకు నియమములేదు. ప్రతివిధానముఁజేయక భర్తపరదేశమునకుఁబోయినపుడు భార్యయీధనమును తన్నుఁబుత్రులనుకోడండ్రను పోషించుటకై వినియోగించుట దోషముకాదు. ప్రతిరోధకవ్యాధి దుర్భిక్ష భయములఁ దొలఁగించుకొనుటకును ధర్మకార్యములందును భర్తసహిత మీధనమును వినియోగింపవచ్చును. ధర్మవివాహితులై సంతానవంతులగు దంపతులునుమూఁడుసంవత్సరములవఱకుఁ గలిసియుండినచో నీధనమునువారిరువురేకీభవించియనుభవింపవచ్చును. గాంధర్వాసురవివాహితులు వృత్తిధనము నిట్లుగలిసియనుభవించినచో సవృద్ధికముగ నిచ్చుకొనవలెను. రాక్షసపైశాచవివాహితులట్లుచేసిన స్తేయదండము నొందుదురు.

— ఇది వివాహధర్మము. —

భర్త మృతిచెందినపుడు ధర్మకామయగుస్త్రీ వైవాహికాభరణములను శుల్కశేషమును తత్క్షణమేపుచ్చుకొనవచ్చును. వివాహానమయమం దియ్యఁబడియుఁ దనయనుభవమందంతవఱకులేనట్టిద్రవ్యమును సవృద్ధికముగఁ దీసికొనవచ్చును. కుటుంబకామయగు స్త్రీ నివేశకాలమందు (పునర్వివాహకాలమందు, శ్వశురపతిదత్తములగు ధనమును పుచ్చుకొనవచ్చును. దీనిఁ ప్రవాసప్రకరణమున నివేశకాలమునుగుఱించి చెప్పఁబడును. శ్వశురుఁడిష్టపడనివపురుషుని (పునర్-)

వివాహము చేసికొనినచో శ్వశురదత్తమగు ధనమునకు హక్కు లేదు. జ్ఞాతులవద్దనుంచఁబడిన దత్తధనమును యథాగృహీతముగా జ్ఞాతులిచ్చుకొనవలెను. న్యాయముగ స్త్రీధనము చేసికొనునపుడు దానియొక్క ధనము నట్టివాఁడు రక్షింపవలెను.

స్మృతిధనమును స్వీకరించిన స్త్రీకి ఏతదాయమందు హక్కు లేదు. ధర్మకామ దానిననుభవింపవచ్చును. పుత్రవతియగుదానికి స్త్రీధనమందు హక్కు లేదు; ఆధనమును పుత్రులు తీసికొనవచ్చును.

పుత్రపోషణమునకని ధనమును తీసికొనినపుడు దానిని వాని నిమిత్తమునకే సమర్పింపవలెను. పురుషసంతానముగల స్త్రీలు భర్తృదత్తమగు స్త్రీధనమును పుత్రులకొఱకై యుంపవలెను. స్వేచ్ఛగననుభవించుటకగు స్త్రీధనమునుసహితము పుత్రుల పేరనే యుంపవలెను.

అపుత్రురాలగు విధవ పతిశయనమును పాలించుచు గురువద్దనున్నయెడల జీవనాంతమువఱకు స్త్రీధనము ననుభవించుచుండవలెను; స్త్రీధనమాపద్ధనమేగదా ? మరణానంతరమాధనమును జ్ఞాతులుతీసికొనవచ్చును.

భర్తజీవించియుండఁగ మృతినొందిన స్త్రీయొక్క ధనమును పుత్రులును పుత్రికలును పంచుకొనవలెను. పుత్రులు లేనపుడు పుత్రికలును వారుగూడ లేనపుడును భర్తృదత్తమగు శుల్కమును భర్తయు బంధుదత్తమును బంధువులును పుచ్చుకొనవలెను.

—ఇది స్త్రీధనకల్పము.—

భార్య వంధ్యయగునప్పుడెనిమిదిసంవత్సరములవఱకును, మృతశిశువును ప్రసవించునపుడుపదిసంవత్సరములవఱకును, ఆడుపిల్లలను ప్రసవించునపుడు పండ్రెండు సంవత్సరములవఱకును నిరీక్షించి పిమ్మట పుత్రార్థియగువాఁడు వివాహముచేసికొనవచ్చును. ఈవిధముగ నిరీక్షింపక పెండ్లి చేసికొనునప్పుడు శుల్కమును స్త్రీధనమునునప్పటిప్రా[illegible]ణమును భార్యకునిచ్చుకొని యిరువదినాలుగుపణముల దండమును

(రాజునకు) చెల్లింపవలెను.

స్త్రీలు పుత్రసంతతికేగనుక వివాహకాలమందు శుల్కము పొందనిభార్యలకు సహితము శుల్కప్రమాణధనమును వస్త్రాభరణాదిద్రవ్యమును అనురూపమగు వృత్తిద్రవ్యము నిచ్చుకొనుచు నెందఱి నైనఁ బెండ్లియాడవచ్చును.

ఋతుకాలమందు వీరిలో వివాహమునుపట్టి పూర్వోఢనైనను జ్యేష్ఠపత్నియయినను తొలుతఁబొందవలెను. తీర్థసమయమందు భార్యనుపొందనివానికిఁ దొంబదియాఱుపణములు దండము. పుత్రవతియు ధర్మకామయు వంధ్యయు సాధువు నీరజస్కయు నకామయైనచో వానినిఁబొందనక్కఱలేదు. అకాముఁడగు పురుషుఁడు కుష్ఠిని ఉన్మత్తను పొందనక్కఱలేదు; కాని పుత్రార్థమై యిట్టిపురుషుని స్త్రీ పొందవలెను.

నీచుఁడు పరదేశగతుఁడు రాజద్రోహి ఘాతముచేయఁదలచినవాఁడు పతితుఁడు నపుంసకుఁడునగు పతులను విడువవచ్చును.

ఇది మూఁడవయధికరణమగు ధర్మస్థీయమున వివాహవిషయమందలి
వివాహధర్మము, స్త్రీధనకల్పము, ఆధివేదనికమును
రెండవయధ్యాయము.
ఆదినుండి యేఁబదితొమ్మిదవ యధ్యాయము.



## 59 ప్రకరణము.

{ వివాహవిషయము, శుశ్రూషాభర్మపారుష్యద్వేష అతిచారఉపకారవ్యవహార ప్రతిషేధములు. }

పండ్రెండు సంవత్సరములవఱకు స్త్రీకిని పదునాఱుసంవత్సరములవఱకుఁ బురుషునికిని వ్యవహారయోగ్యతకలుగఁజాలదు. అటుపిమ్మటవారు పరస్పరశుశ్రూషలఁ జేసికొననిచో స్త్రీకిఁ బండ్రెండుపణములును పురుషునికిరువదినాలుగుపణములును దండము.

కాలనియమములేక ధర్మమునుపొందుటకు హక్కుగలస్త్రీకి గ్రాసాచ్ఛాదనమునుకాని పురుషునియొక్క ఆయము ననుసరించి దాని కంటె నధికముగ భరణద్రవ్యమునుకాని ఇచ్చుకొనవలెను. కాలనియమమున్నప్పుడును శుల్క స్త్రీధన ఆధివేదనికముల నియ్యనప్పుడును పురుషుని యొక్క ఆయము ననుసరించియే మొత్తమునిప్పింపవలెను. శ్వశురకులప్రవిష్టయై భర్తనువదలి స్వతంత్రముగ జీవనముచేయుచున్నప్పుడు భర్తపై భరణమున కభియోగము లేదు.

—ఇది భర్మ.—

నగ్నే వినగ్నే న్యంగే అపితృకే అమాతృకే అనుసంబోధనములచే (తిట్లచే) స్త్రీకి వినయమునేర్పవలెను. (పిమ్మట) వేణుదళరజ్జుహస్తములలో నొకదానిచేత బృష్ఠమునందు మూడుమార్లుకొట్టి, అప్పటికినివశపడనప్పుడు వాగ్దండపారుష్యములలోనర్ధదండమును విధింపవలెను. పైకి దోషముకనబడకున్నను భర్తలయొక్క నీర్ష్యగలస్త్రీలకును బాహ్యవిహారములందునుద్వారములకడనుండుటయందునునలవాటు పడినవారికిని యథానిర్దిష్టమగుదండమునువిధింపవలెను.

ఇది పారుష్యము.

భర్తను ద్వేషించునట్టియు సప్తార్తవయయినట్టియు నన్యునిఁగోరునట్టియుస్త్రీ వెంటనే తనయలంకారద్రవ్యములభర్తకునిచ్చి భర్త మఱియొక్కతెనుపొందుట కంగీకరింపవలెను.

భార్యపై ద్వేషించినభర్త యది (భార్య) భిక్షుకీ సంరక్షక జ్ఞాతికులములలో నొకచోట నుండుట కంగీకరింపవలెను.

స్వయముగఁ జూచికొనవచ్చిన సవర్ణాపసర్పుల సంపర్కము విషయమునను మైథునాపహారవిషయమునను భార్యపైమిథ్యాపవాదముచేయుభర్తకుఁ బండ్రెండుపణములు దండము

భర్తను ద్వేషించుభార్య వానియనుజ్ఞవొందక వానినివిడువఁగూడదు. అట్లే భార్యను ద్వేషించుభర్త సహకారిణియగుదానిని విడువఁగూడదు. భార్యాభర్తలకుఁ బరస్పర ద్వేషము కలిగినప్పుడు పరస్పర

మును విడుచుకొనవచ్చును. భార్య తనకపాయము కలిగించునను శంకచేదానిని భర్తవిడువఁదలఁచినపుడు తనపన్యమును విడుచుకొని వెళ్లిపోవలెను. ధర్మవివాహములలో మాత్ర మిట్టిమోక్షము జరుపఁగూడదు.

దూషితములగు మద్యపాన దర్పక్రీడలందుఁ బ్రవర్తించు స్త్రీకి మూఁడుపణములు దండము. పరస్త్రీలఁజూచుటకును వారితో విహరించుటకును (భర్తయనుజ్ఞనొందక) పగటివేళ వెళ్లుస్త్రీకి ఆఱుపణములును, పురుషులఁజూచుటకును వారితో విహరించుటకును వెళ్ళుస్త్రీకిఁ బండ్రెండుపణములును, ఇట్టిపనుల రాత్రివేళనొనరించినపుడు ద్విగుణముగను దండము.

సుప్తుఁడును మత్తుఁడును నగుభర్తను బలాత్కరించునపుడును ద్వారమునఁ బరవానిని లాగినపుడును భార్యకు ద్వాదశపణదండము. రాత్రి పయికి వెడలిపోయినచో ద్విగుణదండము.

మైథునార్థముగ స్త్రీపురుషులు విలాసచేష్టలొనర్చినను రహస్యముగ సంభాషించినను వారిలో స్త్రీలకిరువదినాలుగు పణములు పురుషులకు ద్విగుణముగను దండము. కేశనీవీదంతనఖావలంబనములుచేయుస్త్రీకిఁ బూర్వసాహసదండము. అట్టిపురుషునికి ద్విగుణదండము.

శంకితస్థానమందు సంభాషించినపుడు స్త్రీకిఁబణదండమునకు బదులు గ్రామమధ్యమందు నిలువఁబెట్టి చండాలుఁడిఱువైపులనైదు కశాహతులఁ గొట్టవలెను.

ఇవి అతిచారములు.

ప్రతిషిద్ధులగు స్త్రీపురుషు లన్యోన్యోపకారముగ క్షుద్రకద్రవ్యముల నిచ్చుకొనునపుడు ద్వాదశపణములును స్థూలకద్రవ్యముల నిచ్చుకొనునపుడిరువదినాలుగుపణములును హిరణ్యసువర్ణముల నిచ్చుకొనునపుడేఁబదినాలుగుపణములును స్త్రీకిదండము. పురుషునికి ద్విగుణదండము. అగమ్యులగు స్త్రీపురుషుల విషయమున సగ

దండము. ప్రతిషిద్ధవ్యవహారవిషయమునను కూడ నిట్లే చేయవలెను.

ఇది ప్రతిషేధము.

రాజద్రోహము చేసినప్పుడును అతిచారము గావించినప్పుడును స్వాయముగఁ దొలఁగిపోయినప్పుడును స్త్రీకి స్త్రీధనమునందును ఆహితమందును శుల్కమునను హక్కు పోవును.

ఇది ధర్మస్థీయమున వివాహవిషయమందలి
శుశ్రూషాభర్మపారుష్యద్వేషాతిచారోపకారవ్యవహారప్రతిషేధములను
మూఁడవ యధ్యాయము.
ఆదినుండి యిరువదవయధ్యాయము.



## 59 ప్రకరణము.

{ వివాహవిషయము, నిష్పతనము, పథ్యనుసరణము, హ్రస్వప్రవాసము, దీర్ఘప్రవాసము. }

భర్తృకృతప్రకారములవలనఁదప్పఁ దక్కినసమయములందుఁ బతిగృహమునుండి వెడలిపోయినట్టి స్త్రీ కాఱుపణములు, ప్రతిషిద్ధయయ్యును నిట్లొనర్చినప్పుడు పండ్రెండుపణములును దండము. పొరుగిల్లు దాటి వెళ్లుస్త్రీ కాఱుపణములుదండము. పొరుగింటివారిని తనయింటిలోనికి రానిచ్చినను, భిక్షుకులనుండి భిక్షను గ్రహించినను వైదేహకులనుండి వారిపణ్యమును తీసికొనినను ద్వాదశపణదండము. ప్రతిషిద్ధయై పైవిధముగ నొనర్చినచోఁ బూర్వసాహసదండము. నలుప్రక్కలనుండు గృహములదాఁటి వెళ్లినపు డిరువదినాలుగుపణములు దండము.

ఆపదలందుఁదప్పఁ దక్కినపుడు పరభార్యలకు స్వగృహమందవకాశమిచ్చిన స్త్రీకి యుక్తదండమును విధింపవలెను. ఆపదలందుఁ బడియు, ఆమెకుఁ దెలియకయు నిట్లుప్రవేశించినను నామెకు దోషములేదు.

పతిజ్ఞాతి తగుమనుష్యుఁడు గ్రామికుఁడు సంరక్షకుఁడు భిక్షుకి స్వకులస్థుఁడు — వీరిలో నొకరిని విప్రకారశంకగలిగినపుడు రక్షణము నకై పొందుట తప్పులేదు, అనిఆచార్యులు.

జ్ఞాతికులమునందనేక పురుషులుండురుగాన వారిలో యోగ్యాయోగ్య పురుషుల నెఱుఁగుట పతివ్రతల కెట్లవకాశమగునని కౌటిల్యుఁడు.

ప్రేత వ్యాధి వ్యసన గర్భనిమిత్తముగ జ్ఞాతికులమును పొందుట ప్రతిషిద్ధముకాదు. ఇట్టినిమిత్తములందు వారించువానికి ద్వాదశపణదండము. అట్లువెళ్లి యచటనే దాగియుండు స్త్రీ స్త్రీధనమును విడుచుకొనవలెను. దానినిదాచుజ్ఞాతులు శుల్కశేషమును విడలుకొనవలెను.

ఇది నిష్పతనము.

పతికులమును విడిచి గ్రామాంతరమునకుఁ బోయిన స్త్రీ పంన్రెండుపణముల దండమునిచ్చుకొనుటయేగాక స్థాప్యాభరణములఁ గూడ విడుచుకొనవలెను.

ధర్మదాన తీర్థయాత్రలందుఁదప్పఁ దక్కినసమయములందు గమ్యపురుషునితోఁ గూడఁ గలిసివెళ్ళిన స్త్రీకి నిరువదినాలుగు పణములను సర్వధర్మలోపమును దండములు. వీరు తుల్యశ్రేయస్కులును పాపులునునైనచో మధ్యమదండము. పురుషుఁడు బంధువైనచో నదండ్యుఁడు, గాని వలదనునపుడు తీసికొనివెళ్ళినచో నర్ధదండము యీవలెను.

మార్గమందును గహనప్రదేశమందును గూఢదేశమందును పరపురుషునితో స్త్రీ కలిసినపుడును మైథునార్థమై శంకితప్రతిషిద్ధుల మార్గమున ననుసరించినపుడును సంగ్రహణదోషమని యెఱుంగవలెను.

మార్గమధ్యమందు నటనర్తక గాయక మత్స్యబంధక గోపాలక శౌండికులతోడను స్త్రీలతోఁబ్రయాణము చేయు నితరపురుషులతోడను కలిసికొనుట దోషముకాదు

నిషేధింపఁబడినపుడు పైపురుషులు స్త్రీనిఁదీసికొనివెళ్ళినచో నట్టివారికిని వారితోఁగలిసివెళ్ళిన స్త్రీలకును పూర్వదండము.

ఇది పథ్యనుసరణము.

హ్రస్వప్రవాసులగు శూద్రవైశ్యక్షత్రియబ్రాహ్మణుల భార్యలప్రజాతలైనచో నొకసంవత్సరమును, ప్రజాతలైనచో సంవత్సరాధికముగను నిరీక్షించియుండవలెను. జీవనాధారమేర్పఱుపఁబడిన వారు ద్విగుణముగ నిరీక్షింపవలెను. అట్టి జీవనాధారములేనివారిని దగుమనుష్యులగుజ్ఞాతులు నాలుగుగాని యెనిమిదిగాని సంవత్సరములు పోషించి, పిమ్మట వారినుండి శుల్కద్రవ్యమును తీసికొని వారిని స్వేచ్ఛగ వదలిపెట్టవలెను. అధ్యయనసంపన్నుఁడగు బ్రాహ్మణునికొఱకు కాతనిభార్య యప్రజాతయైనచోఁ బదిసంవత్సరములును ప్రజాతయైనచోఁ బండ్రెండు వత్సరములును, రాజపురుషునికొఱకై వానిభార్య యాయుఃక్షయాంతముగను నిరీక్షింపవలెను. సవర్ణునివలన సంతానమొందిన స్త్రీ యపవాదము నొందఁగూడదు. కుటుంబవృద్ధికి లోపముగలిగినపుడును తగుమనుష్యులచే విడువఁబడి యాపత్తుపొందినపుడు జీవితార్థముగను స్త్రీ యిష్టమువచ్చినవానిని పొందవచ్చును. ధర్మవివాహమందుఁ బరిగ్రహించినకుమారి ప్రోషితుఁడగుభర్త జీవించియుండినట్లు తెలియుచుండినచో నట్టిస్థితిప్రకటముగానప్పుడు సప్తతీర్థములవఱకును ప్రకటమైనప్పుడు సంవత్సరమువఱకును ప్రోషితుఁడశ్రూయమాణుఁడైనచో నైదుతీర్థములను శ్రూయమాణుఁడైనచోఁ బదితీర్థములను శుల్కములో నొకభాగమునుమాత్రమిచ్చి ప్రోషితుఁడై యశ్రూయమాణుఁడైనచో మూఁడుతీర్థములను శ్రూయమాణుఁడైనచో సప్తతీర్థములను పూర్ణముగశుల్కమునిచ్చి ప్రోషితుఁడై యశ్రూయమాణుఁడైనచో నైదుతీర్థములను శ్రూయమాణుఁడైనచోఁ బదితీర్థములను నిరీక్షించియుండవలెను. తీర్థోపరోధము ధర్మనాశము గావునఁ బైకాలములతిక్రమించినపుడు ధర్మస్థకారులచే విడువఁబడి యిష్టమువచ్చిన

వారినిఁ బొందవచ్చును.

దీర్ఘప్రవాసుఁడు ప్రవ్రజితుఁడు మృతుఁడు —వీరిభార్యలు ప్రజాతలైనచో నేడుతీర్థములును ప్రజాతలైనచో సంవత్సరమును నిరీక్షింపవలెను. పిమ్మటఁ బతిసోదరునిఁ బొందవచ్చును. భర్తృసోదరులనేకులుండినచో భర్తతరువాతవానిని ధార్మికుని భర్మసమర్థునిఁ గనిష్ఠుని అభార్యుని— వీరిలోనొకరినివివాహమాడవచ్చును. భర్తకుసోదరులు లేనపుడు సపిండునిఁగాని తత్తుల్యునిఁగానిపొందవచ్చును. సపిండతుల్యులనేకు లుండునపుడాసన్నక్రమమునననుసరించి వివాహము చేసికొనవలెను. సంతానముకొఱకై పైదాయాదులనతిక్రమించి మఱియొకనినిగ్రహించినపుడు స్త్రీకిని వివాహమాడిన పురుషునికిని దాతకును ననుజ్ఞయిచ్చినవానికిని సంగ్రహాత్యయమునువిధింపవలెను.

ఇది ధర్మస్థీయమున వివాహసందర్భమందు నిష్పతనము పథ్యనుసరణము హ్రస్వప్రవాసము దీర్ఘప్రవాసమును నాలుగవయధ్యాయము. వివాహవిషయము సమాప్తము. ఆదినుండి యఱువదియొకటవ యధ్యాయము.



## 60 ప్రకరణము.

### దాయవిభాగమందు దాయక్రమము.

తలిదండ్రులును వారిపూర్వులునుగలపుత్రు లస్వతంత్రులు. వారు గతించినపిమ్మట వంశక్రమాగతద్రవ్యములను పితృక్రమమున ననుసరించి దాయవిభాగము గావింపవలెను. పితార్జితద్రవ్యసహాయమునఁగాక స్వయముగ నార్జించిన తక్కినద్రవ్యమంతయు నవిభాజ్యము.

పిండము నాలుగవపురుషాంతమువఱకు నవిచ్ఛిన్నమగుటచే నవిభక్తులగుపుత్రపౌత్రులు వంశక్రమాగతద్రవ్యమం దంశభాక్కులగుదురు. (నాలుగవ పురుషాంతరమునకావల) పిండము విచ్ఛిన్న

మయినపుడు సమముగ పంచఁబడఁ బంచుకొనవలెను.

పితృద్రవ్యములేనివారును పితృద్రవ్యమును విభజించుకొనిన వారును మరలఁగలిసిజీవించుచున్నచో సమముగఁ బంచుకొనవలెను; అందు ద్రవ్యమును వృద్ధిఁబొందించినవాఁడు వృద్ధ్యంశమునుబొందవలెను.

అపుత్రునియొక్క ద్రవ్యమును వానిసోదరులును సహజీవులును వానికిఁ గల (స్థిరాస్తి) వానికన్యలును తీసికొనవలెను.

పుత్రవంతుని ద్రవ్యమును ధర్మవివాహమువలనఁబుట్టిన వాని పుత్రులును (అట్టివారు లేనపుడు) పుత్రికలును వీరులేనపుడు జీవించియున్న తండ్రియుఁ దండ్రిలేనపుడు సోదరులును సోదరపుత్రులును తీసికొనవలెను. తండ్రిలేని సోదరులనేకులున్నప్పుడు వారందఱుదానిని పంచుకొనవలెను. భ్రాతృపుత్రులు వారితండ్రిభాగమునుమాత్రము తీసికొనవలెను. పలువురుతండ్రులుగల సోదరులకు వారితండ్రులననుసరించి భాగమువచ్చును. పితృభ్రాతృభ్రాతృపుత్రులలోఁ గ్రమముగ మొదటివారు జీవించియున్నప్పుడు తర్వాతివారికి హక్కు లేదు. అట్లే సోదరులలో జ్యేష్ఠకనిష్ఠులవిషయమునఁగూడ గ్రహించునది.

తండ్రి తాను జీవించియుండఁగనే విభాగముగావించినచో నెవ్వరికిఁగాని యధికముగ నియ్యరాదు. కారణములేక నెవ్వనిని వేఱుపెట్టరాదు. తండ్రిలేనపుడు జ్యేష్ఠభ్రాతలు మిథ్యావృత్తులుగానికనిష్ఠుల ననుగ్రహింపవలెను.

ప్రాప్తవ్యవహారులే దాయవిభాగమును చేసికొనవలయును. అప్రాప్తవ్యవహారులయొక్క భాగమును విశుద్ధముగ విభజించువారికి వ్యవహారజ్ఞానమువచ్చునంతవఱకు వానినిమాతృబంధువులవద్దఁగాని గ్రామవృద్ధులవద్దఁగాని యుంపవలెను. ప్రోషితునిభాగవిషయమునఁగూడ నిట్లేచేయవలెను. అవివాహితులకు వివాహితులతో సమముగ నైవేశనికమును (వివాహవ్యయము) కన్యలకుఁ బ్రాదానికమును

పిచ్చుకొనవలెను. ఋణరిక్థముల నన్నిటిని సమముగఁ బంచుకొనవలెను.

నిష్కించను లుదపాత్రములసహితము పంచుకొనవలయునని యాచార్యులు. ఇది యవసరముకాదు, అర్థమున్నప్పుడే పంచుకొనవలయునుగాని లేనిచోఁ బంచుకొనుటయెట్లు? అని కౌటిల్యుఁడు.

“ఇంతధనము సామాన్యము, దీనిలో నొక్కొకనికింతయంశము” అని సాక్షులవద్దఁజెప్పి పంచుకొనవలెను దుర్విభక్తము అన్యోన్యాపహృతము అంతర్హితము అవిజ్ఞాతోత్పన్నము నగుద్రవ్యమును మఱలఁ బంచుకొనవలెను.

స్త్రీధనము (అగ్నిసంస్కారముజరుగని) ప్రేతద్రవ్యము శ్రోత్రియభిన్నమగు కదర్యానిద్రవ్యములుతప్ప దాయాదులు లేని తక్కిన వారిద్రవ్యమును రాజుతీసికొనవలెను. శ్రోత్రియద్రవ్యమును త్రైవిద్యులకియ్యవలెను.

పతితుఁడు పతితసంతానము క్లీబుఁడు జడుఁడు ఉన్మత్తుఁడు అంధుఁడు కుష్ఠియు— వీరికంశములేదు. భార్యలసొత్తు జడత్వాది దోషములు లేనివారి సంతానమునుచెందును. పతితుఁడు తప్పఁదక్కిన వారికి గ్రాసాచ్ఛాదనములమాత్రమియ్యవలెను

కృతదారులగు పై పతితాదులకు సంతానము లేనప్పుడు వారి బంధువులు వారికిఁ బుత్రులఁ గలిగించి వారియంశముల నిప్పింపవలెను.

ఇది ధర్మస్థీయమున దాయవిభాగప్రయామందలి దాయక్రమమను

నైదవయధ్యాయము.

ఆదినుండి యఱువదిరెండవ యధ్యాయము.



60 ప్రకరణము.

అంశవిభాగము

ఏక స్త్రీపుత్రులగు బ్రాహ్మణులలో మేకలును క్షత్రియుల లో గుఱ్ఱములును వైశ్యులలో గోవులును శూద్రులలో గొఱ్ఱెలును

జ్యేష్ఠాంశము. నానిలోనంగవికలములు మధ్యమాంశము. భిన్నవర్ణపశులు కనిష్ఠాంశము. చతుష్పాజ్జంతువులు లేనపుడు రత్నములు తప్పఁ దక్కినదరిద్రవ్యములలోఁ బదియవపాలు జ్యేష్ఠుఁడు తీసికొనవచ్చును. జ్యేష్ఠుఁడు పితృఋణమునుతీర్చిశి సంబంధముగలవాఁడుగదా! ఇదియాశనసవిభాగము.

తండ్రిమరణానంతర మాతనియానాభరణములు జ్యేష్ఠునకును శయనాసనములు కంచములుమధ్యమునకును కృష్ణధాన్యములు ఇనుపపాత్రములు గోశకటము కనిష్ఠునకును చెందవలెను. మిగిలినద్రవ్యమును సమముగఁ బంచుకొనవలెను.

అప్పచెల్లెండ్రింశభాక్కులు కానేరరు; గాని తల్లిమరణానంతర మామెయొక్క కాంస్యాభరణములు వారినిచెందును. జ్యేష్ఠుఁడు నపుంసకుఁడైనచో జ్యేష్ఠాంశములో మూఁడవవంతును అన్యాయవృత్తియైనపుడు నాలుగవవంతును పొందవలెను. నివృత్తధర్మకార్యుఁడును కామాచారుఁడునునైనచో సర్వమును విడుచుకొనవలెను. మధ్యమకనిష్ఠుల విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది. వీరిలో మానుషోపేతుఁడు జ్యేష్ఠాంశమందు సగముతీసికొనవచ్చును.

నానా స్త్రీపుత్రుల విషయము:—

ఇద్దఱుభార్యలను విధ్యుక్తముగగ్రహించి ననుగ్రహింపకపోయినను వారిద్దఱు కన్యలుచేయఁదగువిధులనుచేసినను చేయకపోయినను వారిలో నెవరికి ముందుపుత్రుఁ డుజనించునో యాతని కేజ్యేష్ఠాంశము. మఱియుఁ గనలపుత్రులలో నుత్పత్తిక్రమమునను సరించియే జ్యేష్ఠభావము.

సూతమాగధవ్రాత్యరథకారులగు పుత్రులకైశ్వర్యమునుపట్టియే విభాగము. తక్కినవారు వీరిననుసరించి జీవింపవలయును. అస్వతంత్రులగువారు (పంచుకొనవలసినపుడు) సమముగఁ బంచుకొనవలెను.

(బ్రాహ్మణుఁడు) నాలుగువర్ణములలోని స్త్రీలను పెండ్లాడినపుడు వారివలనఁగలిగిన పుత్త్రులలో బ్రాహ్మణీపుత్త్రుఁడు నాలుగంశములను క్షత్త్రియాపుత్త్రుఁడు మూఁడంశములను వైశ్యాపుత్త్రుఁడు రెండంశములను శూద్రాపుత్త్రుఁడొక యంశమును తీసికొనవలెను. క్షత్త్రియులు వైశ్యులు క్రమముగ మూఁడు రెండు వర్ణములలోని స్త్రీలను పెండ్లాడినపుడుకూడ నిట్లేయని గ్రహించునది.

బ్రాహ్మణుని యనంతరాపుత్త్రుఁడు (క్షత్త్రియస్త్రీయందుఁబుట్టినవాఁడు) మానుషోపేతుఁడైనచోఁ దుల్యాంశమును తీసికొనవలయును. ఇట్లే క్షత్త్రియవైశ్యుల యనంతరాపుత్త్రులు మానుషోపేతులయినపుడు తుల్యాంశమునుకాని యర్ధాంశమునుకాని పుచ్చుకొనవలెను. తుల్యాతుల్యులగు భార్యలలో నొక్కతెకే పుత్త్రుఁడుగలిగిన పుడతఁడంతయుఁదీసికొని బంధువులఁబోషింపవలెను.

బ్రాహ్మణునకొకశూద్రస్త్రీయందే (పారశవ) పుత్త్రుఁడుగలిగినపుడతఁడు మూఁడవవంతును స్వధానిమిత్తముగ నాసన్నుఁడగు కుల్యుఁడుగాని సపిండుఁడుగాని తక్కిన రెండువంతులను తీసికొనవలెను. ఆసన్నులులేనపుడు తండ్రియొక్క గురువైనను శిష్యుఁడైనను నా రెండుభాగములఁ దీసికొనవచ్చును. లేక వానిసెలవుపైనతనిసగోత్రుఁడుగాని మాతృబంధువుగాని వాని క్షేత్త్రమునందు సంతానము గనవచ్చును. అప్పుడాసంతతి కాధనము చెందును.

ఇది ధర్మస్థీయమున దాయవిభాగవిషయమందంశవిభాగమను

నాఱవ యధ్యాయము.

ఆదినుండి యఱువదిమూఁడవయధ్యాయము.



## 60 ప్రకరణము.

### పుత్త్రవిభాగము

పరునిచే స్వక్షేత్త్రమందుంపఁబడిన బీజము క్షేత్త్రవంతునిదే (ఆసంతానము క్షేత్త్రవంతునిదేయనుట) యని యాచార్యులు.

తల్లి భస్త్రికవంటిదగుటచే రేతస్సెవనిదో వానిసంతానమని మఱికొందఱు.

బీజక్షేత్రములు రెండును సమానములేయని కౌటిల్యుఁడు.

విధ్యుక్తముగఁ బరిగ్రహింపఁబడిన స్త్రీయందుఁ దనకుఁబుట్టినవాఁడౌరసుఁడు. పుత్రికాపుత్రుఁడతనితో సమానుఁడు. నియుక్తుఁడగు సగోత్రునివలనఁగాని యన్యగోత్రునివలనఁగాని తనక్షేత్రమందుఁబుట్టినవాఁడు క్షేత్రజపుత్రుఁడు; వీనిని కనినవానికి వేఱుసంతానము లేనపు డిరువురుతండ్రులకితఁడేకకుమారుఁడై ద్విగోత్రుఁడై యిద్దఱకును పితృకర్మఁజేసి వారిద్దఱిద్రవ్యమునకు హక్కుగలవాఁడగును. బంధువులగృహమందు గూఢజాతుఁడగు గూఢజుఁడు క్షేత్రజునితోఁదుల్యుఁడు; బంధువులచే విడువఁబడినపుడతని నెవ్వఁడుసంస్కరించునో వానికాతఁడు పుత్రుఁడగును. కన్యకుఁబుట్టినవాఁడు కానీనుఁడు. గర్భిణియగుదానిని పెండ్లాడినపుడు దానికిఁబుట్టినవాఁడు సహోఢుఁడు. పునర్వివాహముగఁ బెండ్లాడినదానికిఁ బుట్టినవాఁడు పౌనర్భవుఁడు.

స్వయంజాతుఁడు పితృబంధువులకు దాయాదుఁడగును పరజాతుఁడు సంస్కర్తకేగాని బంధువులకు దాయాదుఁడు కానేరఁడు. తల్లిదండ్రులచే నుదకపూర్వముగ నియ్యఁబడినదత్తుఁడుగూడ సంస్కర్తకేదాయాదుఁడగును. స్వయముగఁగాని బంధువులమూలమునఁగాని పుత్రభావమున నొకనినొందినవాఁడుపగతుఁడు. పుత్రత్వమందధికృతుఁడయినవాఁడు కృతకుఁడు. పుత్రుఁడుగఁ గొనఁబడినవాఁడు క్రీతుఁడు.

ఔరసుఁడుపుట్టినచో (అనౌరసులగు) సవర్ణులు తృతీయాంశమందును అసవర్ణులు గ్రాసాచ్ఛాదనమాత్రమునందును హక్కుగలిగి యుందురు. బ్రాహ్మణక్షత్రియుల కనంతరయందుఁ బుట్టినవారుసవర్ణులు, ఏకాంతరయందుఁ బుట్టినవారసవర్ణులు. బ్రాహ్మణునికి వైశ్యయందుఁబుట్టినవాఁ డంబష్ఠుఁడు; శూద్రియందుఁ బుట్టినవాఁడు

నిషాదుఁడు లేక పారశవుఁడు. క్షత్త్రియునకు శూద్రయందుఁ బుట్టిన వాఁడు ఉగ్రుఁడు. వైశ్యునకు శూద్రయందుఁ బుట్టినవాఁడు శూద్రుఁడే.

అచరితవ్రతులకు సవర్ణాలందుఁ బుట్టినవారు వ్రాత్యులు.

ఇవి యనులోమజములు.

శూద్రుని కుత్తమజాతి స్త్రీలయందుఁ బుట్టినవారు క్రమముగ ఆయోగవ క్షత్త చండాలులగుదురు. వైశ్యునికిఁ బుట్టినవారు మాగధవైదేహకులగుదురు. క్షత్త్రియునకుఁ బుట్టినవారు సూతులు. పౌరాణికులగు సూతమాగధులిట్టివారుగారు. వారు బ్రహ్మక్షత్త్రజాతి సాంకరంబె నధికులు. ప్రతిలోమజులగు వీరందఱు స్వధర్మమును రాజు విడుచుటచేఁ బుట్టుచున్నారు.

ఉగ్రునికి నిషాదియందుఁ బుట్టినవాఁడు కుటకుఁడు. నిషాదున కుగ్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు పుల్కసుఁడు. వైదేహికయం దంబష్ఠునికిఁ బుట్టినవాఁడు వైణుఁడు. అంబష్ఠయందు వైదేహకునికిఁ బుట్టినవాఁడు కుశీలవుఁడు. ఉగ్రునికి క్షత్త్రియందుఁ బుట్టినవాఁడు శ్వపాకుఁడు. వీరును మఱికొందఱును అంతరాళులు.

వైణ్యుఁడు వృత్తిచే రథకారుఁడు. వైణ్యులు స్వజాతియందే వివాహముచేసికొని తమపూర్వులవృత్తము ననుసరించి వర్తించుచు స్వధర్మము నిలుపుకొనవలెను. వీరు శూద్రులుఁగాని చండాలులు తప్పఁదక్కిన హీనజాతివారుఁగాని వ్యవహరింపఁబడుదురు.

ఈ రీతిఁ గులధర్మముల ననుసరించి ప్రజలు ప్రవర్తించునట్లు రాజుపరిపాలించినయెడల నతఁడు స్వర్గముఁబొందును, లేనిచో నరక మునఁబడును.

అంతరాళులలో దాయవిభాగము సమము.

దేశజాతిసంఘగ్రామములందుఁ బాటింపఁబడు ధర్మముననుసరించి దాయవిభాగము చేసికొనవలెను.

ఇది ధర్మశ్లోకీయమున దాయవిభాగమందలి పుత్త్రవిభాగమను సప్తమాధ్యాయము.

ఇంతటితో దాయవిభాగము సమాప్తము.
ఆదినుండి యఱువదినాల్గవ యధ్యాయము.



## 61 ప్రకరణము

### గృహవాస్తుకము

వాస్తువివాదములను చుట్టుప్రక్కలనుండెడివారి సాక్ష్యముపై విచారింపవలెను. గృహము క్షేత్రము ఆరామము సేతుబంధము తటాకము ఆధారము — ఇవియన్నియు వాస్తువిశేషములు. గృహముచుట్టును నినుపకడియలనమర్చి కట్టుటయే సేతువు. సేతుభోగానుకూలముగ నింటినికట్టవలెను. పరులవేశ్మములనాక్రమింపక క్రొత్తయిండ్లను కట్టుకొనవలెను.

రెండరత్నులలోతును మూఁడడుగుల వెడల్పునుకల పునాదును వేయవలెను. ప్రసూతికై పదిదినములుపయోగించుటకుఁగాను కట్టఁబడిన శాలలందుఁదప్పఁ దక్కినయిండ్లలో నుదకపానగృహము నూయి ఉదకముపోవుటకు మార్గము అవస్కరము (పెంటపోయుటకుఁజోటు) నుండవలెను. ఇట్లు చేయనివానికిఁబూర్వసాహసదండము. ఇట్లే కల్యాణకృత్యములందు గదులు గోతులు ఆచామోదకమార్గములు లోనగువాని నిర్మించుకొనవలెను.

మూఁడడుగులుగాని యొకటిన్నర యరత్నులుగాని దట్టించి నీరుబాగుగఁ బ్రవహించుటకువీలగున ట్లుదకమార్గము నేటవాలుగఁ గట్టవలెను. అట్లుచేయనిచో నేఁబదినాలుగుపణములు దండము.

ఒకయడుగుపునాదియు నొకయరత్నిమొదలు నాలుగడుగుల వఱకు వైశాల్యమును కలుగునట్లొక యగ్నిగృహమును ఉదంజరస్థానమును రోచనిస్థానమును కుట్టనీస్థానమును నిర్మింపవలెను. లేనిచో నిరువదినాలుగుపణములు దండము.

రెండేసియిండ్లకు మధ్యనుకాని వానిప్రక్షిప్తములకుమధ్యను కాని యొకకిష్కువుగాని మూఁడడుగులుగాని యవకాశమునుంప

వలెను. వానిపయి కప్పులు నాలుగంగుళముల యవకాశముగలిగిగాని రెండుకదానిపైనొకటిగాని యుండవలెను. అణిద్వారము కిష్కుమాత్రపరిమితిగను దానికొక్కతలుపులు లోపలికిఁ దెఱచుటకడ్డులేకుండఁగను చేయుంపవలెను. వెలుతురు వచ్చుటకై పయిభాగమునఁ జిన్న వాతాయనము నుంపవలెను. పై విషయములలో గృహస్వాములందఱుఁగలిసి యిష్టానుసారముగ నేర్పఱచుకొనుచు ననిష్టముల వారించుకొనుచుండవలయును.

వర్ష బాధ లేకుండునట్లు విశాలమును దృఢమునునగుచాపను కప్పువెన్నుపైవేసి దానిని జారకుండునట్లుగను భగ్నముగాకుండునట్లుగను చేయవలెను. ఇట్లు చేయనివారికిఁ బూర్వసాహసదండము.

రాజమార్గములందును రథ్యలందునుతప్పఁ దక్కినప్రదేశములందుఁ బ్రతిలోమద్వారములవలనను వాతాయనములవలనను బాధగలిగించునప్పుడు పయిదండమునే విధింపవలెను.

గోతులు మెట్లు కాలువలు నిచ్చెన పెంట మొదలగువానిచే నితరులకు బాధగలిగించినను లేక వారిభోగమును నిగ్రహించినను వారికుడ్యములకుదకమువలన నష్టముగలిగించినను ద్వాదశపణములు దండము. మూత్రపురీషోపఘాతముగలిగించినప్పుడు ద్విగుణదండము.

కాలువల ధారాళముగఁ బ్రవహించునట్లు చేయవలెను. లేనిచోఁ బండ్రెండుపణములు దండము.

ప్రతిషేధింపఁబడినను గృహమందుండువానికిదియేదండము. పారుష్యస్తేయసాహససంగ్రహణమిథ్యాభోగదోషము లొనర్చువారినితప్పఁ దక్కినవారివద్దనుండి యద్దెపుచ్చుకొని యింటనుండి వారిని తొలఁగించువానికిఁ బండ్రెండుపణములు దండము.

తనంతటఁదానింటినివదలువాఁడు సంవత్సరపుటద్దెలో శేషభాగమునిచ్చుకొనవలెను.

అందఱుఁగలిసి యనుభవించుచుండు గృహవిషయమున సాహాయ్యముచేయనివానికి, నట్టిగృహమందందఱికి సామాన్యమగు భోగ

మునకు ఆటంకము గలుగఁజేయువానికిని పండ్రెండు పణములు దండము. అట్టి గృహమును నాశముచేయువానికి ద్విగుణదండము.

కోష్ఠకాంగణములు తప్పఁ దక్కిన నివేశనములగు ప్రదేశములను అగ్నిశాలలును కుట్టనశాలలును నంపజేని సామాన్యముగ భోగింపఁబడునవి.

ఇది ధర్మస్థీయమున వాస్తుకవిభాగమందలి గృహవాస్తుకమను

ఎనిమిదవయధ్యాయము.

ఆదినుండి యఱువదియైదవ యధ్యాయము.



## 61 ప్రకరణము.

### వాస్తువిక్రయము.

భూములనుకొనుటలో మొదట జ్ఞాతులకును పిమ్మట సామంతులకును వారితర్వాత ధనికులకును హక్కుగలదు. కొనువారికంటె నన్యులగు నలువది బాహ్యకుటుంబములవా రింటియెదుట నిలిచి గృహవిక్రయమును ప్రకటింపవలయును. క్షేత్రము ఆరామము సేతుబంధము తటాకము ఆధారము లోనగువాని హద్దులను సేతుభాగములననుసరించి గ్రామవృద్ధులయెదుటఁ బ్రకటించి, దీనిక్రయమింత? దీని నెవరుకొనెదరు? అని మువ్మారు చాటించినపిమ్మట దానికెవరు నడ్డుచెప్పక పక్షమునఁ గొనఁదలఁచువాఁడు కొనవచ్చును.

పోటీవలన మూల్యవృద్ధి కలిగినపుడు మూల్యవృద్ధిని శుల్కముతోఁ గూడఁ గోశమునకర్పించుకొనవలెను. విక్రయసమయమున వేలముపాడువాఁడు శుల్కమునిచ్చుకొనవలెను. వాస్తుస్వామి లేనపుడు వేలముపాడినచో నిరువదినాలుగు పణములు దండము. ఏడు రాత్రులు గడచినపిమ్మటఁగూడ వాస్తుస్వామి రానిచో వేలముపాడినవానికా యాస్తి వశమగును. వేలముపాడినవానికిఁగాక మఱియొకనికి వాస్తువు నిచ్చినచో

రెండువందలపణములు దండము. వాస్తుప్రదేశ విక్రయసమయము లలో నిరువదినాలుగుపణములు దండము.

ఇది వాస్తువిక్రయము.

రెండు గ్రామములవారికి హద్దులగురించినవివాదము కలిగినపుడు సమీపమందలి యైదు పది గ్రామములలోని ముఖ్యులు సహజములైనట్టియుఁ గృత్రిమములైనట్టియు సేతువులసహాయమున వివాదమును పరిష్కరింపవలయును. కర్షక గోపాలవృద్ధులు పూర్వానుభవముగలవారు లేక సేతువులఁదెలిసిన బాహ్యులలోనగువారిలో ననేకులుగాని యొక్కరుగాని హద్దులనునిర్దేశించి విపరీత వేషులై హద్దులుండుప్రదేశమునకుఁ బైగ్రామమునందలి ముఖ్యులఁదీసికొనిపోవలయును. అట్టివారిచేనిర్దేశింపఁబడిన సేతువులగపడనపుడు సహస్రదండము. ఆవిసరిగ బుజువుపడినపుడు సీమాపహారులకును సేతుచ్ఛేదకులకును సహస్రదండము.

సేతుభోగములేనట్టియు హద్దులులేనట్టియుఁ బ్రదేశమును యథోపకారముగ రాజు పంచిపెట్టవలెను.

క్షేత్రమునుగురించిన వివాదమును సమీపమందుండు గ్రామవృద్ధులు పరిష్కరింపవలెను. వారిలో ద్వైధీభావముకలిగినపుడు వాదిప్రతివాదులచే నంగీకరింపఁబడిన శుచులగు ననేకులయభిప్రాయమునుపట్టి దానినినిర్ణయింపవలెను. లేదా క్షేత్రము నిద్దఱు సమముగఁబంచుకొనవచ్చును. అట్లు వారుభయులు పరిష్కరించుకొనలేనపుడు దానినిరాజు తీసికొనవలెను.

హక్కుదారులేని క్షేత్రమును యథోపకారముగ రాజుపంచిపెట్టవలెను. బలాత్కరించి వాస్తువునుతీసికొనినయెడల స్తేయదండము. సకారణముగఁ దీసికొనినచో నట్టివానిప్రయాసమును జీవనమునుపరిగణించి వానియొద్దమక్తాను (శిస్తు) వసూలుచేయవలెను. హద్దులనపహరించువానికిఁ బూర్వసాహసదండము. హద్దులుభేదించువానికిఇరువదినాలుగుపణములుదండము. తపోవన వివీత మహాపథ శ్మశాన

దేవకుల యజనపుణ్యస్థానములవిషయమునఁగూడ నిశ్చయన్ని యెఱుంగునది.

ఇది మర్యాదాస్థాపనము.

వివాదములన్నియు సమీపస్థులసాక్ష్యములఁబట్టి పరిష్కరింపవలెను. విపీతస్థలకేదారషండఖలవేశ్మ వాహనకోష్ఠములకు సంభవించినబాధలను పూర్వపూర్వప్రధానముగ నివారింపవలెను. బ్రహ్మసోమారణ్యదేవయజనపుణ్యస్థానములందుండువారు తప్పఁ దక్కినవారు ఆధార పరివాహ కేదారమార్గములమూలమునఁ బరక్షేత్రములలోని సస్యములకు బాధకలిగించినపుడు యథోపఘాతముగ మూల్యమునిచ్చుకొనవలయును. కేదార ఆరామ సేతుబంధములకుఁ బరస్పరహింసకలిగినపుడు హింసాద్విగుణముగ దండమునిచ్చుకొనవలెను. క్రిందనుండు చెఱువునీటిచేఁ బై తటాకపునీటిచే ఫలించు క్షేత్రములను ముంచివేయఁగూడదు. మూఁడు సంవత్సరములనుండి యుపయోగింపఁబడనట్టివాని విషయమునఁదప్పఁ దక్కినక్రిందనుండు చెఱువులకుఁ బయిచెఱువులనుండివచ్చు నీటివాగులను నిరోధింపరాదు. దాని నతిక్రమించినవానికిఁ బూర్వసాహసదండము. తటాకమునకు భంగముగలిగించినపుడుగూడ నిదియేశిక్ష. ఆపదలువచ్చినపుడు తప్పఁ దక్కినపు డయిదుసంవత్సరములవఱకుఁ బాడుబెట్టిన సేతుబంధములందు స్వామ్యము చెడును.

తటాక సేతుబంధములఁ గ్రొత్తగ నిర్మించువారికి అయిదుసంవత్సరములవఱకును భగ్నముల బాగుచేసినవారికి నాలుగుసంవత్సరములవఱకును బాగుగనున్నవానిని మఱింత బాగుపఱచినవారికి మూఁడుసంవత్సరములవఱకును పరిహారమునియ్యవలెను. తాకట్టువలనఁగాని విక్రయమువలనఁగాని స్వాధీనపడినక్షేత్రస్థలమునకు రెండుసంవత్సరములవఱకుఁ బరిహారము.

వాయుయంత్రములయొక్కయు వృషభములయొక్కయు సహాయముచేత సంపాదింపఁబడిన నీటివలనను తటాకముల వలనను

ఫలించు కేదార ఆరామషండవాపముల సస్యవర్ణాముల ననుసరించి యథోపకారముగఁ బన్నునిచ్చుకొనవలెను. మఱియు ప్రక్రియ అపక్రియ విభాగభోగనిస్సృష్టముల భూముల సేవ్యము చేయువారుపై తటాకాదులను మంచిస్థితియందుంపవలెను. లేనిచో హీనద్విగుణదండము నిచ్చుకొనవలెను

తూములనుండితప్ప మఱియొకచోటనుండి చెఱువులలోని నీటిని బ్రవహింపఁజేయువానికిని, తూములనుండి ప్రవహించునీటిని ప్రమాదముచే నిరోధించువానికిని నాలుపణములుదండము.

**ఇది ధర్మస్థీయమున వాస్తువిషయకమందు వాస్తువిక్రయము సీమావివాదము మర్యాదాస్థాపనము బాధాబాధికమను తొమ్మిదవయధ్యాయము.**

**ఆదినుండి యఱువదియాఱవ యధ్యాయము.**



## 61-62 ప్రకరణములు.

### వివీతక్షేత్రపథహింస, సమయానపాకర్మ

ఉచితములగు కర్మోదకమార్గములనిరోధించువానికినినను చితమగునట్లుగ వానినిచేయువానికిని పూర్వసాహసదండము. పరభూమియందు సేతురూపపుణ్యస్థాన చైత్యదేవాయతనములను నిర్మించువానికిని, భగోత్సృష్టములయినవిత్తుఁ దక్కినపూర్వానువృత్తములగు ధర్మసేతువులను విక్రయాధానములఁ జేయువానికిని చేయించువానికిని మధ్యమసాహసదండము. (ఇట్టివిషయములలో) సాక్షులకు నుత్తమసాహసదండము. హాస్యాదావలేవపు ... గ్రామమందలిదగు మనుష్యులు (వారు) భగోత్సృష్టములను బాగుచేయవచ్చును.

దుర్గనివేశప్రకరణమున మార్గప్రమాణములగుఱించి చెప్పఁబడెను.

క్షుద్రపశుపథములను మనుష్యపథములను నిరోధించువానికిఁ బండ్రెండుపణములును మహాపశుపథముల నిరోధించువానికి నిరు

పదినాలుగుపణములును హస్తిక్షేత్రపథముల విషయమున నేఁబది నాలుగు పణములును సేతువనపథములవిషయమున నార్నూఱు పణములును శ్మశానగ్రామపథ నిరోధనముల రెండువందలపణములు ను ద్రోణముఖపథవిషయమున నైదువందలపణములును స్థానీయరాష్ట్రవివీతపథముల విషయమున వేయిపణములును దండము. ఈమార్గములను కొంచెముమీఁదుమీఁదఁ దున్నినవానికిఁ గూడ నీదండములే; అతిమాత్రముగా దున్నినవానికి నాలుగురెట్లుహెచ్చుగ దండమును విధింపవలెను

దోష ఉపనిపాత అవిషహ్యరూపములగు నష్టములున్నప్పుడు తప్పఁదక్కినపుడు పొరుగుననున్నవానిభూములను బీజకాలమున నపహరించువానికిఁ బండ్రెండుపణములు దండము.

కరదులు వారిభూములను కరదులకుమాత్రమును బ్రహ్మదేయకులు వారిభూములను బ్రహ్మదేయకులకు మాత్రమును విక్రయాధానములొనర్పవలెను, లేనిచోఁ బూర్వసాహసదండము. కరదుఁడు కరములేని గ్రామమునకువెళ్ళి వాసముచేయునెడలఁ బూర్వసాహసదండము. కరదునిభూమిలోఁ బ్రవేశించు వానికి నివేశనముతప్ప దానిలోని తక్కినద్రవ్యములన్నియు వానివశమగును. ఇష్టమున్నయెడల నివేశనముగూడ వానికియ్యవచ్చును. పాడుపడినయనాదేయము లనెవఁడయిన నయిదుసంవత్సరము లనుభవించిపిమ్మటఁ బ్రయాస నిష్క్రయమును పుచ్చుకొని దానిని (భూస్వామికి) మరల నిచ్చివేయవలెను. అకరదులు పరదేశగతులయినను వారికి వారిభూమియందుఁ గల హక్కుమాత్రము చెడదు.

గ్రామకార్యమునిమిత్తమై పంపఁబడి యొకచోటికిఁ బోవునప్డు గ్రామాధికారునికి సహాయముగ గ్రామస్థులొక్కొక్కరొక్కొక్కమారు వెళ్లుచుండవలెను. అట్లు వెళ్ళనివారు యోజనమునకొకటిన్నర పణము చొప్పున నిచ్చుకొనవలెను.

చోరులు జారులు కానివారిని గ్రామమునుండి తొలఁగించు గ్రామాధికారుని కిరువది నాలుగుపణముల దండము. అట్లే గ్రామమున కుత్తమసదండము. తొలఁగింపఁబడినవాఁడు మఱలఁబ్రవేశించుచున్నయెడ నదివఱకేచెప్పఁబడియె.

గ్రామమునకు నూరుధనుస్సులదూరమున నంతటను స్తంభములతోఁగూడిన యుపశాలనొకదానిని కట్టింపవలెను.

పశుపరిచారమునకై వివీతములను బయళ్ళను వనములనువృద్ధినొందింపవలెను.

వివీతములందు మేసినపిమ్మటఁగూడ నక్కడనే సంచరించుచుండు నుష్ట్రమహిషముల పైఁ బాదరూప్యమును గవాశ్వఖరములపై నెనిమిదవవంతును క్షుద్రపశువులపైఁ బదునాఱవవంతును దండము విధింపవలెను. మేసినతర్వాత నచటనేపరుండియుండువానికి ద్విగుణదండము. అచటనే కట్టఁబడినవానికిఁ జతుర్గుణదండము. [గ్రామదేవవృషభములకును ఈని పదిదినములుదాటనిగోవులకును ఆబోతులకును నీదండములు లేవు.

(పశువులు; సస్యముల భక్షించునపుడు దానివలనగలిగిననష్టమునకు రెండింతలుదండము నిచ్చుకొనవలయును. క్షేత్రాధికారికిఁ జెప్పక పశువుల క్షేత్రములోఁ జరింపఁజేయువానికిఁ బండ్రెండుపణములును స్వేచ్ఛగదానియందు విడుచువానికిరువదినాలుగుపణములును వగ్గరనుండిబోవువానికర్ధదండమును విధింపవలెను. పూఁదోటల భక్షించునపుడుగూడ నిదియేదండము. కంచలఛేదించునపుడు ద్విగుణదండము. వేశ్మఖలఅంగణములందుండు ధాన్యములనుతినునపుడు దానివలనగలిగిననష్టము నిచ్చుకొనవలెను.

సస్యభక్షణముచేయు నభయవనమృగములఁ బట్టుకొనియధికారులతోఁజెప్పి వానికిహాని కలుగకుండునట్లుగఁ దొలఁగింపవలెను.

పశువులను తాళ్ళచేతను కొరడాలచేతనువారింపవలెనుకాని వానికి మఱియొకవిధమగుహింస చేయఁగూడదు. అట్లుచేసినచోవా

రికిఁ బాహుష్యదండము విధింపవలెను. బ్రతిమాలినను దృష్టాపరాధులగువారిని సర్వోపాయములచే శిక్షింపవలెను.

ఇది క్షేత్రపథహింస.

కృషికై గ్రామమునకు వచ్చి కృషిచేయని వానిపై విధింపఁబడు దండము గ్రామమును చెందవలెను. అట్టివారు వారి వేతనమునకును వారికిచ్చినభక్ష్యపేయములకును ద్విగుణముగదండము నిచ్చుకొనవలెను. యజ్ఞాదులందుఁ బనులఁజేయనివారికిఁగూడ నిదియేదండము.

ఉత్సవప్రదర్శనములకొఱకగు ఖర్చులలో నంశమియ్యనివాఁడును వానిజనమును తదుత్సవమును చూడఁగూడదు. ప్రచ్ఛన్నముగ వినినిజూచినను నందఱికిహితమగుకర్మల కాటంకపఱచినను నంశద్విగుణదండము నిచ్చుకొనవలెను.

అందఱకు హితమగుదాని నొకఁడు చెప్పినను వానియాజ్ఞనుచేయవలెను. అట్లుచేయనపుడు ద్వాదశపణదండము. గ్రామస్థులుకలిసి యట్టివానినికొట్టినపుడు వారిలోనొక్కొకరికి నపరాధద్విగుణమగు దండము. హానికలుగఁజేసినవారిలో బ్రాహ్మణుఁడును బ్రాహ్మణులలో నధికుఁడగువానికిని నెక్కువదండమును విధింపవలెను. యజ్ఞములందుఁదమతో నేకీభవింపనిబ్రాహ్మణునికి హానిచేయక వానినుండియంశమునుమాత్రము పుచ్చుకొనవలెను. దేశజాతికులసంఘములసంబంధించిన సమయానపాకర్మలవిషయమునఁగూడ నిట్లేయని గ్రహించునది.

మార్గములు కలియుబ్రదేశములందు దేశహితములగు సేతువులఁగట్టువారికిని గ్రామమునకు శోభనుతను కలుగఁజేయువారికిని రాజుహితప్రియములఁ జేయవలెను.

ఇది ధర్మస్థీయమున వాస్తుకవిషయమందలి వివీతక్షేత్రపథహింసయను పదియవయధ్యాయము. ఇంతటితో వాస్తుకము సమాప్తము.

సమయానపాకర్మకూడ నింతటితో సమాప్తము.

ఆదినుండి యఱువదియేడవ యధ్యాయము.



63 ప్రకరణము.

ఋణాదానము.

నూటకి నెలకొకటింబావుపణము ధర్మ్యవృద్ధి (వడ్డీ). అయిదు పణములు వ్యావహారికవృద్ధి. కాంతారనివాసస్థులకుఁ బదిపణములు. ఓడవర్తకులకిరువదిపణములు. ఇంతకంటె నెక్కువవృద్ధిని పుచ్చుకొనునపుడు కర్తకును కారంతకునుపూర్వసాహసదండము. సాక్షులొక్కొకరికి దానిలోసగముదండము.

ధనిక (అప్పునిచ్చువారు) ధారణికుల (అప్పు పుచ్చుకొనువారు) చరిత్రము రాజయోగక్షేమావహమగుటచే దానినిపరిశోధింపవలెను. సస్యనిష్పత్తికలుగునపుడు ధాన్యవృద్ధి ఖరీదులోసగముకంటెఁదక్కువగ నుండవలెను. ప్రక్షేపవృద్ధి లాభములోసగము. సమయమునతిక్రమింపక దానినిప్రతిసంవత్సరము నిచ్చుకొనవలెను. చిరప్రవాసమువలన నిచ్చుటకువీలులేనపుడు తుదకు మూల్యద్విగుణముగ నిచ్చుకొనవలెను. లేనివృద్ధినిసాధించువానికిని వృద్ధినసలుతోఁ గలిపి యీమొత్తమసలనివాదించువానికిని బంధ (వివాదద్రవ్యము) చతుర్గుణదండము. అప్పిచ్చినమొత్తమునకంటె నాలుగురెట్లధికము గనిచ్చిన ట్లభియోగముదెచ్చినచో నాలుగురెట్లుదండము. అందులో మూఁడువంతులు ఋణదాతయుఁ దక్కినదానిని ఋణమునుతీసికొనినవాఁడును నియ్యవలెను.

దీర్ఘసత్ర వ్యాధిగురుకులోపరుద్ధులకును బాలురకును అసారులకును నిచ్చినఋణముపై వృద్ధిని పుచ్చుకొనఁగూడదు. ఋణముచెల్లుటకై వచ్చినపుడు దానినిపుచ్చుకొననిచోఁ బండ్రెండుపణములు దండము కారణముచెప్పి యిట్లుపుచ్చుకొననపుడు వృద్ధిహీనముగ నామొత్తము నొకచోటనుంచవలెను. బాలవృద్ధవ్యాధితవ్యసనిప్రోషితదేశత్యాగులిచ్చిన ఋణములును రాజ్యవిభ్రమమువలన వసూలు చేయఁబడని ఋణములునుతప్పఁ దక్కినవి పదిసంవత్సరములుపేక్షింపఁబడినచోఁ జెల్లవు.

మృతిఁజెందినవాని పుత్త్రులు వడ్డీనిచ్చుకొనవలెను. (పుత్త్రులు లేనప్పుడు) రిక్థహరులగు దాయాదులుగాని సహగ్రాహులుగాని జామీనుదారులుగాని దానిని చెల్లింపవలెను. మఱియొకవిధమగు జామీనుగాని బాలుఁడు జామీనుగను ఉండఁగూడదు. కాలనియమము లేని ఋణమును పుత్త్రులు పౌత్త్రులు లేక రిక్థహరులగు దాయాదులు నిచ్చుకొనవలెను. దేశకాలనియమములు లేక జీవితవివాహభూములకై తీసికొనఁబడిన ఋణమును పుత్త్రులు పౌత్త్రులు వహించుకొనవలెను.

ప్రోషితుని పైఁదప్ప దక్కిన పెక్కుఋణములుగలవానిపై నేకకాలమందు అభియోగము చేరాదు. ప్రోషితుఁడైనవాఁడుగూడ ఋణములఁ దీసికొనినకాలము ననుసరించి వానిని చెల్లింపవలెను, లేక రాజునకియ్యవలసినదానిని శ్రోత్రియులకియ్యవలసినదానిని మొదట నిచ్చివేయవలెను.

దంపతులలోను, పితాపుత్త్రులలోను, అవిభక్తులగు సోదరులలోను పరస్పరకృతమగు ఋణము చెల్లదు.

కర్షకులును రాజపురుషులును కర్మకాలములందు ఋణమునకై పట్టుకొనఁబడఁదగరు. గోపాలక అర్ధసీతికుల కియ్యవలసిన ఋణములుతప్ప దక్కిన పతికృతఋణముల గుఱించి వినినను భార్య వాని విషయమున బాధ్యురాలు కాఁజాలదు. స్త్రీకృతఋణములకుఁ బతి బాధ్యుఁడై యుండును. ఋణమునుతీర్పక ప్రోషితుఁడై తప్పుకొనిన వానికి ఉత్తమసాహసదండము. ఒప్పుకొననిచో సాక్షులే దానికిఁ బ్రమాణము.

విశ్వసనీయులు పవిత్రులు గౌరవపాత్రులునగు ముగ్గురు సాక్షులుండవలెను. పక్షానుమతులగు నిద్దఱైననుండవలెనుగాని ఋణవిషయమున నొక్కఁడే సాక్షి యుండఁగూడదు.

స్యాలులు సహాయులు ఖయిదీలు ఋణమునిచ్చినవారు ఋణముపుచ్చుకొన్నవారు శత్రువులు అంగహీనులు శిక్షితులు — వీరు

సాక్షులుగనుండుట కర్హులుగారు. స్వవర్గమునకు సంబంధించిన ఋణ
ములందు దప్పఁ దక్షిణవానియందు వ్యవహారావస్థులు రాజు శ్రో
త్రియులు గ్రామభృతకులు కుష్ఠులు వ్రణులు పతితులు చండాలులు
కుత్సితకర్ములు అంధులు బధిరులు మూకలు అహంవాదులు స్త్రీలు
రాజపురుషులు సాక్షులుగనుండరాదు. పారుష్య స్తేయసంగ్రహణా
భియోగములందు వైరిస్యాలసహాయులుతప్పఁ దక్షిణవారుసాక్షులు
గనుండవచ్చును. రహస్యవ్యవహారములందు రాజులును తపస్వులు
నుతప్ప నుపశ్రోతలు నుపద్రష్టలు నగు స్త్రీపురుషులలో నొక్కొక
రుసాక్షిగనుండవచ్చును. భృత్యులపక్షమున స్వాములును శిష్యుల
పక్షమున ఋత్విగాచార్యులును పుత్రులపక్షమునఁ దలిదండ్రులును
లేక యితరులయినను నిగ్రహణవిషయమున సాక్షులుగనుండవచ్చు
ను. వీరు పరస్పరమభియోగములఁ దెచ్చుకొనునపు డుత్తమదండము.
పరోక్తులుదశబంధమును అవీరులుపంచబంధమును నిచ్చుకొనవలెను.

ఇది సాక్ష్యాధికారము.

సాక్షులను బ్రాహ్మణ ఉదకుంభ అగ్నిసమీపమునకుఁ దీసి
కొనిపోవలెను. అచ్చట "సత్యముచెప్పుము" అని బ్రాహ్మణసాక్షి
తోడను, (నిజముచెప్పనిచో) "నీయిష్టాపూర్తముల ఫలమునశింపఁగా
కపాలహస్తుఁడవై శత్రుబలమును భేదించి యాచకుఁడవగుదువు" అని
రాజన్యవైశ్యసాక్షులతోడను, "నీవునిజముచెప్పనిచో నీపూర్వాద్యు
తనజన్మముల పుణ్యఫలములు రాజునుపొంది రాజానర్పుపాపము ని
న్నుఁబొందగలదు. అనృతమాడినచో దండముకూడవిధింపఁబడును.
ఇఁకమీఁదనయిన యదార్థము తెలియకమానదు", అని శూద్రసాక్షి
తోడను జెప్పవలెను.

సాక్షు లేకమంత్రులై యేకవిధముగ నాలోచించుకొని సత్య
ముగఁబ్రవృత్తురు. అశ్లేష రాత్రులవఱకుఁజేసిన యెడలఁ బండ్రెండు ప
ణము లును మూఁడుపక్షములవఱకుఁ జేసిన యెడల నభియోగదండము
మునిచ్చుకొనవలెను. సాక్షులలో శేషాభిప్రాయముకలిగిన వారు పవి

తుప్రియును సమమతులును నగువారిలో నెక్కువసంఖ్యనుబట్టి వివాదమును నిర్ణయింపవలెను; లేక మధ్యమునయిన గ్రహింపవచ్చును. ఇవి జరుగనపుడు దాదద్రవ్యమును రాజుహరింపవచ్చును. అభియోగము మొత్తముకంటె సాక్షులు తక్కువగఁజెప్పినపుడు ప్రయోక్త యాక్షేపమొత్తమునుబట్టి దండమునిచ్చుకొనవలెను. సాక్షులెక్కువచెప్పినపుడా యధికద్రవ్యము రాజునుచేరవలెను. అభియోక్త బాలిశుఁడైనపుడును వివాదాంశమును (సాక్షులు) బాగుగ వినియుండనపుడును లేకయది దుర్లిఖితమైనపుడును ఋణముదీసికొనినవాఁడు మృతుఁడైనపుడును సాక్షులమూలముననే వివాదమును నిర్ణయింపవలెను.

సాక్షుల బాలిశ్యమువలన దేశకాలకార్యములు దెలిసికొనుట యుపయోగములేనపుడుమాత్రము పూర్వమధ్యమోత్తమదండముల విధింపవలెనని యౌశనసులు.

సత్యాసత్యవివాదములందుఁ గూటసాక్ష్యములఁజెప్పి నష్టము గలుగఁజేయునపుడు నష్టమునకుఁ బదిరెట్లుదండము నిచ్చుకొనవలెనని మానవులు.

బాలిశ్యమువలన విసంవాదముచేయు సాక్షులకుఁ జిత్రఘాతమని బార్హస్పత్యులు.

అట్లుకాదు. సాక్షులుసత్యమునుమాత్రమేవినవలెను. అట్లువినని వారికి నిరువదినాలుగుపణములును అసత్యమునువినిన వారికిఁ బండ్రెండుపణములును దండమని కౌటిల్యుఁడు.

సమీపమందుండునట్టియుఁ గాలాతిక్రమము లేక రాఁగలిగినట్టియు సాక్షులను (వివాదపడువారు) స్వయముగఁ దీసికొనిరావలెను. దూరదేశమందుండునట్టియు వచ్చుటకిష్టపడనట్టియు సాక్షులను నధికారులమూలముగఁ దెప్పింపవలెను.

ఇది ధర్మస్థీయమున ఋణాదానమను పదునొకండవయధ్యాయము.

ఆదినుండి యఱువదిరెండవ యధ్యాయము.



## 64 ప్రకరణము

### ఔపనిధికము.

ఋణాదానవిషయమును జెప్పినయంశములు ఉపనిధివిషయమునం గూడం జెల్లును.

పరచక్రాటవికులమూలమున దుర్గరాష్ట్రవిలోపము కలిగినపుడును, ప్రతిరోధకులమూలమున గ్రామ సార్థ వ్రజములకు నాశముసంభవించినపుడును రాజ్యమంతయునశించినపుడును గ్రామమధ్యమందలి యగ్న్యుదకబాధలవలనఁ బూర్తిగా వస్తువినాశము కలిగినపుడును జ్వాలావేగోపరుద్ధమై యేవియోకొన్నిమాత్రము రక్షింపఁబడినపుడును నావలుమునిగిపోయినపుడును దొంగలచే హరింపఁబడినపుడును ఉపనిధినడుగఁగూడదు.

ఉపనిధి ననుభవించినవాఁడు దేశకాలానురూపముగ భోగవేతనము నేగాక పండ్రెండుపణములు దండమునుకూడ నిచ్చుకొనవలెను; ఉపభోగమువలన నుపనిధికి నష్టముకలిగినపుడును లేక మఱియొకవిధమగుహాని దానికిఁగలిగినపుడును నష్టమునుభరించి యిరువదినాలుగుపణములు దండమునియ్యవలెను.

ఉపనిధినుంచుకొనినవాఁడు మరణించినను వ్యసనగతుఁడయినను దానివిషయమై యభియోగము దేరాదు.

ఉపనిధికి నాధానవిక్రయఅపవ్యయములఁ గలిగించినవాఁడు దానికినాలుగురెట్లు దాచుకొనినవానికిచ్చి అయిదురెట్లు దండమును కూడ భరింపవలెను. దానిని బరివర్తనము చేసినపుడును చెడఁగొట్టినపుడును మూల్యసమము నిచ్చుకొనవలెను.

ఆధులకుఁ (తాకట్టుపెట్టఁబడినవస్తువులు) బరిణాశోపభోగవిక్రయ ఆధాన అపహారములు గలిగించినపుడుగూడ నిక్షేపనిగమనించునది.

సోపకారమగునాధినశింపదు, దానికిమూల్యవృద్ధికూడ లేదు. నిరుపకారమగునాధి నశించుటయేగాక దానిమూల్యముగూడ వృద్ధి

యగును.

తాకట్టుపెట్టినదానిని (ఋణముదీర్చినపిమ్మట) విడుదలఁజేయనివానికిఁ బండ్రెండుపణములు దండము. ప్రయోజకుఁడు (తాకట్టునుంచుకొనినవాఁడు) లేనపుడు దానిమూల్యమును గ్రామవృద్ధులకడ నుంచి దానినితీసికొనవచ్చును: (లేక) అప్పటికయిన మూల్యమునిచ్చి పిమ్మటవృద్ధిలేకుండునట్లచటనే యుంపవచ్చును.

అధిమూల్యము తగ్గుననుభయము కలిగినపుడు ధర్మస్థులకొక్కయు నాధిపాలులయొక్కయు ననుజ్ఞనుపడసి యందలిలాభములఁ దెలిసినవారిసమీపమునఁగాని ధారణసన్నిధానమందుఁగాని ఆధినిక్రయింపవచ్చును.

పరిమాణభోగ్యమయినట్టియు ఫలభోగ్యమయినట్టియు స్థావరమగునాధిని నసలువృద్ధులుపుచ్చుకొని మూల్యక్షయము గాకుండునట్లు మఱలనియ్యవలెను. ఋణముదీసికొనినవాని యనుమతిలేక ఆధిననుభవించునపుడందువలనఁ గలిగినలాభమునిచ్చి అసలుఋణముపైఁ గూడ హక్కునువదలుకొనవలెను. ఆధినిగుఱించిన తక్కినవిషయములన్నియు నుపనిధివిషయమునఁ జెప్పఁబడినట్లేయని గ్రహించునది.

ఆదేశము అన్వాధి— వీనివిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

వర్తకునిమూలమునఁ బంపఁబడువస్తువునుతీసికొనిపోవువాఁడు నిర్దిష్టప్రదేశమును చేరనపుడును చోరులచేఁగొట్టఁబడినపుడును నాద్రవ్యమునకు వర్తకుఁడు బాధ్యుఁడుకాఁజాలఁడు. మార్గమందతఁడు మృతుఁడయినచో వానిదాయాదులకుసహిత మీవిషయమున బాధ్యతలేదు. తక్కినవిషయము లుపనిధియందువలెనే యనియెఱుంగునది.

ఎఱువుగాను నద్దెకుగాను పుచ్చుకొనినవస్తువులను (చెడకుండ) యథావిధిగ నిచ్చివేయవలెను. వీనికి భ్రంశ ఉపనిపాత దేశకాలములవలన నష్టవినష్టములుకలిగినపుడు వానిని భరింపవలసినబాధ్యత లేదు.

తక్కినవిషయము లుపనిధియందువలెనే యని యెఱుంగునది.

వైయావృత్యవిక్రియము:— వైయావృత్యకరులు (ఇతరులవస్తువులవిక్రయించు వర్తకులు) తమకమ్ముటకుఁ గానిచ్చినవస్తువులను దేశకాలానుగుణముగవిక్రయించి విక్రయధనమును లాభముతోఁ గూడ నిచ్చివేయవలెను. తక్కినవిషయము లుపనిధియందువలెనే యని యెఱుంగునది. దేశకాలాతిక్రమమువలన నష్టముగలిగించినపుడు తా ముపుచ్చుకొనిన కాలమునాటి ఖరీదునుబట్టి మూల్యలాభములనిచ్చుకొనవలెను. నిర్ణీతములగు ఖరీదులకు విక్రయింపవలసినదని చెప్పఁబడినపుడు లాభమున పేక్షింపక విక్రయించి మూల్యమునియ్యవలెను. ఖరీదులుతగ్గినపుడు తక్కువఖరీదునకమ్ముటవలన వచ్చినమూల్యము నియ్యవలెను. కలిసి వ్యవహారముచేయువారును విశ్వసనీయులును రాజనిందకుఁ బాత్రులుగానివారును భ్రంశోపనిపాతములవలన నష్టవినష్టములుకలిగినపుడు మూల్యమిచ్చుకొనవక్కఱలేదు. కాని, దేశకాలవ్యవధానమువలన నష్టమునంభవించినపుడు నష్టద్రవ్యమును గొట్టివేసి తక్కినమూల్యలాభముల నియ్యవలెను. కలిసి వ్యవహారించునపుడందలి లాభనష్టములఁ బంచుకొనవలెను. తక్కినవిషయము లుపనిధియందువలెనేయని యెఱుంగునది. వైయావృత్యవిక్రియ యిట్లని తెలిసికొనునగు.

ఉపనిధుల సంబంధించినవిషయములు నిక్షేపములవిషయమునఁగూడ వర్తించును. ఒకనిచే నిక్షిప్తమగునిక్షేపమును మఱియొకనికిచ్చినపుడు వచ్చిననష్టమును తానుభరింపవలెను. నిక్షేపము నపహరించినపుడు దానిపూర్వచరిత్రమును, నిక్షిప్తలును తద్విషయమునఁ బ్రమాణము.

కారువు లపవిత్రులు. వారినిక్షేపధర్మము కారణపూర్వమై యుండదు. కారణహీనమగువారి నిక్షేపమెవ్వరయినహరించినపుడు నిక్షిప్తయధికారులయొద్ద రహస్యముగ సెలవుగయికొని గూఢభిత్తియందుఁగొందఱుసాక్షులనుంచి దానియందలినిజము నెఱిగింపవలెను.

లేక వనాంతమునుండిగాని ప్రవహణమధ్యమునుండిగాని వచ్చినట్లునటించి వృద్ధవ్యాధితనైన దేహకులలో నొక్కఁడు గుర్తులుగలవస్తువును రహస్యముగను నమ్మకముతోడను వానిహస్తమునందుంచి వెళ్ళవలెను. పిమ్మట నతనినెలవునుండి నతనిపుత్రుఁడుగాని సోదరుఁడుగాని నిక్షేపమునిమ్మని కోరవలెను. అట్లుకోరినపుడిచ్చినచో శుద్ధుఁడు. లేనిచో నానిక్షేపము నిచ్చుకొనుటయేగాక స్తేయదండమునుకూడ ననుభవింపవలెను. లేక నమ్మఁదగినవాఁడొకఁడు ప్రవ్రజ్యాభిముఖునివలెనటించి గురుతులుగలవస్తువును వీనిచేతిలోనుంచిపోయి కాలాంతమందువచ్చి యాచించినచో దానినిచ్చినయెడల వీఁడు శుచియని యనుకొనవలెను; లేనిచో నిక్షేపమును స్తేయదండమును నిచ్చుకొనవలెను. లేక బాలిశునివలెనటించి రాజభటులవలన భయముకలుగఁబోవుచున్నదను మిషచే గృతలక్షణమగు ద్రవ్యమును మఱలఁదీసికొందుమని వానివద్దనుంచి వెళ్ళవలెను పిమ్మట బంధనాగారగతుఁడై యా వస్తువును మఱలనడుగునపు డతఁడిచ్చినచో శుద్ధుఁడు; లేనియెడల నిక్షేపమును స్తేయదండమును నిచ్చుకొనవలెను. లేక గురుతులఁబట్టి వీనియింటిలోని నిక్షేపమును నిక్షేప్తృబంధువు లడిగినపుడు దనకు నిక్షేపముగాని నిక్షిప్తముగాని తెలియదనిచెప్పినచోఁ బైశిక్షలొనరింపవలెను. వీని ద్రవ్యభోగప్రాప్తిని నిక్షేప్తయొక్క నిక్షేపప్రాప్తిచిహ్నములను వానియర్థసామర్థ్యమును బ్రశ్నించి తెలిసికొనవలెను.

ఇద్దఱు కలిసిచేయుపనులన్నిటిలోఁగూడ నీవిధముగనే చేయవలెను.

కావున దేశకాలానుపూర్వముగఁ గార్యముల బాగుగనాలోచించి స్వజనులతోడను, పరజనులతోడను (వ్యవహారముల) సాక్షుల నేర్పుటఁజేయవలెను.

**ఇది ధర్మస్థీయమున ఔపనిధికమను పండ్రెండవయధ్యాయము.**

**ఆదినుండి యఱువదితొమ్మిదవ యధ్యాయము.**



## 65 ప్రకరణము.

### దాసకల్పము.

ఉదరదాసుఁడు (జన్మమువలననే దాసుఁడు) కానట్టియు ఆర్యప్రాణుఁడును అప్రాప్తవ్యవహారుఁడును నగుశూద్రుని విక్రయాధానములఁ జేయుస్వజనమునకుఁ బండ్రెండుపణములును, వైశ్యునివిషయమున నిరువదినాలుగుపణములు, క్షత్రియునివిషయమున మూఁడురెట్లును, బ్రాహ్మణునివిషయమున నాలుగురెట్లును దండము. ఈవిక్రయాధానములఁ జేయువారు పరజనులయినచో వారికిని క్రేతృశ్రోతలకును పూర్వమధ్యమోత్తమదండములను వధదండమును విధింపవలెను. మ్లేచ్ఛులను విక్రయాధానములొనర్చుటలో దోషములేదు. ఆర్యునికెప్పుడు దాసభావముకూడదు.

కులమునకును బంధన (దావాతీర్పు) విషయమునను తూర్యాదులకును నాపదగలుగుటచే నార్యునినాధానముగఁ జేసినచో మూల్యమిచ్చి వానినివిడిపింపవలెను. బాలుఁడును సాహాయ్యదాతయునయినచో ముఖ్యముగ నీపనిని చేయవలెను.

తనంతటఁ దానొకమాఱు తాకట్టుఁబడినవాఁడును, ఇతరులచే రెండుమాఱ్లు తాకట్టుపెట్టఁబడినవాఁడును నిష్పతితులయినచో యావజ్జీవము దాసులుగనుండవలెను. వీరిద్దఱు పరదేశాభిముఖులయినపుడుగూడ నిట్టిదాసత్వమే పొందుదురు.

దాసునియొక్క విత్తము నపహరించువానికిని దాసునియార్యభావమును తొలఁగించువానికిని నర్ధదండము.

నిష్పతితుని ప్రేతుని వ్యసనుని తాకట్టుపెట్టుకొనినవాఁడు మూల్యమును మఱలఁదీసికొనవచ్చును.

దాసులచేఁ బ్రేతవిణ్మూత్రోచ్ఛిష్టములఁ గ్రహింపఁజేయుటయు దాసులనగ్నులుగనుంచుటయు శిక్షించుటయు దాసస్త్రీలనతిక్రమించుటయు మూల్యనాశకరములు. ధాత్రి పరిచారిక అర్థసీతిక ఉపచారిక— వీరినతిక్రమించినచో వారిని వదలిపెట్టవలెను. అభిజాతుఁ

డగు నుపచారకునికి హానిగలిగించినచో నతఁడు స్వేచ్ఛగఁ దొలఁగిపో వచ్చును. స్వవశమందుండు ధాత్రియగు నాహితకను దాని యిష్టము లేక పొందువానికిఁ బూర్వదండమును పరవశమందుండుదానిని పొందువానికి మధ్యమదండమును విధింపవలెను. ఆహితయగు కన్యను స్వయముగఁగాని యన్యునిచేఁగాని దూషించువానికి మూల్యనాశ మగుటయేగాక రెండింతలు శుల్కమునుకూడ (వాఁడు) దండముగ నిచ్చుకొనవలెను.

ఆత్మవిక్రియము చేసికొనినవానిసంతానము నార్యులుగ నెన్నుకొనవలయును. పిత్ర్యమగు దాయమును స్వామికర్మ కవిరోధముగఁ దానుసంపాదించిన ద్రవ్యమును దాసుఁడు తీసికొనవచ్చును. మూల్యమిచ్చి మఱల నార్యత్వమును పొందవచ్చును, ఉదరదాస ఆహితకులవిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

దాసనిష్క్రియము పరిక్షేపానురూపముగ నుండును. దండమునకుఁగాను దాసుఁడయినవాఁడు పనిచేసి దండమునుపొందవచ్చును. యుద్ధమందుఁ బట్టుకొనఁబడిన యార్యుఁడు కర్మకాలానురూపమగు సగముమూల్యమునకు విడువఁబడవచ్చును.

దాసుఁడు గృహజాతుఁడయినను దాయాగతుఁడయినను క్రియముచేఁ గొనఁబడినవాఁడయినను లేక మఱియొకవిధముగ లభించినవాఁడయినను ఎనిమిదిసంవత్సరములకంటెఁ దక్కువవయస్సుగలిగి విబంధుఁడై యున్నచో నతనికిష్టములేని నీచకర్మలందు నియోగించువానికిని లేక విదేశమందువిక్రయాధానములఁ జేయువానికిని గర్భభర్మము చేయకయే గర్భిణియగుదాసిని విక్రయాధానములఁ జేయువానికిని కొనువానికిని శ్రోతలకును పూర్వసాహసదండము.

దాసానురూపమగు నిష్క్రియమునిచ్చినపు డార్యత్వమును పొందింపని యజమానునికిని కారణములేక దాసునినిరోధించువానికిని పంద్రెండుపణములు దండము.

దాసపరివ్యయమునకు జ్ఞాతులేదాయాదులు. వారు లేనపుడు దాయమును స్వామిపుచ్చుకొనవచ్చును.

స్వామి వలనదాసికి సంతానముకలిగినచో నదియును దానిపుత్రుఁడును దాసీత్వమునుండి విముక్తులగుదురు. కుటుంబపోషణములకై యది దాసిగనే యుండవలసివచ్చినపుడు దానిసోదరుఁడును సోదరియును విముక్తులుగావలెను.

ఒకమాఱు స్వతంత్రతనుపొందిన దాసునిఁగాని దాసినిఁగాని వారియనుమతిలేక మఱల విక్రయాధానములఁ బొందించువానికిఁ బండ్రెండు పణములు దండము.

ఇది దాసకల్పము.

కర్మకరుల కర్మసంబంధముల నాసన్నులు తెలిసికొనుచుండవలెను. వారు నిర్ణయించుకొనఁబడిన వేతనమును యజమానులనుండి పొందవలెను. ప్రారంభమున వేతనమును నిర్ణయించుకొనినచోనది కర్మకాలానురూపముగ నుండవలెను. అసంభాషితవేతనులలోఁ గర్షకులు సస్యమునందును గోపాలకులు నేతియందును వైదేహకులు విక్రయింపఁబడినవస్తువుల మూల్యములందును పదియవవంతుతు తీసికొనవచ్చును. నిర్ణీతములగువేతనముల నిర్ణయించినప్రకారమియ్యవలెను, అట్లే పుచ్చుకొనవలెను.

స్వతంత్రముగఁబనిచేయు కారుశిల్పకుశీలవచికిత్సకవాగ్జీవనపరిచారకాదులు మఱియొకచోట వారిరివాజునుపట్టిగాని లేకవానిలోఁగుశలులునిర్ణయించినదానినిపట్టిగాని వేతనములఁబొందవలెను. వేతనములగుఱించిన వివాదములను సాక్షులవిచారించిగాని సాక్షులు లేనపుడు పనిచేయించుకొనినవారినిపరీక్షించిగానిపరిష్కరింపవలెను. నిర్ణీతవేతనము నియ్యనపుడు దశబంధముగాని యాఱుపణములుగాని దండము. వేతనాపవ్యయము గావించినపుడు పండ్రెండుపణములుగాని పంచబంధముగాని దండము.

నదీ వేగజ్వాలాస్తేనవ్యాళములచే నుపరుద్ధుఁడయినపుడు సర్వస్వమును దారపుత్రులను నన్ను నిచ్చెదనని చెప్పి రక్షణమునొందిన యార్తుఁడు కుశలులచే నిర్ణయింపఁబడిన వేతనమును రక్షకునకిచ్చుకొనవలెను. ఆర్తదానవిషయమందంతట నిట్లే యనియెఱుంగునది.

వేశ్యలు నిశ్చితపరికారముగ (విటులను) సంగమభోగములఁ బొందింపవలెను. కాని యాలోచింపక చేయఁబడిన యనుచితములగు నిర్ణయములు చెల్లఁగూడదు.

ఇది ధర్మస్థీయమున దాస కర్మకరకల్పవిషయమందలి దాసకల్పమును
కర్మకరకల్పమందలి స్వామ్యాధికారమునను
పదుమూఁడవయధ్యాయము.
ఆదినుండి డెబ్బదియవ యధ్యాయము.



## ౬౨ ప్రకరణము.

### కర్మకరకల్పము, సంభూయసముత్థానము.

వేతనమునుపుచ్చుకొనినను పనిచేయనట్టియు ... నకారణముగఁ గార్యసంరోధము గలిగించునట్టియు భృత్యునకుఁ బండ్రెండుపణములు దండము.

అశక్తుఁడును కుత్సితకర్మలందు నియోగింపఁబడినవాఁడును వ్యాధితుఁడును వ్యసనియునగువారియెడల దయ చూపవలెను. వీరు తమపనుల నితరులచేఁ జేయింపవచ్చును. ఇట్లు చేయుటవలన నష్టము సంభవించినచోఁ గర్మమూల్యమున నష్టపూరణముచేయవచ్చును.

మఱియొకనికి నీవుపనిచేయఁగూడదు, నిన్ను మఱియొకనిపనికై బంపనని భర్తనిర్ణయింపవలయుననికొందఱు. పనిచేయింపనిభర్తకును పనిచేయని భృత్యకునకును పండ్రెండుపణములు దండము. గృహీతవేతనుఁడగు భృత్యకుఁడు భర్తకార్యమునుముగింపక తనంతటఁదాను మఱియొకపనికై వెళ్ళరాదు.

(పనిచేయుటకు) సిద్ధపడివచ్చినభృతకునిచేఁ బనిచేయించుకొననపుడు పనిచేయఁబడినట్లే గ్రహింపవలెనని ఆచార్యులు. అట్లుకాదు, కృతమునకే వేతనముగాని అకృతమునకెన్నఁడునులేదు. కొంతభాగమునయినను చేయించి మానిపించినపుడు కొఱవడినదానిని కృతముగనెఱుంగవచ్చును. దేశకాలాతిపాతముచేఁ గర్మను మఱియొకవిధముగఁ జేసినను కృతమునుకూడ నకృతముగఁ బరిగణింపవచ్చును, లేదా యిష్టముండినయెడలఁ గృతముగనయిన నంగీకరింపవచ్చును. నిర్ణయించుకొనినదానికంటె నెక్కువగఁగర్మనుచేసియు నష్టమునుకలిగింపవచ్చునని కౌటిల్యుఁడు.

సంఘభృతకుల విషయమునఁగూడ నిట్లేయనియెఱుంగునది. నిర్ణీతకాలమునకంటె నేడురోజులధికముగ వారికవకాశమియ్యవలెను. పిమ్మట మఱియొకనినియమించి పనినిపూర్తిగావింపవచ్చును. భర్తతోఁజెప్పక పనినివిడిచినయెడలఁ బండ్రెండుపణములును, పనికిసంబంధించినసామగ్రిని హరించినయెడల నిరువదినాలుగుపణములును దండము.

ఇది భృతకాధికారము.

సంఘభృతులును కలిసిపనిచేయునట్టియితరులును వారివేతనమును సమముగఁగాని యథానిర్ణీతముగఁగాని పంచుకొనవలెను.

కర్షకవైదేహకులు సస్యపణ్యములలోఁ బనిచేయుభృతకులారంభమునఁగాని పర్యవసానమందుఁగాని మధ్యకాలమునఁగాని మరణించినచో వారిపనులఁబట్టి వారికంశములనియ్యవలెను. వారికిబదులుగవచ్చి పనిచేసినవారికి సమగ్రాంశము నియ్యవలెను. జరుగుచుండుపనులకు సిద్ధ్యసిద్ధులు సామాన్యములగుటచేఁ గార్యక్రమములోఁ గొంతపనిముగించి మరణించినభృతకులకుఁ బనినిపట్టియంశమునియ్యవలెను.

కర్మారంభమయినతర్వాత స్వస్థుఁడైయుండుభృతకునికిఁ బనివిడిచిపెట్టిపోవుటకు హక్కులేదు. అట్లుపోవువానికిఁ బండ్రెండుపణ

ముటుదండము. పనినిసరిగఁ జేయనివానికి మొదట నభయమునిచ్చి తర్వాత వానికిఁదగినపనిని, పనికిఁదగిన వేతనాంశములనొసంగి వాని నిగ్రహింపవచ్చును. మఱియొకమాఱుగూడ నతఁడట్లుపనిచేయకుండినను లేక మఱియొకప్రదేశమునకుఁ బాఱిపోయినను నతనిని సంఘమునుండి తొలఁగింపవలెను. గొప్పయపరాధమొనర్చినప్పుడు దూష్య దండము విధింపవలెను.

యాజకులు స్వప్రచారద్రవ్యమునుతప్పఁ దక్కినదక్షిణను నిర్ణయించుకొనినవిధమునఁగాని సమముగఁగాని పంచుకొనవలెను. అగ్నిష్టోమాదిక్రతువులందు దక్షిణనుపుచ్చుకొనినవెంటనే మృతిచెందిన యాజకునకుఁ బంచమాంశమును, సోమవిక్రయమునకు వెంటనే మృతిచెందినవానికిఁ జతుర్థాంశమును, మధ్యమోపసత్ప్రవర్గోద్వాసనములయినవెంటనే మృతిచెందినవానికిఁ దృతీయాంశమును, మయఃకర్మ జరిగినవెంటనే మృతిచెందినవానికి నర్ధాంశమునునియ్యవలెను. సుత్యక్రతువులోఁ బ్రాతస్సవనముతర్వాత మృతిచెందినవానికి నాలుగవవంతుతగ్గించి యియ్యవలెను. సావనకర్మజరుగునప్పటికి దక్షిణ ముగియునుకావున నప్పుడుమృతిచెందినవానికి సమగ్రాంశమునియ్య వచ్చును. బృహస్పతిసవనములోఁదప్పఁ దక్కినవానిలో దక్షిణలీయఁబడును. అహర్గణాదిక్రతువులోఁగూడ నిట్లేయని యెఱుంగునది.

మృతిచెందినవాఁడు చేయుచుండినపనిని తక్కిన యాజకులు గాని వానికివిశ్వాసపాత్రులగు మఱియొకరుగాని పదిదినములవఱకుఁ జేయవలెను.

యజ్ఞకర్మ పూర్తిగాకముందు యజమానుఁడు మృతిచెందినచో ఋత్విజులాయజ్ఞమునుపూర్తిచేసి దక్షిణనుతీసికొనవలెను.

క్రతువుముగియుటకుముందు యాజ్యునివిడిచిన యాజకునకును యాజకునివిడిచిన యాజ్యునకును పూర్వసాహసదండము. యాజకుఁడనాహితాగ్నియై యావిధముగఁజేయునప్పుడు శతమును, గుర్వై యుండిగాని యజ్వాయైయుండిగాని యట్లుచేసినచో సహస్రమును

దండము.

యాజకుఁడు సురాపానము చేయువాఁడగను వ్యాధిగ్రస్తుఁడగను బ్రహ్మహంతగను గురుతల్పగతుఁడుగను అసత్ప్రతిగ్రహుఁడుగను స్తేనుఁడుగను పతితుఁడుగను నుండిన చోఁ బరస్పరకర్మసంకరభీతి చే వానిని విడిచినను దోషము లేదు.

ఇది ధర్మస్థీయమున దాసకర్మకరకల్పవిషయమందలి
భృతకాధికారము, సంభూయసముత్థానమును
పదునాలుగవ యధ్యాయము.
ఆదినుండి డెబ్బదియొకటవ యధ్యాయము.



## 67 ప్రకరణము.

### విక్రీతక్రీతానుశయము.

దోషోపనిపాతావిషహ్యములగు వానిని తెప్ప విక్రయించినతక్క నపణ్యమును కొన్నవాని స్వాధీనము చేయనిచోఁ బండ్రెండు పణములు దండము. పణ్యదోషము దోషము, రాజచోరఅగ్ని ఉదకబాధలు పనిపాతములు. బహుగుణహీనమును ఆర్తకృతమునునగునవి అవిషహ్యములు. వర్తకులకొకరాత్రియుఁ గర్షకులకు మూఁడురాత్రులును మిశ్రవర్ణములవారికిని నుత్తమవర్ణములవారికిని జీవనాధార వస్తువిక్రయమున నేడురాత్రులు ననుశయము (విక్రయము రద్దుపఱచుటకుఁగాలము) నియ్యవలెను. చెడిపోవునట్టిపణ్యములు మఱియొకచోటఁ జెల్లవుగనుక వానికన్యాయముగ ననుశయమియ్యవలెను. అట్లుచేయనిచో నిరువదినాలుగు పణములుగాని పణ్యదశభాగముగాని దండము.

దోషోపనిపాతావిషహ్యములను తెప్పఁ దక్కనపణ్యములఁగొని ప్రతిగ్రహింపనివానికిఁ బండ్రెండుపణములు దండము. అనుశయము విక్రేతక్రేతలకు సమానము.

(మొదటిమూఁడువర్ణములలోను మతాచారములుగల శూద్రులలోను పాణిగ్రహణమునకుముందు నిర్ణయించుకొనినకన్యను విడువవచ్చును.) కన్యయువరుఁడును నభిప్రజాతులయినపుడుతప్ప నాపశాయికదోషముగల కన్యను పాణిగ్రహణానంతరముగూడ విడువవచ్చును.

ఔపశాయికమనుకన్యాదోషమును ప్రకటింపక కన్యనిచ్చినవానికిఁ దొంబదియాఱుపణములు దండము. అట్టివాఁడు పుచ్చుకొనినశుల్క-స్త్రీధనములను తిరిగియిచ్చుకొనవలెను. వరదోషమునుచెప్పక కన్యనువరించి దానిని పొందువానికిఁ బూర్వద్విగుణదండము. అట్టివాఁడు శుల్క-స్త్రీధనముల విడిచిపెట్టుకొనవలెను.

కుష్ఠవ్యాధితములును శుచిత్వరహితములునునగు ద్విపదచతుష్పదజంతువులను నుత్సాహస్వాస్థ్యశుచిత్వములు గలవనిచెప్పి విక్రయించువానికిఁ బండ్రెండుపణములు దండము.

చతుష్పదములవిక్రయమును మూఁడుపక్షములలోను, మనుష్యులవిక్రయము నొకసంవత్సరములోను రద్దుపఱుపవచ్చును. వీని శౌచాశౌచములఁ దెలిసికొనుట కంతకాలముపట్టును.

దాతయును ప్రతిగృహీతయును దానవిక్రయములలో నష్టపోకుండునట్లుగఁ దగుమనుష్యు లనుశయము నిప్పింపవలెను.

ఇది ధర్మస్థీయమున విక్రీతక్రీతానుశయమను

పదునైదవ యధ్యాయము.

ఆదినుండి డెబ్బదిరెండవ యధ్యాయము.



## 68 ప్రకరణము.

### అస్వామివిక్రయము, స్వస్వామిసంబంధము

దత్తము నియ్యకుండునపుడు ఋణాదానమునందుఁ జెప్పినవిషయముల గమనించునది.

వ్యవహారవిరోధమగు దానమును మధ్యవర్తుల వద్ద నుంపవలెను. సర్వస్వమును దారపుత్రులను తన్నును దానముచేసినవాఁడు తనవిషయ మనుశయులతో విన్నవించుకొనవలెను.

అసాధులకు నోపఘాతకకర్మలనిమిత్తముగను చేయుధర్మదానము, అనుపకారులకు నుపకారులకుఁ జేయు నర్థదానము, అనర్హులకొఱకుఁ జేయు కామదానము లోనగువానిని దాతృప్రతిగ్రహీతలకు నష్టముకలుగకుండునట్లు కుశలులు పరిష్కరింపవలెను.

దండభయ ఆక్రోశభయ అర్థభయములవలనఁ జేయఁబడిన భయదానమును ప్రతిగ్రహించినవానికిని నిచ్చినవానికిని స్తేయదండము. పరులను హింసించుటలో దోషదానముచేయువానికిఁగూడ నిదియేదండము. రాజుపైగర్వించువాని కుత్తమదండము.

ఇష్టములేనిచో మరణించినవానిపుత్రుఁడుగాని దాయాదుఁడుగాని రిక్థహస్తుఁడుగాని (మరణించినవాఁడు) వాఁడిచ్చుకొనఁదగిన ప్రతిభావ్యదండమును శుల్కశేషమును నాక్షికమును సౌరికమును కామదానమును నియ్యనక్కఱలేదు.

ఇది దానమును రద్దుపఱచు విషయము.

అస్వామివిక్రయము:— నష్టాపహృతమగు తనద్రవ్యము మఱియొకనివద్ద దొఱకినపుడు వానినధికారులచేఁ బట్టుకొనునట్లుచేయవలెను. దేశకాలాతిపాతములు గలుగుననుశంక గలిగినపుడు స్వయముగఁదానే వానినిపట్టుకొని యధికారులకొప్పగింపవచ్చును. ధర్మస్థుఁడు వానిని, నీకిదెట్లులభించెనని ప్రశ్నింపవలెను. లభించినక్రమమునాతఁడుచెప్పి విక్రేతనుచూపలేనపుడు ద్రవ్యమునుపుచ్చుకొనివానినివిడిచిపెట్టవచ్చును. విక్రేతదొఱకినపుడుమూల్యమును స్తేయదండమును నిచ్చుకొనవలెను. అతఁడు పాఱిపోయినపుడును ద్రవ్యము వ్యయమగువఱకు దాగియుండి పిమ్మటదొఱకినపుడును మూల్యమును స్తేయదండమును నిచ్చుకొనవలెను.

నష్టద్రవ్యము తనదని ఋజువుపఱచుకొని నష్టపరిహారమును పుచ్చుకొనవచ్చును. అట్లు ఋజువుచేసికొనలేనప్పుడు పంచబంధము నిచ్చుకొనవలెను. నష్టద్రవ్యము రాజునకుఁజెందును.

(ధర్మస్థులతో) చెప్పక నష్టద్రవ్యమును (తనంతటతానే) బలాత్కరించి తీసికొనువానికిఁ బూర్వసాహసదండము.

నష్టాపహృతద్రవ్యములను మూఁడుపక్షములవఱకు శుల్కస్థానమందుంచి పిమ్మట నాద్రవ్యస్వామి దాని నఱుఁగనప్పుడు దానినిరాజు తీసికొనవచ్చును. నష్టాపహృతద్రవ్యము ద్విపదమయినచో నయిదు పణములు నిష్క్రయము. ఏకఖురములయినచో నాలుగుపణములు, గోమహిషములయినచో రెండుపణములు. క్షుద్రపశువులయినచోఁ బాదపణము, రత్నసారఫల్గుకుప్యములయినచో నయిదువందలపణములు. ఈనిష్క్రయమును రాజునకిచ్చుకొనవలెను.

పరచక్రాటవికులచే హరింపఁబడినద్రవ్యమును రాజుమరలఁ దీసికొని హక్కుదారులకిచ్చివేయవలెను. చోరహృతములు లభింపనప్పుడు రాజుతనద్రవ్యమునుండి యిచ్చుకొనవలెను; లేక అట్టివానిని తెప్పించుట కశక్తుఁడయినప్పుడు స్వయంగ్రాహునిచేతనయిన వానిని సాధింపవలెను, లేదా నిష్క్రయమునయిన నిచ్చుకొనవలెను.

ఆర్యులను దేవబ్రాహ్మణతపస్విద్రవ్యములనుదప్పఁ బరవిషయమునుండి తనవారెవరయిన విక్రమించి తెచ్చినద్రవ్యమును రాజాజ్ఞానుసారముగ నపహర్తలనుభవింపవచ్చును.

ఇది యస్వామివిక్రయము.

స్వస్వామిసంబంధము:— దేశాంతరమునకుఁబోయినను నెవరి ద్రవ్యములందు వారికిస్వామ్యముండును.

బాలవృద్ధవ్యాధితవ్యసనిప్రోషితులును రాజ్యవిప్లవముచే దేశత్యాగముచేసినవారును తప్పఁ దక్కినవారు తమద్రవ్యమితరులనుభవించుచున్నప్పుడు పదిసంవత్సరములవఱకుపేక్షించినచో దానిలో వారికిఁ గలహక్కు నశించును. ఇరువది సంవత్సరములవఱకు కెడతెగక తన

యింటియందు మఱియొకఁడు నివసించుచుండిన నదేండ్లు చిరకాలం బలిమికిఁగూడఁ జెడిపోవదు. కాని రాజాజ్ఞలేక పరవాస్తువులందు నివసించు జ్ఞాతులకును శ్రోత్రియులకును పాషండులకును సుఖనివాసమాత్రముచేత హక్కుగలుగఁజాలదు. ఉపనిధి ఆధి నిధి నిక్షేపము దాసి గ్రామసీమ రాజస్వము శ్రోత్రియద్రవ్యములోనగువాని విషయమునఁగూడ నిట్లేయనియెఱుంగునది.

ఆశ్రమస్థులును పాషండులును విశాలమగుప్రదేశమునందు నొకరినొకరుబాధించుకొనక నివాసముచేయవలెను. అల్పమగు బాధగలిగినను పూర్వాగతుండు క్రొత్తగవచ్చినవానికిఁజోటియ్యవలెను. అట్లియ్యనపుడు వానినిఁదొలఁగింపవచ్చును.

వానప్రస్థయతిబ్రహ్మచారులద్రవ్యములను వారియాచార్యులుశిష్యులు ధర్మభ్రాతలుసతీర్థులు వరుసఁగఁదీసికొనవచ్చును. వీరిపై వివాదములుగలిగినపుడు దండమునకై విధింపఁబడిన దండమునకుబదులుగ వీరురాజుకొఱకై క్షపణ అభిషేక అగ్నికార్య మహాకచ్ఛవర్ధనముల నెన్నిపణములదండమునిచ్చికొనవలెనో యన్నిదినములు చేయవలెను.

పారుష్యస్తేయసాహస సంగ్రహణదోషములుతప్పఁ దక్కిన దోషములనొనరించునపుడు పాషండులకును సాధువులకును వారునిష్ఠులుగాన నుపవాసవ్రతశిక్ష విధింపవలెను. పారుష్యాదిదోషము లొనరించునపుడు యథోక్తదండముల విధింపవలెను.

రాజు దండముచేఁ బ్రవ్రాజికులవారించుచు వారినివారియాచారములందు నిలుపవలెను. లేనిచో నుపేక్షింపఁబడినట్టియు నధర్మోపహతమైనట్టియు ధర్మము రాజునకు వినాశకారియగును.

ఇది ధర్మస్థీయమున అస్వామివిక్రయము స్వస్వామిసంబంధమను

పదునాఱవయధ్యాయము.

ఆదినుండి డెబ్బదిమూఁడవ యధ్యాయము.



## 69 ప్రకరణము.

### సాహసము.

ద్రవ్యస్వామిసమక్షమునసే బలాత్కారముగఁదీసికొనుట సాహసము. తెలియకుండునట్లుగఁ దీసికొనుటయుఁ దీసికొనినదానిని దాచియుంచుటయు స్తేయము.

రత్నసారఫల్గుకుప్యములవిషయమున సాహసమొనర్చినపుడు మూల్యసమదండమని మానవులు, మూల్యద్విగుణమని యౌశనసులు, యథాపరాధమని కౌటిల్యుఁడు.

క్షుద్రద్రవ్యములగు పుష్పఫలశాకమూలకందపక్వాన్నచర్మవేణుమృద్భాండాదులను సాహసించి తీసికొనువారికిఁ బండ్రెండుమొదలిరువదినాలుగు పణములవఱకు దండము.

స్థూలద్రవ్యములగు కాలాయసకాష్ఠరజ్జుద్రవ్య క్షుద్రపశుపటాదుల సాహసించి తీసికొనువానికి నిరువదినాలుగుమొదలు నలువదియెనిమిదిపణములవఱకు దండము.

స్థూలద్రవ్యములగు తామ్రవృత్తకంసకాచ దంతములతోఁ జేసినభాండాదులఁ దీసికొనినవానికి నలువదియెనిమిదిమొదలు తొంబదియాఱుపణములవఱకు దండము. దీనికి పూర్వసాహసదండమని పేరు.

స్థూలద్రవ్యములగు మహాపశు మనుష్యక్షేత్రగృహహిరణ్యసువర్ణసూక్ష్మవస్త్రాదులను సాహసించి తీసికొనువానికి రెండువందలు మొదలయిదువందల పణములవఱకు దండము. ఇదియే మధ్యమసాహసదండము.

స్త్రీపురుషుల బలాత్కరించి బంధించువానికి బంధింపఁజేయువానికిని బంధమునువిడిపించువానికిని నైదువందలు మొదలు వేయిపణములవఱకు దండము. ఇది యుత్తమసాహసదండమని యాచార్యులు.

సాహసము చేయుమని మతియొకనితోఁ జెప్పి వానిచే సాహసముచేయించువానికి ద్విగుణాదండము. వలసినంతధనమునిచ్చి సాహసముచేయించినచోఁ జతుర్గుణాదండము.

ఇంతహిరణ్యమునిచ్చెదనని ప్రమాణముచేసి సాహసమునుచేయించువాఁడాహిరణ్యమును దండమునుకూడ రాజునకిచ్చుకొనవలెనని బార్హస్పత్యులు. కోపమదమోహములచే నిట్టితప్పునుచేసితినని యతఁడొప్పుకొనినచో యథోక్తదండమునుమాత్రము విధింపవలెనని కౌటిల్యుఁడు.

సర్వదండకర్మలందును నూటికిఁదక్కువగ దండమునువిధించినపుడు నూటికెనిమిదిచొప్పున రూపమును, నూటికంటెనధికముగ దండమును విధించినపుడు నూటికైదుచొప్పున వ్యాజినివసూలు చేయవలెను.

ప్రజలు దోషబాహుళ్యులగుటచేతను రాజులు దోషములేకుంగఁజాలకుండుటచేతను సధర్మిష్ఠులనుండి రూపవ్యాజులఁ బుచ్చుకొనుటధర్మమేయని చెప్పఁబడినది.

**ఇది ధర్మస్థీయమున సాహసమను పదునేడవయధ్యాయము.**

**ఆదినుండి డెబ్బదినాలుగవ యధ్యాయము.**



## 72 ప్రకరణము.

### వాక్పారుష్యము.

ఉపవాదము కుత్సనము అభిభర్త్సనమని వాక్పారుష్యము మూఁడువిధములు. ఉపవాదము శరీరప్రకృతి శ్రుతివృత్తి జనపదముల సంబంధించియుండును. అందులో శరీరవైకల్యముగలవారిని సహితము గుడ్డికుంటి యనిపిలిచినచో మూఁడుపణములును, లేనివారినట్లుపిలిచినపు డాఱుపణములును దండము.

గ్రుడ్డికంటి మొదలగులోపములుగలవారిని నిందాస్తుతిగ, సాగసయినకన్నులుగలవాఁడా, సొగసయినదంతములుగలవాఁడా యని పిలిచినపుడును కుష్ఠోన్మాదక్లైబ్యాదులనుపట్టి పరిహాసముచేయునపుడును పండ్రెండుపణములు దండము.

నిందాస్తుతులు సత్యములయినను కాకపోయినను, తుల్యుల విషయమై (వానిని) గావించినపుడు పండ్రెండుపణములకంటె నధికముగను, అధికులవిషయమై కావించినపుడు ద్విగుణముగను, హీనుల విషయమై కావించునపుడు సగమును, పరస్త్రీలవిషయమునఁ గావించినపుడు ద్విగుణముగను దండమువిధింపవలెను. ప్రమాదమదమోహాదులచే నిట్లుచేసినప్పుడర్ధదండము.

కుష్ఠోన్మాదముల విషయమునఁ దచ్చికిత్సకులును సన్నిధినుండుపురుషులునుసాక్షులు. క్లీబత్వవిషయమును స్త్రీలమూలమునను మూత్రఫేనములఁబట్టియు నీటిలో మలము మునిఁగిపోవుటఁబట్టియుఁ దెలిసికొనవలెను

బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్ర చండాలాదులలో నధములుత్తమవర్ణములవారివిషయమై ప్రకృత్యుపవాదము గావించినపుడు వారివర్ణక్రమమునుపట్టి త్రిపణోత్తరదండమును, ఉత్తమవర్ణములవారధమవర్ణములవారివిషయమై యిట్టియుపవాదము గావించినపుడు ద్విపణాధరమగు దండమునువిధింపవలెను. కుబ్రాహ్మణుఁడనుటమున్నగాఁగల జాతినైచ్యమును సూచించువానికిఁగూడ నిట్లే.

శ్రుతసంబంధములగునట్టివియు వాగ్జీవనకారుకుశీలవుల వృత్తినిసంబంధించినట్టివియు ప్రాజ్జూణకగాంధారాది జనపదములసంబంధించినట్టివియునగు నుపవాదములవిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

ఎవఁడు మఱియొకనిని నిన్నిట్లుచేసెదనని భయపెట్టునో యతఁడావిధముగఁ జేయకపోయినను చేసినపుడనుభవింపవలసినశిక్షలో సగముశిక్షకుఁ బాత్రుఁడగును. అశక్తుఁడై కోపమోహమదములచేనిట్లు

భయము పెట్టినపుడు పంద్రెండుపణములు దండము. అపకారముచేయు సమర్థుఁడయినవాఁడు విరోధముపూని పయిరీతిగ భయపెట్టునపుడు యావజ్జీవకముగు జామీనునియ్యవలెను.

స్వదేశస్వగ్రామములవిషయమైన వాక్పారుష్యముఁ జూపినవానికిఁ బూర్వసాహసదండము. స్వజాతిస్వసంఘములనునిందించినవానికి మధ్యమదండము. దేవచైత్యములనిందించినవాని కుత్తమదండము.

ఇది ధర్మస్థీయమున వాక్పారుష్యమను
పదునెనిమిదవయధ్యాయము.
ఆదినుండి డెబ్బదిమొదవ యధ్యాయము.



## 73 ప్రకరణము.

### దండపారుష్యము.

స్పర్శనము అవగూర్ణము ప్రహతము అని దండపారుష్యము మూఁడువిధములు.

నాభికధోభాగమున హస్తపంకభస్మపాంసువులతో స్పృశించువానికి మూఁడుపణములును, అపవిత్రములగువీనితోను పాదముతోను నిష్ఠీవనముతోను స్పృశించినచో నాఱుపణములును, ఉమ్మి మూత్రము పురీషము— వీనితోస్పృశించినవానికిఁ బండ్రెండుపణములును దండము. నాభి కుపరిభాగమందు పైవిధముగఁ జేసినపుడు ద్విగుణముగను శిరస్సునందుఁ జేసినయెడల నాలుగురెట్లుగనుదండము విధింపవలెను. గొప్పవారియెడ నీనేరముచుగావించినపుడు ద్విగుణదండము; హీనులయెడనయినచోనర్థదండము. పరస్త్రీలయెడనయినచో ద్విగుణదండము. ప్రమాదమదమోహములమూలమున వీనిని గావించినపు డర్థదండము.

పాదవస్త్రహస్తకేశావలంబనములందు షట్పణోత్తర దండము. పీడించుట ఆవేష్టించుట త్రోయుట లాగుట పయినిగూర్చుం

డుట — వీనిని చేసినపుడు పూర్వసాహసదండము. పరద్రోహి పాణిపోషణానికర్థదండము. బ్రాహ్మణుని శూద్రుఁడేయవయవముతోఁగొట్టునో దానిని ఛేదింపవలెను.

కొట్టినపుడు నిష్క్రియుఁడు స్పర్శదండములో సగమును నిచ్చుకొనవలెను. చండాలాద్యశుచులకు నీ నియమముగూడ నిష్క్రియుని యెఱుంగునది. చేతితోఁగొట్టినపుడు మూఁడు మొదలు పండ్రెండుపణములవఱకును; పాదముతోఁదన్నినపుడు తద్ద్విగుణముగనుదండము. ముఖోత్పాదము గలిగించుద్రవ్యముతోఁగొట్టినపుడు పూర్వసాహసదండము. ప్రాణబాధకమగుద్రవ్యముతోఁగొట్టినపుడు మధ్యమదండము. కాష్ఠలోష్టపాషాణలోహదండరజ్జుద్రవ్యములలో నొకదానిచే రక్తమురాకుండఁగొట్టిగఁ గొట్టినపు ఇరువదినాలుగుపణములును, వ్రణాదులున్నపుడుతప్పఁ దక్కినపుడు రక్తమువచ్చునట్లుకొట్టినచో ద్విగుణముగను దండము.

రక్తమురాకపోయినను మృతప్రాయుఁడగునట్లుఁ గొట్టినవానికిని, దుష్టవ్రణములున్నపుడుతప్పఁ దక్కినపుడు పాణిపాదదంతములకుభంగమును కర్ణనాసలకుచ్ఛేదనమును శరీరవిదారణమును కావించినవానికిఁ బూర్వసాహసదండము.

తొడలను కంఠమును విఱిచినపుడును, నేత్రభేదముగావించినపుడును వాక్యచేష్టాభోజనముల కుపరోధముగలిగించినపుడును మధ్యమసాహసదండమునేగాక గాయముతగిలినవాఁడు యథాస్థితికివచ్చుటకుఁగావలసిన వ్యయమునుసహితమిచ్చుకొనవలెను. దేశకాలాతిపాతముగలిగినపుడు కంటకునివలెశోధించి శిక్షింపవలెను. అనేకులేకీభవించి యొకనినికొట్టినపుడు వారిలోనొక్కొకరికి ద్విగుణదండమునువిధింపవలెను.

పర్యుషితము (కాలాతీతము) లగుకలహము ప్రవేశములును ననభియోజ్యములునని ఆచార్యులు. అపకారిని విడువఁగూడదని కౌటిల్యుఁడు.

బాధనుసహింపఁజాలని వాఁడే ధర్మస్థీయమునకుఁ బరుగెత్తినను కొనఁ బూర్వాగతునకే జయమియ్యవలెనని యాచార్యులు. క్షిప్తకలహము, మొదటవచ్చినను తర్వాతవచ్చినను సాక్షులఁబట్టియే (వివాదమును) పరిష్కరింపవలెనని కౌటిల్యుఁడు. సాక్షులులేనప్పుడు వానిగాయములను కలహచిహ్నములనుబట్టి పరిష్కరింపవలెను.

ఘాతముగుఱించిన యభియోగములలోఁ బ్రతివాదముచేయని వానికారోజుననే (అభియోగము దెచ్చినరోజుననే) శిక్షవిధింపవలెను.

కలహమధ్యమున ద్రవ్యము నపహరించువానికిఁ బదిపణములు దండము.

క్షుద్రద్రవ్యములకు హింసనుకలిగించువానికిమూల్యద్విగుణదండము. స్థూలద్రవ్యములవిషయమున మూల్యత్రిగుణదండము. వస్త్రాభరణహిరణ్యసువర్ణభాండములవిషయమున వానిమూల్యమునిచ్చుకొని పూర్వసాహసదండమును భరింపవలెను. అభిఘాతముచేఁబరకుడ్యములకు క్షోభకలిగించువానికి మూఁడుపణములు దండము. ఛేదనభేదనములొనర్చువాఁడాఱుపణములుదండము నిచ్చుకొని నష్టప్రతీకారముకూడఁ జేయవలెను.

ఒకనియింటిలో దుఃఖోత్పాదకమగుద్రవ్యమును పడవేయు వానికిఁ బండ్రెండుపణములు దండము; ప్రాణహింసగలిగించుద్రవ్యమునుపడవేయువానికిఁ బూర్వసాహసదండము.

కాష్ఠాదులచే క్షుద్రపశువులకు నొప్పిగలిగించినప్పుడు పణముగాని రెండుపణములుగాని దండము. రక్తమువచ్చునట్లుఁగొట్టినచో ద్విగుణదండము. ఈబాధల మహాపశువులకుఁ గలిగించినప్పుడు ద్విగుణదండమునేగాక సముత్థానవ్యయమునుకూడ నిచ్చుకొనవలెను.

పురోద్యానమందుండు పుష్పఫలచ్ఛాయావృక్షములయొక్క ప్రరోహముల ఛేదముచేయువాని కాఱుపణములును, క్షుద్రశాఖల ఛేదించువానికిఁ బండ్రెండుపణములును, పీనశాఖలఛేదించువాని కిరువదినాలుగుపణములును, స్కంధవధము గావించినవానికిఁ బూర్వసా

హాసమును, మూలచ్ఛేదముచేసినవానికి మధ్యమసాహసమును దండము. పుష్పఫలచ్ఛాయలనిచ్చు గుల్మలతలను, పుణ్యస్థాన తపోవనశ్మశానములందుండెడివృక్షములను పైవిధముగఁ జేసినపుడదే దండము.

సీమావృక్షములను చైత్యములందుఁ బూజింపఁబడు వృక్షములను రాజవనములందలి వృక్షములను పయివిధముగ ఛేదించుటకు దండము ద్విగుణదండము.

ఇది ధర్మస్థీయమున దండపారుష్యమను పందొమ్మిదవయధ్యాయము.

ఆదినుండి డెబ్బదియారవ యధ్యాయము.



## 74-75 ప్రకరణములు.

### ద్యూతసమాహ్వయము, ప్రకీర్ణకములు

గూఢాజీవులఁ దెలిసికొనుటకై ద్యూతాధ్యక్షుఁడుద్యూతము నేకముఖముగఁ జేయవలెను. మఱియొకచోటనెక్కడనైన జూదమాడువారికిఁ బండ్రెండుపణములు దండము.

ద్యూతాభియోగమున జయించినవానికిఁ బూర్వసాహసదండమును పరాజితునకు మధ్యమదండమునువిధింపవలెను. ఏలన, పరాజితుఁడు మూఢుఁడై జయింపఁగోరినను, పరాజయమును సహింపకుండునని యాచార్యులు. ఇట్లుగాదు, ఎవరును రాజవద్దకురాకుండునట్లుగఁ బరాజితునకు ద్విగుణదండమును విధింపవలెనని కౌటిల్యుఁడు.

ద్యూతకారులుతఱుచుగ కితవులై యుండుటచేగావున వారియధ్యక్షులు శుద్ధభావులై కాకణ్యక్షములను (కాకణినిచ్చి పుచ్చుకొనఁదగినవి) వానికిచ్చుచుండవలెను. కాకణ్యక్షముల మార్చువానికిఁ బండ్రెండుపణములు దండము.

కపటద్యూతమందు జయించినవానికిఁ బూర్వసాహసదండమును ఉపధాస్తేయ దండమునను విధించి వాఁడుగెలిచిన పందెమును

కూడఁ దీసికొనవలెను.

అధ్యక్షుఁడు జితద్రవ్యమునుండి నూటికి యైదుపణమును కాకణ్యక్ష అరళాశలాకలయద్దెను ఉదకభూమికర్మక్రియను పుచ్చుకొనవలెను. ద్రవ్యములయొక్క విక్రయాధానములఁగూడ నతఁడు చేయవచ్చును.

అక్షభూమిహస్తములమూలమునఁ జేయు మోసమును నిషేధింపని యధ్యక్షునకు ద్విగుణదండము

విద్యాశిల్పములకయిన సమాహ్వయములందుఁ దప్పఁ దక్కిన సమాహ్వయములందుఁగూడ నిట్లేయని యెఱుంగునది.

ప్రకీర్ణకము:— యాచితక అవక్రీతక ఆహితక నిక్షేపక ద్రవ్యములను యుక్తదేశకాలములం దియ్యనివానికిని, యామచ్ఛాయాప్రదేశములఁ బ్రవేశించి దేశకాలాతిపాతమగునట్లు కూర్చుండువానికిని, బ్రాహ్మణునివద్ద గుల్మదేయతరదేయములు దీసికొనువానికిని కరుగుపొరుగువారిపైఁ గలహించుటకై తరులను పురికొల్పువానికిని పండ్రెండుపణములు దండము. సంధిపత్త్రము నియ్యనివానికిని, హస్తముచే భర్తృభార్యను శిక్షించువానికిని, అన్యోపశుద్ధయగు రూపాజీవను పొందువానికిని, పరుఁడు బేరముచేసిన పణ్యమును కొనువానికిని, ముద్రితోఁగూడినగృహమును భేదించువానికిని, సమీపమందుండు నలువదియిండ్లవారికి బాధకలిగించువానికిని నలువదియెనిమిదిపణములుదండము. కులాదాయమును వశముచేసి యపవ్యయముచేయువానికిని, స్వచ్ఛందచారాలగు విధవనుబలాత్కరించువానికిని, ఆర్యస్త్రీని స్పృశించు చండాలునికిని, ఆపత్కాలమందుఁ దన్నుఁజేరినవానిని రక్షించుటకై వెళ్ళనివానికిని, నిష్కారణముగఁ బరుగెత్తువానికిని, దేవపితృకార్యములందు జీవకాదులకును శూద్రప్రవ్రజితులకును భోజనమిడువానికిని నూరుపణములుదండము. అధికారములేక శపథవాక్యప్రశ్నముచేయువానికిని, ఉద్యోగి కాకపోయినను ఉద్యోగులుచేయఁదగు కర్మలఁజేయువానికిని, క్షుద్రపశువృషభములకుఁ బుం

స్త్రీపురుషఘాతమొనరించువానికిని, ఔషధముచే దాసీగర్భపాతముగలిగించువానికిని బూర్వసాహసదండము. పితాపుత్రులును దంపతులును సోదరీసోదరులును మేనమామమేనల్లుండ్రును శిష్యాచార్యులును పతితులగుటకుఁ దప్పఁ దక్కినసమయములందుఁ బరస్పరముత్యజించినచో వారికిని, తనసహాయముకొఱకై యొకనినిపిలిపించి వానిని గ్రామమధ్యమందు విడిచి వెళ్ళిపోవువానికిని పూర్వసాహసదండము. కాంతారమధ్యమందిట్లు విడిచినచో మధ్యమదండము. బెదిరించియిట్లుచేయువానికి నుత్తమదండము. కలసిబయలుదేరినవారిని (మార్గమధ్యమున) విడిచినచో నర్ధదండము. బంధింపఁదగనిపురుషుని బంధించువానికిని, బంధింపించువానికిని, బద్ధునివిడిపించువానికిని, అప్రాప్తవ్యవహారుఁడగు బాలుని బంధించువానికిని బంధింపఁజేయువానికిని వేయిపణములు దండము.

పురుషులనుబట్టియు నపరాధములఁబట్టియు దండములమార్చుచుండవలెను.

తీర్థయాత్రచేయువాఁడు తపస్వి వ్యాధితుఁడు క్షుత్పిపాసాధ్వక్లాంతుఁడు జానపదుఁడు (?) దండఖేది నిష్కించనుఁడు— వీరనుగ్రాహ్యులు. వారు మనవిచేసికొనకపోయినను దేవ బ్రాహ్మణ తపస్వి బాల వృద్ధ వ్యాధితులయొక్కయు ననాథలయొక్కయుఁ గార్యములను ధర్మస్థులు చేసిపెట్టవలెను. దేశకాలభోగాతిపాతములు గలిగెనను మిషచే నీకార్యములకు నష్టముగలిగింపరాదు.

విద్యా బుద్ధి పౌరుష అభిజన కర్మాతిశయములచేతఁ బురుషులుపూజ్యులగుచున్నారు.

మిషపెట్టనివారై విశ్వాసపాత్రులై లోకప్రియులై యవస్థలన్నిటియందును సమబుద్ధిఁగలిగి ధర్మస్థులుకార్యములనీవిధముగఁ జేయవలెను.

ఇదిధర్మస్థీయమున ద్యూతసమాహ్వయము ప్రకీర్ణకములను నిరువదవయధ్యాయము.
ఆదినుండి డెబ్బదియేడవయధ్యాయము.

ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమునందు ధర్మస్థీయమను మూఁడవయధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## నాలుగవయధికరణము — కంటకశోధనము.

### 76 ప్రకరణము.

#### కారుకరక్షణము.

ముగ్గురుప్రదేష్టలుగాని ముగ్గురమాత్యులుగాని కంటకశోధనము చేయవలెను.

ఆపత్ప్రతీకారముఁ జేయఁదగినవారును కారువులశాసించువారును నిక్షేపముల నుంచుకొనఁదగినవారును స్వేచ్ఛఁగబని చేయఁదగిన శిల్పులును సంఘములకు నమ్మఁదగినవారును శ్రేణీనిక్షేపముల దాచియుంపవచ్చును. ఆపత్కాలమందీనిక్షేపములను వారివద్దనుండి శ్రేణులు తీసికొనవచ్చును.

నిర్దిష్టములగు దేశకాలకర్మలప్రకారము కారువులు వారిపనులు గావింపవలెను. దేశకాలకర్మలు నిర్దేశింపఁబడలేదనుమిషపెట్టి కాలాతిపాతనముగా వించినపుడు వేతనమందు నాలుగవవంతునుమాత్రమే గాక ద్విగుణదండమునుకూడ నిచ్చుకొనవలెను. భ్రంశోపనిపాతములు గలిగినపుడుతప్పఁ దక్కినపుడు నష్టవినష్టములను కారువులు భరింపవలెను. కార్యమును చెప్పినట్లు గాక మఱియొకవిధముగఁ జేయునపుడు వేతననాశనమగుటయే గాక దానికి రెండురెట్లు దండమును కూడ నిచ్చుకొనవలెను.

సాలెవాండ్రు (నేయుటకుఁగనిచ్చిన) సూత్రములను దశైకాదశికముగ వృద్ధిచేయవలెను; లేనిచో నష్టద్విగుణదండమును సూత్రమూల్యమును నిచ్చుకొని వేతనమునుకూడ విడిచిపెట్టుకొనవలెను.

క్షౌమకౌశేయముల నర్ధగుణముగను పత్త్రోర్ణకంబళదుకూలముల ద్విగుణముగను వృద్ధిచేయవలెను. కొలతతగ్గించినపుడు నష్టానుసారముగ వేతనమునుతగ్గించి ద్విగుణదండమును విధింపవలెను. తూనిక తగ్గించినపుడు హీనచతుర్గుణదండమును, సూత్రములమార్చినపుడు మూల్యద్విగుణమును నిచ్చుకొనవలెను. ద్విపటవానము (వెడల్పుగల వస్త్రములు) ల విషయమునఁగూడ నిట్లేయనియెఱుంగునది. ఒక తులము ఊర్ణమును బాగుగనాపుచేసినపుడయిదుపలములు నష్టము సంభవించును.

చాకలివాండ్రు కట్టెపలకలమీఁదఁగాని నున్నని రాతిపలకమీఁదఁగాని వస్త్రముల నుతుకవలెను. మఱియొకచోట నుతికినపుడు వస్త్రమునకుఁ గలిగిననష్టమును నాఱుపణములుదండమును నిచ్చుకొనవలెను. ముద్గరచిహ్నితమగు వస్త్రముదప్పఁ దక్కిన వానిని కట్టుకొనురజకునకు మూఁడుపణములుదండము. ఇతరులవస్త్రములను విక్రయ ఆవక్రియ ఆధానములఁజేయునపుడు పండ్రెండుపణములు దండము; వానినిమార్చునపుడు ప్రతివస్త్రమును మూల్యద్విగుణమును నియ్యవలెను. మల్లెపుష్పము (ముకుళము) వలెఁ దెల్లగఁజేయవలసినట్టియు, ఱాతిపలకమీఁద నుతికినపుడు శుద్ధధౌతసూత్రవర్ణమగునట్టియు శుద్ధిచేయఁబడిన వెండివర్ణముగలిగినట్టియు వస్త్రమునొకరాత్రికంటె నెక్కువకాలముంచుకొనినచో దండమునిచ్చుకొనవలెను. స్వల్పముగ రంగువేయవలసినవస్త్రముల నైదురాత్రులకంటెనధికముగను నీలివర్ణమువేయవలసినచో నాఱురాత్రులకంటె నధికముగను, పుష్పలాక్షామాంజిష్ఠరక్తవర్ణముల వేయవలసినప్పుడును గురుతరమగుయత్నముచేఁ బరిశ్రమచేయవలసినప్పుడేడురాత్రులకంటె నధికముగను నుంచుకొనఁగూడదు. అట్లుచేసినచో వేతననాశమొందును. రాగవివాదములందు శ్రద్ధేయులును కుశలులునగువారు వేతననిర్ణయముచేయవలెను. శ్రేష్ఠములగువస్త్రములనుతికినచో నొకపణము వేతనము; మధ్యమవస్త్రములకర్ధపణము; అవరములకుఁబాదపణము.

ముతుకబట్టలకు మాషకము లేక రెండు మాషకములు. రంగుబట్టలకు ద్విగుణము.

రంగుబట్టల మొదటి పర్యాయముతుకునప్పుడు నాల్గవవంతును రెండవ పర్యాయముతుకునప్పుడైదవవంతును రంగు తగ్గిపోవును. ఇట్లే క్రమక్రమముగ తగ్గునని గ్రహించునది.

రజకులగుఱించి చెప్పఁబడినవన్నియు సాలెవాండ్ర విషయమునఁగూడఁజెల్లును.

రాజున కెఱిఁగింపక యశుచియగువాని చేతినుండి వస్తురూపమున నున్న రూప్యసువర్ణములఁగొనిన సువర్ణకారులకుఁ బండ్రెండు పణములును, వస్తురూపమునుమార్చి కొనెడివానికి యిరువదినాలుగుపణములును, చోరహస్తమునుండి కొనినచో నలువదియెనిమిది పణములును దండము. రహస్యముగఁ గరఁగించి తేఁబడినదానిని తక్కువ ఖరీదునకుఁగొనినప్పుడును, ఒకవస్తువును మఱియొక వస్తువుగ మార్చి మోసము చేసినప్పుడును స్తేయదండము. సువర్ణమెత్తు బంగారమునుండి యొక్క మాషక మపహరించు సువర్ణకారునికి రెండువందలపణములును ధరణపరిమితిగల రూప్యమునుండి యొకమాషక మపహరించువానికిఁ బండ్రెండుపణములును దండము. ఇట్లే తక్కినవానివిషయమున గ్రహించునది. అపసారణముచేఁగాని యోగముచేఁగాని వన్నెనుచెడఁగొట్టినవానికి ఐదువందలపణములు దండము. సువర్ణరూప్యములవన్నెను మఱియొకవిధముగ మార్చినప్పుడు గూడ నిదియే దండము

ధరణమెత్తు రూప్యమునుండి వస్తువును తయారుచేయువానికొకమాషకము వేతనము; సువర్ణమెత్తు బంగారమునుండి తయారుచేయువానికందులో నెనిమిదవ వంతు వేతనము. నేర్పునుబట్టి ద్విగుణముగ వేతనవృద్ధి కావచ్చును. దీనినిబట్టి తక్కినవాని విషయమున నిట్లే యని గ్రహించునది. తామ్రవృత్తకంసవైకృంతకఆరకూటములనుండి వస్తువులఁదయారుచేయువారికి నూటికైదుచొప్పున వేతనము.

తామ్రమునకుఁ బదియవవంతు తరుగు. (ఇట్లుకాక) ఒకపలము తగ్గినచో హీనద్విగుణదండము. సీసత్రపువులకిరువదియవవంతుతరుగు. ఒక పలముపరిమితిగల సీసత్రపువస్తువులఁ దయారుచేసినపుడొక కాకణి వేతనము.

చెల్లని నాణెములను కుప్యములోఁ జేర్చునట్టియుఁ జెల్లునట్టి వానిని కుప్యమునుండి తీసివేయునట్టియుఁ రూపదర్శకునకుఁ బన్నెండుపణములు దండము. కపటపు నాణెములఁ దయారుచేయువానికిని పరిగ్రహించువానికిని చెల్లుబడిచేయువానికిని వేయిపణములు దండము. అట్టివానిని కోశములోఁ జేర్చువానికి వధయే దండము.

ముట్టికి కాలువలు మొదలగు వానిని తుడుచువారు తమకుదొరకిన సారవస్తువులలో నొకవంతునుంచుకొని రెండువంతులు రాజునకియ్యవలెను. రత్నములు దొరకినయెడల దొరకినదంతయు రాజును చేరవలెను; లేనిచో నుత్తమదండము.

ఖని రత్న నిధులను తెలిసికొని చెప్పినవానికాఱవభాగమియ్యవలెను; అతఁడు రాజసేవకుఁడయినయెడలఁ బండ్రెండవభాగము నియ్యవలెను. లక్షకంటెనధికమగునిధి లభించినపుడంతయురాజునే చెందును; దానికంటెఁదక్కువనిధియైనచో నాఱవభాగమును గనుఁగొనినవాని కియ్యవలెను. శుచియగుజానపదుఁడు తనకుదొరకిననిధితన పూర్వులుంచినట్లు ఋజువుచేయఁగలిగినచో దానినంతయునతఁడుతీసికొనవచ్చును; అలాగుఋజువుపఱుపకయే పుచ్చుకొనినపుడైదువందలుదండము; రాజునకుఁ దెలియపఱుపనిచో వేయిపణములుదండము.

రోగము ప్రాణాపాయకరమైనదనిచెప్పక చికిత్సకుఁబూనుకొనినపుడు రోగికిఁబ్రాణాపాయము గలిగినయెడల వైద్యునికిఁ బూర్వసాహసదండము. (చెప్పినపుడుసహితము) చికిత్సయందలిలోపమువలనఁ బ్రాణాపాయముగలిగినచో మధ్యమదండము. రోగమునకువిరుద్ధముగఁ జికిత్సచేసి విపత్తుగలిగించినచో దండపారుష్యదండము.

కుశీలవులు వర్షాకాలమం దొకప్రదేశముననే యుండవలెను.

అతిమాత్రమగు కామదానమునువర్జింపవలెను. ఎవనికిఁగాని (అధికమగు) నష్టమునుకలిగింపరాదు. దీనినతిక్రమించినచో ద్వాదశపణదండము. దేశ జాతి గోత్ర చరణ మైథునములననుసరించి వారియిష్టానుసారముగఁ గ్రీడింపఁజేయవచ్చును. చారణాదిభిక్షుకులవిషయమునఁగూడ నిక్లేయనియెఱుంగునది. వారెన్నిపణములదండము నిచ్చుకొనవలెనో యన్నిశిక్షాపరిహారముల నయశూలములచే విధింపవచ్చును.

తక్కినశిల్పులకుఁగర్మలబట్టి వేతనములఁగల్పింపవలెను.

ఇట్లుకపటపు జోరులు వణిక్కులు కారువులు కుశీలవులు భిక్షుకులు కూహకులు లోనగువారివలన దేశమునకు బాధకలుగకుండ రక్షింపవలెను.

ఇది కంటకశోధనమున కారుకరక్షణమను
మొదటి యధ్యాయము.
ఆదినుండి డెబ్బదియొనిమిదవ యధ్యాయము.



## 77 ప్రకరణము.

### వైదేహకరక్షణము.

పణ్యాధ్యక్షుఁడు తమవియని ఋజువు చేసికొనఁగలవారి నిలువ వస్తువులు నాధానవిక్రయములఁ జేయింపవలెను. పౌతవములందపచారము కలుగకుండుటకై తులామానభాండములఁ బరీక్షించుచుండవలెను.

పరిమాణి ద్రోణములలో నర్ధపలము హెచ్చుతగ్గులు వచ్చినను దోషములేదు. ఒకపలము హెచ్చుతగ్గులు వచ్చినచోఁ బండ్రెండుపణములు దండము. దీనిని పట్టి యింతకంటె హెచ్చుతగ్గులున్న పుడు విధింపవలసినదండమును తెలిసికొననగు.

తుల (త్రాసు) లో నొకకర్షము హెచ్చుతగ్గులుండవచ్చును. రెండుకర్షముల వ్యత్యాసమున్నచో నాలుపణములుదండము.

కంటెకంటె నధికమగు వ్యత్యాసమున్నపుడు దీనినిపట్టి దండవృద్ధిచేయవలెను.

ఒకయాఢకములో నర్ధకర్షము హెచ్చుతగ్గులుండుట దోషముకాదు. కర్షము హెచ్చుతగ్గులున్నచో మూఁడుపణములు దండము. కర్షముకంటె నధికమగు వ్యత్యాసమున్నచో నిదేవిధముగ దండవృద్ధిచేయవలెను.

మఱికొన్నిరకముల తులామానవిశేషములలో హెచ్చుతగ్గులున్నపుడుగూడ నిట్లేయని యెఱుంగునది.

అతిరిక్తములగు తులామానములతోఁగొని హీనములగువానితో విక్రయించువానికి ద్విగుణదండము.

ఒకపణమువిలువగలిగినట్టి గణ్య (లెక్కించియమ్మఁబడు) పణ్యములలో నెనిమిదవవంతుహరించువానికిఁ దొంబదియాఱుపణములు దండము.

అనుత్తమములగు (మంచిజాతిలోఁజేరని) కాష్ఠలోహమణిమయవస్తువులను రజ్జుచర్మమృణ్మయములను సూత్రవల్కరోమమయములను నుత్తమములని (సజాతీయములని) విక్రయాధానములొనర్చువానికి మూల్యద్విగుణదండము. అసారభాండమును సారభాండమనియు, దేశమందుత్పత్తిగానివానిని దానియందుత్పత్తియైనదనియునని చెప్పి విక్రయాధానములఁజేయువానికిని, అసారయుక్తములను మోసముతోఁగూడినవానిని (హస్తలాఘవముచే) సముత్పరివర్తనముచేయఁబడినవానిని విక్రయాధానములొనర్చువానికిని హీనమూల్యమును నేఁబదినాలుగుపణములును దండము. పణమూల్యనష్టముగలిగించినపుడు రెండుపణములును వందపణములమూల్యనష్టము గలిగించినపుడు రెండువందలపణములును దండము. మూల్యవృద్ధికానుగాను దండవృద్ధి యీవిధముగనగుచుండును.

ఎవరయినఁగొందఱేకీభవించి కారుశిల్పులకార్యములకు విఘాతముగావించినను వారియాదాయవిక్రయక్రయముల కుపఘాతముగ

లిగించినను వేయిపణములుదండము.

వర్తకులేకీభవించి వస్తువులకు నిరోధము గలిగించినను వస్తువుల నసహార్ఘములగుమూల్యములకుఁ గ్రయవిక్రయములఁ జేసినను వేయిపణములు దండము.

తులామానవ్యత్యయముమూలమునను అర్ఘవర్ణవ్యత్యాసముగలిగించియు హస్తలాఘవముచే మూల్యములో నెనిమిదవవంతు నష్టమును ధరకునికిని మాపకునికిని కలిగించినచో రెండువందలపణములు దండము. ఇట్టినష్టమునుపట్టి రెండువందలకంటె నధికముగ దండవృద్ధి గావింపవలెను.

ధాన్యస్నేహక్షారలవణగంధభైషజ్య ద్రవ్యములయొక్క వర్ణములవిషయమున మోసముగావించినవానికిఁ బండ్రెండుపణములు దండము.

మధ్యవర్తులకు జీవనాధారమగులాభమును ప్రతిదినములెక్కించి వారికిచ్చుచుండవలెను. విక్రేతక్రేతలకుమధ్యనుగలుగుద్రవ్యమాదాయములోఁ జేరదు.

పణ్యాధ్యక్షునియనుజ్ఞఁబొందియే ధాన్యాదిసంగ్రహము గావింపవలెను. అట్టియనుజ్ఞలేక సంగ్రహింపఁబడినపణ్యము నధ్యక్షుఁడుతీసికొనవచ్చును.

అనుజ్ఞాతక్రయముకంటె నూటికైదెక్కువగ లాభమువచ్చునట్లు స్వదేశీయపణ్యములను, నూటికిఁబదిచొప్పునఁ బరదేశీయములను విక్రయింపవచ్చును. క్రయవిక్రయములలో నిర్ణీతమూల్యముకంటె శతపణములకొకయర్ధపణమధికముగనమ్మినపుడుసహితము పంచపణములుమొదలు రెండువందలపణములవఱకు దండము విధింపవచ్చును. మూల్యవృద్ధి యగుకొలఁదియు దండవృద్ధి యగుచుండవలెను.

వస్తువులకు మొత్తముమీఁద నిర్ణీతక్రయమున కమ్ముఁడాలనపుడు మఱియొకక్రయమునునిర్ణయింపవచ్చును. (అప్పుడుకూడ)

పణ్యములకు నష్టముసంభవించినచో నధ్యక్షుఁడనుగ్రహింపవలెను.

పణ్యము బాహుళ్యముగనుండునపుడు పణ్యాధ్యక్షుఁడుదాని నేకముఖముగఁజేసి యమ్మించుచు నదిచెల్లుబడికానంతవఱ కితరులచే నట్టిపణ్యముల విక్రయింపనియ్యఁగూడదు. ప్రజలకు నష్టముకలుగ నీయక దానిని దివసవేతనముననకై యమ్మించుచుండవలెను.

విదేశములనుండివచ్చినట్టియుఁ జిరకాలముక్రిందవచ్చినట్టియు బణ్యములయొక్క ప్రక్షేపము పణ్యనిష్పత్తి శుల్కము వృద్ధి అవక్రయము ఇతరములగువ్యయములు లోనగువానినిలెక్కించి అర్ఘవేత్తయగునధ్యక్షుఁడు మూల్యనిర్ణయము చేయవలెను.

ఇది కంటకశోధనమున వైదేహకరక్షణమను
రెండవయధ్యాయము.
ఆదినుండి డెబ్బదితొమ్మిదవ యధ్యాయము.



## 78 ప్రకరణము.

### ఉపనిపాతప్రతీకారము.

అగ్ని ఉదకము వ్యాధి దుర్భిక్షము మూషికములు వ్యాళములు సర్పములు రాక్షసులు — ఈయెనిమిదియు దైవికమహాభయములు. వీనినుండి రాజు జనపదమును రక్షించవలెను.

గ్రీష్మకాలమున గ్రామములలో నింటివెలుపలనే వంటచేసికొనవలెను. లేదాదశమూలీసంగ్రహణము (నిచ్చెనమొదలగువానిని సంగ్రహించుట) చేసి యుంచుకొనవలెను. నాగరికప్రణిధి నిశాంతప్రణిధి రాజపరిగ్రహప్రకరణములలో నగ్నిప్రతిషేధమునుగుఱించి చెప్పఁబడియున్నది.

పర్వదినములలో బలిహోమస్వస్తివాచనములతో నగ్నిని పూజింపవలెను.

నదీప్రాంతగ్రామస్థులు వర్షాకాలమునఁ బ్రవాహసామీప్య

మునువిడిచి మఱియొకప్రదేశమునకు వెళ్లుటయేగాక కాష్ఠవేణునావ లనుకూడ సంగ్రహించుకొనవలెను. ప్రవాహామందుఁ గొట్టుకొని పోవుచుండువానిని అనపకాయ పడవ చెట్టుబోదె వెదురులు మొద లగువానిచేఁ దరింపఁజేయవలెను. ప్లవములేనివారుతప్పఁ దక్కినవారి ట్లుచేయనిచోఁ బండ్రెండుపణములు దండము. పర్వదినములందు నదీపూజ చేయవలెను. మాయావిదులును యోగవిదులును వేదవే త్తలును (అధికముగఁగురియు) వర్షమునాపవలెను. వర్షాలోపము కలిగినపుడు ఇంద్ర గంగా పర్వత మహాకచ్ఛ పూజలొనర్చవలెను.

ఔపనిషదికములగుప్రతీకారములచేతను వైద్యులువారియౌ షధములచేతను సిద్ధతాపసులు వారిశాంతిప్రాయశ్చిత్తములచేతను వ్యాధిభయప్రతీకారము గావింపవలెను. మరకవ్యాధుల న్నిటిలోఁ గూడ నిట్లేచేయవలెను. మఱియుఁ దీర్థాభిషేచనము మహాకచ్ఛవర్ధ నము శ్మశానమందు గోవులఁబితుకుట కబంధదహనము దేవపూజ లొనగువానిని చేయింపవలెను. పశువులకుసంభవించిన వ్యాధి మర కములలో వానిస్థానమునందర్ధనీరాజనమును స్వదైవతపూజలను చే యింపవలెను.

దుర్భిక్షకాలమున రాజు బీజములను భక్తమునునిచ్చి ప్రజల ననుగ్రహింపవలెను; లేక దుర్గకర్మలఁజేయించి తనవద్దసంగ్రహించి యుంచుకొనిన యాహారమునుకాని దేశమందలి (ధనికుల) నిక్షేపము నుకాని ప్రజలకుఁ బంచిపెట్టవలెను; లేక రాజు తనమిత్రులనాశ్రయిం చిగాని ధనవంతులనుండిధనమువసూలుచేసిగాని వారినిరక్షింపవలెను; లేక సస్యసంపదగల దేశాంతరములకుఁ బ్రజలతోఁగలసివెళ్ళవలెను; సముద్రసరస్తటాకములనయిన నాశ్రయింపవలెను; లేక ధాన్య శాక మూల ఫలావాపముల సేతువులందుఁ జేయింపవలెను; లేక మృగప శుపక్షివ్యాళములనయిన సంగ్రహించుకొని జీవింపవలెను.

మూషికభయముకలిగినపుడు మార్జాలనకులముల వానిపైకి విడువవలెను. వానినిపట్టుకొని హింసించువారికిఁ బండ్రెండుపణము

లుదండము. అరణ్యచరములుగా నికుక్కలను స్వేచ్ఛగ వదలిపెట్టువా రికిఁగూడ నిదియేదండము. ఎలుకలఁజంపుటకై స్నుహీక్షీరలిప్తము లగునట్టిగాని యుపనిషద్యోగయుక్తములగునట్టిగాని ధాన్యములనుచ ల్లవలెను; లేక సిద్ధతాపసులు శాంతినిచేయవలెను. మఱియుఁ బర్వ దినములలో మూషికపూజలొనరింపవలెను. శలభపక్షిక్రిమిభయము లలోఁగూడ నిట్టిప్రతీకారములనే చేయింపవలెను.

వ్యాళభయముసంభవించినపుడు మదనరసయుక్తములగుపశు శవములనుకాని మదనకోద్రవపూర్ణములగు నాదర్యములనుకాని భూమిపైఁ బడవేసియుంపవలెను. లుబ్ధకులును శ్వగణులును కూట పంజరములతో వానినిపట్టుకొనవలెను, లేదా శస్త్రపాణులగు కవచ ధరులువానిని చంపవచ్చును. వ్యాళములచేఁ బట్టుకొనఁబడినవానికి సహాయముచేయనిచోఁ బండ్రెండుపణములుదండము. వ్యాళమును చంపినవానికిఁ బండ్రెండుపణములు బహుమానము.

పర్వదివసములందుఁ బర్వతపూజలఁ జేయింపవలెను.

మృగ పక్షిసంఘ గ్రాహములవలనఁ గలిగినభయములందుఁ గూడఁ బ్రతీకారములిట్టివి యేయని యెఱుంగునది.

రక్షోభయముకలిగినపు డథర్వవేత్తలును మాయాయోగవే త్తలును రక్షోఘ్నములగుకర్మలఁ జేయవలెను. పర్వదినములలో వి తర్దికలయందు ఛత్రి ఉల్లోపిక(?) హస్త పతాక ఛాగోపహారముల చే చైత్యపూజలొనరింపవలెను. మీకుఁగాను మేము తిరుగుచున్నా మని సర్వభయములందహోరాత్రములలోఁ దిరుగుచుండవలెను.

నష్టపడినవారిని రాజుతండ్రివలె నెల్లప్పుడనుగ్రహింపవలెను.

దైవాపత్ప్రతీకారులగు మాయాయోగవేత్తలును సిద్ధతాప సులును రాజుచేఁబూజితులై దేశమందుండవలయును.

ఇది కంటకశోధనమున ఉపనిపాతప్రతీకారమను మూఁడవ యధ్యాయము.

ఆదినుండి యెనుబదవ యధ్యాయము.

## 79 ప్రకరణము.

### గూఢాజీవరక్షణము.

సమాహర్తృప్రణిధియను ప్రకరణమున జనపదరక్షణమును గుఱించి చెప్పఁబడియె. జనపదకంటకశోధనమునుగుఱించి యిప్పుడుఁ జెప్పఁబడును.

సిద్ధ తాపస ప్రవ్రజిత చక్రచర చారణ కుహక ప్రచ్ఛందక కార్తాంతిక నైమిత్తిక మౌహూర్తిక చికిత్సక ఉన్మత్త మూక బధిర జడ అంధ వైదేహక కారు శిల్పి కుశీలవ వేశశౌండిక ఆపూపిక పాక్వమాంసిక ఔదనిక వ్యంజనులగువారిని సమాహర్త జనపదమునకు రహస్యముగఁ బంపవలెను. వారు గ్రామస్థులయొక్కయు అధ్యక్షులయొక్కయు శుచిత్వాశుచిత్వముల నెఱుంగవలయును.

గూఢజీవియని శంకింపఁబడినవానిని సత్త్రివ్యంజనుఁ డనుసరింపవలెను. పిమ్మట శంకితుఁడగువాఁడు ధర్మస్థునికిఁగాని ప్రదేష్టకుఁగాని తనయందువిశ్వాసముపుట్టించి యతనితో, ఈనాబంధువభియుక్తుఁడు వీనికినష్టముసంభవించినది, ఈధనమునునీవుప్రతిగ్రహించి వీనికిఁబ్రతీకారముచేయుమని పలుకవలయును. అతఁడాలాగొనర్చినచో, ఉపధాగ్రాహకుఁడని (లంచగొండి) వానిని దేశమందుండి తొలఁగింపవలయును. ప్రదేష్టలవిషయమునఁగూడ నిట్లేచేయవలెను.

లేక సత్త్రియగు వాఁడు గ్రామసంఘముతోఁగాని, అధ్యక్షుని తోఁగాని, 'వీఁడుదుష్టుఁడుగాని మిక్కిలిధనవంతుఁడు. వీనికిప్పుడనర్థముసంభవించినది· వీనిధనము నపహరించుటకిదియే సమయము, అని పలుకవలెను. దానికిసమ్మతించి యట్లొనర్చినచో ఉత్కోచకుఁడని జనపదమునుండి వానినిఁదొలఁగింపవలయును.

సత్త్రి తానభియుక్తుఁడయినట్లు వేషమువేసికొని విశేషద్రవ్యమిచ్చెదనని కూటసాక్షులనిప్రసిద్ధికెక్కినవారితో బేరమాడవలెను.

వారాతని కనుకూలురయినచోఁ గూటసాక్షులని వారిని దేశమునుండి తొలఁగింపవలయును.

కపటపునామెములఁ జేయువారివిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

శ్మాశానికములగు మంత్రయోగమూలకములగుకర్మలచే సంవననము (తొర్పుట) చేయువానితో సత్రి, ఈతనిభార్యను కోడలిని కుమార్తెను నేనుకామించుచున్నాను. నీవీద్రవ్యమును పుచ్చుకొని వారునన్నువలచునట్లు చేయుమని పలుకవలెను. వాఁడాలాగు చేసినచో సంవననకారకుఁడని దేశమునుండి వానినితొలఁగింపవలెను. కృత్యాభిచారశీలురవిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

రసమునుగుఱించి పేర్కొలుచుండుట చేతను రసమునుగొనుటచేతను దానినివిక్రయించుటచేతను రసవైద్యముచేయుటచేతను రసదుఁడని (రసముపెట్టిచంపువాఁడు) యెవనినయిన శంకించుటకు హేతువున్నచో నట్టివానితో సత్రి, వీఁడునాశత్రువు, నీవీద్రవ్యమునుతీసికొని వీనినిచంపుమని పలుకవలెను. వాఁడట్లుచేసినచో రసదుఁడని వానిని దేశమునుండి తొలఁగింపవలెను. మదనయోగవ్యవహారము లంవంతట నిట్లేయని యెఱుంగునది.

నానాలోహక్షారములను అంగార భస్త్ర సందంశ మూషికాధికరణ విటంక మూషలను దఱచుగఁగొనుటచేతఁగాని మూషీభస్మధూమములచేఁ బూయఁబడిన హస్తవస్త్రములుగలవాఁడగుటచేతఁగాని కర్మారునియుపకరణముల నంపాదించినవాఁడగుటచేతఁగాని నెవనినయినఁ గూటరూపకారునిగ శంకించినచో నతనితోసత్రి శిష్యత్వమూలమున వ్యవహారము మొదలిడి వానిగుట్టును బహిరంగపఱచవలెను. పిమ్మటవానినికూడ రూపకారకుఁడని దేశమునుండితొలఁగింపవలెను. రాగాపహర్తలు కూటసువర్ణవ్యవహారులు— వీరి విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

## 81 ప్రకరణము.

### శంకారూపకర్మాభిగ్రహము.

సిద్ధప్రయోగము జరిగిన పిమ్మట శంకారూపకర్మాభిగ్రహములఁ జేయవలెను.

క్షీణదాయముగలకుటుంబి (ము) అల్పసుఖములుగలవాఁడు దేశజాతిగోత్రనామకర్మలనై పరీత్యముగలవాఁడు ప్రచ్ఛన్నమగువృత్తికర్మలుగలవాఁడు మాంససురాభక్ష్యభోజన గంధమాల్యవస్త్ర విభూషణప్రసక్తుఁడు అతివ్యయకర్త పుంశ్చలీద్యూతశౌండికులతో మైత్రిగలవాఁడు ఎల్లప్పుడు పరవాసముచేయువాఁడు స్థానగమనకార్యములఁ దెలియనీయనివాఁడు రహస్యప్రదేశములందును అరణ్యనిష్కుటప్రదేశములందును అకాలమునఁ జరించువాఁడు ప్రచ్ఛన్నమును సామిషమునునగు ప్రదేశమందుఁ బలువిధములగు నాలోచనఁ జేయువాఁడు సద్యఃక్షతవ్రణములకు గూఢముగఁ బ్రతీకారము చేయువాఁడు ఎల్లప్పుడంతర్గృహములో దాఁగియుండువాఁడు కాంతాపరుఁడు పరులభార్యలగుఱించియు ద్రవ్యవేశ్మములగుఱించియుఁ బ్రశ్నించుచుండువాఁడు కుత్సితములగు కర్మశాస్త్రోపకరణములతో సంసర్గము గలవాఁడు ప్రచ్ఛన్నములగు కుడ్యములనీడలలో విరాత్రమందు సంచరించువాఁడు విరూపద్రవ్యముల నదేశకాలములందు విక్రయించువాఁడు జాతవైరాశయుఁడు హీనములగు కర్మజాతులుగలవాఁడు రూపమునుదాచుకొనువాఁడు లేనిచిహ్నాలను ధరించుకొనువాఁడు భిన్నాచారుఁడు పూర్వకృతాపదానుఁడు స్వకర్మలనుండి తొలఁగింపఁబడిన నాగరికుఁడు మహామాత్రదర్శనమున దాఁగువాఁడు పరుగెత్తువాఁడు ఊపిరిపట్టక నొకచోటఁ గూర్చుండువాఁడు ఆవిగ్నుఁడు శుష్కమగు ముఖవర్ణమును భిన్నమగుస్వరవర్ణములుగలవాఁడు శస్త్రహస్తులగుమనుష్యులతోసంబంధముగలవాఁడు భయపెట్టుచుండువాఁడు— ఇట్టివారు హింస్రస్తేననిధినిక్షేపాపహార పరప్రయోగ గూఢాజీవులలోఁ జేరినవారని శంకింపవలెను. ఇది శంకాభిగ్రహము.

రూపాభిగ్రహము:— నష్టాపహృతములగు వస్తువులుతిరిగిదొరకవపు డాజాతిలోఁజేరినవస్తువులను విక్రయించువారి కెఱింగింపవలెను. అట్లెఱింగింపఁబడినతర్వాత నవి లభ్యమైనను వానినిగప్పిపుచ్చువర్తకులు సాచివ్యకరదోషులగుదురు. (నష్టాపహృతమని తెలియకవారిట్లుచేసినచో) దానినిచ్చివేసి నిర్దోషులుకావచ్చును. సంస్థాధ్యక్షునితోఁజెప్పక పురాణభాండముల నాధానవిక్రయములఁ జేయరాదు. సంస్థాధ్యక్షుని కిట్లుజరిగినదని తెలిసినపుడు వస్తువుగలవానిని, నీకిదియెట్లు లభించినదని యడుగవలెను. నాకిదిదాయమునుండివచ్చినది లేక మఱియొకనినుండి లభించినది, ఇదికీ్రతము దీనినినేఁజేయించితిని; ఇదినావద్దదాచఁబడినదని యదిలభించినవిధమును దేశకాలములను దానియర్ఘపరిమాణలక్షణమూల్యములను తెలుపవలెను. ఇట్లు తెలుపఁబడినవిషయము సరియనితోఁచినయెడల వానిని విడిచిపెట్టవచ్చును. నాష్టికుఁడాద్రవ్యము తనదనిచెప్పినపుడు వీరిద్దరిలో నెవరికిఁ బూర్వమైనట్టియు దీర్ఘమైనట్టియు ననుభవమున్నదో, ఎవఁడుశుచియో వానికినాద్రవ్యము నియ్యవలెను. ఏలన చతుష్పాత్తులకుసహితము రూపలింగసామాన్యమగపడుచున్నది. ఏకయోనిద్రవ్యకర్తృకప్రసూతములగు కుప్యాభరణభాండములమాట వేఱుగఁజెప్పనేల? అది యాచితకము అవక్రీతము ఆహితకము నిక్షేపము ఉపనిధి వైయావృత్త్యకర్మ వలన లభించినది యని నాష్టికుఁడుచెప్పినచోఁ దగిన ఋజువుఁబుచ్చుకొని వానినివిడుదలచేయవలెను; లేక మధ్యవర్తియగువాఁడిది సత్యముగాదనియైనఁ జెప్పవచ్చును. (అపహరింపఁబడిన) పరునివస్తువును దగ్గఱనుంచుకొనినవాఁడు తనకావస్తువును పరుఁడు దానముచేయుటకును దానినితాను పరిగ్రహించుటకునుకల కారణమునుచెప్పి దానియొక్క చిహ్నములను దాయకదాపకనిబంధకప్రతిగ్రాహకోపదేష్టలమూలమున ఋజువుచేయవలెను. తనకులభించిన వస్తువుప్లుతమైనదనిగాని ప్రణష్టమైనదనిగాని నిష్పతితమనిగాని చెప్పునపుడు దానిని దేశకాలలాభోపలింగములచే ఋజువుచేయఁగలిగి

నయెడల శుద్ధుఁడగును. లేనిచో నావస్తువునుమాత్రమేగాక తత్సరి మితదండమునయినను స్తేయదండమునయిన నిచ్చుకొనవలెను. ఇది రూపాభిగ్రహము.

కర్మాభిగ్రహము:— దొంగలింపఁబడిన గృహావిషయమున ద్వారముకానట్టి ప్రదేశములమూలమునఁ బ్రవేశనిష్కాసనములొన ర్చుట సంధిబీజములచే ద్వారమును పగులఁగొట్టుట ఆరోహణావత రణములలో నుత్తమాగారముయొక్క జాలవాతాయన నీవ్రములఁ బగులఁగొట్టుట గోడలఁగొట్టుట గోడలక్రిందఁద్రవ్వుట ఉపదేశము మూలముననేదెలియనగుగూఢనిక్షేపగ్రహణము లోపలివైపునుండి ఛేదించుటకుపయుక్తములగునుపకరణములు లోనగువానిసపట్టి య భ్యంతరుఁడు కన్నమువేసినట్లు తెలిసికొనవలెను. ఇందుకువిరుద్ధ ముగఁ జిహ్నములున్నపుడు బాహ్యాకృతమనియు, రెండువిధములగు చిహ్నములగుపడినపు డుభయకృతమనియుఁ దెలిసికొనవలెను.

అభ్యంతరకృతమైనపుడు— ఆసన్నపురుషులలో వ్యసనినిఁ గ్రూరసహాయునిఁ దస్కరోపకరణసంసర్గముగలవానిని దరిద్రకులజ యునన్యప్రసక్తయునగుస్త్రీని, అట్టిదుర్గుణములుగల పరిచారికాజన మును అతిస్వప్నుని నిద్రాక్లాంతుని అవిక్లాంతుని ఆవిగ్నునిశుష్క ముఖవర్ణుభిన్నస్వరుని ఊరకగూర్చుండియుండువానిని అతిప్రలాపి తుని ఉచ్చస్థలములనారోహణము చేసినలక్షణములుశరీరమందుగల వానిని, తెగినట్లునుగీచుకొనినట్లును బ్రద్దలైనట్లునున్న శరీరవస్త్రము లుగలవానిని వాచినహస్తపాదములుగలవానిని పాంసుపూర్ణములయి నట్టియు కేశనఖములుగలవానినితెస్నానలేపనములఁజేసికొనినవాని ని తైలముచేశరీరమునంతపూసికొనినవానిని అప్పటికప్పుడే హస్తపాద ములనుకడుగుకొనినవానిని పాంసుప్రదేశములందుఁబ్రవేశనిష్కాసనము లలోఁబడినయడుగులతోఁ దుల్యములగు పాదనిక్షేపము గలవానిని ఇంటిసమీపమున ముక్కలుగబడిఁయుండువానితోఁ దుల్యములగు మాల్యమద్యగంధములుగలవానిని అచటఁబడియుండు వస్త్రచ్ఛేద

ములచే నూహింపఁదగు స్వేదముగలవానిని పరీక్షింపవలెను. ...దారికుడగుపౌరునిఁగూడ నిక్షేపపరీక్షింపవలెను.

గోపస్థానికులతోఁగూడి ప్రదేష్టబాహ్యచోరులను వెతుకవలెను. తగినకర్తులుపట్టినాగరికుఁడు దుర్గములోపలచోరులను వెతుకవలెను.

ఇది కంటకశోధనమున శంకారూపకర్మాభిగ్రహము నాలవ యధ్యాయము.

ఆదినుండి యెనుబదియూఁడవ యధ్యాయము.

82 ప్రకరణము.

ఆశుమృతకపరీక్ష

హతాత్తుగమృతినొందినవానిని తైలమువ్రాసి పరీక్షింపవలెను.

నిష్క్రాంతములగు మూత్రపురీషములుగలవానిని వాతపూర్ణములగునవయవములు ఉబ్బినపాణిపాదములు ఉన్మీలితములగుకన్నులు వ్యంజనసహితమగు కంఠముగలవానిని పీడించియుచ్ఛ్వాస నిరోధముగావించిచంపబడినట్లు దెలిసికొనవలయును. వీనిబాహువులును దొడలును సంకుచితములై యున్నచో నుద్బంధహతునిఁగనెఱుంగునది. ఉబ్బినపాణిపాదోదరములుగలిగి అపగతాక్షుఁడై పొంగిననాభిగలవాఁడైనచో శూలారోపహతుఁడనిదెలిసికొనవలెను. గుదాక్షములుబిగుసుపాటియు, నాలుకకఱచుకొనియు ఉదరముపొంగియునున్నచో ఉదకహతుఁడనియూహింపవలెను. అవయవములురక్తముచేఁనడిచి విరిగ్రబద్దలైయున్నచోఁగాష్ఠముచేఁగాని ద్రాళ్ళచేఁగానిహతుఁడైనట్లూహింపవలెను. శరీరముభగ్నస్ఫుటితముగనున్నచోఁ గ్రిందఁద్రోయఁబడుటచే హతుఁడయ్యెనని దెలిసికొనవలెను. పాణిపాదదంతనఖములు నల్లగను మాంసరోమచర్మములు శిథిలములుగను ముఖముఫేనోపదిగ్ధముగను నున్నచో విషహతుఁడు. ఇతఁడుశోణితదంశముతోఁగూడి

యున్న యెడల సర్పకీటహతుఁడు; విక్షిప్తములగు వస్త్రగాత్రములను వాంతివిరేచనములు నుకలవాఁడు మదనయోగహతుఁడు. పైకారణములవలనఁ జచ్చుటయుఁ జంపఁబడుటయు దండభయముచే దట్టించునదియెఱుంగునది.

విషహతుని భోజనశేషమును పక్షులకుఁ బెట్టి పరీక్షింపవలెను; లేకదానిని హృదయమునుండి (?) తీసి యగ్నియందు వేసినపుడు చిటచిటశబ్దమును నింద్రధనుర్వర్ణమును కలిగినచో నదివిషయుక్తమని యూహింపవలెను.

దగ్ధకళేబరములో నిహృదయము దగ్ధముగాకుండినచో మృతుని పరిచారకజనమును దండపారుష్యముచేఁ బరీక్షింపవలెను. మృతుని బంధువులలో దుఃఖోపహతుని నన్యప్రసక్తయగు స్త్రీని మృతుని దాయమును గోరు స్త్రీజనాభిమానిని గూడఁ బరీక్షింపవలెను. ఉరిచేఁ జచ్చినవాని విషయమైకూడ నిట్లే చేయవలెను.

తనంతటఁదానురిదీసికొని చచ్చినవాని విషయమున నాతఁడెవరికైన నపకారముగాని కీడునుగాని చేసియుండెనో యనువిషయమును తెలిసికొనవలెను.

స్త్రీలకు దాయాదులకు దోషమొనర్చుట కర్మస్పర్ధ ప్రతిపక్షద్వేషము వర్తకులు సంఘములు- ఇవి రోషస్థానములు. రోషనిమిత్తము ఘాతము.

స్వయముగఁ దానుపంపిన పురుషులచేఁగాని సాదృశ్యముపట్టి యన్యులనిఁ జంపుటకుఁ బంపఁబడిన యన్యభృత్యులచేఁగాని చంపఁబడినవానిమరణమును గురించి వానియాసన్నులఁ బరీక్షింపవలెను. మృతుని బిలిచినవారెవరు. వానితోఁగూడ నుండినవారెవరు. బయలుదేరినవారెవరు. హతభూమినిగురించి వానిని తీసికొని పోయినవారెవరు. అనివారి నడుగవలెను. ఇట్లే హతభూమికి సమీపమున సంచరించుచుండువారి నొక్కొక్కనిగఁ బిలిచి ఎవని చేనతఁడిచటికిఁ దీసికొనిరాఁబడెను. వారిలో శస్త్రహస్తుఁడెవఁడు. వారిలో దాగియుండినవాఁడును నుద్వి

ఘ్నుఁడైనవాఁడును మోసగపడెనా, అనిప్రశ్నింపవలెను. వారుచెప్పిన విషయములఁబట్టి లెస్సగఁబరీక్షింపవలెను.

దిక్కులేక మృతుఁడైనవానివిషయమై వానిశరీరస్థములగు నుపభోగవస్త్రవేషవిభూషణము తద్వ్యవహారులుపరిశీలించి వానిస్నేహితులను నివాసమును ప్రవాసకారణమును వృత్తినివ్యవహారమును తెలిసికొని వీమ్మట నతఁడెవఁడో నిర్ణయింపవలెను.

కామక్రోధవశముచేఁగాని మఱియొక పాపబుద్ధిచేఁగాని రజ్జుశస్త్రవిషములమూలమున నాత్మహత్యచేసికొనినస్త్రీపురుషులను త్రాడుగట్టి చండాలునిచే రాజమార్గమున నీడ్పింపవలెను. వారికిశ్మశానవిధియు సంబంధులు చేయఁదగినయితరములగునుత్తరక్రియలును జరుగరాదు. వారికుత్తరక్రియలఁజేసిన బంధువులకుఁగూడ నిదియే గతియగును; లేక వారినిబంధుజనములనుండి బహిష్కరింపవలెను. పతితునితోసహవాసముచేసినవాఁడొక సంవత్సరములోపుగ వానిసహచరులతోఁగూడ యాజనాధ్యాపనయానముల కనర్హుఁడైపోవును.

ఇది కంటకశోధనమున ఆశుమృతకపరీక్షయను

ఏడవయధ్యాయము.

ఆదినుండి ఎనుబదినాలుగవ యధ్యాయము.



83 ప్రకరణము.

వాక్యకర్మానుయోగము.

అభియుక్తుఁడు బాహ్యుఁడైనను ఆభ్యంతరుఁడైనను వానిసాక్షిని ముషితునిసన్నిధియందుంచి వాని (యభియుక్తుని) దేశజాతిగోత్రనామకర్మసారసహాయనివాసములగుఱించిప్రశ్నింపవలెను. అతఁడిచ్చుజబాబుల నదివఱకభియుక్తుఁడు చెప్పిన వాక్యములతో సమన్వయముగావించి యపహరణమునకుఁ బూర్వపుఁబగటియందభియుక్తునిప్రచారమును నారాత్రియందువానినివాసమును చెప్పుమని సాక్షి

నడుగవలెను. అతఁడిదివఱకుఁజెప్పినది సాక్ష్యమువలన ఋజువైనచో నతఁడుశుద్ధుఁడు; లేనిచోఁగర్మప్రాప్తుఁడగును.

సాధనోపకరణములులభించినప్పుడునప్పుడక్కడేనప్పుడు పరీక్షల జేయుటకవకాశముండదుగావున (నేరముజరిగి) మూఁడురాత్రులయిన పిమ్మట శంకితునిబట్టుకొనరాదు.

చోరుఁడుకానివానినిఁ జోరుఁడని చెప్పువానికినిఁ జోరునిదాచిన వానికిని జోరసమదండము.

వైరద్వేషములచేఁ దనపైనభియోగము తేఁబడినదని ఋజువు చేసికొనఁగలచోరుఁడు శుద్ధుఁడు. శుద్ధుని దేశమునుండి వెడలఁగొట్టు వానికిఁ బూర్వసాహసదండము.

శంకితునిపైఁగలిగినశంకను ఉపకరణమంత్రి సహాయరూప వైయావృత్యకరులమూలముఁ ఋజువుచేయవలెను. ఈవిషయము కార్యకర్మజరిగినప్రదేశము ద్రవ్యాదానము అంశవిభాగము లోన గువానితో సమన్వయముచేసి చూడవలెను. ఈసందర్భములన్నిటి వలనను ఋజువుగాక అతఁడు మొఱపెట్టుచుండినచో నతఁడుచోరుఁడని దెలిసికొనవలెను. ఒక్కొక్కప్పుడు దైవవశముచే నచోరుఁడుగూడఁ జోరమార్గమునఁజూడఁబడవచ్చును; లేదాచోరుని వేషశస్త్రభాండ సాదృశ్యముచేఁగాని చోరభాండమునకు సమీపమందుండుటచేఁగాని (అచోరుఁడు) పట్టుకొనఁబడి కర్మక్లేశభయమువలనమాండవ్యుని వలె నేనచోరుఁడను అనిచెప్పవచ్చును. కావుననసుమానరహితమగు సాక్ష్యమును సంపాదింపవలెను.

మందుఁడు బాలుఁడు వృద్ధుఁడు ఉన్మత్తుఁడు క్షుత్పిపాసాధ్వక్లాంతుఁడు అత్యాశితుఁడు తప్పుజేసినట్లొప్పుకొనువాఁడు దుర్బలుఁడు వీరివిషయముఁ గర్మనుచేయఁగూడదు (వీరిని బలాత్కరింపఁగూడదు).

తుల్యశీలులు పుంశ్చలులు పానీయమునిచ్చువారు కథకులు భోజనదాతలు లోనగువారిమూలమున వీరివిషయముగనుఁగొనిని క్షే

పాపహర్తలఁ బరీక్షించునట్లు వీరిఁ బరీక్షింపవలెను.

దోషియనినమ్మఁదగినవానిపైఁ గర్మ చేయవలెను. గర్భిణియుఁ బ్రసూతయు మాసావరప్రసూతయునగు స్త్రీని బలాత్కరింపఁగూడదు. స్త్రీలపై నర్ధకర్మను చేయవలెను, లేక ప్రశ్నమూలమున వారినేరమును స్థాపింపవచ్చును.

బ్రాహ్మణునియొక్కయు శ్రుతవంతునియొక్కయుఁ దపస్వియొక్కయు నేరమును శత్రులమూలమునఁ దెలిసికొనవలెను.

ఈరీతులనతిక్రమించువారికిని నతిక్రమింపఁజేయువారికిని మరణముగలుగునట్లు బలాత్కరించువారికిని నుత్తమదండము.

నాలుగువిధములగుకర్మ (బలాత్కారము) వ్యవహారములో నున్నది:- ఆఱువిధములగు దండములు, ఏడుకొరడా దెబ్బలు, రెండువిధములుగఁ బైనుండి ప్రేలాడఁగట్టుట, నీటిగొట్టము (తో శిక్షించుట).

గొప్పపాపకర్మనుచేసినవారిని బెత్తముతోఁ దొమ్మిదివిధములుగఁ గొట్టవలెను:- రెండుతొడలపైఁ బండ్రెండు దెబ్బలు, నక్తమాలలతలతో నిరువది దెబ్బలు అరచేతిలో ముప్పది, రెండు వృశ్చికబంధములు, చేతులందుసూదులఁ బెట్టి వ్రేలఁగట్టుట, కదల్చుట, గంజిద్రావించియంగుష్టపర్వమునుఁ గాల్చుట, నూనెద్రావించి యొకపగలు శరీరమును కాపుట, చలిరాత్రులందు బల్బజశయ్యపై బరుండఁబెట్టుట.- ఇవి పదునెనిమిది విధములగుకర్మలు. పాపకర్మనిఁ బ్రమాణప్రహరణ ప్రధారణ అవధారణాద్యుపకరణములను గాడిదెపైఁ బెట్టికాల్పవలెను. వీనిలో నొక్కొక్కకర్మ నొక్కొక్కదినమునఁ జేయవలెను.

ఇదివఱకు నేరముచేసినవానిని ప్రతిజ్ఞచేసియపహరించువానిని అపహరించినద్రవ్యములోఁ గొంతభాగ మనుభవించినవానిని చౌర్యముఁ జేయుచున్నప్పుడు బట్టుకొనఁబడినవానిని, రాజాజ్ఞచే నొక్కమాఱుగాని పలుమార్లుగాని యీవిధములగుకర్మలకుఁ బాత్రునిజేయవలెను.

సర్వాపరాధములందు బ్రాహ్మణుఁడశిక్షనీయుఁడు. వ్యవహారా

నపహారకుఁడని సూచించుటకై యతనిచేఁ జౌర్యముగావించినప్పుడు శున
కాంకమును మనుష్యవధ చేసినప్పుడు కబంధాంకమును గురుతల్పగతుఁడైన
చో భగాంకమును సురాపానము చేసినచో మద్యధ్వజాంకమును వానిము
ఖముపై వేయవలెను. పాపకర్ముఁడగు బ్రాహ్మణునకు నిగుతులను వే
సి, వానిని చాటించి దేశమునుండి తొలఁగింపవలెను, లేదా గనులలోఁ
బనిచేయింపవలెను.

ఇది కంటకశోధనమున వాక్యకర్మానుయోగమను
నెనిమిదవ యధ్యాయము.
ఆదినుండి ఎనుబదియైదవ యధ్యాయము.



## 84 ప్రకరణము.

### సర్వాధికరణ రక్షణము.

సమాహర్తచే నియమింపఁబడిన ప్రదేష్టలు మొట్టమొదట నధ్యక్షులను వారిభృత్యులను నియమమునందుంచవలెను.

గనులనుండిగాని సారకర్మాంతములనుండిగాని సారవస్తువులను రత్నములను నపహరించువానికి శుద్ధవధము దండము. ఫల్గుద్రవ్యాంతములనుండి ఫల్గుద్రవ్యములను నుపస్కరములను నపహరించినచోఁ బూర్వసాహసదండము. పణ్యభూములనుండి మాషము మొదలు పాదపణముమూల్యముగల రాజపణ్యము నపహరించినచోఁ బండ్రెండుపణములును అర్ధపణమూల్యమువఱకిరువదినాలుగు పణములును ముప్పావుపణముమూల్యమువఱకు ముప్పదియాఱుపణములును ఒకపణముమూల్యమువఱకు నలువదియెనిమిదిపణములును రెండుపణములమూల్యముగలవస్తువులపహరించినపుడు పూర్వసాహసదండమును నాలుగుపణముల మూల్యమైనచో మధ్యమదండమును ఎనిమిది పణములమూల్యమైనపు డుత్తమదండము నంతకంటెనధికముగనపహరించినచో వధమును దండములు. కోష్ఠపణ్యకుప్య ఆయుధాగారములనుండి పైనానిలోసగముమూల్యముగల ద్రవ్యభాండ ఉప

స్కారములను నపహరించినపురుషుని తలటిదండనమునే విధింపవలెను. కోశభాండాగార అక్షశాలలనుండి వీనిలోనాలవవంతు మూల్యము గలవస్తువులనపహరించినను ద్విగుణదండము. చోరులుతప్పించుకొనుటయందు సహాయముచేయువారికిఁ జిత్రవధముదండమని రాజపరిగ్రహపరికరణములఁజెప్పఁబడియున్నది. బాహ్యులగువారు (ఉద్యోగులుకానివారు) పగలుపరిచ్ఛన్నులై క్షేత్రఖలవేశ్మ ఆపణములనుండి మాషము మొదలు పాదపణమువఱకు మూల్యముగల కుప్యభాండములను ఉపస్కారములను నపహరించినవానికి మూఁడుపణములుదండము, లేక గోమయమునుపూసినదైనను శరావమును మొలకుఁగట్టినదైనను వీధులవెంబడనతనిఁద్రిప్పవలెను. పావుమొదలర్ధపణమూల్యము వఱకు నాఱుపణములుదండము, లేక అతనిని ముండితునిఁగనైనను పరివ్రాజకునిఁగనైనను చేయవలెను. అర్ధపణముమొదలు ముప్పాతికపణమువఱకుఁ బొమ్మిదిపణములుదండము, లేకఅతనినిగోమయభస్మములఁబూసి శరావమునుమొలకుఁగట్టి త్రిప్పవలెను. పణ్యమూల్యమువఱకుఁ బండ్రెండుపణములుదండము, లేకఅతనినిముండితునిఁగఁగాని పరివ్రాజకునిఁగఁగాని చేయవలెను. రెండుపణములమూల్యమువఱకిరువదినాలుగుపణములుదండము, లేకఇటికలతో ముండితునిఁగఁగాని పరివ్రాజకునిఁగఁగానచేయువలెను. నాలుగుపణములుమూల్యమువఱకు ముప్పదియాఱుపణములుదండము. అయిదుపణములమూల్యమువఱకు యేనిమిదిపణములుదండము. పదిపణములమూల్యము వఱకుఁబూర్వసాహసదండము. అది మొదలరువదిపణముల మూల్యము వఱకు రెండువందలపణములుదండము, ముప్పదిపణముల మూల్యమువఱకు నైదువందలపణములుదండము, నలువది పణములమూల్యమువఱకు వేయి పణములుదండము. అంతకధికమగు మూల్యముగల వస్తువులనపహరించినచో వధము. పగటిలోగాని రాత్రియందుఁగానిజాముకాలము కాక పూర్వమే బలాత్కరించిపై మూల్యములలో నర్ధమూల్యముగలవస్తువులనపహరించినచో ద్విగుణదండము. రాత్రియం

డుఁగాని పగటిలోఁగాని శస్త్రసహితుఁడై బలాత్కరించి చతుర్భాగమూల్యమునపహరించినవానికిఁగూడ ద్విగుణదండము.

కుటుంబాధ్యక్ష ముఖ్య స్వాములలోనెవరైనను కూటశాసనములనుగాని కూటముద్రలనుగాని కల్పించినచోఁ బూర్వమధ్యమోత్తమదండములనుగాని వధనుగాని విధింపవలెను, లేక యథాపరాధముగనైనను దండింపవచ్చును.

ధర్మస్థుఁడు వివాదము చేయుచుండు పురుషునిఁ దర్జించినను భర్త్సనము చేసినను తొలఁగించినను పట్టుకొనినను నతనికి మొదలఁ బూర్వసాహసదండమును విధింపవలెను. వాక్పారుష్యమొనర్చినపుడు ద్విగుణదండము. అతఁడు (ధర్మస్థుఁడు) పృచ్ఛ్యమును ప్రశ్నింపకున్నను అపృచ్ఛ్యమును ప్రశ్నించినను ప్రశ్నించియు విడిచినను క్రొత్తగనెప్పనను జ్ఞాపకముచేసినను వానికిసలహాయిచ్చినను మధ్యమసాహసదండము. ఆవశ్యకమగుసందర్భములనుగనకున్నను అనావశ్యకమగుసందర్భములనడిగినను అసందర్భప్రశ్నలచేఁ గార్యవిలంబనము గావించినను ఛలముచేఁగాలహరణముచేసినను కాలహరణముచే శ్రాంతుఁడగు వివదమానునితొలఁగించినను వివాదమునుపరిష్కరించుటలో నుపయోగించువాక్యముల నుత్క్రమింపఁజేసినను సాక్షులకుసహాయముచేసినను తీర్మానించినవివాదముల మఱలవిచారణచేయఁబూనినను ధర్మస్థునికుత్తమసాహసదండము. ఇట్టియపరాధమును రెండవమారు గావించినయెడల ద్విగుణదండమునువిధించి యుద్యోగమునుండి తొలఁగింపవలెను.

చెప్పినదానినివ్రాయనట్టియుఁ జెప్పనిదానిని వ్రాయునట్టియు దురుక్తమునుగమనింపనట్టియు సూక్తమునుసరిగవ్రాయనట్టియు లేక వికల్పార్థమువచ్చునట్లువ్రాయునట్టియు లేఖకునికిఁ బూర్వసాహసదండమునుగాని యథాపరాధదండమునుగాని విధింపవలెను.

ధర్మస్థుఁడుగాని ప్రదేష్టగాని న్యాయవిరుద్ధముగ జరీమానానువిధించినయెడలదానికి రెండింతలదండమునుగాని హీనాతిరిక్తాష్టగుణ

దండమును గాని భరింపవలెను. న్యాయవిరుద్ధముగ శరీరదండమును విధించినపుడట్టిదండమునకు వారే పాత్రులగుదురు, లేదా నిష్క్రయద్విగుణము నిచ్చుకొనవలెను. రావలసినధనమును రాకుండఁజేయునట్టియు రాఁగూడనిదాని నిప్పించునట్టియు ధర్మస్థుని కెనిమిదిరెట్లు దండము.

ధర్మస్థీయమునుండి చారకమునుండియు నేరముచేసినవానిని తొలఁగించువానికిని కారాగృహస్థుల శయ్యాసనభోజనసంచారాములకు నిరోధముగలిగించువానికిని మూఁడుపణములకంటె నెక్కువదండమును విధింపవలెను.

చారకమునుండి యభియుక్తునిఁదొలఁగించినను తొలఁగింపఁజేసినను మధ్యమసాహసదండమునువిధించి, యట్టివానినుండి యభియోగద్రవ్యమును వసూలుచేయవలెను. బంధనాగారమునుండియభియుక్తుని విడుదలచేసినవానికి సర్వస్వమునుతీసికొని వానిని వధింపవలెను.

దోషమునునిరూపింపకయే యొకనినిబంధనాగారమందుంచిన బంధనాగారాధ్యక్షునికి యిరువదినాలుగుపణములుదండము. వానిపైఁ గర్మ (బలాత్కారవధ) ను కావించినయెడల ద్విగుణదండము, వానిని మఱియొకచోటికిఁ బంపినను వానియన్నపానములకు నిరోధముకలిగించినను తొంబదియాఱుపణములుదండము. వానినాక్రోశపెట్టినను వానినుండి లంచముపుచ్చుకొనినను వానినికొట్టినను వేయిపణములు దండము.

కారాగృహమందుండు పరిగృహీతనుకాని దాసినికాని ఆహితకనుకాని బలాత్కరించిపొందువానికిఁ బూర్వసాహసదండము. చోరునిభార్యతోఁగాని ధామరికుని (మరకములోఁజచ్చినవాని) భార్యతోఁగాని వ్యభిచరించువానికి మధ్యమదండము. సంరుద్ధయగునార్యస్త్రీనిపొందువానికుత్తమదండము. సంరుద్ధుఁడగువాఁడు సంరుద్ధయగునార్యతో వ్యభిచరించినయెడల ఘాతమేదండము. అకాలసంచార

మునకై నిరోధింపఁబడిన యార్యను పొందువానికి మరణదండము; అట్టిదాసిని పొందువానికిఁ బూర్వసాహసదండము.

చారకమును భేదింపక నేరము చేసినవానిఁ దప్పించుకొని పోవునట్లు గావించిన యుద్యోగికి మధ్యమదండము. చారకమును భేదించి యిట్లొనరించినచో వధము. బంధనాగారమునుండి యిట్లు చేసిన యెడల సర్వస్వమును తీసికొని వధింపవలెను.

తగినదండముచే నర్థచరులను (ఉద్యోగులను) రాజు మొదట శోధించి శుద్ధులగువారి సహాయమునఁ బౌరజానపదులను తగువిధముగ శిక్షించి శోధించుచుండవలెను.

ఇది కంటకశోధనమున సర్వాధికరణరక్షణమను

తొమ్మిదవయధ్యాయము.

ఆదినుండి యెనుబదియాఱవ యధ్యాయము.



## 85 ప్రకరణము.

### ఏకాంగవధనిష్క్రయము.

తీర్థఘాతములను గ్రంథిభేదములను నొనరించునట్టి రాజోద్యోగులకుఁ(?) బ్రథమాపరాధమునఁ జూపుడువ్రేలిని ఛేదించుట లేక యేఁబదినాలుగుపణములు దండము, ద్వితీయాపరాధమున నీ ఛేదముగాని నూరుపణములుగాని దండము, తృతీయాపరాధమున దక్షిణహస్తచ్ఛేదముగాని నాలుగువందలపణములుగాని దండము, చతుర్థాపరాధమున నేదియో యొకవిధమగు వధము దండము.

ఏఁబదినాలుగుపణములకంటెఁ దక్కువఖరీదుగల కుక్కుటనకులమార్జారశునకసూకరములఁ దొంగిలించినను వానికి హింసగలిగించినను నాసాచ్ఛేదముగాని యేఁబదినాలుగుపణములుగాని దండము. చండాలారణ్యచరులీవిధముగ నొనర్చినచో నర్ధదండము.

పాశ జాల కూటములం దుంచఁబడియుండు మృగపశుపక్షివ్యాళ

మత్స్యములను బంధములనుండియే దీసికొనిపోయినచో వానినిమఱల నిచ్చివేయుట యేగాక వానిమూల్యమున కనుసరియగుదండమునుకూడఁ జెల్లింపవలెను.

మృగద్రవ్యవనములనుండి మృగద్రవ్యములనపహరించినచో నూరుపణములుదండము. బింబవిహారమృగపక్షులనుదొంగిలించినను హింసించినను ద్విగుణదండము.

కారుశిల్పకుశీలవతపస్వుల క్షుద్రద్రవ్యములనపహరించినచో నూరుపణములును స్థూలద్రవ్యములఁగాని, కృషిద్రవ్యములఁగాని యపహరించినచో రెండువందలపణములును దండము.

ప్రవేశమెన్నఁడు లేనివాఁడు దుర్గమునుప్రవేశించినను ప్రాకారమందుఁ గన్నమువేసి నిక్షేపమునుగ్రహించి పరుగెత్తుకొనిపోయినను కంధరావధముగాని రెండువందలపణములుగాని దండము.

బండినిగాని నావనుగాని క్షుద్రపశువునుకాని యపహరించువాని కేకపాదవధగాని మూఁడువందలపణములుగాని దండము.

కపటములగు పాచికలతోడను ఎత్తియేవైనయుపాయములతోడను హస్తలాఘవముచేతను జూదమాడువాని కేకహస్తవధగాని నాలుగువందలపణములుగాని దండము.

జారచోరులకు సహాయముచేయునపుడు పట్టుకొనఁబడిన స్త్రీకిఁ గర్ణనాసాచ్ఛేదవధగాని అయిదువందలపణములుగాని దండము. అట్టి పురుషునికి ద్విగుణదండము.

మహాపశువునుగాని దాసునిఁగాని దాసినిగాని యపహరించినవానికిని, ప్రేతముపైనుండివస్త్రములఁదీసి విక్రయించువానికిని ద్విపాదవధగాని ఆఱువందలపణములుగాని దండము.

ఉత్తమవర్ణస్థులయొక్కయు గురువులయొక్కయు హస్తపాదలంఘనముచేయువానికిని, రాజుల యానవాహనాద్యారోహణము చేయువానికిని నేకపాదవధగాని యేడువందలపణములుగానిదండము

బ్రాహ్మణుఁడననివాదించు శూద్రునికిని, దేవద్రవ్యాపహారికి

ని, రాజునకు నష్టముకలుగునని చెప్పువానికిని (ద్వేషముచే) కొంపుక న్నులచ్ఛేదించువానికిని యోగాంజనముచే నంధత్వముగాని యెనిమిది వందలపణములుగాని దండము.

జారచోరులను విడిపించువానికిని రాజశాసనములందు నధికముగాని యల్పముగాని లిఖించువానికిని, కన్యనుగాని దాసినిగాని సహిరణ్యముగ నపహరించువానికిని, కూటవ్యవహారికిని, మర్త్యాంసమును విక్రయించువానికిని వామహస్తద్విపాదవధగాని తొమ్మిదివందలపణములుగాని దండము. మనుష్యమాంసమును విక్రయించువానికి వధముదండము. దేవప్రతిమలను పశుప్రతిమలను మనుష్యులను అన్యులక్షేత్రగృహహిరణ్యసువర్ణరత్నసస్యముల నపహరించువాని కుత్తమదండముగాని వధముగాని విధింపవలెను.

పురుషుని గౌరవమును అపరాధమును (వానిచేఁజేయఁబడిన నేరముయొక్క) గురులఘుకారణములను అప్పటిసంబంధమును దేశకాలములను రాజుతోడను ప్రకృతులతోడను నేరముచేసిన వారికిఁగలసంబంధమునుచూచి ప్రదేష్ట దండకర్మలలో నుత్తమమధ్యమావరత్వములను కల్పింపవలెను.

ఇది కంటకశోధనమున ఏకాంగవధనిష్క్రియమను
పదియవయధ్యాయము.
ఆదినుండి ఎనుబదియేడవ యధ్యాయము.



## 86 ప్రకరణము.

### శుద్ధచిత్రదండకల్పములు.

కలహమందుఁబురుషునిఁజంపువానికిఁ జిత్రఘాతముదండము. కలహముజరిగినపిమ్మట నేడుదినములలోఁగా మృతిపొందినచోఁ గొట్టినవానికి శుద్ధవధముదండము. పక్షములోపల మృతిచెందినచో నుత్తమసాహసదండము. నెలదినములలోపలమృతిచెందినచో నైదువం

విలపనములను సముత్థానవ్యయమును నిచ్చుకొనవలెను.

శస్త్రముచేఁగొట్టువాని కుత్తమదండము. మద్యపానముచేమత్తుఁడై కొట్టినవానికి హస్తవధము. వధించినవానికి వధమేదండము.

ప్రహారముచే గర్భమును చెడఁగొట్టువాని కుత్తమసాహసదండము; ఔషధముచేఁ జెడఁగొట్టువానికిఁ మధ్యమదండము. క్లేశపెట్టి చెడఁగొట్టువానికిఁ బూర్వసాహసదండము.

బలాత్కరించి స్త్రీపురుషులఁ జంపువారికిని అభిసారికులను (అన్యాయముగ) ఇతరులశిక్షించువారికిని లేనియపవాదముల కల్పించువారికిని మార్గస్థులనడ్డుకొనిబాధించువారికిని ఇండ్లలోఁబ్రవేశించినిరోధించువారికిని రాజుయొక్క హస్త్యశ్వరథములకు హింసగలిగించువారికిని వానినిదొంగలించువారికిని శూలారోహణముగావింపవలెను. వీరిప్రేతముల దహించువారికిని మఱియొకచోటికిఁ దీసికొనిపోవువారికినికూడ నిదియేదండముగాని యుత్తమసాహసదండముగాని విధింపవలెను.

హింసకులకును దొంగలకును భక్తవాసఉపకరణఅగ్నిమంత్రదానములఁజేయువానికిని మఱియొకవిధముగ వీరికిసహాయముచేయువానికి నుత్తమదండము. తెలియక యిట్లుగావించినచో దూషణమాత్రదండము హింసకులయొక్కయు దొంగలయొక్కయు దారపుత్రులు వారికిసలహానియ్యనిచో దండమునకుఁ బాత్రులుకారు; అట్టిసలహానిచ్చుదారపుత్రులను పట్టుకొనవలెను.

రాజ్యకాముకుని, అంతఃపురప్రధర్షకుని, ఆటవికశత్రువులఁ బ్రోత్సహించువానిని దుర్గరాష్ట్రసైన్యములోనివారికి రాజుపైఁ బ్రకోపముగలిగించువానిని శిరోహస్తములనుకాల్చి చంపవలెను. ఇట్టి బ్రాహ్మణుని నీటిలోఁద్రోయవలెను.

మాతృపితృపుత్రభ్రాత్రాచార్యతపస్వులనుచంపువానియొక్క చర్మమును శిరస్సునుకాల్చి వధింపవలెను. వీరికాక్రోశముగలిగించినచో జిహ్వాచ్ఛేదమును చేయవలెను. వీరియంగములలో దేనినైనఁ

గఁజచినచో వారియాయంగములను ఛేదింపవలెను.

క్రోధపురుషునిఁ జంపువానికిని పశుయూథమును దొంగిలించు వానికిని శుద్ధవధము గావింపవలెను. యూథమనఁ గొంచెము హెచ్చుదక్కువగ పది.

ఉదకముతో నిండియుండుచెరువులఁ దెగఁగొట్టువానినానీటిలో ముంచివేయవలెను. ఉదకములేనిచో నుత్తమసాహసదండము. కొంచెముపాడుపడియుండు చెరువు నీవిధముగఁ జేసినచో మధ్యమదండము.

విషము పెట్టిన పురుషునిఁ బురుషునిఁజంపిన స్త్రీని నీటఁబడఁ ద్రోసిచంపవలెను.

పతి గురు సంతాన ఘాతుకురాలను అగ్నివిషములఁ బెట్టినదానిని శరీరసంధిచ్ఛేదముగావించినదానిని గర్భిణియైనను అగర్భిణియైనను మాసావరప్రజాతయైనను వృషభముచేఁ ద్రొక్కింపవలెను.

వివీత క్షేత్ర ఖల వేశ్మ ద్రవ్య హస్తివనములను దగులఁబెట్టినవానిని కాల్చిచంపవలెను.

రాజునాక్రోశపెట్టువానియొక్కయు రాజమంత్రిభేదకునియొక్కయు రాజునకనిష్టముగఁ బ్రవర్తించువానియొక్కయు బ్రాహ్మణులవంటయిండ్ల పవిత్రతనుచెడఁగొట్టువానియొక్కయు నాలుకను ఛేదింపవలెను.

ప్రహరణావరణములను దొంగిలించువాఁడనాధీయుఁడయినచో వానిని బాణములతోఁగొట్టవలెను. ఆయుధీయుఁడయినచో వానికుత్తమసాహసదండము.

మేఢ్రఫలముల ఛేదించువాని కట్టిఛేదమును గావింపవలెను.

నాలుకను ముక్కును హింసగలిగించువాని వ్రేళ్ళనుఛేదింపవలెను.

ఈచిత్రవధలు పెద్దలచే శాస్త్రములందుఁ జెప్పఁబడినవి. కాని క్రౌర్యముతోఁగూడని పాపములోనర్చువారికి శుద్ధవధ యేధర్మ్యము.

ఇది కంటకశోధనమున శుద్ధ చిత్ర దండకల్పములను

పదునొకండవ యధ్యాయము.

ఆదినుండి యెనుబదియెనిమిదవ యధ్యాయము.



87 ప్రకరణము.

## కన్యాప్రకర్మ.

రజస్వలకాని సవర్ణయగుకన్యనుబలాత్కరించువానికి హస్తవధముగాని నాలుగువందలపణములుగాని దండము. బలాత్కరించుటవలననది మృతిచెందినచో వధింపవలెను. రజస్వలయైనదానిని బలాత్కరించినవానికి మధ్యమాంగుష్టచ్ఛేదముగాని రెండువందలపణములుగాని దండము; అట్టివాఁడు (కన్యయొక్క) తండ్రికపహీనముకూడ నిచ్చుకొనవలెను. అకామయగుదానినిపొందరాదు. అకామయగు కన్యనుపొందినవాని కేఁబదినాలుగుపణములును కన్యకకుదానిలోసగమును దండము.

మఱియొకనిచే శుల్కమియ్యఁబడినకన్యను తానుశుల్కమిచ్చితినని చెప్పి పొందువానికి హస్తవధముగాని నాలుగువందలపణములుగాని దండము; అతఁడు శుల్కద్రవ్యమునుకూడ నిచ్చుకొనవలెను.

తొలుత వాగ్దానముచేయఁబడి యేడుమార్లు ఋతుమతియైన పిమ్మటఁగూడఁ దన్నువివాహమాడనికన్యను పొందువానికి దోషము లేదు. ఋతుప్రతిరోధముగావించుటచేఁదండ్రికిఁ గుమార్తెయందు స్వామ్యముచెడునుకాన నట్టితండ్రికపహీనముగూడ నిచ్చుకొననక్కఱలేదు.

ఋతుమతియైనతర్వాత మూఁడుసంవత్సరములవఱకవివాహితయైయుండుకన్యనుపొందుతుల్యునికిదోషములేదు. మూఁడుసంవత్సరములుగడచినపిమ్మట నతుల్యుఁడుసహిత మనలంకృతయగుకన్యను పొందవచ్చును; కాని పితృద్రవ్యమును తీసికొనిపోయినచో స్తేయదండము.

కన్యయొకనికొకనిచెప్పి మఱియొకనికేబదిరెండు వానికి రెండుపందల పణములు దండము. అకామయగు దానిని పొందరాదు.

ఒకకన్యనుచూపెట్టి తుల్యయగుమఱియొకదాని నిచ్చినచో నూరుపణములు దండము, హీనయగుకన్యనిచ్చినచో ద్విగుణదండము. ఇట్లియ్యఁబడిన స్త్రీకేఁబదినాలుగుపణములు దండము. ఇచ్చినవాఁడు శుల్కమును వ్యయమును భరింపవలెను. ఒకనిని వివాహమాడుటకంగీకరించి పిదపవానిని తిరస్కరించినచో ద్విగుణదండము.

అన్యశోణితోపధానము చేయువానికిని మిథ్యాభిశంసికిని రెండునూరులపణములు దండము; పురుషుని శుల్కవ్యయాదుల నిచ్చివేయవలెను. అకామయగుదానిని పొందరాదు.

సకామయు సమానయునగు స్త్రీని యొకనిని పొందినప్పుడు పంతొమ్మిది పణముల నిచ్చుకొనవలెను. అట్టిదానిని పోత్సాహపఱచిన స్త్రీకి ద్విగుణదండము. అకామను బలాత్కరించువానికి నూరుపణములుదండము, అట్టివాఁడాకన్యకు శుల్కద్రవ్యమునిచ్చి సంతోషపెట్టవలెను. స్వయముగ నొకనినిపొందిన స్త్రీకి రాజదాస్యమేదండము.

గ్రామమునకు వెలుపల బలాత్కరించినను లేనియపవాదమునుకల్పించినను ద్విగుణదండము.

కన్యనుబలాత్కరించి యెత్తుకొనిపోవువానికి రెండునూరులపణములును, కన్యయలంకృతయైనచో నతనికి నుత్తమదండమును విధింపవలెను. పలువురుకలిసి యొకకన్యనపహరించునప్పుడు వారిలోనొక్కొకరికి యథోక్తదండమును విధింపవలెను. వేశ్యాకన్యను బలాత్కరించువాఁ డేఁబదినాలుగుపణముల దండమును వేశ్యమాతకుఁ బదునాఱురెట్లు భోగశుల్కమును నిచ్చుకొనవలెను.

అదాసియగు దాసునియొక్కగాని దాసియొక్కగాని కుమార్తెను బలాత్కరించినవాఁ డిరువదినాలుగుపణములను శుల్కమును నిచ్చుకొనవలెను. నిష్క్రయానురూపయగు దాసిని బలాత్కరించు

వాఁడు పండ్రెండుపణముల దండమును ధరింపఁదగిన వస్త్రమును ఇచ్చుకొనవలెను. ఈవిషయములలో సహాయముచేయువానికిఁ గన్యసముదండము.

భర్త ప్రోషితుఁడైయున్నప్పు డపచరించు స్త్రీని పతిబంధువుగాని పతిభృత్యుఁడుగాని తనయధీనమందుంచుకొనవలెను. అట్లువారిచేర క్షింపఁబడినదై భర్తకొఱకునిరీక్షింపవలెను. పతి క్షమించిన యెడ వీరిరువురు విముక్తులుగావచ్చును; లేనిచో స్త్రీకిఁ గర్ణనాసాచ్ఛేదమును జారునికి వధమునుదండము.

జారుని చోరుఁడనినిందించు వానికైదువందల పణములుదండము. వానినుండి హిరణ్యమునుపుచ్చుకొని వానినివదలిపెట్టువానికిష్టగుణదండము.

కేశాకేశికక్రీడ సంగ్రహణము శరీరోపభోగచిహ్నములలో నగువానిమూలముననను విషయమును తెలిసినవారిమూలముసను స్త్రీవచనముమూలముననను బలాత్కారము జరిగినదా లేదాయను విషయమును నిర్ణయింపవలెను.

పరచక్రముననుండియు అడవులనుండియుఁ బ్రవాహములనుండియు రక్షింపఁబడినట్టియు దుర్భిక్షమందరణ్యమున వదలిపెట్టఁబడినట్టియు, మరణించెనని విడువఁబడినట్టియుఁ పర స్త్రీని రక్షించినదానికిష్టమున్నచో దానితోభోగింపవచ్చును. ఉత్తమజాతిదియు నకామయుసంతానవతియు నగునపుడు నిష్క్రయమును పుచ్చుకొని విడిచిపెట్టవచ్చును.

చోరహస్త నదీవేగ దుర్భిక్ష దేశక్షోభములనుండి రక్షింపఁబడినట్టియు మృతిచెందెనని విడువఁబడినట్టియు స్త్రీని రక్షకుఁడు దానియిష్టముపైఁ బరిగ్రహింపవచ్చును. రాజప్రతాపముచేఁగాని స్వజనముచేఁగాని త్యజింపఁబడిన స్త్రీని నీవిధముగఁ బరిగ్రహింపరాదు. ఉత్తమజాతిస్త్రీని అకామయగుదానిని సంతానవతిని బలాత్కరింపక

నిష్క్రయము పుచ్చుకొని విడిచిపెట్టవలెను.

ఇది కంటకశోధనమున కన్యాప్రకర్మయను
పండ్రెండవయధ్యాయము.
ఆదినుండి ఎనుబదితొమ్మిదవ యధ్యాయము.



## 88 ప్రకరణము.

### అతిచారదండము.

అపేయమును నభక్ష్యమును బ్రాహ్మణునిచేఁ దినిపించువానికుత్తమదండము; క్షత్రియునిచేఁ దినిపించువానికి మధ్యమదండము; వైశ్యునిచేఁ దినిపించువానికిఁ బూర్వసాహసదండము; శూద్రునిచేఁ దినిపించువానికి నేఁబదినాలుగుపణములు దండము. స్వయముగఁ దమంతటఁ దామిట్టివానిని తినినచో దేశమునుండి త్రోలింపఁబడవలెను.

పరగృహమును పగలు ప్రవేశించువానికిఁ బూర్వసాహసదండము, రాత్రియందుఁ బ్రవేశించువానికి మధ్యమదండము. రాత్రిగాని పగలుగాని శస్త్రసహితుఁడై యిట్లుచేసినచో నుత్తమదండము. భిక్షుకవైదేహకులును మత్తోన్మత్తులును నాపద్గతులగు సన్నికృష్టులును ప్రతిషేధింపఁబడినపుడు దప్పఁ దక్కినసమయములందిట్లు ప్రవేశించినచో నదండ్యులు.

అర్ధరాత్రమునఁ దనయింటికప్పుపై నెక్కినవానికి సహితము పూర్వసాహసదండము. పరులగృహములపై నెక్కినవానికిని గ్రామారామవాటముల భేదించినవానికిని మధ్యమదండము.

సార్థకులు వారి పణ్యపరిమాణమును గ్రామస్వామికిఁ దెలిపి గ్రామములో నొకచోట నుండవచ్చును. రాత్రియందు వారిపణ్యము దొంగిలింపఁబడి నష్టమయినచో నది యితరగ్రామములకుఁ బంపఁబడెనని జాడలుకనఁబడనప్పుడు గ్రామస్వామి దానినిచ్చుకొన

కలహముపెట్టి మరణముగలిగించువాఁడు వానిఖరీదును వానితోసమానమగుదండమును నిచ్చుకొనవలెను.

దేవపశువును ఆఁబోతును ఆవుపెయ్యను వాహనముగ నుపయోగించువాని కయిదువందలపణములును పరదేశమునకుఁ బాఱఁదోలువాని కుత్తమసాహసదండమును విధింపవలెను.

లోమ దోహ వాహన ప్రజననములమూలమున నుపకరించు క్షుద్రపశువుల నపహరించినవాఁడును దేవపితృకార్యములందుఁ దప్పఁ దక్కినపుడీజంతువులకుఁ బ్రవాసముగలిగించినవాఁడును వానిఖరీదును ఖరీదుతోసమానమగుదండమును నిచ్చుకొనవలెను.

ముక్కుత్రాళ్లుతెగుటచేతను యుగముభగ్నముగుటవలనను అడ్డగను ఎదురుగను ప్రక్కకును బండినిలాగుటవలనను త్రోవనుబోవు పశువులయు మనుష్యులయు సమ్మర్దముచే బెదరుటవలనను బండికిఁగట్టినయెద్దు హింసగలిగించినచో దానియజమానుఁడదండ్యుఁడు. ఇవిగాక మఱియేకారణముచేతనయిన నిట్టిహింసగలిగినచో నతఁడు మనుష్యులప్రాణిహింసలవిషయమునఁ జెప్పఁబడిన దండమునకుఁ బాత్రుఁడగును. మనుష్యుఁడుదప్పఁ దక్కినప్రాణములకు నష్టముగలిగించినచో నట్టిజంతువును ప్రతిదానమొనర్పవలెను.

బండినడుపువాఁడు బాలుఁడయినచో యానస్థుఁడగు శకటస్వామి దండ్యుఁడగును. శకటస్వామిలేనపుడు యానస్థుఁడుగాని ప్రాప్తవ్యవహారుఁడగు బండినితోలువాఁడుగాని దండ్యులగుదురు. బాలాధిష్ఠితమును లేక శూన్యమునగు యానమును రాజు హరింపవచ్చును.

కృత్యాభిచారములచే నితరునినష్టపెట్టినవాని కట్టియభిచారముచే నష్టమునుకలిగింపవలెను. తనయందిష్టములేని భార్యవిషయమై భర్తయు దారార్థులు కన్యకవిషయమునను భర్తవిషయమై భార్యయుఁ బ్రైయభిచారములనుచేసి వారినివశపఱచుకొనవచ్చును. మఱి

జొకవధముగ హింసించినచో మధ్యమసాహసదండము.

స్త్రీయొక్క సోదరిని మేనత్తను మేనమామభార్యను గురుపత్నిని కోడలిని కూతురను అప్పచెలియలిని కామించువానికి లింగచ్ఛేదమును వధమును దండములు. వీరుగూడఁ గామముగలవారైనచో వధియేదండము. దాస పరిచారక ఆహితకులను పొందునట్టి స్త్రీకిఁగూడ నిదియేదండము.

అగుప్తయగు బ్రాహ్మణస్త్రీని పొందినక్షత్రియున కుత్తమ దండము. అట్టి వైశ్యునికి సర్వస్వాపహరణమును శూద్రునకుఁ గటాగ్ని దాహమును దండములు. రాజభార్యాభిగమనమున నన్నిజాతులవారికిని కుంభపాతదండమును విధింపవలెను.

శ్వపాకితో వ్యభిచరించువారిని గురుతుపెట్టి పరదేశమునకుఁ బంపవలెను, లేదా శ్వపాకత్వమును పొందింపవలెను. ఆర్యులభార్యలనుపొందు శూద్రునకును శ్వపాకునికిని వధమేదండము; వారికిలోఁగిన స్త్రీలకుఁ గర్ణనాసాచ్ఛేదము గావింపవలెను.

ప్రవ్రజితనుపొందువాని కిరువదినాలుగుపణములు దండము. ప్రవ్రజిత సకామయైనచో దానికి నదియేదండము.

వేశ్యను బలాత్కరించి భోగించువానికిఁ బండ్రెండుపణములు దండము. ఒకతె ననేకులుకలిసి యభిచరించినపు డొకరొకరి కిరువదినాలుగుపణములు దండము.

స్త్రీయొక్క యోనికంటె నన్యములగుప్రదేశముల మోహనముచేయువానికిని పురుషులఁబొందువానికిని పూర్వసాహసదండము.

వివేకములేనివాఁడు తిర్యగ్యోనులందుఁ గ్రీడించినచోఁ బండ్రెండుపణములును దేవతాప్రతిమలఁబొందినచో నిరువదినాలుగుపణములును దండము.

అదండ్యుని దండించు రాజు ముప్పదిరెట్లు ద్రవ్యమును వరుణునకర్పించి పిమ్మట దానిని బ్రాహ్మణుల కియ్యవలెను. మిథ్యావాదం

డము గావించువారి కంతయు వరుణుఁడే శాసనకర్తయగు రాజగుటచే దీనివలన దండాపచారముచే రాజునకుఁగలిగినపాపము పోవును.

ఇది కంటకశోధనమున అతిచారదండమను
పదుమూఁడవయధ్యాయము.
ఆదినుండి తొంబదవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమందలి
కంటకశోధనమను నాలుగవయధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## అయిదవయధికరణము — యోగవృత్తము.

### 89 ప్రకరణము.

#### దాండకార్మికము.

దుర్గరాష్ట్రములందలి కంటకశోధనమును గుఱించి చెప్పఁబడి నది. రాజరాజ్యముల సంబంధించిన కంటకశోధనమునుగుఱించి చెప్పఁబోవుచున్నాము.

విరోధించినట్టి రాజోపజీవులవిషయమునను శత్రుపక్షమును చేరిన ముఖ్యులవిషయమునను రాజదివఱకుఁ జెప్పఁబడినట్లు గూఢప్రుషప్రణిధియైగాని కృత్యపక్షోపగ్రహుఁడైగాని పారగ్రామికప్రకరణమునఁ జెప్పఁబోవునట్టుపజాపోపసర్పుఁడైగాని సిద్ధినొందవలెను.

రాజ్యోపఘాతులగు రాజవల్లభులును ఏకీభవించి యుపఘాతము గలుగఁజేయు ముఖ్యులును, ప్రకాశముగ నిషేధింపఁదగని దూష్యులు. ధర్మమందిష్టముగల రా జట్టివారిని రహస్యముగ శిక్షింపవలెను.

రాజుపై మహామాత్రుఁడు ద్వేషించినచో నతనిభ్రాతను సగౌరవముగఁ బ్రోత్సాహపఱచి సత్త్రిలు రాజునొద్దకుఁ దీసికొనిపోవలెను. రా జాతనికి మహామాత్రునియొక్క ద్రవ్యోపభోగములనిచ్చి వానిపైకిఁ బురికొల్పవలెను. శస్త్రముచేతఁగాని రసముచేతఁగాని విక్రమించిన మహామాత్రు నతఁడుచంపఁగనే వానినికూడ భ్రాతృఘాతకుఁడను మిషచే వధింపవలెను. (దూష్యుఁడయిన) పారశవునియొక్కయుఁ బరిచారికాపుత్రునియొక్కయు విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

లేక, మహామాత్రుఁడు ద్వేషించినపుడతనిభ్రాత నతనిచేఁ బ్రోత్సహింపఁబడినవాఁడై దాయమునుయాచించి రాత్రియందు మహామాత్రుని ద్వారమునఁగాని మఱియొకప్రదేశమునఁగాని పరుండవలెను. అప్పుడాతనిఁ దీక్ష్ణుఁడగు చారుఁడుచంపి దాయముగోరినట్టి వీఁడన్నచేఁ జంపఁబడెనని ప్రకటింపఁగా రాజు హతునిపక్షమవలంబించి మహామాత్రుని నిగ్రహింపవలెను. లేక సత్రులు దూష్యసమీపస్థులై దాయమునుకోరుచున్న భ్రాతనుకొట్టి బెదిరింపవలెను. పిమ్మటనంతయుఁ బైవిధముగ జరుగవలెను.

మహామాత్రులిద్దరు రాజద్వేషులైనచో వారిలోనొకఁడుగాని, వానిపుత్రుఁడుగాని, మఱియొకని పుత్రదార నధిచరించెననియును లేక ఒకనిభ్రాత మఱియొకనిభ్రాతదార నధిచరించెననియును ప్రకటించి వారిరువురకును కపటకలహమునుపుట్టించి పైవిధముగ వారినిచంపింపవలెను. ఆత్మసంభావితుఁడగు దూష్యమహామాత్రపుత్రుని, సత్రివశముచేసికొనియతనితో రాజపుత్రుఁడవగునిన్ను శత్రుభయమునుండి తొలఁగించుటకై మంత్రిగృహమున నుంచితిమని రహస్యముగఁ జెప్పవలెను. దీనిని నమ్మినచో నతనిని రాజుమిక్కిలిగారవించి యౌవరాజ్యకాలము ప్రాప్తించినను మహామాత్రునిభయము వలన నీకభిషేకము చేయలేదని చెప్పి సత్రిచేనతనిని మహామాత్రవధకై ప్రేరేపింపవలెను. తండ్రిపై విక్రమించినట్టివానిని ఇతఁడుపితృఘాతకుఁడని వధింపవలెను. లేక భిక్షుకి దూష్యునిభార్యకు సంవసనములగు నౌషధములచే మోహముగలిగించి దానిచేనతనిని చంపింపవలెను.

ఈయుపాయములన్నియు వ్యర్థములయినపుడు సారహీనమైనట్టియుఁ దీక్ష్ణులతోఁగూడినట్టియు సైన్యమును మహామాత్రునకిచ్చి యాటవికులను పారగ్రామికులను చంపుటకును కాంతారప్రదేశములలో రాష్ట్రపాలునిఁగాని యంతపాలునిఁగాని స్థాపించుటకును కుపితమగునగరస్థానమును వశపఱచుకొనుటకును, పార్శ్వదేశములనుండి

రావలసిన కప్పముదెచ్చు సార్థవాహులకు సహాయముచేయుటకును పంపవలెను రాత్రియందుఁగాని పగటియందుఁగాని యుద్ధముజరుగు చుండఁగాఁ దీక్ష్ణులుగాని ప్రతిరోధకవ్యంజనులుగాని వానినిఁజంపి యుద్ధమందు హతుండయ్యెనని ప్రకటింపవలెను.

రాజు యాత్రావిహారగతుండై ద్వేషించిన మహామాత్రుల ను తనదర్శనమునకై పిలిపింపవలెను. అప్పుడు గూఢశస్త్రులగు తీక్ష్ణులు వారితోఁగూడవచ్చి మధ్యమకక్ష్యలోఁ బ్రవేశించుటకై త మ్ముసుపరీక్షింపవలెనని చెప్పఁగా దౌవారికులువారినిపట్టుకొనవలెను. అప్పుడు వారు (తీక్ష్ణులు) మేమీదూష్యునిచే నియోగింపఁబడితిమని చెప్పవలెను. దీనినిరాజు ప్రకటించి దూష్యులనువధించి తీక్ష్ణులకుబ దులుగ నన్యులను చంపవలెను.

రాజు బహిర్విహారగతుండై దూష్యులకుఁ దనసమీపమున బసలిచ్చి గౌరవించి వానిలోఁ బట్టపుదేవివేషమునుధరించిన నొకతె నుపట్టుకొని తద్విధముగ దూష్యులను వధింపవలెను.

రాజనొద్దనుండు సూదుఁడుగాని, భక్ష్యకారుఁడుగాని నీయొ ద్దనుండు భక్ష్యభోజ్యములు రుచిగలవని దూష్యామాత్రునియాచిం చి వానిని సగమువిషముగలిపిన పానీయముతోఁజేర్చి మందుగఁదా ము ప్రతిస్వాదముచేసి విషప్రయోగముచేయుటకై పంపఁబడినదని ప్రకటించి యమాత్యులను చంపవలెను.

అభిచారశీలుండగు మహామాత్రుని సిద్ధవ్యంజనుఁడొకఁడు చ క్రనిగోధాకూర్మకర్కటకకుటములలో నొకదానిమూలమున నీమ నోరథము సిద్ధించునని వశపఱచుకొని తత్ప్రతనాపనిలోఁ బ్రవర్తిం చుచున్న యమాత్యుని రసలోహముసలములలో నొకదానిచేఁజంపి వాని యభిచారకర్మలచే నాతఁడుచచ్చెనని ప్రకటింపవలెను.

చికిత్సకవ్యంజనుఁడొకఁడు దూష్యామాత్యునిఁజేరి యతనికి దౌరాత్మికమును నసాధ్యమునునగు వ్యాధి కలదని చెప్పి భైషజ్యాప హారములలో రసమునుకలిపి చంపింపవలెను. లేక ప్రాణహితులని

పొందిన సూదారాళికవ్యంజనులు రసముచే మోసముగావించిదూష్యమహాత్ముని వధింపవలెను. ఇది యుపనిషత్ప్రతిషేధము.

ఉభయదూష్యప్రతిషేధము:— ఫల్గుబలమును తీక్ష్ణులను సహాయముగనిచ్చి ప్రతిషేధింపఁదగిన దూష్యుఁడుండు ప్రదేశమునకు మఱియొకదూష్యునిఁబంపి యతనితో వెళ్ళి యీదుర్గమును నీరాష్ట్రమును నీసైన్యమును నీహిరణ్యము నుతీసికొనిరమ్ము, వల్లభులనుండి యీహిరణ్యమును తెమ్ము, వల్లభకన్యను బలాత్కరించి తెమ్ము, దుర్గసేతువణిక్పథ శూన్యనివేశ ఖనిద్రవ్యహస్తివనకర్మలలో నొకదానిని కావింపుము; రాష్ట్రపాల్యమునుకాని యంతపాల్యమునుకానియేర్పాటుచేయుము. వైపనులలో నిన్నుఁబ్రతిషేధించువానిని నీకు సహాయముచేయునట్టివానిని బంధింపుమని చెప్పవలెను. దూష్యాంతరునితోఁగూడ అవినయుఁడగు నితనిఁబ్రతిషేధింపుమని చెప్పవలెను. వీరిద్దఱు కలహించుచుఁ గర్మప్రతిఘాతము చేసికొనుచుండునప్పుడు వీరిని శస్త్రహస్తులగుతీక్ష్ణులు ప్రచ్ఛన్నముగఁ జంపవలెను. పిమ్మట నాదోషమునకై యితరుల శిక్షింపవలెను.

దూష్యములగు పట్టణములలోను గ్రామములలోను కులములలోను సీమాక్షేత్రఖలవేశ్మమర్యాదల గుఱించిగాని ద్రవ్యోపకరణసస్యవాహన హింసలగుఱించిగాని ప్రేక్షణీయములగు నుత్సవములగుఱించిగాని కలహములుకలిగినప్పుడును లేక తీక్ష్ణులు కలహములుకలిగించినప్పుడును తీక్ష్ణులు శస్త్రములనువిసరి, వీనితోఁగలహించినవారికీఫలమగుఁగాక యనిచెప్పవలెను. ఈదోషమునకై యితరులఁ జంపింపవలెను.

దూష్యులలోఁ బరస్పరము కలహముసంభవించినపుడు వారి క్షేత్రఖలవేశ్మములకు నిప్పుపెట్టి వారిబంధుసంబంధులపైని వాహనములపయిని తీక్ష్ణులు శస్త్రములనువిసరి, ఇతనిచేమేము ప్రేరేపింపఁబడితిమని చెప్పవలెను. తర్వాత నిమిషపెట్టి తక్కినదూష్యులనుకూడఁ జంపవలెను.

దుర్గరాష్ట్రదూష్యులను సత్త్రిలు పరస్పరము సహాపంక్తిభో జనమునకుఁ బిలుచునట్లుచేసి రసదులచే రసమునిప్పించి ఆదోషమును మిషగఁబెట్టి తక్కినవారిని చంపింపవలెను.

దూష్యులగు రాష్ట్రముఖ్యులలో నొకనిభార్యయో స్నుషయో దుహితయో మఱియొకరాష్ట్రముఖ్యునిఁ గామించుచున్నదని భిక్షుకియొకకపటమువన్ని వానియొద్దనుండి యాభరణములఁదెచ్చి పరదూష్యునికిఁజూపి, యావనోత్సిక్తుఁడై యీముఖ్యుఁడు నీయొక్క భార్యను స్నుషను దుహితను కామించుచున్నాఁడని చెప్పి వారిద్దఱి కిఁ గలహము గల్పించి రాత్రియందువారిని చంపింపవలెను.

దూష్యమగుసేన తనయొద్దనున్నప్పుడు, యువరాజుగాని సే నాపతిగాని మొదట దానికిఁగొంచెము నుపకారముచేసి తర్వాతహఠా త్తుగ దానిపైవిక్రమించి దానిపయికి ఫల్గుబలతీక్ష్ణయుక్తమగు మఱి యొకదూష్యసేనను పంపవలెను.

ఈవిధముగఁ బయినిజెప్పిన యుపాయములన్నియు సమాన ములే.

చంపఁబడిన దూష్యులయొక్క పుత్త్రులలో నెవఁడు నిర్వికా రుఁడో వానికిఁ బిత్రుదాయము నిప్పింపవలెను.

ఈవిధముగఁ జేసినచో నెట్టిపురుషప్రయత్నము ద్వేషములే నిదై రాజ్యము పుత్రపౌత్రానువృత్తి గలిగియుండును.

రాజు శాంతుఁడై మొగమోటపడక సర్వకాలములందు స్వ పక్షపరపక్షములవారిని రహస్యముగ శిక్షించుచుండవలెను.

ఇది యోగవృత్తమను పంచమాధికరణమున దాండకార్మికమను

యొకటవ యధ్యాయము.

ఆదినుండి తొంబదియొకటవ యధ్యాయము.

## 90 ప్రకరణము.

### కోశాభిసంగ్రహణము.

కోశములేక ధనవిషయమున శ్రమపడుచుండు రాజు కోశమును సంగ్రహింపవలెను. జనపదము పెద్దదయినను చిన్నదయినను దేవమాతృకముగనో లేక ప్రభూతధాన్యముగనో యుండినచో ఫలించినధాన్యములో మూడవవంతుగాని నాలుగవవంతుగాని యథాకారముగ గ్రహింపవచ్చును. మధ్యమావరజనపదములనుండియు దుర్గసేతుకర్మవణిక్పథశూన్యనివేశ ఖనిద్రవ్యహస్తివనకర్మలందు కాజున నుపకరించునట్టివారినుండియుఁ బత్యంతమందమంపునట్టివారినుండియు అల్పప్రాణులనుండియు ధనమును కోరరాదు. (మఱియు) శూన్యప్రదేశముల నివసింపఁగోరువారికి ధాన్యపశుహిరణ్యాదులనిచ్చి సహాయముచేయవలెను బీజభక్తశుద్ధమగు ధాన్యచతుర్థాంశమును హిరణ్యమునిచ్చి రాజు కొనవచ్చును. అరణ్యజాతమగుదానిని శ్రోత్రియద్రవ్యమును విడువవలెను; వీనినికూడ ననుకూలముగ మూల్యమునిచ్చి కొనవచ్చును. ఈవిధముగ (కోశసంగ్రహణము) జరుగనపుడు సమాహర్తలు కర్షకులచే గ్రీష్మకాలములందుసహితము వ్యవసాయము చేయింపవలెను. ప్రమాదమువలననష్టము గలిగించినచో నష్టమునకు రెండింతలు పుచ్చుకొనఁబడునని చెప్పుచు (సమాహర్తలు) బీజకాలమందు బీజలేఖ్య మొనరింపవలెను. ఫలించిన తర్వాత యాచించి తెచ్చుకొనినవారినుండితప్పఁ దక్కినవారినుండి కాయగూరలు, పండినధాన్యములను తీసికొనవచ్చును. దేవపితృప్రాజలనిమిత్తమును పశువులనిమిత్తమును భిక్షుకగ్రామభృతకుల నిమిత్తమును రాశిమూలమును విడువవలెను.

స్వసస్యఫలమును (రాజును మోసముచేయు నుద్దేశముతో) దాచియుంచినవానికి నష్టగుణమును, పరసస్యములనపహరించిన స్వవర్గమున కేఁబది రెట్లును, అట్లుచేసిన బాహ్యులకు వధయును దండములు.

ధాన్యములలో నాలుగవభాగము, వస్త్రములలోను తూల లాక్షా క్షౌమ వల్క కార్పాస రోమ కౌశేయ కౌపేయ గంధపుష్ప ఫలశాక పణ్యములలోను కాష్ఠ వేణు మాంసవల్లూరములలోను ఆఱవభాగము, దంతాజినములలో సగముభాగము రాజోద్యోగులు వసూలుచేయవలెను. రాజాజ్ఞనొందక వీనినమ్మువారికిఁ బూర్వసాహసదండము.

ఇది కర్షకులనుండి రాబడి.

సువర్ణరజతవజ్రమణిముక్తాప్రవాళ అశ్వహస్తిపణ్యములందు వ్యాపారముచేయువారికి ఏబదిపణములు పన్ను. సూత్ర వస్త్ర తామ్ర వృత్త కంస గంధ భైషజ్య సీధుపణ్యముల విక్రయించువారికి నలువదిపణములు. ధాన్య రస లోహపణ్యములను శకటములను విక్రయించువారికి ముప్పదిపణములు. కాచవ్యవహారులకును మహాకారువులకును నిరువదిపణములు. క్షుద్రకారువులు వర్ధకీపోషకులు పదిపణముల నియ్యవలెను. కాష్ఠ వేణు పాషాణమృద్భాండ పక్వాన్న హరితపణ్యముల విక్రయించువారు ఐయిదుపణములు. కుశీలవులు రూపాజీవులు వేతనార్థము నిచ్చుకొనవలెను. హిరణ్యాకరుల హిరణ్యమునంతను దీసికొనవచ్చును: వారొనర్చునపరాధము కొంచెమయినను క్షమింపఁగూడదు; వారొరులహిరణ్యమును తమదనిమోసపుచ్చి యమ్ముదురు.

ఇది వ్యవహారులవలని రాబడి.

కుక్కుటసూకరములను పోషించువారు సగభాగమును, క్షుద్రపశువులను పోషించువారాఱవభాగమును, గోమహిషాశ్వతర ఖరోష్ట్రములను పోషించువారు దశభాగమును నియ్యవలెను. బంధకీపోషకులు మిక్కిలిచక్కనయినట్టియు యౌవనముగలట్టియు రాజదాసీజనముయొక్క సహాయమునుపొంది వీనిని వసూలుచేయవలెను.

ఇది జంతువులను పెంచువారినుండి రాబడి.

వీనినొక్కమారేగాని రెండుమార్లు పుచ్చఁగూడదు. పన్ను

లు వసూలుకానపుడు సమాహర్త సత్కార్యమునకు ద్రవ్యముకావలయునని మిషపెట్టి పౌరజానపదులను యాచింపవలెను. (అప్పుడు) కొందఱు కలిసి మొట్టమొదట నెక్కువధనము నియ్యవలెను; దీనినిపట్టి రాజు తక్కిన పౌరజానపదులను యాచింపవలెను. స్వల్పమునిచ్చువారిని కాపటికులు నిందించుచుండవలెను. ధనికులను వారిధనమునుపట్టి యాచింపవలెను (యాచించుటకుఁ బూర్వము, తమంతటఁ దామే రాజునకు ద్రవ్యమిచ్చువారికి వారియుపకారము ననుసరించి స్థాన ఛత్ర వేష్టన విభూషణములిచ్చి సత్కరింపవలెను. పాషండసంఘద్రవ్యమును అశ్రోత్రియభోగ్యమగు దేవద్రవ్యమును ప్రేతద్రవ్యమును దగ్ధగృహములోని ద్రవ్యమును నితరులు తీసికొనిపోకుండఁ గృత్యకరులు కోశమందుఁ జేర్పవచ్చును.

దేవతాధ్యక్షుఁడు దుర్గ దేవతలయొక్కయు రాష్ట్ర దేవతలయొక్కయు ధనము నొకచోటికిఁ దెచ్చి కోశమునఁ జేర్పవలెను, లేక దైవతచైత్యమును సిద్ధపుణ్యస్థానమును ఔపాదికమును రహస్యముగ రాత్రియందు నిర్మించి యాత్రాసమాజములనుండి ధనమును సంపాదింపవలెను. లేక ఋతుభిన్నకాలములందుఁ బుష్పఫలములతోఁ గూడిన చైత్యోపవనవృక్షముల మూలమున దేవతాగమనమును ప్రకటింపవలెను. లేక వృక్షముపై మనుష్యు నొకనినుంచి రాక్షసుఁడని ప్రకటించి సిద్ధవ్యంజనులు పౌరజానపదులనుండి భయప్రతీకారమునకని ధనమును వసూలుచేయవలెను. లేక సురంగాయుక్తమగు కూపమునందనేక శిరస్సులుగలసర్పమునుంచి దానినిచూపించెదమని ప్రేక్షకులవద్దనుండి ధనమును పుచ్చుకొనవలెను. నాగప్రతిమయందొక కన్నముచేసి దానియందుఁగాని చైత్యచ్ఛిద్రమందుఁగాని వల్మీకచ్ఛిద్రమందుఁగాని సర్పము నొకదానినుంచి మత్తుగలిగించునాహారముచే దానిని కదలకుండునట్లుచేసి ధనమునుతీసికొని శ్రద్ధేయులగువారికి దానినిచూపెట్టవలెను; నమ్మనివారిపై రసముతోఁగూడినయాచమనప్రోక్షణములొనర్చి దానివలనఁగలుగుబాధ దేవతాశాపముచేఁ గలిగెన

ని బెదరింపవలెను, లేక అభిత్యక్తుఁడొకనిని దానిచేఁగఱపించి యోగదర్శనప్రతీకారముచేఁ గోశమును వృద్ధిపొందింపవలెను.

లేక వైదేహకవ్యంజనుఁడొకఁడు ధనికుఁడగు వర్తకునితోఁ గలిసి వ్యాపారము మొదలిడి నిక్షేపప్రయోగములచే నాపణ్యమూల్యము వృద్ధిపొందినపుడు రాత్రియందు దానినిదొంగిలించి (రాజకోశమునకు) చేర్పవలెను. రూపదర్శక సువర్ణకారుల విషయమునఁ గూడ నిట్లేయని యెఱుంగునది.

వైదేహకవ్యంజనుఁడు ప్రఖ్యాతవ్యవహారుఁడై యొకవర్తకమునిమిత్తమెరువుగను, అద్దెకును ననేకరూప్య సువర్ణభాండముల గ్రహింపవలెను; లేక సర్వపణములను తెచ్చెదనని (వర్తక) సమాజమునుండి ప్రభూతసువర్ణహిరణ్యములనుఋణముగఁదీసికొని, ఆద్రవ్యము నారాత్రియందే దొంగలపహరించిరని ప్రకటింపవలెను.

సాధ్వీవ్యంజనులగు స్త్రీలచే దూష్యులకుఁ గామమును కలిగించి వారిండ్లకువచ్చిన దూష్యులను పట్టుకొని సర్వస్వమపహరింపవలెను.

దూష్యకులములోనివారికిఁ బరస్పరవివాదముకలిగినపుడు వారిలో నొకరికి (రాజప్రేరితులగు) రసదులు రసమునిచ్చి దాని నేమిష పెట్టి తక్కినవారి సర్వస్వమపహరింపవలెను.

అభిత్యక్తుఁడొకఁడు తగుమనుష్యునివేషమువేసికొని రాజదూష్యులనుండి పణ్యమునుకాని హిరణ్య నిక్షేపమునుకాని ఋణమును కాని దాయమునుకాని కోరవలెను: లేక వానిని దాసుఁడనియు వాని భార్యను కోడలిని కూఁతును తనకుదాసియనియు లేక భార్యయనియుఁ జెప్పవలెను. అట్టియభిత్యక్తుని దూష్యగృహమునఁగాని దూష్యునింట మఱియొకచోటనుకాని శయనించుచుండునపుడు రాత్రియందుఁ దీక్ష్ణులుచంపి, కాముకుఁడగువీఁడు హతుఁడయ్యెనని చెప్పి అదియేమిషపెట్టి దూష్యులనుండి ధనమును రాఁబట్టవలెను.

సిద్ధవ్యంజనుఁడు దూష్యునితో, ఆక్షయమగు హిరణ్యోత్పత్తి, రాజద్వారప్రవేశము స్త్రీహృదయాకర్షణము శత్రుక్షయము ఆయుష్యము సంతానము— వీనినికలిగించువిధముల తెప్పగనేనెఱుంగుదునని చెప్పి వానిని జంభకవిద్యలచే వశపఱుచుకొనవలెను. వశమైనవీనిచే రాత్రియందుఁ జైత్యస్థానమున నధికముగ సురామాంసగంధోపచారములుచేయించి తత్పూర్వమే ఆచట ప్రేతాంగముఁగాని ప్రేతశిశుహస్తమునఁగాని హిరణ్యమునుంచియుండి దానినిప్పుడుతీసి చూపించి, ఇప్పుడల్పమగు హిరణ్యముమాత్రమే దొరకినది, అధికమగుహిరణ్యము దొరకుటకై మరల నెక్కువగు నుపహారముఁజేయుము ఈహిరణ్యముతో నుపహారద్రవ్యమును నీవేకొని తెమ్మని చెప్పి, అతఁడాహిరణ్యముతో ద్రవ్యములను కొనుచున్నప్పుడు వానినిపట్టుకొనవలెను. అప్పుడు మాతృవ్యంజకయగునొక్కతె,నాపుత్రుఁడితనిచేఁ జంపఁబడెనని యాక్రోశింపవలెను. ఈవిధముగ రాత్రియందు వనములో నుపహారమిచ్చుటకు సంసిద్ధుఁడయినవానిని తీక్ష్ణులుచంపి, అభిత్యక్తుఁడని వానినితీసికొనిపోవలెను.

భృతకవ్యంజనుఁడు దూష్యునివద్దఁబనిచేసి వాఁడిచ్చినవేతనములోఁ గూటరూపములగు నాణెములఁగలిపి దానిని ప్రకటింపవలెను.

కర్మకారవ్యంజనుఁడు దూష్యునిగృహమునఁ బనిచేయుటకుఁ బ్రవేశించి కూటరూపములుచేయుట కుపయోగించు నుపకరణముల నందుంపవలెను.

చికిత్సకవ్యంజనుఁడు రోగములేదని చెప్పుచు రోగియగుదూష్యునిఁ జేరవలెను.

సత్రియొకఁడు దూష్యునింట రాజాభిషేకభాండమును రాజామిత్రశాసనమును నుంపించి, ఇవిపచ్చుటకుఁ గారణము తెలుపవలసినదని మఱియొకకాపటికు నడుగవలెను.

ఈవిధముగ ధార్మికులగు దూష్యులయెడఁ బ్రవర్తించుచు నదితరులయెడనట్లు ప్రవర్తింపకుండవలెను.

ఫలము పక్వమయినతర్వాత నారామమునుండి గ్రహించునట్లు పక్వమయినపుడే రాజ్యమందుండి పన్నులను గ్రహింపవలెను. పచ్చికాయను కోయకవిడిచినట్లు కోపజనకమగు పన్నులను విడువవలయును.

ఇది యోగవృత్తమను పంచమాధికరణమున కోశాభిసంహరణమను రెండవయధ్యాయము.

ఆదినుండి తొంబదిరెండవ యధ్యాయము.



## 91 ప్రకరణము.

### భృత్యభరణీయము

దుర్గజనపదముల యవసరములఁబట్టి ఆదాయములో నాలుగవవంతును భృత్యపోషణద్రవ్యముగ నేర్పఱుపవలెను. కార్యసాధకములగు భృత్యలాభములచే వారికుత్సాహము గలిగించుచు వారి నిఁబోషింపవలెను. ధర్మార్థముల కెప్పుడు బాధగలిగింపఁగూడదు.

ఋత్విగాచార్యమంత్రిపురోహిత సేనాపతి యువరాజ రాజమాతృరాజమహిషులకు నలువదివేలపణములు సంవత్సరమునకియ్యవలెను. ఇంతటి పోషణద్రవ్యమిచ్చినయెడల వారు కోపములేక తృప్తిపడియుందురు.

దౌవారికాంతర్వంశిక ప్రశాస్తృ సమాహర్తృ సన్నిధాతలకు నిరువదినాలుగువేల పణములు. ఇంతటిద్రవ్యముతో వీరుకర్మార్హులగుదురు.

కుమార కుమారమాతృ నాయకా పౌరవ్యావహారిక కర్మాంతిక, మంత్రిపరిషద్రాష్ట్రాంతపాలాంత పాలురకుఁ బండ్రెండువేలు. దీనితో వీరుస్వామిభక్తిగలిగి యతనికి సహాయముచేయుచుందురు.

శ్రేణీముఖ్యులకును హస్త్యశ్వరథముఖ్యులకును ప్రదేష్టలకు నెనిమిదివేలపణములు. ఇట్లిచ్చినచో వీరు స్వవర్గముతోఁ గూడి పనిచేయుదురు.

పత్త్యశ్వరథహస్త్యధ్యక్షులకును, ద్రవ్యహస్తివనపాలురకును నాలుగువేల పణములు. రథికానీక చికిత్సకాశ్వదమక వర్ధకులకును యోనిపోషకులకును రెండువేలు. కార్తాంతిక నైమిత్తిక మౌహూర్తిక పౌరాణికసూతమాగధులకును పురోహితపురుషులకును అధ్యక్షులందఱకిని వేయిపణములు. శిల్పవంతులగు పదాతులకును సంఖ్యాయక లేఖకవర్గమున కయిదువందలపణములు. కుశీలవులకు నూటేఁబదిపణములు; వీరిలోఁ దూర్యకరులకు రెండురెట్లధికముగ వేతనము, కారుశిల్పులకు నూటయిరువది. చతుష్పదద్విపదపరిచారకులకును పారికార్మికోపస్థాయికపాలకవిష్టిబంధకుల కఱువదిపణములు.

ఆర్యయుక్తుఁడు ఆరోహకుఁడు మాణవకుఁడు శైలఖనకులు సర్వోపస్థాయులు ఆచార్యులు విద్యావంతులు— వీరు పూజార్హతనుపట్టి అయిదువందలుమొదలు వేయిపణములవఱకుఁ బొందవచ్చును.

మధ్యమదూతకు యోజనదూరము పోవునపుడు యోజనమునకుఁ బదిపణముల చొప్పునను, పదియోజనములకుమించి నూరుయోజనములవఱకుఁ బ్రయాణముచేసినపుడు రెండురెట్లుగను వేతనమియ్యవలెను.

రాజసూయాది క్రతువులందు రాజస్థానమందుండువానికి సమానులగుతక్కిన విద్యావంతులకంటె మూఁడురెట్లువేతనము. రాజసారధికి వేయిపణములు.

కాపటికోదాస్థిత గృహపతిక వైదేహక తాపసవ్యంజనులకు వేయిపణములు. గ్రామభృతక సత్త్రి తీక్ష్ణ రసదభిక్షుకుల కయిదువందలపణములు. చారసంచారకులకు మూఁడువందలుపణములుగాని ప్రయాసమునకుఁదగిన వేతనముగాని యియ్యవలెను.

శతవర్గసహస్రవర్గాధ్యక్షులు వారివారివర్గముల సంబంధించిన భక్తవేతనలాభ ప్రదేశ విక్షేపములను వారేచేయింపవచ్చును.

రాజపరిగ్రహ దుర్గ రాష్ట్ర రక్షావేక్షణములందు నియుక్తులగువారికి మార్పులేదు. వారిలో ముఖ్యులు నిత్యులుగను ననేకులుగను నుండవలెను.

ప్రభుకార్యములుచేయుచు మృతినొందినవారి దారపుత్రులకు భక్తవేతనమియ్యవలెను. వీరికి సంబంధించిన బాలురు వృద్ధులు వ్యాధితులుగూడ ననుగ్రహ్యులే. ప్రేతవ్యాధిత సూతికాకృత్యములు వచ్చునప్పుడు వారికిధనసహాయము చేయవలెను.

అల్పకోశుడగురాజు కుప్య పశు క్షేత్రములను అల్పహిరణ్యము నియ్యవలెను. శూన్యప్రదేశములందు నివాసము లేర్పరుపఁగోరురాజు హిరణ్యముమాత్రమే యియ్యవలెను. గ్రామములన్నిటిలో నొక్కరీతి వ్యవహారము జరుపనిశ్చయించుకొనిన రాజు గ్రామమునంతను నొకనికియ్యరాదు. ఈలాగు జీతములిచ్చుచు భృత్యుల విద్యాకర్మలనుపట్టి భక్తవేతనముల నధికము చేయుచుండవలెను.

అఱువదిపణముల కొకయాఢకము చొప్పున హిరణ్యమునుపట్టి భక్తమునియ్యవలెను.

పత్త్యశ్వరథద్విపములకు సంధిదినములందుదప్ప దక్కినదినములను సూర్యోదయమున గ్రామమునకువెలుపల శిల్పము నేర్పవలెను. అట్టిసమయములందు రాజు జాగరూకుఁడై యుండి వానిశిల్పనైపుణ్యమును కనిపెట్టవలెను.

శస్త్రవరణములకు రాజముద్రలనువేసి ఆయుధాగారమందుంపవలెను. (శస్త్రజీవులుసహితము) ముద్రానుజ్ఞాతులు కానప్పుడశస్త్రులై తిరుగవలెను; అందలి నష్టవినష్టములను ద్విగుణముగనిచ్చుకొనవలెను, చెడిపోయినవానిని లెక్కపెట్టవలెను.

సార్థికులయొక్క శస్త్రాసరణముల సంతపాలుడు శిక్షింపవలెను: ముద్రయుండిన మొహరల విడిచిపెట్టవచ్చును.

యుద్ధయాత్రకు బయలుదేరురాజు సేననుచేర్చవలెను. తరువాత వైదేహకవ్యంజకులు సర్వపణ్యములను ద్విగుణప్రత్యాదేయముగ యాత్రాకాలమందాయుధీయుల కియ్యవలెను. ఇట్లొనర్చినచో రాజపణ్యవిక్రియము వేతనప్రత్యాదానము జరుగును.

ఈలాగున నాయవ్యయములఁ జూచుకొనుచున్నరాజు కోశదండవ్యసనములఁ బొందఁడు.

ఇది భక్తవేతన వికల్పము.

సత్త్రిలు వేశ్యలు కారుకుశీలవులు దండవృద్ధులు జాగరూకులై యాయుధీయుల శుచిత్వాశుచిత్వములఁ దెలిసికొనవలెను.

ఇది యోగవృత్తమను పంచమాధికరణమున ద్రవ్యభరణీయమను మూఁడవయధ్యాయము.

ఆదినుండి తొంబదిమూఁడవ యధ్యాయము.



## 92 ప్రకరణము.

### అనుజీవివృత్తము.

లోకానుభవముగలవాఁ డాత్మద్రవ్యప్రకృతి సంపన్నుఁడగు రాజను, ప్రియహితుఁడగువాని సహాయమున నాశ్రయింపవలెను.

లేక, నేను ప్రభువును (ఆశ్రయమును) కోరినట్లే, యితఁడు భృత్యుని (వినయమును) కోరుచున్నాఁడు. వీఁడాభిగామికగుణయుక్తుఁడని ఎవ్వనిగుఱించి నిశ్చయించుకొనునో అట్టిరాజునుగూడ నాశ్రయింపవచ్చును. ఇట్టివాఁడు ద్రవ్యప్రకృతిహీనుఁడైనను వాని నాశ్రయింపవచ్చునుగాని, అనాత్మసంపన్నుఁడు మాత్రమాశ్రయార్హుఁడుకాఁడు. అనాత్మవంతుఁడు నీతిశాస్త్రద్వేషియగుటచేతను, అనర్థభూయిష్ఠుం డగుటచేతను మహైశ్వర్యమును పొందియు దానిని

నిలువుకొనవలెను. ఆత్మజ్ఞానసంపన్నుఁడగు ప్రభువునొద్ద భృత్యుఁడవకాశము గలుగఁజేసికొని శాస్త్రవిషయముల నెఱింగింపవలెను. తాను చెప్పినహితమును ప్రభువంగీకరించినచోఁ దనకు స్థానస్థైర్యముకలిగినట్లూహింపవచ్చును.

వర్తమానభవిష్యత్కాలముల సంబంధించిన విషయముల గుఱించి ప్రశ్నింపఁబడినప్పుడు ధర్మార్థానుకూలముగను ప్రవీణుడవలెను పరిషద్భీరువుగాక నేర్పుతో సలహా నియ్యవలెను. ప్రశ్నింపఁబడినవాఁడైన ధర్మార్థానుకూలముగ అల్పులు బలవత్సంయుక్తులయినపుడును, తనకు బలసంయోగము కలిగినపుడును వెంటనే దండధారణముచేయవలెను. ఒకపక్షమువలంబింపరాదు. నావృత్తిని నారహస్యమును లక్ష్యపెట్టకుండుడు. కామక్రోధములచే నీవు (అధర్మ) దండములను విధించునపుడు నేనుసంజ్ఞచేసి నిన్నువారింతునని చెప్పవలెను.

(భృత్యుఁడు) రాజాజ్ఞనొంది నిర్దిష్టమగుస్థానమును ప్రవేశింపవలెను. పరాసనములకు దూరముగను రాజాసనమునకు దగ్గరగను కూర్చుండవలెను. పరోక్షముగ సభ్యప్రతికూలవాక్యములు చెప్పుట, నమ్మఁదగనివాక్యము, అనృతము, అకారణముగ పెద్దహాసమును చప్పుడగునట్లు వాతక్ష్వేవనముచేయుటయును విడువవలెను. అన్యునితో రహస్యముగ మాట్లాడుట, జనవాదమగుచుండఁ బరస్పరము మాటలాడుకొనుట, రాజుయొక్కయు, ఉద్ధతకుహకులయొక్కయు వేషమునువేసికొనుట, రత్నాతిశయములను ప్రకాశముగఁ గోరుట, ఒకకంటితోఁజూచుట, పెదవికఱచుకొనుట, కనుబొమలుముడుచుట రాజుమాట్లాడుచుండ నడుమమాట్లాడుట, బలవంతులతో విరోధము స్త్రీలు స్త్రీప్రేరకులు సామంతులదూతలు ద్వేష్యులు శత్రుపక్షమువారు ఉద్యోగమునుండి తొలఁగింపఁబడినవారు దుష్టులులోనగువారితో సంసర్గము, పట్టుదల, సంఘములలోఁజేరుట— వీనిని విడువవలెను.

సమయముగనిపెట్టి రాజార్థమును, ప్రియహితులతోఁగూడి నపుడు స్వార్థమును, దేశకాలములఁ దప్పింపక ధర్మార్థసహితమగునట్లు పరార్థమును (భృత్యుఁడురాజునకు) చెప్పవలెను.

ప్రశ్నింపఁబడినవాఁడై ప్రియమును హితమునునగు వాక్యమును చెప్పవలెనుకాని ప్రియమైనను నహితమును చెప్పరాదు. రాజనుమతించి వినునపుడు రహస్యముగ నప్రియమగు హితమునుచెప్పవలెను.

విరుద్ధవాక్యము చెప్పవలసివచ్చినపు డూరకుండవలెను. ద్వేష్యాదులను వర్ణింపఁగూడదు. రాజాభిప్రాయమునకు విరుద్ధముగఁ జెప్పినవారు దక్షులయినను అప్రియులగుదురు నిష్ప్రయోజకులైనను రాజాభిప్రాయమెఱింగి తదనుసారముగ వర్తించినచోఁ బ్రియులగుదురు.

హాస్యసమయమున నల్పముగ నవ్వవలెనుకాని పెద్దనవ్వునవ్వరాదు.

పరునిచే ఘోరముగఁ బలికించుకొనఁగూడదు; పరుని ఘోరమగుమాట లనఁగూడదు. పృథివివలెఁ దన్నెవరేమిచేసినను శాంతినొంది యుండవలెను.

ఆత్మరక్షయే పండితునిచే మొదటఁజేయఁదగిన కార్యము.

రాజోపజీవులయొక్క వృత్తి అగ్నిసమీపమందలి వృత్తివంటిది. అగ్ని శరీరమందొక్క భాగమునుకాని శరీరమునంతనుకాని దహించును. రాజన్నచో పుత్రదారసహితముగఁ గుటుంబమునంతను దహించును, లేక రక్షించును.

ఇది యోగసూత్రమున పంచమాధికరణమున అనుజీవివృత్తమను నాలుగవయధ్యాయము.

ఆదినుండి తొంబదినాలుగవ యధ్యాయము.



## 93 ప్రకరణము.

### సమయాచారికము.

కర్మలయందు నియోగింపఁబడిన భృత్యుఁడు వ్యయశుద్ధముగ లాభమును చూపింపవలెను: అభ్యంతరబాహ్యకార్యములను గుహ్యప్రకాశకార్యములను ఆత్యాయికోపేక్షణీయములను, ఇదియిట్లని చెప్పవలెను.

మృగయాద్యూతమద్యస్త్రీప్రసక్తుఁడగు రాజు ననువర్తించి ఆసన్నుఁడై ప్రియవాక్యములచే వ్యసనములనుండి తొలఁగించుటకు యత్నింపవలెను. శత్రువులయుపజాప అతిసంధాన ఉపసంధులనుండి రక్షింపవలెను. మంత్రిసంవరణమునకై రాజు తనయింగితాకారములచేఁ గామద్వేషదైన్యవ్యవసాయ ద్వంద్వవిపర్యాసమును చేయునుకాన వానియింగితాకారములఁ గనిపెట్టుచుండవలెను.

ప్రజ్ఞచూపించినపుడు ప్రసన్నుఁడగుట, చెప్పినమాటవినుట, ఆసనమునిచ్చుట, రహస్యముగదర్శనమిచ్చుట, శంకస్థానమందుఁగూడ శంకింపకుండుట, చెప్పినకథలనువిని సంతోషించుట, జ్ఞాపకముచేయఁదగిన విషయములనుకూడ స్వయముగ జ్ఞప్తిలోనుంచుకొనుట, చెప్పఁబడినపథ్యమునుసహించుట, నవ్వుచునియోగించుట, చేతితో స్పృశించుట, శ్లాఘ్యవిషయమున నపహసింపకుండుట, పరోక్షమున గుణములనుచెప్పుట, భోజనసమయమందుస్మరించుట, కలిసివిహరించుట, వ్యసనములందు సలహానుకోరుట, భృత్యునకిష్టమగువానిని గౌరవించుట, రహస్యమునుచెప్పుట, గౌరవమును హెచ్చించుట, ధనమునిచ్చుట, ఆపదలనుండి తొలఁగించుట —— ఇవి తుష్టుఁడగు రాజుయొక్క లక్షణములు. వీనికి విపరీతముగనుండుట యతుష్టుని లక్షణములు.

మఱియుఁ జెప్పెదము. చూడఁగనే కోపించుట, చెప్పినమాటవినకయే ప్రతిషేధించుట, ఆసనమునియ్యకుండుట, కంటితోఁజూడకుండుట, వర్ణస్వరముల భేదము, ఒకకంటితోఁజూచుట, భ్రూకు

టోష్ఠముల నిర్భేదము, స్వేదము, అసమయములందు హాసస్మిత ములఁజూపుట, తనలోఁదాను మూల్గుకొనుట, హఠాత్తుగ లేచుట లేక వెనుకకుఁదిరుగుట, అన్యునిభూమిగాత్రముల స్పృశించుట, అన్యునిపిసిపయిఁకి లేవనెత్తుట, విద్యావర్ణదేశముల నిందించుట, సమదోషపరితిదోషనింద, ప్రతిలోమస్తవము, ఉపకారానవేక్షణము, అపరాధకీర్తనము, వచ్చినవారినెల్లఁ జూచుచుండుట, అతిత్యాగము మిథ్యాభిభాషణము, రాజదర్శనముఁ జేయుటకువచ్చినవారి వృత్తివికారము, మానుషేతరజంతువుల వృత్తివికారము,— వీనినిపట్టిరాజతుష్టుఁడని తెలిసికొనవచ్చును.

రాజు పలుకకముఁఖగ నుండునని కాత్యాయనుఁడు.

క్రౌంచ మపసవ్యముగ వెళ్ళినదని కణికభారద్వాజుఁడు.

(రాజు) తృణమని దీర్ఘచారాయణుఁడు.

(రాజు) తడిసిన బట్టయని ఘోటముఖుఁడు.

ఏనుఁగుస్వేచ్ఛగ నీటినిజల్లుచున్నదని కింజల్కుఁడు.

రథాశ్వమని చెప్పవలెనని పిశునుఁడు.

శత్రువరణమందు శ్వానమని పిశునపుత్రుఁడు.

అర్థమానములోసంగనిరాజును పరిత్యజింపవచ్చును; లేక తనలోపమును రాజుయొక్కయోగ్యతను తెలిసికొని ప్రతీకారముచేసికొనవచ్చును; లేక ఉత్కృష్టుఁడగుమిత్రుని యాశ్రయింపవలెను.

రాజోద్యోగమందుండువరకు మిత్రబలమూలమున రాజదోషములను తొలఁగించుచు, అటుతర్వాత రాజు జీవించినను గతించినను స్వస్థానమునకు వెళ్ళవచ్చును.

ఇది యోగవృత్తమను పంచమాధికరణమున సమయాచారికమను అయిదవ యధ్యాయము.

ఆదినుండి తొంబదిమొదవ యధ్యాయము.



## 94 ప్రకరణము.

### రాజ్యప్రతిసంధానము, ఏకైశ్వర్యము.

అమాత్యుఁడు రాజవ్యసనమునకీవిధముగఁ బ్రతీకారమునుచేయవలెను; రాజునకు మరణాబాధతటస్థించుటకుఁబూర్వమునుండి యమాత్యుఁడు మిత్రులసలహాలను పుచ్చుకొని, దేశపీడలఁ బోఁగొట్టునట్టియు శత్రునాశనకరమగునట్టియు ఆయుష్కరమయినట్టియుఁ బుత్రసంపాదకమగునట్టియుఁ గర్మలను రాజుచేయుచున్నాఁడని మిషపెట్టి యొకమాసమునకుఁగాని రెండుమాసములకుఁగాని యొకపర్యాయము రాజదర్శనము చేయింపవలెను. అవసరమయినయెడలఁ బ్రకృతులకును మిత్రామిత్రులమాతలకును రాజవ్యంజనునొకనిఁ జూపింపవలెను. రాజవ్యంజనుఁ డమాత్యునిద్వారముగ వారితోఁ యథోచితసంభాషణమును చేయుచుండవలెను. దౌవారికాంతర్వంశికముఖుఁడై మంత్రి రాజాజ్ఞననుసరించుచుండువట్లు నటింపవలెను. అపకారులయెడ హేడప్రసాదములను, ఉపకారులయెడఁ బ్రసాదనూత్రమును మఱియొకనిమూలమునఁ జేయించుచుండవలెను దుర్గప్రత్యంతస్థములగు కోశదండములు నొక్కచోటఁజేర్చి, ఆప్తపురుషాధిష్ఠితములుగఁ జేయవలెను. దాయాదులను రాజకుమారులను ముఖ్యులను నేదియోయొకమిషపెట్టి పక్షవంతుఁడై దుర్గాటవులందుసంచరించుచున్న విరోధముఖ్యునిఁ బట్టుకొనుటకుఁగాని బాధాకరమగు మఱియొకయుద్ధయాత్రకుఁగాని మిత్రకులసందర్శనమునకుఁగాని పంపవలెను.

ఏసామంతునివలన నపాయశంకకలుగునో వానిని ఉత్సవవివాహహస్తిబంధనాశ్వపణ్యభూమిప్రదానములకని మిషపెట్టిపిలిపించి పట్టుకొని బంధింపవలెను; లేక మిత్రునిమూలమున వానితోసంధిచేసికొని యదూష్యునిగఁ జేయవలెను; లేక ఆటవికామిత్రులతో నతనికి వైరముగల్పింపవలెను; లేక ఉపరుద్ధుఁడగు వానిదాయాదినొకనిని వానిరాజ్యములోఁగొంతభాగమిచ్చెదనని వానిపైకిఁ బంపవలెను.

కుల్యకుమారముఖ్యుల యంగీకారమునుహొంది రాజకుమారునికభిషేకమొనర్చి వానిని (ప్రజలకు) చూపింపవలెను: లేక దాండకార్మికప్రకరణమునఁ జెప్పినట్లు రాజ్యకంటకులఁదొలఁగించి వానిచే రాజ్యమునేలింపవలెను.

సామంతాదులలో ముఖ్యుఁడగు నేకఁడు ప్రకోపించినచో, నీకేరాజ్యమిచ్చెదమని పిలిపించి చంపవలెను; లేదా వానివలనఁగలుగు నాపదను మఱియొకవిధముగనైన సాధింపవలెను.

క్రమముగ యువరాజునందు రాజ్యభారమునారోపించి పిమ్మట రాజవ్యసనమును (మరణము) ప్రకటింపవలెను

శత్రుభూమిలో రాజు మృతిచెందినపుడు, అమిత్రవ్యంజనుఁడగు మిత్రునిమూలమున శత్రునితోసంధిచేసికొనిగాని సామంతులలోనొకనిని రాజదుర్గములోస్థాపించిగాని వెనుకకు మరలిపోవచ్చును. లేక కుమారుని కభిషేకముచేసి శత్రువుపైఁ బ్రతిఘటింపవచ్చును శత్రువుచే నభియుక్తుఁడైనపుడు ముందుచెప్పఁబోవు విధముగ నాపత్ప్రతీకారము చేసికొనవలెను.

ఈవిధముగ నమాత్యుఁడు రాజ్యమునేకైశ్వర్యముగఁ జేయవలెనని కౌటిల్యుఁడు.

ఇట్లుకాదు. రాజు మృతిచెందినవెంటనే ఆమాత్యుఁడు కుల్యకుమారముఖ్యులకుఁబరస్పరముకలహముగలిగించి, అందువిక్రమించినవానిని ప్రజలచేఁజంపించిగాని రహస్యశిక్షచే వానినిసాధించిగాని తానే రాజ్యమును గ్రహింపవచ్చును. ఏలనఁగా రాజ్యముకొఱకై తండ్రిపుత్రులను పుత్రులు తండ్రినిఁ జంపుకొనుచుందురు. రాజ్యమునకెల్ల నాధారభూతుఁడగు నమాత్యుఁడుమాత్ర మేల ఉపేక్షించును? కావున స్వయముగఁ బ్రాప్తించినదానిని వాఁడెన్నటికి విడువఁడు. స్వయముగవచ్చిన స్త్రీ త్యజింపఁబడినదై పురుషునిశపించునని లోకులుచెప్పుదురుగదా? సమయమును కోరుచుండుపురుషుని కాసమయమెప్పుడో ఒకమారుమాత్రమే ప్రాప్తించును. దానిను పేక్షించి

నచో నట్టితరుణము తిరిగిమఱియొకమారు రాఁజాల దని భారద్వాజుఁడు

ప్రకృతికోపకమగునీకార్యమధర్మిష్ఠముగను సిద్ధాంతవిరుద్ధముగను నుండును. కావున, ఆత్మసంపన్నుఁడగు రాజపుత్రుని రాజ్యమందు నిలుపవలెను. అతఁడు సంపన్నుఁడు కానపుడు వ్యసనియగు కుమారునిఁగాని రాజకన్యకఁగాని గర్భిణియగుదేవిని గాని పురస్కరించుకొని మహామాత్రులతో, ఇతఁడు మీనిక్షేపము; ఇతనితండ్రిని మీయోగ్యతను వంశమును జ్ఞాపకముంచుకొనుఁడు. ఇతఁడు ధ్వజమాత్రుఁడు. మీరేస్వాములు. ఇట్టిసందర్భమున నేనుచేయవలసినదేమని యమాత్యుఁడు పలుకవలెను. అట్లు పలుకుచున్నవానితో యోగపురుషులు, నీవుప్రధానుఁడు గాఁగల యీమనరాజకంబె నన్యుఁడు చాతుర్వర్ణ్యమును పాలించుట కసమర్థుఁడెట్లగునని చెప్పవలెను. ఆలాగేయనిఅమాత్యులు కుమారునిఁగాని రాజకన్యకగాని గర్భిణియగు దేవినిగాని యధికారమందుంచి బంధుసంబంధులకును మిత్రామిత్రదూతలకునుచూపింపవలెను. అమాత్యులకును నాయుధీయులకును భక్తవేతనముల నధికముచేసి, ఇతఁడు పెద్దయైనపుడింతకంటె నధికముగ బహుమానముచేయఁగలఁడనిచెప్పుచు దుర్గముఖ్యులతోను రాష్ట్రముఖ్యులతోను మిత్రామిత్రులతోను యథార్థముగఁ బలుకవలెను. రాజకుమారునికి వినయకర్మలలో నభ్యాసము గలుగఁజేయవలెను; లేక సమానజాతీయునివలనఁ గన్యకకుఁగలిగిన పుత్రునకభిషేకము చేయవలెను. తల్లికిఁజిత్తక్షోభభయములేకుండునట్లు కుల్యుఁడు నల్పసత్త్వుఁడు సుందరుఁడు నగునొకనిని ప్రతినిధిగనుంచి, తల్లిని కపటములేకుండ రక్షించుచుండవలెను. అమాత్యుఁడాత్మార్థమై యుత్కృష్టోపభోగములను చేయించుకొనక రాజునకు యానవాహనాభరణవస్త్రస్త్రీవేశ్మ పరివారములను కల్పింపవలెనని కౌటిల్యుఁడు.

రాజకుమారునికి యౌవనమువచ్చినతర్వాతఁ దనకువిశ్రాంతి

కోరి కుమారుఁడు తుష్ట్యుఁడయినచో నమాత్యుఁడతనిని విడువవలెను తుష్ట్యుఁడయినచో వానిననుసరింపవలెను; లేక గూఢాసారపరిగ్రహులనుండి పుత్రునిని రక్షింపవలసినదని చెప్పి విరక్తుఁడై కానరణ్యమునకు వెళ్ళవలెను, లేదా సత్రియాగమునైనఁ జేయవలెను.

ముఖ్యులచే ననుగృహీతుఁడగు రాజునుసహితము వానిప్రియులనాశ్రయించి యర్థశాస్త్రవేత్తయగు నమాత్యుఁడు వానికితివృత్తపురాణములను బోధింపవలెను; లేక సిద్ధవ్యంజనుఁడై యోగమవలంబించి రాజును తనయధీనముచేసికొని దూష్యులను దండింపవలెను.

ఇది యోగవృత్తమను పంచమాధికరణమున రాజ్యప్రతిసంధానమేకైశ్వర్యమను ఆఱవ యధ్యాయము.

ఆదినుండి తొంబదియాఱవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమందలి
యోగవృత్తమను పంచమాధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## ఆఱవయధికరణము — మండలయోని.

### 95 ప్రకరణము.

#### ప్రకృతి సంపదలు

స్వామ్యమాత్య జనపద దుర్గకోశ దండమిత్రులు ప్రకృతులు. వీనిలో స్వామిసంపద — మహాకులీనత దైవబుద్ధి సత్త్వసంపద వృద్ధానుసరణము ధార్మికత సత్యము అవిసంవాదిత్వము కృతజ్ఞత స్థూలలక్షత మహోత్సాహము అదీర్ఘసూత్రత సామంతులవశపఱచుకొనుశక్తి దృఢబుద్ధి అక్షుద్రపరిషత్తునుచేరదీయుట వినయకామత. అన్యులను వశపఱచుకొనుటకు వలయు నుపకరణములుగూడ నివియే.

శుశ్రూషాశ్రవణగ్రహణ ధారణవిజ్ఞానోహాపోహ తత్త్వాభినివేశములు ప్రజ్ఞాగుణములు.

శౌర్యము అమర్షము శీఘ్రత దాక్ష్యములు ఉత్సాహగుణములు.

ప్రజ్ఞ ప్రగల్భము స్మృతి బలము మతిబలము ఉదగ్రత స్వవగ్రహము శిల్పవిజ్ఞానము వ్యసనమునందును దండనాద్యుపకారాపకారములందును ప్రతీకారముచేయుశక్తి హ్రీమానాపదలందు గాంభీర్యావలంబనము దీర్ఘ దూరదర్శిత్వము దేశ కాల పురుషకార కార్యప్రధాన్యము సంధి విక్రమ త్యాగ సంయమపణ పరచ్ఛిద్రములను సమయానుసారముగ విభాగించుట అభిహాస జిహ్మభృకుటీ క్షణముల సంవృతము చేసికొనుట కామ క్రోధ లోభ స్తంభ చాపలోపతాపైశున్యములు లేకుండుట స్మితపూర్వాభి భా

క్షేత్రము వృద్ధోపదేశాచరణము — ఇవి ఆత్మసంపదలు.

అచ్చటచ్చట నమాత్యసంపదలు చెప్పఁబడియున్నవి.

ముఖ్యపట్టణములు గలిగియుండుట, ఆపత్కాలమునం దాత్మధారణమును, పరధారణమును గలిగియుండుట స్వారక్షస్వాజీవములు గలిగియుండుట శత్రుద్వేషియగుట వశ్యులగు సామంతులను గలిగియుండుట పంకపాషాణోపరవిషమకంటకశ్రేణివ్యాళమృగాటవులులేకుండుట, చూచుటకింపుగనుండుట సీతాఖనిద్రవ్యహస్తివనములు గలిగియుండుట గవ్యముగలిగియుండుట పౌరుషేయమైయుండుట గుప్తగోభూములను పశువులను అదేవమాతృకలను వారిస్థలపథములను సారచిత్రములయిన పెక్కుపణ్యములను గలిగియుండుట, దండకరములు సహింపఁగలుగుట పాటుపడుకర్షకులను బాలిశస్వాములను నవరవర్ణములవారిని విశేషముగఁ గలిగియుండుట భక్తులు పవిత్రులునగు మనుష్యులను గలిగియుండుట — ఇవి జనపదసంపదలు.

దుర్గసంపద లిదివఱకే చెప్పఁబడినవి.

పూర్వులచేఁగాని స్వయముగఁగాని ధర్మమార్గమున సంపాదింపఁబడుట హేమరూప్యములతోడను, చిత్రములును స్థూలములును నగు రత్నహిరణ్యములతోడను నిండి దీర్ఘములగు నాపదలువచ్చినను చాలకాలము రాఁబడిలేకుండినను తరుగకుండుట — ఇవి కోశసంపదలు.

పితృపైతామహమయినది నిత్యమయినది వశ్యమయినది తుష్టులగు భృతపుత్రదారలుగలది ప్రవాసములందుసహితము విరోధింపనిది ఎందును నపజయమొందనిది కష్టములసహించునది అనేకయుద్ధములందనుభవముగలది సర్వవిధయుద్ధములందును ప్రహారణవిద్యలందును నేర్పుగలది, స్వామియొక్క వృద్ధిక్షయములలోఁ బాల్గొనునది క్షత్రియప్రాయమయినది — ఇది దండసంపద.

పితృపైతామహమయినది నిత్యమయినది వశ్యమయినది అద్వైధ్యమయినది కాలవిలంబములేక అధికముగఁ బనిచేయఁగలది—

ఇది మిత్రసంపద.

రాజబీజమునకుఁ బుట్టినివాఁడు క్షుద్రపరిషత్తును విరక్తప్రకృతులను నన్యాయవృత్తిని గలిగినవాఁడు అయుక్తుఁడు వ్యసని నిరుత్సాహుఁడు దైవప్రమాణుఁడు అనాలోచితముగఁ బనిచేయువాఁడు సహాయములేనివాఁడు క్లీబుఁడు నిత్యాపకారి— ఇట్టివాఁడమిత్రసంపదగలవాఁడు. ఇట్టిశత్రుని సుఖముగఁజంపవచ్చును.

అమిత్రుఁడుతప్పఁ దక్కినప్రకృతులేడును స్వగుణోదయము గలవై రాజసంపద కంగములుగనుండును.

ఆత్మవంతుఁడగు రాజసంపన్నులగు ప్రకృతులను సహితము సంపన్నములుగఁజేయును; అనాత్మవంతుఁడన్నచో వివృద్ధములును ననురక్తములును నగు ప్రకృతులనుగూడ క్షీణింపఁజేయును.

కావున దుష్టప్రకృతియు ననాత్మవంతుఁడును నగురాజు నాలుగుదిక్కులఁ బాలించువాఁడయినను తనప్రకృతులచేఁగాని శత్రువులచేఁగాని హతుఁడగును. ఆత్మవంతుఁడగువాఁ డల్పదేశముగలవాఁడయినను ప్రకృతిసంపదతోఁగూడి నయజ్ఞుఁడై భూమినంతను జయించునేగాని క్షయమును బొందఁడు.

ఇది మండలయోనియను ఆఱవయధికరణమునఁ బ్రకృతిసంపదలను మొదటియధ్యాయము.

ఆదినుండి తొంబదియేఁడవ యధ్యాయము.



96 ప్రకరణము.

శమవ్యాయామికము

యోగక్షేమములకు శమవ్యాయామములు కారణములు. కర్మారంభమువలన సిద్ధినిపొందుట వ్యాయామము. కర్మఫలములనాపదరహితములుగ ననుభవించుట శమము.

శమవ్యాయామములకు షాడ్గుణ్యమే కారణము.

క్షయము స్థానము వృద్ధియని ఉదయము. అట్టియుదయము నకు మానుషములగు నయాపనయములును దైవికములగు అయానయములు కారణములు. దైవమానుషములగునివి లోకమును లోకకర్మలను పరివర్తింపఁ జేయుచున్నవి.

అగపడక (అదృష్టమై) జరుగునది దైవము. అట్టిదైవముచే నిష్టఫలము సంప్రాప్తించుట అయము.

ప్రత్యక్షముగఁ జూచిచేయఁబడినది (దృష్టకారితము) మానుషము. యోగక్షేమనివృత్తిని కలిగించు మానుషము నయము: విపత్తినికలిగించునది అపనయము. ఇవి రెండు నూహించుటకవకాశము గలిగియుండునవి. అట్టి యవకాశములేనిది దైవము.

ఆత్మద్రవ్యప్రకృతిసంపన్నుఁడును నయాధిష్ఠితుఁడును నగు రాజు విజిగీషువు. వానికిఁజుట్టునుండు వారిలో భూమ్యంతరు లరిప్రకృతిలోఁజేరినవారు; భూమ్యేకాంతరులు మిత్రప్రకృతిలోఁ జేరినవారు. అరిసంపద్యుక్తుఁడగు సామంతుఁడు శత్రువు, అట్టివాఁడు వ్యసనములలోనున్నప్పుడు వానిపైదండెత్తవలెను. ఆశ్రయము లేనివాఁడుగను దుర్బలాశ్రయుఁడుగనునున్నప్పుడు వాఁడు ఛేదనీయుఁడగును. ఇవియే శత్రువిశేషములు.

మిత్రుఁడును వానితర్వాత నరిమిత్రుఁడును, పిమ్మట మిత్రమిత్రుఁడును తర్వాత నరిమిత్రమిత్రుఁడును భూమ్యనంతరులై విజిగీషునకు ముందుందురు. పార్ష్ణిగ్రాహుఁడు ఆక్రందుఁడు పార్ష్ణిగ్రాహాసారుఁడు ఆక్రందాసారుఁడు— వీరువిజిగీషుని వెనుకభాగమందుందురు.

భూమ్యనంతరుఁడై స్వభావముచే నమిత్రుఁడును తుల్యాభిజనుఁడును నగువాఁడు సహజశత్రువు. అట్లుగాక తనచే విరోధింపఁబడినవాఁడుగాని తన్నువిరోధించినవాఁడుగాని కృత్రిమశత్రువు.

భూమ్యేకాంతరుఁడును మాతాపితృసంబంధుఁడును ప్రకృతిమిత్రుఁడై సహజమిత్రుఁడనఁబడును. ధనజీవన హేతువులవలననా

శత్రువంచినవాఁడు కృత్రిమమిత్రుఁడు.

అరివిజిగీషువుల సమీపమందుండు భూమినేలువాఁడును సంహతాసంహతులగు వీరిరువురిననుగ్రహించుటకును అసంహతులగునపుడు వీరిని నిగ్రహించుటకును సమర్థుఁడగువాఁడు మధ్యముఁడు.

అరివిజిగీషుమధ్యముల భూముల కావలనుండి, ప్రకృతులచేత బలవత్తరుఁడై సంహతాసంహతులగు వీరినందఱి ననుగ్రహించుటకును అసంహతులగునపుడు వీరిని నిగ్రహించుటకును సమర్థుఁడగువాఁడుదాసీనుఁడు. ఇవి ప్రకృతులు.

విజిగీషువు మిత్రుఁడు మిత్రమిత్రుఁడను ప్రకృతులు మూఁడును అమాత్యజనపదదుర్గకోశదండప్రకృతులతోఁగూడినవారై యష్టాదశకమండలముగ నేర్పడుచున్నారు. అరిమధ్యమోదాసీనమండలములుగూడ నిట్టివియని యెఱుఁగునది. కనుక మండలములు నాలుగు, రాజప్రకృతులు పండ్రెండు, ద్రవ్యప్రకృతు లఱువది, ప్రకృతులన్నియుఁగలిసి డెబ్బదిరెండు.

రాజప్రకృతులకు ధనమునుబట్టి సంపచ్ఛక్తిసిద్ధులు కలుగును. బలమే శక్తి, సిద్ధియనఁగా సుఖము.

శక్తి మూఁడువిధములు— జ్ఞానబలమగు మంత్రశక్తి, కోశదండబలముచేఁగలుగు ప్రభుశక్తి, విక్రమబలముచేఁగలుగు నుత్సాహశక్తి యని మూఁడు.

ఇదేవిధముగ సిద్ధియు మూఁడువిధములు— మంత్రశక్తిసాధ్యమగునది మంత్రసిద్ధి, ప్రభుశక్తిసాధ్యమగునది ప్రభుసిద్ధి, ఉత్సాహశక్తిసాధ్యమగునది యుత్సాహసిద్ధి.

వీనిచే నధికతరుఁడు జ్యాయుఁడగును. అల్పతరుఁడు హీనుఁడగును. వీనిని సమానముగఁ (ఇతరునితో) గలవాఁడు సముఁడగును. కావున స్వశక్తిసిద్ధులను వృద్ధిపఱచుకొనుటకుఁ బ్రయత్నింపవలెను. ద్రవ్యప్రకృతుల విషయమున సమానుఁడగువాఁడు భూమ్యనంతరుని సహాయమునఁగాని శుచిత్వముచేఁగాని దూష్యామిత్రుల

మూలమునఁగాని శత్రునిఁ బెల్లగించుటకుఁ బ్రయత్నింపవలెను.

లేక, నాయొక్క శత్రువు శక్తియుక్తుఁడయినను వాగ్దండపారుష్యార్థదూషణములచేఁ బ్రకృతులను బాధింపఁగలఁడు; సిద్ధియుక్తుఁడయినను మృగయాద్యూతమద్యస్త్రీలోలుఁడై ప్రమాదమునుపొందఁగలఁడు; విరక్తులగు ప్రకృతులుకలవాఁడై ప్రమాదముచే క్షీణించి నాకుసాధ్యుఁడు కాఁగలఁడు; నేను విరోధించి దాడివెడలినచో సర్వసైన్యములతో దుర్గస్థుఁడై ఒకచోటనుండఁగలఁడు; సైన్యములతోఁ గూడినవాఁడయినను మిత్రదుర్గవియుక్తుఁడై నాకు సాధ్యుఁడగును; బలవంతుఁడగురాజు శత్రువునుజయింపఁగోరి వానినిజయించుటలో నాసహాయమపేక్షించుచున్నాఁడు. దీనివలన నాశత్రువుతో నాకు యుద్ధముతటస్థించినపుడు నాకు సహాయముచేయఁగలఁడు; లేక నేను మధ్యముఁడను కావచ్చునని తోఁచినపుడు శత్రువుయొక్క శక్తిసిద్ధులనుపేక్షింపవచ్చును.

ఏకాంతరుఁడగుమిత్రునిఁ బ్రకృతిమండలమునకు నేమిగను, అనంతరులను అరములుగను, తన్ను నాభిగను ప్రభువుచేయవలెను.

ప్రభువునకును మిత్రునకును మధ్యస్థుండగుశత్రువు బలవంతుఁడయినను ఉచ్ఛేద్యుఁడును పీడనీయుఁడు నగును.

ఇది మండలయోనియను ఆఱవయధికరణమున శమవ్యాయామికమను రెండవ యధ్యాయము.

ఆదినుండి తొంబదియెనిమిదవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున మండలయోనియను నాఱవయధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## సప్తమయధికరణము — షాడ్గుణ్యసముద్దేశము.

97-99 ప్రకరణములు.

### క్షయస్థానవృద్ధినిశ్చయము

షాడ్గుణ్యమునకుఁ బ్రకృతిమండలమే కారణము.

సంధి విగ్రహాసనయానసంశ్రయ ద్వైధీభావములు షాడ్గుణ్యమని యాచార్యులు.

సంధివిగ్రహములచేతనే షాడ్గుణ్యము సంభవించును. కావున రెండేగుణములని వాతవ్యాధి.

వీనిలోఁ బరస్పరావస్థాభేదము లుండుటవలన గుణములాఱని కౌటిల్యుఁడు.

అందు— పణబంధము సంధి, ఉపకారము విగ్రహము, ఉపేక్షణ మాసనము, అభ్యుచ్చయము యానము, పరార్పణము సంశ్రయము, సంధివిగ్రహోపాదానము ద్వైధీభావము— ఇవియే షడ్గుణములు.

శత్రునికంటె హీనుఁడగునపుడు సంధిచేసికొనవలెను; అధికుఁడగునపుడు విగ్రహింపవలెను; నన్నుఁ బరుఁడుగాని పరుని నేనుగాని జయించుట జరుగదని యనుకొనినపుడాసన మవలంబింప వలెను; గుణాతిశయయుక్తుఁడగునపుడు యానముచేయవలెను; శక్తిహీనుఁడగునపుఁడు సంశ్రయముచేయవలెను; సహాయముచే సాధింపఁదగిన కార్యమున ద్వైధీభావము చేయవలెను.

ఇది గుణావస్థాపనము.

పైయాఱుగుణములలో దేనినవలంబించి తనయొక్క దుర్గకర్మవణిక్పథశూన్యనివేశదత్రిహస్తివనకర్మలను వృద్ధిపఱచుకొనుటకును, శత్రుసంబంధములగు నీకర్మలను చెడఁగొట్టుటకును సమర్థుఁడగునో అట్టిగుణ మవలంబింపవలెను.

అచిరకాలములో వృద్ధిపొందుటకుఁదనకవకాశమున్నదనియు శత్రువుయొక్కవృద్ధి దీనికివిపరీతముగ నుండునవియుఁదలఁచునప్పుడు శత్రువువృద్ధి నుపేక్షింపవచ్చును. తనవృద్ధియు శత్రువృద్ధియు సమకాల సమఫలములు గలవిగనుండునని తోఁచినప్పుడు సంధిచేసికొనవలెను.

ఏగుణమునవలంబించుటవలనఁ దనకర్మలకునష్టమును శత్రుకర్మలకుఫలమును కలుగునవితోఁచునో అట్టిగుణమునాశ్రయింపఁగూడదు. ఇదియే క్షయము. చిరకాలమునకు వృద్ధికంటెనల్పతరముగు క్షయము తనకుఁగలుగునవియు, శత్రువిషయమున దీనికి విపరీతము గజరుగునవియుఁ దోఁచినపుడు దనక్షయము నుపేక్షింపవచ్చును. క్షీణదశయందిరువురికుఁ దుల్యకాలఫలోదయమగునప్పుడు సంధిచేసికొనవలెను.

ఏగుణము నవలంబించి స్వకర్మవృద్ధిక్షయములఁ బొందకుండునో అద్దానికే స్థానమనిపేరు. తన స్థానము హ్రస్వతరముగను వృద్ధ్యుదయముగను శత్రువుయొక్కస్థానము దీనికి విపరీతముగను నుండునపుడు స్థానావస్థ నుపేక్షింపవచ్చును.

స్థానము తుల్యకాలఫలోదయమగునపుడు సంధిచేసికొనవలెనని యాచార్యులు. ఇదియే సిద్ధాంతము, దీనికిఁదిరుగులేదని కౌటిల్యుఁడు.

లేక, సంధిచేసికొని ఫలదాయకములగు నాపనులచే శత్రుకార్యములను చెరుపఁగలను; నాకార్యములవలని మహాఫలములనేగాక పరకర్మలవలని ఫలమునుకూడ ననుభవింపఁగలను. సంధియని నమ్మించి యోగోపనిషత్ప్రణిధులచే శత్రుకర్మలను చెఱుపఁగలను;

సుఖమును సానుగ్రహపరిహార సౌకర్యములను కలిగించి, అధికఫలలాభములఁ గూర్చునటువంటి శత్రుకర్మల కుపఘాతముఁ గలిగించు జనమును స్వరాష్ట్రమునకు రప్పింపఁగలను; బలవంతుఁడగువానితో శత్రువు స్వకర్మోపఘాతముఁ బొందఁగలఁడు; ఎవనితో విగ్రహించి నాతో సంధి చేసికొనునో ఆప్రవాహతో నాశత్రువునకు దీర్ఘవైరము గల్పింపఁగలను; నాతోఁ గలసిన నాశత్రువుయొక్క జనపదమును నాతోడఁ బోషింపఁగలఁడు; పరోపహతమగు వీనిజనపదము నన్నుఁ జేరఁగలదు, అందుచేఁ గర్మలలో వృద్ధి నాకుఁ గలుగును; విపన్నకర్మారంభుఁడును విషమస్థుఁడును నగుశత్రువు నాపనులకడ్డుపెట్టలేఁడు, ఇతరులతోఁ గలిసి ప్రవృత్తకర్మారంభుఁడనై నాపనులను వృద్ధిపఱచుకొనఁగలను; శత్రువితో సంధిచేసికొని శత్రుప్రతిబద్ధమగు మండలమును భేదింపఁగలను; అట్లు భేదమొందినదానిని వశపఱచుకొనఁగలను, దండానుగ్రహములచే శత్రువును స్వాధీనముచేసికొని మండలములోఁ గలిసినపిమ్మట వానిపైనితరులకు ద్వేషముఁబుట్టించి విద్విష్టుని మండలముచేఁ జంపింపఁగలనని తోఁచినపుడు సంధిచేసికొని వృద్ధిపొందవలెను.

లేక, నాదేశమాయుధీయప్రాయమై శ్రేణీప్రాయమై లవనదీదుర్గద్వారములరక్షను కలిగియున్నది, కావున పరాభియోగమును సహింపఁగలదు, విషయాంతమందలి దుష్ప్రవేశమగు నాదుర్గమునుండి శత్రుకర్మల నాశముచేయుటకుసమర్థుఁడను; వ్యసనపీడలచే నుత్సాహముచెడి శత్రువు కర్మోపఘాతమొందుచున్నాఁడు: శత్రుఁడన్యునితో విగ్రహించుటవలన వానిజనపదములోని వారి నందఱిని నాదేశములోఁ బ్రవేశపెట్టవచ్చునని తోఁచునపుడు శత్రునితో విగ్రహించి వృద్ధిపొందవలెను.

లేక, నాకర్మలనశింపఁజేయుటకు శత్రుఁడుగాని శత్రుకర్మల కుపఘాతము కలిగించుటకు నేనుగాని సమర్థులము కాము. శ్వవరాహకలహమునందువలె స్వకర్మానుష్ఠానపరుఁడనై వీని వ్యసనమును

లంభింపవలెను.

సామంతుఁడు బలవంతుఁడయినపుడు వానికంటె నెక్కువబలముగల వానినాశ్రయింపవలెను. అట్టివాఁడు లభింపనపుడు కోశదండభూములలో నొకదానిని సామంతునికిచ్చి వానినాశ్రయించి [illegible]స్యముగ వానికపకారముచేయుటకై యత్నించుచుండవలెను. శత్రువులచేఁ బట్టుపడినపుడుతప్పఁ దక్కినపుడు విశిష్టబలులతో సమాగమము రాజులకు మహాదోషకారియగును.

అశక్తుఁడగు ప్రభువు దండోపనతునివలెఁ బ్రవర్తింపవలెను; లేక శత్రువునకుఁ బ్రాణహరము వ్యాధి అంతఃకోపము శత్రువృద్ధి మిత్రవ్యసనములు కలుగుననియుఁ దన్నిమిత్తమునఁ దనకువృద్ధిగలుగుననియుఁ దోఁచునపుడు వ్యాధి ధర్మకార్యాపదేశములచే వాని[illegible]నుండి తొలఁగిపోవలెను, లేక స్వవిషయమందేయుండి వాని[illegible]చెయ్యఁగూడదు. లేక, ఆసన్నుఁడై యవకాశముగనిపెట్టి శత్రు[illegible]హరింపవలెను.

తోఁగలిసి వారిలో నొకనినికాని వారిద్దరినికాని సంహరింపవలెను. ద్దరిచేఁగొట్టఁబడినప్పుడు మధ్యమోదాసీనులపక్షమువారినికాని తత్త్రీలఁగాని న్యాయవృద్ధిఁకోరి అకాశ్రయింపవలెను. ఎవనిప్రకృతులు నకుసుఖము గలిగించునో లేక తానెక్కడనుండి తన్నువృద్ధిపఱచు నుటకు సమర్థుఁడగునో ఎచట పూర్వపురుషోచితగతియు నాసన్న బంధువులును శక్తిమంతులగు ననేకమిత్రులును సంభవింతురో అట్టి వానిని నాశ్రయింపవలెను.

వీరిద్దఱిలో నెవఁడుతనకుఁబ్రియుఁడో, ఎవనికిఁ దానుహితుఁడో వానినాశ్రయింపవలెను. ఇదియే శ్రేష్ఠమగు నాశ్రయగతి.

ఇది షాడ్గుణ్యమను ఏడవయధికరణమున సంశ్రయవృత్తియను రెండవయధ్యాయము.

ఆదినుండి నూరవ యధ్యాయము.



## 101-102 ప్రకరణములు.

### సమహీనజ్యాయసులగుణములు హీనసంధులు.

విజిగీషువు శక్త్యపేక్షుఁడై షాడ్గుణ్యము నుపయోగింపవలెను. సమజ్యాయులతో సంధిచేసికొనవలెను, హీనునితో విగ్రహింపవలెను. జ్యాయునితో విగ్రహించినచో సేనఁగుతోఁ బాదయుద్ధముచేసినప్పుడు కలుగుఫలము కలుగును. సమునితో విగ్రహించినచో నామపాత్రము నామపాత్రముచేఁ గొట్టినపుడువలె నుభయులకు క్షయమగును; హీనునితో విగ్రహించినచో నశ్మముచేఁ గుంభమునువలె వానినికొట్టి సిద్ధినొందవచ్చును.

జ్యాయుఁడు సంధికొప్పుకొననిచో దండోపనతవృత్తుఁడై యసమగ్నునివలె నుండవలెను. సముఁడు సంధినొప్పుకొననిచో నెంతటి యపకారము నాతఁడొనర్చునో యంతటి ప్రత్యపకారమును వానికిఁ

జేయుచుండవలెను. తేజస్సే గదా సంధానకారణము. అతప్తములగు లోహము లోహముతోఁ గలియనేరదుకదా ?

హీనుఁడగువాఁడు తన కన్నివిధములుగఁ బ్రబలుఁడైనవానితో సంధిచేసికొనవలెను, లేనిచో దుఃఖామర్షజమగు వానితేజస్సు వానిని విక్రమింపఁజేసి మండలానుగ్రహపాత్రునిఁగ జానిసి చేయును.

సంధిచేసికొనినహీనుఁడు, పరదేశములోని ప్రకృతులు లుబ్ధక్షీణాపచారితులయినను తిరిగిపట్టుకొనఁబడుదురేమో యనుభయముచేఁ దన్నుఁ బొందకున్నారని తలఁచునపుడు శత్రునిపై విగ్రహింపవచ్చును.

శత్రుప్రకృతులు లుబ్ధక్షీణాపచారితులయినను విగ్రహోద్విగ్నులగుటచేఁ దన్నుఁ జేరరను సందేహము కలిగినపుడు విగృహీతుఁడగు జ్యాయుఁడుగూడ సంధిచేసికొనవలెను, లేక విగ్రహోద్వేగమునయిన శమింపఁజేయవలెను.

ఏకకాలమం దుభయులకు వ్యసనముకలిగినపుడు తనవ్యసనమధికమైనదనియు శత్రునివ్యసనమల్పమైనదనియు శత్రుఁడు వాని వ్యసనమును సులభముగఁ బోఁగొట్టుకొని తనపైనభియోగముచేయఁ గలఁడనియుఁ దోఁచినపుడు జ్యాయుఁడుగూడ సంధిచేసికొనవలెను.

సంధివిగ్రహములు రెండిటివలనను శత్రుకర్శనము ఆత్మోపచయము కలుగఁజాలదని తోఁచునపుడు జ్యాయుఁడు సహితమాసనము నవలంబింపవలెను.

పరచక్రప్రతీకారమగు వ్యసనము సంభవించినపుఁడు హీనుఁడు సహితము వానిపై దాడివెడలవచ్చును.

అప్రతీకారమగు వ్యసనమాసన్నమైనపుడు జ్యాయుఁడుగూడ సంశ్రయమొందవలెను ఒకనితో సంధియు మఱియొకనితో విగ్రహమును చేసిన యెడలఁ దనకుఁగార్యసిద్ధియగునట్లు దోఁచునపుడు జ్యాయుఁడుకూడ ద్వైధీభావమవలంబింపవలెను.

ఈరీతిగ మొత్తముమీఁద షాడ్గుణ్యోపయోగముచే యవలెను. అందులోని విశేషములెట్టివనఁగా:—

సన్నద్ధమండలుఁడును బలవంతుఁడునునగు రాజుచే నాక్రమింపఁబడిన హీనుఁడు కోశదండభూములనర్పించి శీఘ్రముగ సంధిచేసికొనవలెను.

నిర్ణీతసైన్యముతోఁగాని సారసైన్యముతోఁగాని కోరునప్పుడు వచ్చునట్లుచేసికొనుసంధి ఆత్మామిషసంధి.

తాను స్వయముగరాక సేనాపతికుమారుల నవసరమైనప్పుడు పంపించుటకొప్పుకొనుసంధి పురుషాంతరసంధి. ఇందుచే నాత్మరక్షణము కలుగును.

తాను స్వయముగ వెళ్లునట్లుగాని లేక తనసైన్యమునుపంపునట్లుగాని యొప్పుకొని చేసికొనినసంధి అదృష్టపురుషసంధి. దీనిచే దండముఖ్యాత్మరక్షణమగును.

దండోపనతిసంధులగు నీమూఁడింటిలో మొదటి రెంటియందును ముఖ్యస్త్రీబంధమును, చివరదానిలో రహస్యముగ శత్రుబంధమును చేయవలెను.

కోశమునిచ్చి తక్కినప్రకృతులను యథాసుఖముగ విడుదల చేసికొనుట పరిక్రియసంధియని చెప్పుదురు.

స్కంధోపనేయమగు కోశమునిచ్చి చేసికొనుఉపగ్రహసంధి దేశకాలములఁబట్టి నిరుద్ధోపగ్రహమనియు, అత్యయోపగ్రహమనియుఁ జెప్పఁబడును. ఉత్తరకాలమందయిననిచ్చుట కవకాశముండును కనుక స్త్రీబంధనముకంటె నిదిమంచిది.

పరస్పరవిశ్వాసమువలన నేకీభవించుట సువర్ణసంధి.

అధికమగు ధనమునిచ్చిచేసికొనుసంధి కపాలసంధి. నాలుగు విధములగు నీకపాలసంధిలో మొదటిరెండిటియందుఁ గుప్యమును వాగురాన్వితమగు హస్త్యశ్వములను మూఁడవదానియం దర్థమును నియ్యవలెను. కర్మక్షయము కలిగెననుమిషచే నాలుగవదానియందే

మియు నియ్యకుండవలెను. ఇవియే కోశోపనతసంధులు.

రాష్ట్రములో నొక్కభాగమునిచ్చి తక్కిన దేశమునురక్షించు కొనుట ఆదిష్టసంధి. రహస్యముగఁ జోరుల సంహారింపఁ దలఁచువాని కది తగియుండును.

ఆత్తసారమగుభూమిని ప్రధానపట్టణవర్జముగనిచ్చి సంధిచేసి కొనుట ఉచ్ఛిన్నసంధి. పరవ్యసనకాంక్షికది లాభకరము.

ఫలమునిచ్చెదనని భూమిని విడిపించుకొనుట అపక్రయసంధి. భూములనుండివచ్చిన యాదాయముకంటె నెక్కువనిచ్చెదనని చెప్పుట పరిభూషణసంధి. దేశోపనతసంధులగు నీమూఁడిటిలో సామాన్య ముగ మొదటిదానినపేక్షింపవలెను. ఫలమును తీసికొనుమనిచెప్పు తక్కిన రెండుసంధులను శత్రువు బలవంతుఁడయినపుడే చేసికొన వలెను.

హీనసంధులగు పైమూఁడును దేశకాల కార్యవశముచే నొప్పుకొనఁబడి బలవంతులతో హీనులు చేయఁదగినవి.

ఇది షాడ్గుణ్యమందు సమహీనజ్యాయసుల గుణాభినివేశము హీనసంధులను మూఁడవ యధ్యాయము.

ఆదినుండి నూటయొకటవ యధ్యాయము.



## 103-7 ప్రకరణములు.

(విగ్రహించినపిమ్మట ఆసనము, సంధిచేసికొనినపిమ్మట ఆసనము, విగ్రహించినపిమ్మట యానము, సంధిచేసికొనినపిమ్మటయానము, కలిసిప్రయాణముచేయుట.)

సంధివిగ్రహములలోఁ జేయవలసిన యానాసనములగుఱించి చెప్పఁబడినది. స్థానము ఆసనము ఉపేక్షణములనునవి ఆసనశబ్దప ర్యాయములే. విశేషమేమనఁగా, నేదియో యొకలాభ మపేక్షించి యూరకొనుట స్థానము, స్వవృద్ధిప్రాప్తికొఱకై చేయునది ఆసనము, శత్రువుపై నెట్టిప్రయోగమును చేయకుండుట ఉపేక్షణము.

విజిగీషులయినను నొకరినొకరు జయింప శక్తిగలవారుగాక సంధికాములయినపుడు విగ్రహించియు సంధిచేసికొనియు ఆసనమవలంబింపవలెను.

సైన్యముతోఁగాని, మిత్రాటవికసైన్యములతోఁగాని, సమజ్యాయులను జయించుట కుత్సాహముకలిగినపుడు బాహ్యాభ్యంతరరక్షణముగావించుకొని విగ్రహించి యానమవలంబింపవలెను. నా ప్రకృతు లుత్సాహవంతములై పరస్పరమేకీభవించి వృద్ధినొంది తమ శమపనులనష్టములేక యొనర్చుకొని పరకర్మలంజెఱుపఁగలవని తోఁచినపుడువిగ్రహించి యానమవలంబింపవలెను.

శత్రుప్రకృతు లపచారితులయినను క్షీణులును లుబ్ధులును నై స్వచక్రస్తేనాటవికజనులచే బాధింపఁబడిగాని వారిలోవానికి భేదముకలిగిగాని నన్నుఁజేరఁదురు, నావార్త సంపన్నముగనున్నది; పరునివార్త క్షీణించుచున్నది. దుర్భిక్షహతులగు శత్రుప్రకృతులు నన్నుఁబొందఁగలరు. నావార్త విపన్నముగను పరునివార్త సంపన్నముగ నున్నను నాప్రకృతులు వానినిపొందఁజాలరు. విగ్రహించి పిసి ధాన్యపశుహిరణ్యములను వశపఱచుకొనఁగలను. స్వపణ్యోపఘాతములగు పణ్యముల మళ్ళింపఁగలను. సారములగుపణ్యములు పరవణిక్పథమునుండి నన్నుఁబొందఁగలవు. విగృహీతుఁడగు శత్రువు వానిరాష్ట్రములోని దూష్యామిత్రాటవికులనునిగ్రహింపలేఁడు. వారితో విగ్రహములఁ బొందును. గుణవంతమును తీసికొనఁదగినదియునునగు భూమిని నన్నను నపేక్షించి నామిత్రుఁడు బహ్వల్పకాలముననే తనుక్షయవ్యయములు నర్థమునుపొంది నన్ను వెంబడింపఁగలఁడను నీవిధముగఁదోఁచునపుడు పరవృద్ధిప్రతిఘాతనిమిత్తమును స్వప్రతాపనిమిత్తమును విగ్రహించి యానమవలంబింపవలెను.

పరావృత్తుఁడై శత్రువు విగిజీషునే భక్షించునని యాచార్యులు. అట్లు జరుగదు. వ్యసనములేని వీనికి కర్శనమునూత్రము కలిగింపవచ్చును, కాని విజిగీషువు వృద్ధినొందినవాఁడై శత్రుచ్ఛేదనము

గావింపఁగలఁడని కొట్టిల్యుఁడు. ఈరీతిగనున్నప్పుడమిత్రామిత్రుఁడుగూడ విజిగీషునకు నష్టముపొందక సాహాయ్యదానమును చేయఁగలఁడు, కావున సర్వప్రకృతులతోఁగూడ విగ్రహించి యానమవలంబింపవలెను.

విగ్రహించిచేసిన యానమునకుఁ బ్రతిబంధము కలిగినపుడు సంధిపూర్వముగ నానమునుగావింపవలెను. విగ్రహపూర్వముగ యానహేతువులచే వృద్ధినొందినతర్వాతసర్వసందోహములేకుండఁగనేయానము చేయవచ్చును.

శత్రువు వ్యసని. వానిప్రకృతులకుఁగలిగిన వ్యసనమునుఁబోగొట్టుటకతనికి సాధ్యముకాదు. వానిప్రకృతులు స్వచక్రపీడితులై విరక్తులుగను కర్శితులుగను నిరుత్సాహులుగను పరస్పరభేదముగలవారుగను లోభనీయులుగను నున్నారు. శత్రువు అగ్న్యుదకవ్యాధిమరకదుర్భిక్షనిర్మగ్నుఁడై క్షీణించిన యుగ్యపురుషనిచయరక్షావిధానుఁడై యున్నాఁడని తోఁచినపుడు విగ్రహించి యానము చేయవలెను.

నామిత్రాక్రందులు శూరవృద్ధానురక్తప్రకృతులు. నాశత్రుని మిత్రాక్రందులు తద్విపరీతులు. నాపార్ష్ణిగ్రాహాసారుల విషయమునఁగూడ నిట్లేయున్నది. నామిత్రునిచే నాసారుని ఆక్రందునిచేఁ బార్ష్ణిగ్రాహుని జయింపఁగలనని తోఁచినపుడు విగ్రహించి యానముచేయువలెను.

తనంతటఁ దానల్పకాలమున జయమునుసంపాదింపవచ్చునని యనుకొనినపుడు పార్ష్ణిగ్రాహాసారులతోఁ గూడవిగ్రహించి యానముచేయవచ్చును. ఇట్లనుకూలపడనపుడు వారితోసంధి గావించుకొని యానముచేయవలెను.

యానమవశ్యమైయుండి తానొక్కఁడుగూత్రము యానము చేయుటకు సాధ్యముకానపుడైక్యబుద్ధిగల సమహీనజ్యాయులతో నేకీభవించి వెళ్ళవలెను. ఒక్కనితోనేకీభవించుచపుడంశమునునిర్దేశిం

చి ఫలాప్రకృతితో సంభవించినప్పుడట్లు నిర్దేశింపక యానముచేయవలెను. వారందఱికి సహాయము దొరకనప్పుడు నిర్దిష్టాంశము నిచ్చెదనని వారిలో నొకరినుండి సైన్యసహాయమును కోరవలెను; లేక వారితోఁ గలిసివెళ్లునట్లయిన నేర్పఱచుకొనవలె. లాభము ధ్రువమైనప్పుడంశమునిర్ణయించియు నట్లుకానప్పుడు లాభమునుపట్టి యంశమును నిర్ణయించియు యానముచేయవలెను.

సేనను పట్టి యంశమును నిర్ణయించుకొనుట శ్రేష్ఠము, ప్రయాసమునుపట్టి నిర్ణయించుకొనుట యంతకంటెను త్తమము. లాభమునుపట్టిగాని ప్రక్షేపమునుపట్టిగాని నష్టములేకుండ నంశముల నిర్ణయించుకొనవలెను.

ఇది షాడ్గుణ్యమందు విగ్రహించినపిమ్మట ఆసనము, సంధిచేసికొనిన
పిమ్మట ఆసనము, విగ్రహించినపిమ్మట యానము, సంధిచేసి
కొనినపిమ్మట యానము, కలిసిప్రయాణముచేయుట అను
నాలుగవయధ్యాయము
ఆదినుండి నూటరెండవ యధ్యాయము.



## 198-10 ప్రకరణములు.

యాతవ్యామిత్రుల యభిగ్రహచింత, ప్రకృతుల
క్షయ లోభ విరాగ హేతువులు,
సామవాయికవిపరిమర్శ.

యాతవ్యామిత్రులకుఁ దుల్యవ్యసనముకలిగినప్పుడు వారిలో నమిత్రునిపై మొదట దండెత్తవలెను. అతఁడు లోఁబడినపిమ్మట యాతవ్యుని నెదుర్కొనవలెను. ఏలనఁగా, అమిత్రుఁడు వశపడినచో యాతవ్యుఁడు సహాయముచేయును కాని యాతవ్యుఁడు వశపడినను అమిత్రుఁడు సహాయముచేయఁడు.

యాతవ్యుఁడు గురువ్యసనిగను, అమిత్రుఁడు లఘువ్యసనిగను నున్నప్పుడు వారిలో నెవరిపై మొదట దండెత్తవలెను? గురువ్యస

సుఁడు సులభుఁడగుటచే వతనిపైకి వెళ్ళవలెనని యాచార్యులు. అట్లుకాదు. లఘువ్యసనుఁడగు నమిత్రునిపైకి వెళ్ళవలెను ఏలనఁగా వ్యసనము లఘువయినను యభియుక్తుఁడయినచో నదికృచ్ఛ్రమగు వ్యసనము గురువై (క్రమముగనది) గురుతరమగును. అనభియుక్తుఁడయినచో నమిత్రుఁడు తనలఘువ్యసనమునకు సుఖముగఁ బ్రతీకారముగలిగించుకొని యాతవ్యననుసరించి పార్ష్ణిగ్రాహుఁడగునని కౌటిల్యుఁడు.

ఏకకాలమునందిద్దఱు యాతవ్యులున్నప్పుడు గురువ్యసనియైనను న్యాయవృత్తియగువానిపై ముందువెళ్ళవలెనా లేక లఘువ్యసనియైనను నన్యాయవృత్తియును విరక్తప్రకృతియునునగు వానిపైవెళ్ళవలెనా? గురువ్యసనియైనను న్యాయవృత్తిగలవాఁ డభియుక్తుఁడైనపుడు వానిప్రకృతులు వానిననుగ్రహింతురుగావునను, లఘువ్యసనుఁడయినను నన్యాయవృత్తిగలవాఁడగు బలవంతునిసహితము వానిప్రకృతు లుపేక్షింతురుగావునను విరక్తప్రకృతియగు వానిమీఁదనే దండెత్తవలెను.

క్షీణలుబ్ధప్రకృతియగువానిపై దండెత్తవలెనా? అపచరితప్రకృతియగువానిపై దండెత్తవలెనా? క్షీణలుబ్ధులగు ప్రకృతులు పీడోపజాపములకు సులభముగ వశులగుటచేతను. అపచరితులగు ప్రధానులెన్నఁడట్లు వశపడరు కావునను క్షీణలుబ్ధప్రకృతియగువానిపై దండెత్తవలెనని యాచార్యులు. అట్లుకాదు, క్షీణలుబ్ధులగు ప్రకృలుభర్తయెడ స్నేహముగలిగి వానిహితమునువిడువక, ఉపజాపములకులొంగరు. వారియనురాగమువలననే (శత్రువునకు) సర్వగుణసిద్ధియగును. కావున నపచరితప్రకృతియగువానిపై దండెత్తవలెనని కౌటిల్యుఁడు.

బలవంతుఁడగు నన్యాయవృత్తునిపై దండెత్తవలెనా లేక దుర్బలుఁడగు న్యాయవృత్తునిపై దండెత్తవలెనా? అన్యాయవృత్తుఁడగు బలవంతుఁడభియుక్తుఁడయినపుడు వానిప్రకృతులు వానిననుగ్ర

హింపక వానిని చెడఁగొట్టి వానిశత్రువులను చేరుదురు; న్యాయస్వ త్తుఁడగు దుర్బలుని ప్రకృతులట్లుగాక వానినిపరిగ్రహించి యనుస రింతురు; కావున నన్యాయవృత్తుని పై దండె త్తవలెను.

సత్పురుషాపక్షేపము అసత్ప్రగ్రహము అభూతాధర్మములగు హింసలను ప్రవర్తింపఁజేయుట, ఉచితములును ధర్మిష్ఠములును నగుచరిత్రల నివర్తించుట, అధర్మప్రసంగము ధర్మమునువిడుచుట అకార్యకరణము కార్యనాశము దేయములనియ్యకపోవుట, ఆదేయముల సాధించుట దండ్యులదండింపకుండుట అదండ్యులను తీక్ష్ణముగ దండించుట అగ్రాహ్యులగ్రహించుట గ్రాహ్యులను విడుచుట అనర్థములుచేయుట అర్థములకు విఘాతముగలిగించుట చోరులనుండి రక్షింపకుండుట ధనముల దొంగిలింపించుట పురుషప్రయత్నములను చెఱచుట కర్మగుణదూషణము ప్రధానులకు హానిచేయుట మాన్యులనవమానించుట వృద్ధులతో విరోధవైషమ్యములఁబెట్టుకొనుట అనృతము ఉపకారమునకుఁ బ్రతీకారముచేయకుండుట ఆరబ్ధకార్యాకరణము యోగక్షేమవిధులందుసహితము ప్రమాదాలస్యములనొందుట లోనగునవి ప్రకృతుల క్షయలోభవిరాగములకు హేతువులు.

క్షీణులగుప్రకృతులు లోభమునొందుదురు; లోభమువలన విరాగముపుట్టును. విరక్తులగువారు శత్రువులతోఁగలిసికాని స్వయముగఁగాని ప్రభువునకు హానిచేయుదురు. కావునఁ బ్రకృతులకు క్షయలోభవిరాగములను పుట్టింపఁగూడదు. అట్లుపుట్టినను వెంటనేవానికిఁ బ్రతీకారము చేసికొనవలెను.

క్షీణులు లుబ్ధులు విరక్తులునగు ప్రకృతులలోనెవరెట్టివారు? క్షీణులు పీడనోచ్ఛేదనభయముచే సద్యఃఫలకమగు యుద్ధమునైయినను నిష్పతనమునయినను గోరుదురు. లుబ్ధులు లోభముచేనసంతుష్టులై పరోపజాపమునకులొంగుదురు. విరక్తులభియోగియగు శత్రునితో నేకీభవింతురు.

హిరణ్యధాన్యక్షయము సర్వోపఘాతియై కష్టసాధ్యమగును. యోగ్యపురుషక్షయమన్ననో హిరణ్యధాన్యసాధ్యమగును. లోభము కొందఱిముఖ్యులయందు మాత్రముండునుగాన దానిని శత్రుసన్యమూలమునఁ దొలఁగించుటకు వీలగును. ప్రధానులను పట్టుకొని విరక్తులగు ప్రకృతులను వశపఱచుకొనవచ్చును. ప్రధానులులేని ప్రకృతులు రాజునకు భోగ్యులుగను శత్రులకనుపజాప్యులుగనుందురు. ప్రధానులు వశమైనయెడల నితరులొనర్చునాపదలను సహింపలేని ప్రకృతులు వేఱువేఱుగ విభజింపఁబడుదురు; వారిని రక్షించినచో నాపత్సహులగుదురు.

సంధివిగ్రహకారణములను పరిశీలించి శక్తిశౌచయుక్తులగు సామవాయికులతోఁగలిసి యానముచేయవలెను. పార్ష్ణిగ్రహణమందును యాత్రాసాహాయ్యదానమందును సమర్థుఁడగువాఁడే శక్తిమంతుఁడు. కార్యము సిద్ధించినను కాకపోయినను చెప్పినట్లు ప్రవర్తించువాఁడు శుచి.

వారిలో జ్యాయుఁడగు నొక్కనితోఁ గలియుట మంచిదా? లేక సములగు నిద్దఱితోఁగలిసివెళ్ళుట మంచిదా? సములగు నిద్దఱితోఁగలియుటమంచిది. జ్యాయునితోఁ గలిసినప్పుడతనివలన నవగృహీతుఁడగును; సములతో వెళ్ళినయెడల వారు మోసముచేయుటయందధికులయినపుడు మాత్రమే వారికివశుఁడగును. కాని వారిద్దఱిని సులభముగ భేదింపవచ్చును. వారిలో దుష్టుఁడగువానిని స్వాధీనముచేసికొని భేదపెట్టవచ్చును.

సముఁడగునొకనితోఁ గలియవలెనా? లేక హీనులగు నిద్దఱితోఁగలియవలెనా? హీనులగు నిద్దఱితోఁగలియుట శ్రేయము. వారు భిన్నభిన్నములగు రెండుకార్యముల సాధించుటయందుపయోగించి తనకు వశులగుదురు. కార్యసిద్ధియైనతర్వాత వారు కృతార్థులై జ్యాయునుండి వెళ్లఁగ దొలఁగిపోదురు.

అట్లు వి.మను వానితో గలిసిన పుడు తన్ను వాడు విడుచునం తవఱకు రహస్యముగ వానిని కనిపెట్టిగాని వాని భార్యను వశము చేసి కొనిగాని వానినిపరీక్షించుచుండవలెను.

సముఁడయినను లబ్ధార్థుఁడు జ్యాయస్త్వమున పేక్షించుచుం డుఁగాన లబ్ధార్థుఁడగు సమునినుండి విశ్వస్తునికి భయము కలుగవచ్చును.

ఉచ్చదశయందుండువాఁడు విశ్వాసానర్హుఁడు. వృద్ధి చిత్తవి కారకారికదా ? విశిష్టుఁడంశమును పొందినను పొందకున్నను తుష్టు నివలెవెళ్లి సమయముగనిపెట్టి వీసనివశపఱచుకొని ద్విగుణముగనం శమును హరించును. కావునఁ గృతార్థుఁడగుప్రభువు సామవాయిక లకంశములను న్యాయముగనిచ్చి విడువవలెను. అంశము విషయమున వానితో వివాదపడకుండినచో మండలమునకిష్టుఁడగును.

ఇది షాడ్గుణ్యమను ఏడవయధికరణమున యాతవ్యామిత్రయోరభిగ్రహచింత క్షయలాభవికారహేతువులు సామవాయిక విపరివర్తనము అయిదవయధ్యాయము.
ఆదినుండి నూటమూఁడవ యధ్యాయము.



## 111-112 ప్రకరణములు.

### సంహితప్రయాణికము, పరిపణితాపరిపణితాపసృతసంధులు.

మండలములో ద్వితీయప్రకృతియగు శత్రువును విజిగీషువి ట్లు మోసపుచ్చవలెను. నీవీదేశమునకు వెళ్లుము; నేనాదేశమునకు వెళ్ళెదను. లాభమును సమానముగఁ బంచుకొనెదమని సంహితప్రయాణమున శత్రువుని నియోగింపవలెను. అందులాభము సమానమయినచో సంధిచేసికొనవలెను; లేనిచో విక్రమముఁ జూపింపవలెను.

సంధి పరిపణితము అపరిపణితమని రెండువిధములు. నీవీదేశ మునుగూర్చి వెళుము. నేనీదేశమునుగూర్చి వెళ్ళెదననుట పరిప ణితదేశము నీవింతకాలము పనిచేయుము. నేనింతకాలముచేసెదన నుట పరిపణితకాలము. నీవింతటికార్యమును సాధింపుము. నేనింతటి కార్యమును సాధింతుననుట పరిపణితార్థము.

శత్రువు వెళ్ళుచుండు దేశము శైలవనసదీదుర్గాటవులతోఁ గూడినది, ధాన్యపురుషవీవధాసారములులేక చెడినట్టిది, యవసేంధ నోదకములు లేనట్టిది, దూరమందుండునట్టిది, తెలియనట్టిది, అన్య ములగుభావములుగలది, సైన్యవ్యాయామములకుఁ జోటులేనట్టిది, తద్విపరీతమగు దేశమునకు నేనువెళ్ళుచున్నానని తలఁచునపుడు పరి పణితదేశసంధిని చేసికొనవలెను.

శత్రువు వెళ్ళుచుండుకాలము శీతోష్ణాధిక్యముగలది, అధిక రోగజనకమయినట్టిది, ఆహారోపభోగములచే శూన్యమైనట్టిది, సై న్యవ్యాయామోపరోధకమయినట్టిది, కార్యసాధనమునకు న్యూనాతి రిక్తమై తగనట్టిది, తద్విపరీతకాలమందు నేను వెళ్లుచున్నానని తలఁ చునపుడు పరిపణితకాలసంధిని చేసికొనవలెను.

శత్రువు సాధించుచుండు కార్యము స్థిరపడనట్టిది ప్రకృతికోప జనకమైనది చిరకాలముపట్టునట్టిది మహాక్షయవ్యయకారి అల్పమైన ది అనర్థానుబంధి అశుభమయినది ధర్మరహితమయినది మధ్యమో దాసీనులకనిష్టమయినది మిత్రవిఘాతమయినది. తద్విపరీతమగు కార్యమును నేనుసాధించుచున్నానని తలఁచునపుడు పరిపణితార్థసం ధిని చేసికొనవలెను.

ఇట్లే దేశకాలములతోడను, కాలకార్యములతోడను, దేశ కార్యములతోడను, దేశకాలకార్యములతోడను సంబంధించిచేయఁ బడినదై పరిపణితసంధి యేడువిధములుగనున్నది. సంధిచేసికొనుట కుఁబూర్వమే స్వకార్యములను ప్రారంభించి స్థిరపఱచుకొని తర్వాత శత్రుకర్మలవిషయమై విక్రమింపవలెను.

గతుఁడైనవాఁడగుటచే సంధేయుఁడు.

ఉభయులయొక్క గుణములను గమనింపక స్వదోషముచేత వారినివిడిచి తిరిగివచ్చువాఁడు అకారణగతాగతుఁడు చలబుద్ధి. అందుచే నసంధేయుఁడు.

స్వామియొక్క దోషముచేనాతనివిడిచి స్వదోషముచేతనే శత్రువునుండి మఱలివచ్చినవాఁడు కారణగతుఁడు నకారణాగతుఁడు. అట్టివానినిగుఱించి యిట్లాలోచింపవలెను.

ఇతఁడు పరప్రయుక్తుఁడు. నాదోషముచే నపకారముచేయఁదలఁచినవాఁడు. పరునిసంహరించుచున్నానని ప్రతిఘాతభయముచే మఱలనావద్దకు వచ్చినవాఁడు. నన్నుఁజంపఁదలఁచిన పరునిఁ బరిత్యజించి క్రౌర్యభయముచే నావద్దకువచ్చినవాఁడను మొదలగు విషయముల నాలోచించి కల్యాణబుద్ధియైనచోఁ బూజింపవలెను లేనిచో దూరముగఁ దొలఁగింపవలెను.

స్వదోషముచేఁదన్నువిడిచి పరదోషముచేమఱలఁదన్నుఁజేరినవాఁడు కారణగతుఁడు కారణాగతుఁడు. అట్టివానివిషయమై నా లోపములను పూరింపఁగలఁడు; కావున వీఁడునావద్దనుండుట లాభకరము. ఇతనిజనము నాశత్రువులనిష్టపడక నామిత్రులతోఁగలిసి నా శత్రువుచే విగ్రహింపఁబడినవారు. లుబ్ధక్రూరుఁడును శత్రుసంహితుఁడునునగు నాశత్రువునుండి వచ్చినవాఁడని యాలోచించి బుద్ధ్యనుగుణముగ నతనినాదరింపవలెను.

కృతప్రణాశుఁడు శక్తిహీనుఁడు విద్యయేజీవనముగఁగలవాఁడు దురాశాపరుఁడు దేశలోలుఁడు విశ్వాసములేనివాఁడు—ఇట్టివాఁడు పరిత్యజింపఁదగినవాఁడని యాచార్యులు. ఇది భయము అధర్మము అసమానము. ఇహాపకారియొక్కఁడే త్యాజ్యుఁడు; పరాపకారి సంధేయుఁడు. ఉభయాపకారిసందేహింపఁదగినవాఁడనికౌటిల్యుఁడు.

అసంధేయునితో సంధిచేసికొనవలసివచ్చినపుడుసంధిచేసికొని ప్రభావముచే సమయమునుకనిపెట్టి ప్రతివిధానము చేసికొనవలెను.

అవశీర్ణక్రియుఁడు అరిపక్షీయుని నాయకుఁడయినపుఁడు గుప్తముగను వ్యవహితముగను సోపకారముగను నుంపవలెను, లేక వానిభర్తపై విక్రమింపఁజేయవలెను, లేక అమిత్రాటవులతో సిద్ధునిఁగను దండచారిఁగను నియోగింపవలెను, లేక ప్రత్యంతదేశమునకుఁ బంపవలెను. లేక పణ్యమునిచ్చి శత్రుదేశమునకంపి పరసంధేయకారణముచే దూష్యునిఁగ నిర్ణయింపవలెను. ఆయతికొఱకు వానిఁజంపవలసి వచ్చినపుడు గతాగతమునుకనిపెట్టి రహస్యముగవానిఁ జంపవలెను. శత్రువుదగ్గఱనుండి వచ్చినదుష్టుఁడు సర్పముతోఁగలిసియుండువానితో సమానుఁడై తప్పకదూషితుఁ (దూష్యుఁ) డగును. ప్లక్షబీజమును భక్షించినకపోతము శాల్మలివృక్షమునకువలె నిత్యము నుద్వేగజనకుఁడును భయావహుఁడు నగును.

నిర్దిష్టదేశకాలములందు భయంకరముగ శత్రువునాక్రమించి వానికిఁ బ్రమాదవ్యసనములఁ గలిగించుట ప్రకాశయుద్ధము. ఒకవైపుత్యాగము మఱియొకవైపు ఘాతము కూటయుద్ధలక్షణము. యోగగూఢోపజాపార్థమైనది తూష్ణీంయుద్ధము.

**ఇది షాడ్గుణ్యమందు సంహితప్రయాణికము పరిపణితాపరిపణితాపసృతములను ఆఱవ యధ్యాయము.**

**ఆదినుండి నూటనాలుగవ యధ్యాయము.**



## 113 ప్రకరణము.

### ద్వైధీభావికములగు సంధివిక్రమములు.

విజిగీషువేవిధముగ ద్వితీయప్రకృతిని వశముచేసికొనవలెను. సామంతునితోఁగలిసి శత్రుసామంతునిపైకిఁ బోవలెను. లేక నాశత్రువు నన్నువెంటనంటఁడు. యాతవ్యుని నపచరింపఁడు. అట్లనుసరించినచో నాకుపాయము కలుగునుగదా ? (నామిత్రుఁడు) వివధాసారములఁ బ్రవర్తింపఁజేయును, నాకుబాధ కలిగినపుడు నాశత్రువు

లను మర్దింపఁగలఁడు. యాతవ్యునికి నష్టముగాని, వాఁడునాతోసంధిచేసికొనుబుద్ధికాని సామంతులలో నొకనినుండికోరి వానితోఁ గలిసి మఱియొకసామంతునిపయికి వెళ్ళవలెను. ఇట్లు జ్యాయునకధికాంశమును సమునకు సమాంశమును హీనునకు హీనాంశమునిచ్చి సంధిచేసికొనుట సమసంధి. ఇందుకు విరుద్ధమగునట్టిది విషమసంధి, పైరెండిటికంటె నధికలాభముకలది అతిసంధి.

వ్యసనియు నపాయసక్తుఁడును నష్టపడినవాఁడునునగుజ్యాయునికి బలసమములగు లాభమునిచ్చెదనని హీనుఁడతనితో సంధికోరవచ్చును. కోరఁబడినవాఁడై హీనునకపకారముచేయ సమర్థుఁడయినచో వానితో విక్రమింపవలెను, లేనిచో సంధిచేసికొనవలెను.

ఇట్లే హీనుఁడు స్వశక్తిపరితాపపూరణార్థమును మూలపార్ష్ణిత్రాణార్థమును బలముకంటె నెక్కువగు లాభమునిచ్చెదనని చెప్పి జ్యాయునితో సంధికోరును. అట్లుకోరఁబడినవాఁడై హీనుఁడుఁ కల్యాణబుద్ధిగలవాఁడయినచో వానిననుగ్రహింపవచ్చును లేనిచో విక్రమింపవలెను.

జాతవ్యసనియును ప్రకృతిలోపము గలవాఁడునునగుజ్యాయుని. దుర్గమిత్రసహాయము గలిగినట్టియు అల్పయానముచేయఁదలఁచినట్టియు యుద్ధమావశ్యకముగాక శత్రువును జయింపఁగలిగినట్టియు హీనుఁడు హీనలాభమిచ్చెదనని సంధినికోరవలెను. అట్లుకోరినపుడు హీనునికపకారముచేయ సమర్థుఁడయినచో విక్రమింపవలెను, లేనిచో సంధిచేసికొనవలెను.

రంధ్రవ్యసనములు లేనట్టి జ్యాయుఁడుగూడ దురారబ్ధకర్మలుగల శత్రువునకు క్షయవ్యయములఁ గలిగింపఁదలఁచినప్పుడును దూష్యసైన్యమును పరదేశమునకుఁ బంపఁదలఁచినపుడును లేక దానినిశత్రుస్వాధీనము చేయఁదలఁచినపుడును సంధియే ప్రధానమనితలఁచి బుద్ధిమంతుఁడై హీనలాభమునుకూడఁ గోరవచ్చును. అట్లుకోరిహీనుఁడు మంచివాఁడయినచో వానితో నేకీభవింపవలెను, లేనిపక్షమున

వానిపై విక్రమింపవలెను.

సముఁడు సముని మోసపెట్టవలసి వచ్చినపుడును అనుగ్రహింపవలసివచ్చినపుడును ఈక్రిందివిధముగ నాచరిపవలెను.

సముఁడు స్వామితాత్రువుల రక్షణముకును దేశిక మూలప్రాప్తిరక్షణమునకును శత్రుసైన్యములఁ ఛేదింపఁదగిన సమునిసైన్యమును, సమలాభమిచ్చెదనని కోరవలెను. కోఁబడినవాఁడై (కోరిన వాఁడు) కల్యాణబుద్ధియైనచో వానిననుగ్రహింపవలెను, కానిచో విక్రమింపవలెను.

అన్యునిసహాయముపొంద నవకాశముగలవాఁడు జాతవ్యసన ప్రకృతిరంధ్రుఁడును అనేకులతో విరోధించినవాఁడునునగు మఱియొకసమునితో హీనలాభమిచ్చెదనని సంధినికోరును. అప్పుడతఁడు (కోరఁబడినవాఁడు) కోరినవాని కపకారముచేయ సమర్థుఁడయినచో విక్రమింపవలెను, లేనిచో సంధిచేసికొనవలెను.

సామంతుల కధీనమగుకార్యములు గలవాఁడగుటచే సైన్యమును సిద్ధపఱచుకొనుటకుఁబూర్వము బలాధికమగులాభము నిచ్చెదనని సమునితో సంధినికోరును. అతఁడు కల్యాణబుద్ధియైనచో వానిననుగ్రహింపవలెను, లేనిచో విక్రమింపవలెను.

వ్యసనములను ప్రకృతిలోపములను గలవానిని స్వాధీనము చేసికొనఁ దలఁచినట్టియు వానిచే నారంభింపఁబడి సులభసిద్ధమగు వానికర్మను చెఱుపఁదలఁచినట్టియు వానస్థలమందుఁ గాని వాఁడు యాత్రచేయునపుడుగాని వానినికొట్టఁదలఁచినట్టియుఁబ్రభువు, యాతవ్యులగు జ్యాయోహీనసములనుండి యెక్కువలాభము పొందుచున్నను వారిని సైన్యముకొఱకై యాచించును. యాచింపఁబడిన వాఁడు స్వబలమును రక్షించుకొనవలసి వచ్చినపుడును దుర్ధర్షణమగు నన్యదుర్గాసారాటవులఁ బరసైన్యముచే మర్దింపఁదలఁచినపుడును మిక్కిలిదూరములగు దేశకాలములందుఁ బరదండమునకు క్షయవ్యయములఁగలిగింపఁ దలఁచినపుడును పరదండముచే వృద్ధినొంది దానినే

చ్ఛేదింపఁదలఁచినప్పుడును లేక దానిని స్వీకరింపఁదలఁచినప్పుడును యా చించినదాని నియ్యవచ్చును.

జ్యాయునిఁగాని హీనునిఁగాని యాతవ్యాపదేశముచే వశపఱచుకొనుటకును శత్రువిఁ జంపిన యనంతరము తనకునసహాయముచేసిన వానిఁ జంపుటకును ఇచ్చినదానిని తిరిగిపుచ్చుకొనుటకును తలఁచినప్పుడు విశిష్టలాభమునిచ్చి సంధినికోరవచ్చును. కోరినవాని కపకారము చేయసమర్థుఁడగునచో విక్రమింపవలెను, లేనిచో సంధిచేసికొనవలెను. మఱియు యాతవ్యునితోఁ గలియవచ్చును, లేక తనదూష్యామిత్రాటవీసైన్యములను తనుఁ గోరినవాని కియ్యవచ్చును.

జాతవ్యసనరంధ్రుఁడగు జ్యాయుఁడుసహితము సమలాభమిచ్చెదనని హీనునితో సంధిని కోరవచ్చును. కోరినవానికపకారముచేయ సమర్థుఁడైనచో విక్రమింపవలెను, లేనిచో సంధిచేసికొనవలెను, లేక హీనలాభమిచ్చెదనని హీనునిసహాయము గోరును. అప్పుడుగూడ నిట్లేచేయవలెను.

సంధిగోరువాఁడును కోరఁబడువాఁడును కారణమునుతోలుత నాలోచించి శ్రేయస్కరమార్గమునుపట్టి వెళ్ళవలెను.

**ఇదిషాడ్గుణ్యమందు సంహితప్రయాణికము, ద్వైధీభావికములగు సంధివిక్రమములను యేడవ యధ్యాయము.**

**ఆదినుండి నూటయయిదవ యధ్యాయము.**



## 114-15 ప్రకరణములు.

### యాతవ్యవృత్తి, అనుగ్రాహ్యమిత్రవిశేషములు.

సామవాయికులుకొందఱు యాతవ్యునిపై దాడివచ్చినప్పుడు వారునిర్ణయించుకొనిన సంధినియమముల ప్రకారము తానేనచుచుకొనఁదలఁచికాని వారిసంధిని చెడఁగొట్టఁదలఁచికాని లాభద్వైగుణ్యమునిచ్చెదనని వారిలోనొకనికిఁజెప్పి యానమువలనఁ గలుగు

క్షయవ్యయప్రవాసప్రత్యవాయ పరోపకారశరీరబాధలను వానికి వర్ణించి దానికతఁడంగీకరించినచో నాతనికి నిర్ణీతద్రవ్యమియ్యవలెను; లేక శత్రువులతో వానికి వైరముగల్పించి తదుపానానిర్ణయమును రద్దుపఱచుకొనవలెను.

దురారబ్ధకర్మలనొనర్పు సామవాయికునికి మిత్రక్షయవ్యయములఁ గలిగించుటకును వానిచేనారంభింపఁబడిన యాత్రను చెఱచుటకును, వాఁడున్నచోటునఁగాని యాత్రామధ్యమునఁగాని వానిని కొట్టుటకును యాతవ్యునితోఁగూడి వానివద్దనుండి సత్కృతలాభము సంపాదించుటకును కోరునప్పుడును తాను ప్రత్యలోపముగలవాఁడైనప్పుడును సామవాయికునియందు విశ్వాసములేనప్పుడును యాతవ్యునినుండి స్వల్పలాభముమాత్రమే కోరవచ్చును

ముందుముందధికమగు మిత్రోపకార శత్రుఘాతప్రత్యానుబంధములు కలుగుననియుఁ బ్రత్యుపకారము చేయించుకొనుటకవకాశముండుననియుఁ దోఁచినపుడు ప్రస్తుతమధికలాభమునుత్యజించి ముందుముందువచ్చు స్వల్పలాభమునే కోరవలెను.

దూష్యామిత్రులవలనఁగాని మూలహారకులగు శత్రువులవలనఁగాని విగ్రహింపఁబడినవానిని రక్షింపఁదలఁచినపుడును, అట్టిప్రత్యుపకారమును చేయింపఁదలఁచినపుడును సంబంధమును కోరినవాఁడై ప్రస్తుతలాభమునుకాని ముందుముందు లాభమునుకాని యపేక్షింపరాదు.

పరప్రకృతికర్శనమును మిత్రామిత్రసంధివిశ్లేషణమును చేయఁదలఁచినపుడుగాని పరాభియోగశంకకలిగినపుడుగాని తానొకనితోఁ జేసికొనినసంధి నతిక్రమింపఁగోరువాఁడప్రస్తుతముగు నధికలాభము నపేక్షింపవలెను. అట్లుకోరినవానినుండి తటితరుఁడు ప్రస్తుతమునను ముందుముందును జరుగవలసిన విషయములగుఱించినిర్ణయమును కదానినడుగవలెను. రెండింటి విషయములందుఁగూడ నిశ్చయము ను ఉండునది.

తమతమమిత్రుల ననుగ్రహించు నరివిజిగీషులకు శక్యకల్య భవ్యారంభులును స్థిరకర్ములు ననురక్తప్రకృతులునగు మైమిత్రుల బట్టి భేదముకలుగుచున్నది.

వీరిలో శక్యారంభి చేయఁగలపనిమాత్రమే ప్రారంభించును కల్యారంభి నిర్దుష్టకార్యము నారంభించును, భవ్యారంభి ఫలవత్తర మగుకార్యము నారంభించును స్థిరకర్ముఁడు పూనిన కార్యమును పూర్తిచేయక మరలఁడు: అనురక్తప్రకృతిసహాయుఁడగుటచే నల్పానుగ్రహామువలనఁ గార్యముసాధించును. వీరుకృతార్థులైనపుడు సుఖముగనధికముగు నుపకారముచేయఁగలరు. కావునఁ దద్విరుద్ధుల ననుగ్రహింపరాదు.

అరివిజిగీషులిరువురకు నొక్కఁడేమిత్రుఁడైనపుడు వీరిరువురిలో నెవరియందతనికధికమగు మైత్రిగలదో యతఁడతనినను గ్రహించి లాభమునుపొందును. లోకములో నాత్మవృద్ధిఁబొందుటమిత్రుని మూలముననేగదా! అట్లనుగ్రహింపఁబడనివాఁడు క్షయవ్యయప్రవాసపరోపకారములఁబొంది కృతార్థుఁడగు శత్రువునకు మఱింతవిరోధియగును.

మధ్యముననుగ్రహింపవలసివచ్చినపుడు మిత్రుఁడును మిత్రతరుఁడునునగు మధ్యముననుగ్రహించి శత్రువును మోసపెట్టవలెను మిత్రునివలననేగదా యాత్మవృద్ధి యగుట. ఇతరుఁడన్ననో క్షయవ్యయప్రవాసపరోపకారములఁ బొందును. అనుగృహీతుఁడగు మధ్యముఁడు విగుణుఁడయినచో శత్రువునకధికలాభము కలుగును. అట్టిమధ్యము ననుగ్రహించినవాఁడు కృతప్రయాసుఁడయినను తనకార్యమ్మును చక్కఁబెట్టుకొనలేకపోవుట యేగాక ఏకార్థోపగతమగు నష్టమును పొందును.

ఉదాసీనుననుగ్రహించుటలోఁగూడ నిట్లేయని తెలిసికొనునది

మధ్యమోదాసీనులకు సైన్యసహాయము చేయవలసివచ్చినపుడు శూరులు కృతాస్త్రులు దుఃఖసహులు అనురక్తులునగు సైన్య

మునిచ్చువాఁడు మోసపోవును. తద్విరుద్ధసేననిచ్చువాఁడు మోసపెట్టుటకు శక్తుఁడగును.

ఎవనిసైన్యము తనవలనఁబ్రతీహాశమగునో, ఎవనివలన స్వకార్యము స్వార్థములు సాధింపఁబడునో వానికి నలబ్ధదేశకాలమగు మహాలభృతశ్రేణీమిత్రాటవీ బలములలో నొకటగు సైన్యమునుకాని వ్యసహితదేశకాలములుగల యమిత్రాటవీ బలమునుకాని యియ్యవలెను.

కృతార్థుఁడైన నామిత్రుఁడు నాసైన్యమును గ్రహింపవచ్చును; అట్లుతీసికొన దాని నమిత్రాటవ్యభూమ్యకాలములందుంచి క్షుదకఫలముగఁ జేయునని తోఁచినపుడు దండవ్యాసంగమును మిషపెట్టి మఱియొకవిధముగ మిత్రునిగ్రహింపవలెను. అవశ్యముగ సైన్యమునిచ్చి యనుగ్రహింపఁదగినవాఁడైనచో దత్కాలసహమగు సైన్యమునిచ్చి యుద్ధసమాప్తిపర్యంతము దానినచటనుంచి దానిచే యుద్ధముచేయించి దానినివ్యసనములనుండిరక్షింపవలెను. కార్యము ముగిసినపిమ్మట సాపదేశముగ మఱలఁదనసైన్యమును తీసికొనవలెను లేక దూష్యామిత్రాటవీసైన్యమును వీనికిచ్చికాని యాతవ్యునితో సంధిచేసికొనికాని మిత్రుని మోసపెట్టవలెను.

సమహీనవిశిష్టులగువారికి సమలాభము గలుగుటయే సంధి. విషమలాభముగలుగుటయే విక్రమము. సంధివిక్రమములనఁగివియే.

ఇది షాడ్గుణ్యమందు యాతవ్యవృత్తి అనుగ్రాహ్యమిత్రవిశేషములను రెండవది యధ్యాయము
ఆదినుండి నూటయాఱవ యధ్యాయము.



116 ప్రకరణము.

మిత్రసంధి: హిరణ్యసంధి

సంహితయానమువలనఁగలుగు మిత్రహిరణ్యభూ లాభములలో

నుత్తరోత్తరముగనివి శ్రేయస్కరములు. భూలాభమువలన మిత్ర హిరణ్యములను సంపాదింపవచ్చును. మిత్రహిరణ్యలాభములనుండి సిద్ధించులాభము తక్కినవానిని సాధింపఁగలదు.

నీకును నాకును మిత్రుఁడు లభింపఁగలఁడనువిధముగఁ జేసికొనునది సమసంధి. సంహితయానములో నొకనికిమిత్రుఁడును మఱియొకని కమిత్రుఁడును లభించినచో నది విషమసంధి. వారిద్దఱిలో నొకనికంటె మఱియొకని కెక్కువలాభము కలుగుట అతిసంధి.

సమసంధిలో సంపన్నమిత్రునిఁ బొందువాఁడును, కష్టములో నున్నమిత్రునికి సహాయముచేయువాఁడును నెక్కుడు లాభమొందును. ఆపత్సహాయము సౌహార్దస్థిరత్వమును పుట్టించునుకదా?

ఆపదలోనున్న మిత్రులలో నిత్యుఁడు నవశ్యుఁడగువానికా? లేక అనిత్యుఁడు వశ్యుఁడగువానికా? సహాయముచేయుట అవశ్యుఁడయినను నిత్యునికిఁజేయుటయే శ్రేయము. అట్టివాని కుపకారము చేయకున్నను నపకారముచేయఁడని యాచార్యులు. అట్లుకాదు, అనిత్యుఁడయినను వశ్యుఁడగువానికిఁ జేయుటయే శ్రేయము. ఉపకారమే మిత్రలక్షణము. ఎంతకాలము సహాయము చేయుచుండునో అంతకాలమతఁడు మిత్రుఁడుగనుండునని కౌటిల్యుఁడు.

వశ్యులగు నిద్దఱిలో మహాభోగుఁడగు ననిత్యునా? లేక అల్పభోగుఁడగు నిత్యునా సంగ్రహించుట? మహాభోగుఁడగు ననిత్యుని సంగ్రహించుటయే శ్రేయము మహాభోగుఁడగువాఁ డనిత్యుఁడైనను స్వల్పకాలముననే గొప్పయుపకారముచేయుచు గొప్పవ్యయస్థానములఁ బ్రతీకరించునని యాచార్యులు. అట్లుకాదు, అల్పభోగుఁడయినను నిత్యుఁడే శ్రేయస్కరుఁడు. అనిత్యుఁడగుమహాభోగి యుపకారముచేయవలసివచ్చునని మైత్రినుండి తొలఁగును, లేక యుపకారముచేసినను ప్రత్యుపకారము గోరుచుండును. నిత్యుఁడగు నల్పభోగియన్ననో నిడువక కొంచెముకొంచె ముపకరించుచుఁ గాలక్రమమున గొప్పయుపకారము చేయఁగలుగునని కౌటిల్యుఁడు.

గురుప్రియత్న సిద్ధుఁడగు గొప్పమిత్రుఁడా ? లేక అల్పప్రియత్న సిద్ధుఁడగు నల్పుఁడా సంపాదనీయుఁడు ? మహామిత్రుఁడగువాఁడు గురుప్రియత్నసిద్ధుఁడయినను ప్రకాశకరుఁడగుటచే నతఁడు సిద్ధించినక్షణముననే కార్యముకూడ సాధ్యమగును, కావున నట్టివాఁడే శ్రేయస్కరుఁడని యాచార్యులు. అట్లుకాదు, సులభసిద్ధుఁడగువాఁడల్పుఁడయినను కార్యకాలాతిపాతము గలిగింపక దుర్బలుఁడగుటవలన యథేష్టభోగ్యుఁడగును. అధికుఁడగు నితరుఁడట్టివాఁడుకాఁజాలఁడు. కనుక లఘుసముత్థితుఁడగునల్పుఁడే శ్రేష్ఠుఁడని కౌటిల్యుఁడు.

విక్షిప్తసైన్యముగలవాఁడా ? అవశ్యసైన్యముగలవాఁడా సంపాదనీయుఁడు ? వశ్యమైనదగుసైన్యమువిక్షిప్తమైనను ప్రతిసంహరించుటకు శక్యమైనదిగావున విక్షిప్తసైన్యముగలవాఁడే మంచివాఁడని యాచార్యులు. అట్లుకాదు. అవశ్యమైనను సామాదులచే వశపడునుకావున నవశ్యసైన్యమే మంచిది. విక్షిప్తమగునది కార్యవ్యాసక్తమై ప్రతిసంహరింప శక్యముకాదని కౌటిల్యుఁడు.

పురుషభోగియగుమిత్రుఁడా లేక హిరణ్యభోగియగుమిత్రుఁడా లెస్స ? పురుషభోగియగువాఁడే శ్రేయస్కరుఁడు. అట్టివాఁడు ప్రతాపకరుఁడై పూనినకార్యమునుసాధింపఁగలఁడని యాచార్యులు. అట్లుకాదు. హిరణ్యభోగియగు మిత్రుఁడే లెస్స. ఏలనఁగాఁ దఱుచుగ హిరణ్యమేయవసరమై యుండునుకాని సైన్యమెప్పుడో యొకప్పుడుమాత్రము కావలసియుండును. మఱియు హిరణ్యమూలమున సైన్యమేగాక యితరకామములుకూడ లభించునని కౌటిల్యుఁడు.

హిరణ్యభోగియా లేక భూమిభోగియా లెస్స ? హిరణ్యభోగి సర్వవ్యయప్రతీకార సమర్థుఁడుగాన నతఁడేలెస్సయని యాచార్యులు. అట్లుకాదు. మిత్రహిరణ్యములు భూమిలాభమువలనఁ గలుగుచున్నవని యిదివఱకే చెప్పఁబడెను. కావున భూమిభోగియే లెస్సని కౌటిల్యుఁడు.

పురుషభోగములో సమానులగు మిత్రులలోఁగూడ విక్రమ

షము, క్లేశసహాత్వము, అనురాగము, సర్వబలలాభము లోనగువానిం బట్టి మిత్రకులములో భేదములుండును. (శ్లో) సమానులగు హిరణ్యభోగులలోఁ బ్రార్థితార్థత ప్రాభూత్యము అల్పప్రయాసము సాత్త్వము లోనగువానింబట్టి భేదములేర్పడును. వీనినిగుఱించి యిట్లుచెప్పఁబడియున్నది:—

నిత్యత వశ్యత లఘుసముత్థానత వంశపరంపరాగతత్వము మహత్త్వము అద్వైతము లోనగు నాఱుగుణములు సంపన్నమిత్రుని లక్షణములు.

ధనసంబంధములేక కేవలప్రేమచేఁ బరస్పరమొకరినొకరు రక్షించుకొనుచుఁ బూర్వోపచిత సంబంధమును మఱువని మిత్రులు నిత్యులు.

సర్వవిధములఁగ భోగ్యుఁడగువశ్యుఁడు ఏకతోభోగియనియు ఉభయతోభోగియనియు సర్వతోభోగియనియు మూఁడువిధములుగ నుండును.

సహాయమును పొందునపుడును సహాయము నిచ్చునపుడును శత్రుహింసచేయుచునే జీవించుచు దుర్గాటవ్యపసారులఁ గలవాఁడవశ్యుఁడగు నిత్యమిత్రుఁడు.

ఇతరునివలన విగ్రహింపఁబడియు నల్పవ్యసనియయ్యు నుపకారముకొఱకు సంధిచేసికొనువాఁడు వశ్యుఁడగు ననిత్యమిత్రుఁడు.

తుల్యప్రయోజనముగలట్టియు నుపకారియు నవికారియు మిత్రభావియునగు మిత్రుఁడాపత్తునందుసహిత మద్వైధ్యుఁడగును.

(తనయందు మాత్రము) మిత్రభావముగలవాఁడు ధ్రువమిత్రుఁడు, శత్రువునందుఁగూడ మైత్రిగలవాఁడు చలమిత్రుఁడు ఇద్దఱిలో నొక్కనివిషయములోఁగూడ నౌదాసీన్యమొందనివాఁడుభయభావి.

విజిగీషుశత్రునకు మిత్రుఁడగువాఁడును ఉభయపక్షములనవలంబించిన వాఁడును ఉపకారనివిష్టుఁడయినను శక్తుఁడయినను

అనుపకారియే.

పరప్రీతుని శత్రుప్రీతుని శత్రుప్రాజ్యుని శత్రుసంబంధి ననుగ్రహించుమిత్రుఁడు శత్రుసాధారణుఁడు.

ప్రకృష్టుఁడును సంతుష్టుఁడును బలవంతుఁడును నగుమిత్రుఁడలసుఁడయినచోఁ దాను వ్యసనావమానితుఁడయిననుతఁ డుదాసీనుఁడుగనే యుండును.

దౌర్బల్యమువలన నరివిజిగీషువుల నిరువురివృద్ధిని ననుసరించుచు నుభయులకు విద్విష్టుఁడుగానివాఁ డుభయవాది.

కారణముండియు లేకయు నాపదనొందుచుండునట్టియుఁ గారణముండియు లేకయుఁ దన్నుఁ బొందుచుండునట్టియు మిత్రునుపేక్షించినవాఁడు స్వనాశమెఱుంగఁడు.

శీఘ్రకాలమునలభించు నల్పలాభమునుకోరవలెనా లేక చిరకాలమునకులభించు మహాలాభమునుకోరవలెనా? దేశకాలకార్యాతిపాతముగాక అచిరకాలములో లభించునట్టిదే మంచిదని యాచార్యులు. అట్లుకాదు. ఎన్నటికిని నాశములేక బీజతుల్యమైనచో మహాలాభమే శ్రేయస్కరము. తద్విపరీతమైనచో నల్పలాభమే మంచిదని కౌటిల్యుఁడు.

పైరీతిగ స్థితిలాభమంతమును లాభాంశమంతమును గుణోదయమునుకనిపెట్టి స్వార్థసిద్ధిపరుఁడై సామవాయికులతోఁ గలిసి యానము చేయవలెను

ఇది షాడ్గుణ్యమందు మిత్రహిరణ్యభూమికర్మసంధులలో
మిత్రసంధి హిరణ్యసంధులను
తొమ్మిదవ అధ్యాయము.

ఆదినుండి నూటపదునాల్గవ అధ్యాయము.



## 116 ప్రకరణము

### భూమిసంధి

నీవును నేనునుకలిసి భూమినిసంపాదింతమని చేసికొనుసంధి భూమిసంధి.

సంధిచేసికొనునట్టివారిలో నెవఁడు ఫలసంపన్నమగు భూమిని పొందునో వాఁడితరునికంటె నెక్కువలాభమును పొందినవాఁడగును భూలాభముసమానమైనను బలవంతునోడించి భూమిని సంపాదించిన వాఁడధికుఁడగును; ఏలననఁగనతఁడు భూలాభమునేగాక శత్రుకర్శనముగావించి స్వప్రతాపాధిక్యమునుకూడఁ బొందుచున్నాఁడు. దుర్బలునినుండి భూలాభమొందుటగూడ మంచిదేగాని యదిగూడ దుర్బలమై యుండుటేగాక దానిసమీపమందలి సామంతుఁడమిత్రభావమొందును.

యాతవ్యులగు శత్రువులు సమానబలులైయినను వారిలోస్థిరశత్రువుఁ బెల్లగించి వానిభూమిని వశపఱచుకొనువాఁడధికుఁడగును. ఏలనఁగా దుర్గావాప్తి స్వభూమిరక్షణమునేగాక అమిత్రాటవికప్రతిషేధమునుకూడఁ జేయునుకదా ?

చలామిత్రునినుండి భూమిలాభమును పొందినప్పుడది దుర్బలసామంతమైనచో శీఘ్రయోగక్షేమములఁగలిగించును. అట్లు కానిచోఁ గోశదండావచ్ఛేదమై నీచభూమిప్రాప్తియగును.

సంపన్నమై నిత్యామిత్రుఁడుగలభూమియా ? లేక మందగుణమై యనిత్యామిత్రుఁడుగల భూమియామంచిది ? సంపన్నమగునదియే మంచిది. సంపన్నమగునది కోశదండములనిచ్చును. వానిమూలమున శత్రుప్రతిఘాతమగునని యాచార్యులు. అట్లుకాదు. నిత్యామిత్రమగుభూమివలన శత్రువులధికమగుదురు. ఉపకారముచేసినను నపకారముచేసినను నిత్యశత్రువు శత్రుభావమును విడువఁడు. అనిత్యశత్రువట్లుగాక ఉపకారముచేయుటచేతను నపకారముచేయక పోవుటచేతను శమించి యూరకుండును. పెక్కుదుర్గములు చోరగణ

గాలు మ్లేచ్ఛాటవిక జనములతోఁగూడిన ప్రత్యంత దేశముగలదియే నిత్యామిత్రభూమి. అట్లుకానిదనిత్యామిత్రభూమియని కౌటిల్యుఁడు.

సమీపమందుండు నల్పభూమియా? దూరమందుండు నధిక భూమియా మంచిది? సమీపమందుండు నల్పభూమియే మంచిది. దానిని సంపాదించుటయుఁ బాలించుటయు రక్షించుటయు సులభము. వ్యవహితభూమి యట్టిది కాదు.

వ్యవహితావ్యవహిత భూములలో దండధారణభూమియా? ఆత్మధారణభూమియా మంచిది? ఆత్మధారణమగునదియే శ్రేయస్కరము. అట్టిదానిని దానినుండివచ్చిన కోశదండములచే రక్షింపనగును. దండస్థానమగు దండధారణభూమి యట్టిదికాదు

బాలిశునినుండియా ప్రాజ్ఞునినుండియా భూలాభము మంచిది? బాలిశునినుండి వచ్చినభూమియే మంచిది. దానినిసంపాదించుటయుఁ బాలించుటయు సులభము; అది శత్రువులవలనఁ బడసికొనఁబడదు. ప్రాజ్ఞునినుండి లభించినది తదనురక్తయగుటచే నిట్టిది కాదు.

పీడనీయోచ్ఛేదనీయులగు శత్రువులలో నుచ్ఛేదనీయులనుండి లభించినభూమి మంచిది. ఉచ్ఛేదనీయుఁడనపాశ్రయుఁడును దుర్బలాశ్రయుఁడును నగుటచే నభియోగకాలమునఁ గోశదండముల సంగ్రహించుకొని తొలఁగిపోవును; ప్రకృతులుకూడ వానిఁద్యజింతురు. దుర్గమిత్రప్రతిస్తబ్ధుఁడగుటచేఁ బీడనీయుఁడట్లు సులభసాధ్యుఁడు కాఁడు.

దుర్గప్రతిస్తబ్ధులగు స్థలనదీదుర్గీయులలో స్థలదుర్గీయునినుండి భూమినిసంపాదించుట మంచిది. స్థలదుర్గము సులభముగ నరికట్టుటకును నాశముచేయుటకును నాక్రమించుటకును వీలై శత్రువుతోఁగూడ లభించును. నదీదుర్గమందో శత్రువునకువలయు నుదకమును జీవనాధారమును నిచ్చుచు విజిగీషునకు ద్విగుణక్లేశకరమై యుం

నదీపర్వతదుర్గీయ శత్రువులలో నదీదుర్గీయునుండి భూమిలాభము శ్రేయస్కరము. ఏనుఁగులు స్తంభములు సేతుబంధములు నావలు మొదలగువానిచే నదీదుర్గమును సాధింపవచ్చును. మఱియు నది యెల్లప్పుడు లోతుగనుండదు; దానిలోని యుదకమును మఱలింపవచ్చును. పర్వతదుర్గమన్ననో స్వరక్షగలిగి దురవరోధమై ఆరోహింపశక్యముగాక ఒకవైపు భగ్నమైనను నంతయుఁగొట్టఁబడక శత్రువులు శిలావృక్షములు త్రోయుటకవకాశము కలిగించును.

నిమ్నస్థలయోధులలో నిమ్నయోధులనుండి లభించినభూమి మంచిది. నిమ్నయోధులు పరుద్ధదేశకాలు లగుదురు. స్థలయోధులు సర్వదేశకాలములందు యుద్ధముచేయఁగలిగి యుందురు.

ఖనకాకాశయోధులలో ఖనకులనుండి భూమిలాభము మంచిది. ఖనకులు ఖాతశస్త్రములు రెండిటితోడ యుద్ధముచేయుదురు. ఆకాశయోధులు శస్త్రముచేతమాత్రము యుద్ధముచేయుదురు.

అర్థశాస్త్రవేత్తయై పైఁజెప్పినవారినుండి భూమినివశముచేసికొనినవాఁడు సంహితులకంటెను శత్రులకంటెను నాధిక్యముపొందును.

ఇది షాడ్గుణ్యమందు మిత్రహిరణ్యభూమికర్మసంధులలో

భూమిసంధియను

పదియవ యధ్యాయము.

ఆదినుండి నూటయెనిమిదవ యధ్యాయము.



## 116 ప్రకరణము.

### అనవసితసంధి

నీవును నేనును కలిసి శూన్యస్థలము నాక్రమింతమని చేసికొను సంధి అనవసితసంధి. అట్లుచేసికొనినవారిరువురిలో నెవఁడుపస్థితార్థుఁడై సారవత్తరమగు భూమినాక్రమించునో వాఁడధికుఁడగును.

అట్టిశూన్యభూములలో స్థలమా ఔదకమా శ్రేష్ఠము ? గొప్పబయలు ప్రదేశముకంటె నల్పమగు నౌదకప్రదేశము శ్రేయస్కరము. ఏలనఁగా నది ఫలసాతత్యము గలిగియుండును. స్థలప్రదేశములలోఁగూడ నధికమగు పూర్వాపరసస్యముల ఫలించునదియు నల్పవర్షముచేతనే ఫలించునదియు నల్పప్రయత్నమువలననే ఫలము నిచ్చునదియు శ్రేయస్కరము. ఔదకభూములలో నధాన్యవాపములకంటె ధాన్యవాపములు మంచివి. వానిలో ధాన్యములుఫలించు స్వల్పభూమికంటె ధాన్యేతరములు ఫలించు మహాభూమియే శ్రేయస్కరము. ఎక్కువవైశాల్యముగల భూమియుండినచో స్థాల్యానూప్యౌషధుల ఫలింపఁజేయుట కవకాశముండుటయేగాక దుర్గాదికర్మలనుకూడ నధికముగఁ జేయింపవచ్చును. భూమి గుణములు కృత్రిమములు (మనుష్యప్రయత్నసిద్ధములు) కదా ?

ఖనిభోగ ధాన్యభోగ భూములలో ఖనిభోగము కోశకరమగును. ధాన్యభోగము కోశకరమేగాక కోష్ఠాగారకరముగూడ నగును. ఇదిగాక దుర్గాదికర్మలు ధాన్యమూలములు. అయినప్పటికిని గొప్పదేశములను సంపాదించుటకు హేతువగుఖనిభోగమే శ్రేయస్కరము.

ద్రవ్యవన హస్తివనములలో ద్రవ్యవనము సర్వకర్మసాధకమును, ప్రభూతనిధానక్షమమును నగును. హస్తివనమట్టిది కాదని యాచార్యులు. అట్లుకాదు. ద్రవ్యవనముల నెన్నిటినయిన నెక్కడనయిన నాటింపవచ్చునుకాని హస్తివనమునట్లు చేయుటకు వీలులేదు. మఱియు శత్రుసైన్యవధ హస్తిప్రధానమై యున్నదని కౌటిల్యుఁడు.

వారిపథ స్థలపథ భూములలో వారిపథమనిత్యమగుటచేత స్థలపథము నిత్యమగుటచేతను స్థలపథభూమియే మంచిది.

భిన్నమనుష్యమగుభూమియా లేక శ్రేణీమనుష్యమగు భూమియా మంచిది ? భిన్నమనుష్యమే శ్రేయస్కరము. భిన్నమనుష్యులు రాజునకు భోగ్యులుగ నుందురు; శత్రువుల యుపజాపమును

సహింపరు. శ్రేణీమనుష్యులిట్లుగాక అనాపత్సహులై కోపమువచ్చినపుడు మహాద్రోహము చేయుచుందురు.

చాతుర్వర్ణ్యాభినివేశమగు భూములలో సర్వభోగసహత్వము బాహుళ్యము ధ్రువత్వము గలిగియుండునదిగావున అవరవర్ణప్రాయమగునదియే శ్రేయస్కరము.

కర్షణవతియగు భూమికంటెఁ గృష్యయగుభూమి శ్రేయస్కరము. ఏలనఁగా నిదియన్యములగు నారంభములకుఁగూడఁ బ్రయోజనకారియగును. గోరక్షవతియుఁ బణ్యనిచయములను కలిగినట్టియు ఋణములనిచ్చుటకు శక్తిగలిగినట్టియు వర్తకులుగలభూమి మఱింత శ్రేయస్కరము.

దుర్గాధారమగుభూమియా పురుషాధారమగుభూమియా మంచిది? పురుషాధారమగునదియే శ్రేయస్కరము. రాజ్యము పురుషమూలముగదా? పురుషహీనయగునది వంధ్యయగు పశువువలె నేమిచ్చును?

మహాక్షయవ్యయములఁ బొందించి వానినుండి భూమినిమరల సంపాదింపఁదలఁచినప్పుడాభూమిని మొదటనే దుర్బలుఁడు అరాజబీజి నిరుత్సాహుఁడు అపక్షుఁడు అన్యాయవృత్తి వ్యసని దైవప్రమాణుఁడు యత్కించిత్కారుఁడు నగువానినిఁజూచి వానికి విక్రయింపవలెను. మహాక్షయవ్యయములుగల భూమియందు దుర్బలుఁడగు నరాజబీజి కొంతకాలముండియు సంబంధులగు ప్రకృతులతోఁగూడ క్షయవ్యయములఁబొంది నశించును. అరాజబీజి బలవంతుఁడయినను క్షయభయముచే నసగంధులగు ప్రకృతులచే విడువఁబడును. సైన్యసమేతుఁడయినను నిరుత్సాహుఁడగువాఁడు సైన్యమునుబాగుగనుపయోగింపక దానికి క్షయవ్యయములఁ గలిగించును. అపక్షుఁడు కోశవంతుఁడయినను క్షయవ్యయానుగ్రహహీనుఁడగుటచే దేనిని సంపాదింపలేఁడు. నివిష్టుఁడయినవాఁడు సహితమన్యాయవృత్తియైనచో వానిని సులభముగఁ దొలఁగింపవచ్చును. అనివిష్టునిమాట చెప్పనేల?

కర్మసంధి. అట్లు చేసికొనినవారి కవ్వరిలో నెవఁడు దైవకృతమును నవిషహ్యమును నల్పవ్యయారంభమును నగు దుర్గమును నిర్మించుకొనునో వాఁడితరునికంటె నధికుఁడగును. ఇట్టి స్థలనదీపర్వతదుర్గములలో నుత్తరోత్తరము శ్రేయస్కరము.

సేతుబంధములలో నాహార్యోదకముకంటె సోదకమగునది మంచిది. సోదకములలోఁగూడ నెక్కుడుభూమిని సాగుచేయఁగలది శ్రేష్ఠము.

ద్రవ్యవనములలోఁగూడ గొప్పదియు సారవత్తరమగు నదియు నాటవికద్రవ్యముగలదియు నదీమాతృకమయినదియునగు ద్రవ్యవనమును విషయాంతమున నాటించువాఁడధికుఁడు. నదీమాతృకమగునది స్వాజీవమై యాపత్కాలమందుపయోగించును.

హస్తిమృగవనములలో మిక్కిలి శూరమృగములఁ గలిగినట్టియుఁ బొరుగున దుర్బలులఁగలిగినట్టియు వారికిఁ జొరశక్యముగానట్టియు హస్తివనమును విషయాంతమునఁ గలిగినట్టివాఁడధికుఁడు.

కుంతులనేకులుండునట్టి దేశముకంటె నల్పసంఖ్యగల శూరులుండు దేశము శ్రేయస్కరము. శూరులేగదా యుద్ధముచేయువారు! మఱియు నల్పసంఖ్యాకులగుశూరు లశూరులగువారి ననేకులను ఛేదింపఁగలరు. ఛేదింపఁబడినవీరు స్వసైన్యావఘాతులగుదురని యాచార్యులు. అట్లుకాదు; కుంతులయినను నధికసంఖ్య గలవారుండుటయే మేలు. వీరు వ్యూహాదులలోననేకములగు కర్మలుచేయుటయందుపయోగించుచు యుద్ధముచేయుచుండు తమవారికి సహాయులు కాఁగలరు. మఱియుశత్రులకు దుర్ధర్షులును భయంకరులునగుదురు. కుంతుల కెల్లయును శౌర్యము గలిగింపవచ్చునుగాని (అల్పసంఖ్యగల) శూరులకు బహుత్వముసంపాదించుట దుర్ఘటమని కౌటిల్యుఁడు.

గనులలోఁ బ్రభూతసారమును సులభమార్గమును నల్పవ్యయారంభమును నగుఖనిఁ ద్రవ్వించువాఁ డధికుఁడగును. వీనిలో నల్పసంఖ్యాకములగు మహాసారములా బహుసంఖ్యాకములగు నల్ప

సారములా శ్రేష్ఠములు? వజ్రమణిముక్తాప్రవాళ హేమరూప్యధాతువులు మిక్కిలి విలువగలవగుటచే నల్పసారములగు వస్తువులనేకములను సంపాదింపఁగలవు. (కావున నల్పసంఖ్యాకములగు మహాసారములే శ్రేష్ఠములు.) అనియాచార్యులు. అట్లుకాదు. చిరకాలమున కయినను మహాసారములలోఁ గొంచెముభాగమునయిన నెవ్వాఁడుగాని గలిగియుండరు. అల్పసారముల నెల్లప్పుడనేకులు కొనుచుందురని కౌటిల్యుఁడు.

వణిక్పథముల విషయమునఁగూడ నిశ్లేయనియెఱుంగునది.

వారిపథస్థలపథములలో నల్పములగు వ్యయవ్యాయామములను ప్రభూత పణ్యోదయమును కల వారిపథమే శ్రేయస్కరమని యాచార్యులు. అట్లుకాదు. వారిపథము సంరుద్ధగతియు నసార్వకాలికము నధికభయహేతువు దుష్ప్రతీకారము నగుటచే నిట్టిబాధలులేని స్థలపథమే శ్రేయస్కరమని కౌటిల్యుఁడు. వారిపథములగు కూల (సముద్రతీర) సంయాన (సముద్రమధ్యమందలి) పథములలో కూలపథము పణ్యపట్టణబాహుళ్యముగలదగుటచే శ్రేయస్కరము. పెక్కుబాధలు లేకుండుటచేతను సతతగమనానుకూల మగుటచేతను నదీపథముకూడ శ్రేష్ఠమే.

స్థలపథములలో సారవత్తరములగు హస్త్యశ్వగంధదంతాజినరూప్యసువర్ణపణ్యములు గలదియగు హైమవతము దక్షిణాపథముకంటె శ్రేయస్కరమని యాచార్యులు. అట్లుకాదు. కంబళాజినాశ్వపణ్యములుతప్పఁ దక్కినశంఖవజ్రమణి ముక్తాసువర్ణపణ్యములన్నియు నధికముగ దొరకుటచే దక్షిణాపథమే మంచిదని కౌటిల్యుఁడు. దక్షిణాపథమందుసహిత మెక్కువగనులును సారపణ్యములును, ప్రసిద్ధగతియు నల్పవ్యాయామమునుకల వణిక్పథము, ఫల్గుపణ్యములుగలిగి అనేకదేశములమీఁదుగ వెళ్లువణిక్పథము మంచివి.

దీనినిబట్టి పూర్వపశ్చిమవణిక్పథముల విషయమునఁగూడ నిశ్లేయమని యెఱుంగునది.

వణిక్పథములలోఁ జలపథము విపులారంభముగలదగుటచే బాదపథముకంటె శ్రేయస్కరము. దేశకాలవివక్షలేక ఉపయోగింపఁదగిన ఖరోష్ట్రపథముగూడ మంచిదే. అంసపథవిషయమును దీని నిపట్టి యెఱుంగునది.

నేతకుఁ బరకర్మోదయము క్షయము, తద్విపరీతము వృద్ధి. శత్రువులతోఁ దుల్యముగఫలముఁ బొందుట స్థానము. దీనినంతయు వి జిగీషు వెఱుంగవలెను.

అల్పాయము నతివ్యయమునుగలది క్షయము. తద్విపరీతము వృద్ధి. సమమైన నాయవ్యయములుగలది స్థానము. స్వకర్మలలో వీనినన్నిటిఁ దెలిసికొనవలెను.

కావున దుర్గాదికర్మలందల్పవ్యయారంభమును మహోదయమునుకలిగిన కార్యములు ప్రారంభించి విశిష్టుఁడగును. కర్మసంధు లీరీతిగనుండునని యెఱుఁగునది.

ఇది షాడ్గుణ్యమందు మిత్రహిరణ్యభూమికర్మసంధులలో కర్మసంధియను పండ్రెండవయధ్యాయము.

ఆదినుండి నూటపదియవ యధ్యాయము.



## 117 ప్రకరణము.

### పార్ష్ణిగ్రాహచింత

అరివిజిగీషులిద్దరు పరాభియోగులగు వారిశత్రువులకుఁ బార్ష్ణిగ్రాహులగునపుడు శక్తిసంపన్నునకుఁ బార్ష్ణిగ్రాహుఁడగువాడెక్కువలాభముఁ బొందును. ఏలనఁగా శక్తిసంపన్నుఁడైనటులు తను శత్రువును సాధించికాని పార్ష్ణిగ్రాహునివైపు చూడఁడు; హీనశక్తియగు వాఁడట్లుకాడు.

సమానమగు శక్తిగలవారిలో విపులారంభుని పార్ష్ణిని గ్రహించువాఁడెక్కువ లాభముఁబొందును. ఏలనఁగా విపులారంభుఁడు (ఎదుటనుండు) శత్రువునోడింపక పార్ష్ణిగ్రాహునివైపు చూడఁడు. సక్తచక్రుఁడగు నల్పారంభుఁడట్లుగాదు.

సమానారంభముగలవారిలో సర్వసందోహ ప్రయాతుఁడగువాని పార్ష్ణిని గ్రహించువాఁడెక్కువ లాభమొందును. ఏలనఁగా సర్వసందోహప్రయాతుఁడు శూన్యమూలుఁడగుటచే జయింప సులభుఁడగును; ఏకదేశబలప్రయాతుఁడన్నచో పార్ష్ణిప్రతివిధానము చేసికొనును. కావున సులభసాధ్యుఁడు కాఁజాలఁడు.

సమబలముగలవారిలోఁ జలామిత్రప్రయాతునియొక్క పార్ష్ణినిగ్రహించువాఁడెక్కువలాభమొందును. ఏలనఁగాఁ జలామిత్రప్రయాతుఁడు శత్రునిసుఖముగ వశపఱచుకొనినఁగాని పార్ష్ణిగ్రాహునిపైఁబడఁడు. స్థితామిత్రప్రయాతుఁడన్నచో దుర్గప్రతిహతుఁడై స్థితామిత్రునిచేఁ బట్టుకొనఁబడి పార్ష్ణిగ్రాహునిపైఁబడును.

తక్కిన శత్రువులవిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

శత్రువులు సమానులైనప్పుడు ధార్మికుఁడగు రాజుపై వెళ్లువానియొక్క పార్ష్ణినిగ్రహించువాఁడెక్కువలాభమొందును. ఏలనఁగా ధార్మికాభియోగి స్వజనమునకు సహితము ద్వేష్యుఁడగును; అధార్మికాభియోగి ప్రజలకు సంప్రియుఁడుగ నుండును.

మూలహరతాదాత్వికకదర్యాభియోగుల పార్ష్ణిగ్రహణవిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది. మిత్రాభియోగుల పార్ష్ణిగ్రహణమందుఁగూడ నిట్లే

మిత్రామిత్రులపై నభియోగముచేసినవారిలో మిత్రాభియోగియొక్క పార్ష్ణినిగ్రహించువాఁడెక్కువలాభమొందును ఏలనఁగా మిత్రాభియోగి సుఖముగ సంధిచేసికొనినఁగాని పార్ష్ణిగ్రాహునిపైఁబడఁడు. మిత్రునితో సంధి సుకరమగునట్లమిత్రునితోఁ గాదుగదా!

మిత్రామిత్రులను వెల్లగించుచుండువారిలో మిత్రోద్ధారి యొక్క పార్ష్ణి నిగ్రహించువాఁడధికుఁడగును. అమిత్రోద్ధారి వృద్ధమిత్రుఁడై పార్ష్ణిగ్రాహుని పైఁబడును. స్వపక్షోపఘాతియగు నితరుఁడట్లు చేయఁడు.

అలబ్ధలాభావగమనము చేయువారిద్దరిలో నెవని శత్రువు మహాలాభవియుక్తుఁడై క్షయవ్యయాధిక మొందునో వాఁడు పార్ష్ణిగ్రాహుఁడై యెక్కువలాభ మొందును. లబ్ధలాభావగమనమం దెవని శత్రువు లాభవియుక్తుఁడును శక్తిహీనుఁడునునగునో వాఁడధికుఁడగును.

ఏ పార్ష్ణిగ్రాహుని శత్రుయాతవ్యుఁడు నిగ్రహాపకారసమర్థుఁడో, పార్ష్ణిగ్రాహులలో నెవఁడు శక్త్యారంభబలోపాదానములచేన ధికుఁడై స్థితశత్రువుగను పార్శ్వస్థాయిగను నుండునో వాఁడెక్కువ లాభ మొందును. పార్శ్వస్థాయి యాతవ్యాభిసారుఁడును మూలాబాధకుఁడును నగును. పశ్చాత్‌స్థాయియగువాఁడు మూలాబాధకుఁడు మాత్రమే యగును.

శత్రుచేష్టలనిరోధించునట్టి పార్ష్ణిగ్రాహులు సామంతునికిఁ బృష్ఠమందుండువారనియు వానిరెండుపార్శ్వములందుండువారనియు మూఁడువిధములుగ నుందురు.

అరివిజిగీషువులకు నడుమనుండు దుర్బలుఁడంతర్ధియనఁబడును. ఇతఁడు దుర్గాటవ్యవసారములు గలవాఁడయినచో బలవంతునికిఁగూడఁ బ్రతిఘాతము గలిగింపఁగలఁడు.

మధ్యముని వశపఱచుకొనఁగోరునట్టియు, వానిపార్ష్ణి నిగ్రహించునట్టియు నరివిజిగీషులలో లబ్ధలాభావగమనవిషయమున మధ్యముని, వానిమిత్రునుండి విడఁదీసి యమిత్రుని మిత్రునిగఁజేసికొను వాఁడు ఎక్కువలాభము గలుగును. సంధేయశత్రుఁ డుపకారము చేయునుకాని మైత్రినుండి తొలఁగిన మిత్రుఁడట్లుచేయఁడు.

ఉదాసీనుని వశపఱచుకొనఁదలఁచినపుడుగూడ నిట్లే యూహ యెఱుంగునది.

పార్ష్ణిగ్రహణాభియానములందు మంత్రియుద్ధమువలన లాభము కలుగును.

వ్యాయామయుద్ధమున క్షయవ్యయములచే [illegible] రుకూడ నష్టమొందుదురు. జయమొందినవాఁడు సహిత[illegible] డకోశుఁడై పరాజితుఁడగునని యాచార్యులు. అట్లుకాదు. గొప్పక్షయవ్యయములు కలిగినను శత్రువినాశము తప్పకచేయఁదగినదని కౌటిల్యుఁడు.

సమానక్షయవ్యయములు సంభవించినపుడైనఁ బెదుటనుండు దూష్యబలమును నాశముగావించి శత్రురహితుఁడై వశ్యబలసహాయముచే వెనుకనుండు శత్రువితో యుద్ధముచేయునో వాఁడెక్కువ లాభమొందును. ఎదుటనుండు దూష్యబలముల జయించినవారిద్దరిలో బహుళతరమును శక్తిమత్తరమునునగు దూష్యబలమును నాశముచేయువాఁడెక్కువ లాభమొందును.

అమిత్రాటవీబలఘాతి విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

పార్ష్ణిగ్రాహాభియోక్తలిద్దరు యాతవ్యులయినపుడు విజిగీషు వీక్రిందివిధముగ నాచరింపవలెను.

విజిగీషునిమిత్రునిపై నభియోగముచేయు శత్రునికిఁ బార్ష్ణిగ్రాహుఁడు నేతయగునుకానఁ బార్ష్ణిగ్రాహాభిసారునిపై నాక్రందుని మొదట విగ్రహింపఁజేసి దానిమూలమునఁ బార్ష్ణిగ్రాహుని నివారింపవలెను. అట్లే యాక్రందాభిసారుని మూలమునఁ బార్ష్ణిగ్రాహాభిసారుని నివారింపవలెను.

ముందుభాగమున నరిమిత్రునితో స్వమిత్రునికి విగ్రహము కలుగఁజేసి మిత్రమిత్రునిమూలమున నరిమిత్రుని నివారింపవలెను.

అభియుక్తుఁడభియోగియొక్క పార్ష్ణిని మిత్రునిమూలమున గ్రహించి, ఆక్రందుని మిత్రమిత్రునిమూలమునఁ బార్ష్ణిగ్రాహినుండి వారింపవలెను.

విజిగీషువీవిధముగఁ బృష్ఠభాగమునను ముందుభాగమునను మిత్రప్రకృతిసంపదతోఁగూడినవాఁడై స్వరక్షణమునకై మండలమునేర్పఱచుకొనవలెను.

మండలమందెల్లప్పుడు గూఢదూతలనునిలుపుచుఁ దానుగూఢుఁడై శత్రులయెడ మిత్రునివలెనటించుచు కాలముఁగొట్టుచుండవలెను. అసంవృతునకధికముగఁ గార్యములు ప్రాప్తించినట్లు పక్షినను సముద్రములోఁ బగిలినయోడవలె నిస్సంశయముగ నశించును.

ఇది షాడ్గుణ్యమందుఁ బార్ష్ణిగ్రాహచింతయను
పదునాఁడవయధ్యాయము.
ఆదినుండి నూటపదునొకండవ యధ్యాయము.



## 118 ప్రకరణము.

### హీనశక్తిపూరణము.

సామవాయికులచే నభియుక్తుఁడగు విజిగీషువు వారిలోఁ బ్రధానుఁడగువానితో నిట్లుపలుకవలెను. "నీతో నేను సంధిచేసికొనెదను. ఇదిగో హిరణ్యము. నేనునీకు మిత్రుఁడను. దీనివలన నీవృద్ధి రెండురెట్లగును. మిత్రులవలెనటించు నీయమిత్రులను నాత్మక్షయముకై వృద్ధినొందించుట తగదు. వీరు వృద్ధినొందినీపై తిరుగఁబడుదురు".

లేక, ఈవిధముగ భేదవాక్యములను పలుకవలెను "అనపకారినగునేను వీరిచే నెట్లభియుక్తుఁడనయితినో యట్లేనీపైఁగూడ వీరు సంహితబలులై అవకాశముగనిపెట్టి నీకువ్యసనములు వచ్చినపుడభియోగముచేయుదురు. బలము చిత్తవికారమును పుట్టించునుకదా? కావున వీరికి విఘాతము గలిగింపుము."

ప్రధాను నీవిధముగ వశపఱచుకొని భేదింపఁబడిన హీనులపై వానినివిక్రమింపఁజేయవలెను; లేక హీనులనుగ్రహించి ప్రధా

నుసిపయికి వారినిపంపవలెను. లేక ఎట్లుతనకు శ్రేయమగునో యట్లు శత్రువులతోఁ బ్రధానునికి వైరముగలిగించి పరస్పరవిరోధులఁ జేయవలెను. లేక ఫలాధిక్యముచేఁ బ్రధానునిభేదపెట్టి వానితోసంధిగావించుకొనవలెను. అటుతర్వాత నుభయవేతనులు ఫలాధిక్యము చూపెట్టుచు సామవాయికులను, మీరుచాలబాగుగఁ గలిసియున్నారని హేళనముచేయవలెను; లేక సామవాయికులలో దుష్టులగువారి మూలమున వారిసంధిని చెఱుపవలెను. పిమ్మట నుభయవేతనులు, మేముచెప్పినట్లేజరిగినదని మఱలమఱల వారిని భేదపెట్టవలెను; లేక భేదమొందినవారిలో నొకనినిపట్టుకొని వానిమూలమునఁ గార్యము నెఱవేర్చుకొనవలెను.

ప్రధానుఁడు లేనప్పుడు సామవాయికులఁ బోత్సాహపఱచువానిఁగాని స్థిరకర్మునిఁగాని అనురక్తప్రకృతి గలవానినికాని భయలోభములవలన సామవాయికులఁ జేరినవానినికాని విజిగీషునుండి భయమొందినవానినికాని రాజ్యముతో సంబంధముకలవానినికాని చలామిత్రునిఁగాని క్రమముగ స్వాధీనముచేసికొనవలెను. పైవారిలో నుత్సాహపఱచువాని నాత్మనిసర్గమూలమునను స్థిరకర్ముని సాంత్వప్రణిపాతముచేతను కన్యాధానయాపనసంబంధములచే ననురక్తప్రకృతిని, అంశద్వైగుణ్యముచే లుబ్ధునిఁ గోశదండానుగ్రహము చేస్వతో భీతునిఁ బ్రతిభూప్రదానముచే రాజ్యప్రతిసంబంధునిఁ ఏకీభావ ప్రాపగమనముచే నుభయమిత్రునిఁ బ్రియహితములచేఁగాని ఉపకారత్యాగముచేఁగాని చలామిత్రుని, అనపకారోపకారములచే నవధృతుని వశపఱచుకొనవలెను. ఆవత్ప్రకరణమునఁ జెప్పఁబడినవిధముగ నెవఁడెట్లువశవడునో అతనినట్లు సామదానభేదదండములచే వశపఱచుకొనవలెను.

వ్యసనోపఘాతత్వరితుఁడగువాఁడు కోశదండములచే దేశకాలకార్యములఁబట్టి స్థిరసంధిని చేసికొనవలెను; ఇదివఱకుఁ జేసికొనిన సంధి నతిక్రమించియుండినయెడల దానికిఁబ్రతీకారము చేసికొనవలె

ను; పక్షహీనుఁడు బంధుమిత్రపక్షమును సంపాదింపవలెను; లేక అవిషహ్యమగు దుర్గమునయిన నిర్మించుకొనవలెను. దుర్గమిత్రప్రతిస్తబ్ధుఁడగువాఁడు తనవారికిని పెరవారికిని పూజ్యుఁడగునుకదా ?

మంత్రిశక్తిహీనుఁడు పండితులను విద్యావృద్ధులను చేర్చుకొనవలెను; అట్లయినచో శ్రేయమునొందును. ప్రభవహీనుఁడు ప్రకృతులయోగక్షేమసిద్ధికై యత్నింపవలెను సర్వకర్మలకు జనపదము హేతువు, దానివలననే ప్రభవముగూడ లభించును. ఆపత్కాలమందుఁదనకును ప్రభవమునకును, దుర్గమే కారణము. సేతుబంధము సస్యహేతువు. సేతువాపములందుఁబడు వర్షలాభము నిత్యానుషక్తమైయుండునుకదా ? వణిక్పథముచే దండ గూఢపురుషాతినయనము శస్త్రవరణయానవాహనక్రియము ప్రవేశనిర్ణయనములు సంభవించుచున్నవిగావున శత్రువులను స్వాధీనముచేసికొనుటకు వణిక్పథమే హేతువు. గనులు సంగ్రామోపకరణములకును ద్రవ్యవనము దుర్గకర్మలకును యానరథములకును హస్తివనము గజములకును వ్రజము గవాశ్వరథోష్ట్రములకును కారణములు.

ఇవి లభింపనప్పుడు బంధుమిత్రకులమునుండి వీనినిసంపాదింపవలెను. లేక శ్రేణీప్రవీరపురుషులను చోరగణాటవికమ్లేచ్ఛజాతులను పరాపకారులగు గూఢపురుషులను యథాలాభముగ సంగ్రహింపవలెను. పరులకును మిత్రులకును ప్రతీకరింపఁదగనట్టి బలవత్తరమగు సాధనమును శత్రులయెడఁ బ్రయోగింపవలెను.

ఈవిధముగఁ బరులనుండి తనకుఁగలిగిన యవగ్రహమును పక్షమంత్రద్రవ్యబలములతోఁగూడినవాఁడైతొలఁగించుకొనవలెను.

ఇది షాడ్గుణ్యమందు హీనశక్తిపూరణమను

పదునాలుగవ యధ్యాయము.

ఆదినుండి నూటపండ్రెండవ యధ్యాయము.



## 119-20 ప్రకరణములు.

### బలవంతునితో విగ్రహించుసమయమున నుపరోధహేతువులు దండోపనతవృత్తము.

బలవంతునిచే నభియుక్తుఁడగు దుర్బలుఁడితరుల మంత్రశక్తికి వశపడని విశిష్టబలునిమఱియొకనినాశ్రయింపవలెను. మంత్రిశక్తులు సమానముగఁగలవారిలో నాయత్తసంపదలఁబట్టియు, వృద్ధసంయోగముఁబట్టియు విశిష్టత్వమును నిర్ణయించుకొనవలెను విశిష్టబలుఁడు దొరకనపుడు బలవంతునితో సమానమగు బలసంఖ్యగల సమబలులతోఁగలిసి (శత్రుని) మంత్రప్రభావశక్తులచే వారు మోసమునుపొందనంతవఱకు వారితోఁగూడ నుండవలెను. ప్రభావశక్తులు సమానముగఁగలవారిలో విపులారంభమునుపట్టి విశేషమును నిర్ణయించుకొనవలెను. సమబలులు దొరకనపుడు శుచిత్వోత్సాహములఁ గలిగినట్టియు శత్రుసేనలనెదుర్కొనఁదగినట్టియు శత్రువుయొక్క మంత్రప్రభావోత్సాహశక్తులకు లోఁబడనట్టి హీనబలులతోఁ గలిసియుండవలెను. తుల్యోత్సాహశక్తిగలవారిలో స్వయుద్ధభూలాభమును పట్టియుఁ దుల్యభూములుగలవారిలో స్వయుద్ధకాలలాభముఁబట్టియు తుల్యదేశకాలములుగలవారిలో యుగ్యశస్త్రావరణములఁబట్టియు విశేషమును నిర్ణయించుకొనవలెను సహాయుఁడేదొరకనపుడు సైన్యముచేనధికుఁడగు శత్రువుసహితము భక్తయవసేంధనోదకముల కుపరోధము గలిగింపలేనట్టియు క్షయవ్యయములను పొందనట్టియు దుర్గమునాశ్రయింపవలెను. తుల్యదుర్గములనేకము లున్నప్పుడు నిచయాపసారమునుపట్టివిశేషమేర్పడును. నిచయాపసారసంపన్నమగు మనుష్యదుర్గమునే కోరవలెనని కౌటిల్యుఁడు. అట్టిదాని నాశ్రయించుటకుఁగల కారణములివి:—

పార్ష్ణిగ్రాహాసారమధ్యమోదాసీనులను శత్రునిపైఁ బురికొల్పఁగలను. సామంతాటవికతత్కులీనాపరుద్ధులలో నొకనిచేనితని రాజ్యమునుహరింపఁగలను. కృత్యపక్షోపగ్రహముచే వీనిదుర్గరాష్ట్రి

స్కంధావారములందుఁ గోపముఁబుట్టింపఁగలను. శస్త్రాగ్నిరసప్రణిధానములచేతను ఔపనిషదికయుక్తులచేతను యథేష్టముగ నాసన్నుఁడగు వీనిని చంపఁగలను. స్వాధిష్ఠితమగు యోగప్రణిధానముచే క్షయవ్యయములఁ గలిగింపఁగలను. క్షయవ్యయప్రయాసోపతప్తమగు నితని మిత్రవర్గమును సైన్యమును క్రమముగ భేదపెట్టఁగలను. వీవధాసారప్రసారములకష్టంగలిగించి వీనిస్కంధావారావగ్రహముచేయఁగలను వీనికి సైన్యమునిచ్చునట్లు నటించి వీనిలోపములఁగనిపెట్టి సర్వసైన్యముచే వీనినిఁబరిహరింపఁగలను. ఉత్సాహముచెడిన శత్రునితో యథేష్టము సంధిచేసికొనఁగలను. నాతో విఘటించిన వీని కన్నివిధముల గుకష్టములు రాఁగలవు. నిరాసారుఁడగు వీనిని వీనిమూలాన్మిత్రాటవిదండములతోఁ బెల్లగింపఁగలను. గొప్పదియగు నాదేశముయొక్క యోగక్షేమము నీదుర్గమందుండియే పాలింపఁగలను. స్వవిక్షిప్తమును మిత్రవిక్షిప్తమును నగు నాసైన్యమీప్రదేశమునుచేరి వీనికి దుస్సహముకాఁగలదు. నిమ్నఖాత రాత్రి యుద్ధములందు నేర్పుగలనా సైన్యము పనులుసమీపించినపుడు నాయిష్టానుసారముగఁ గర్మలచేయఁగలదు. విరుద్ధదేశకాలాగతుఁడగుటచే స్వయముగనే శత్రువు క్షయవ్యయములఁ బొందఁగలఁడు. దుర్గాటవ్యవసారబాహుళ్యముగ లదగుటచే నా దేశమును మహాక్షయవ్యయముల మూలముఁగాని శత్రువుపొందఁజాలఁడు. వ్యాధియుక్తములగు సైన్యముల వ్యాయామములకు వలయుచోటులేక నాదేశము నతికష్టముపై నితఁడు ప్రవేశింపఁగలఁడు. ప్రవేశించినను తిరిగివెనుకకు వెళ్ళఁగలిగియుండఁడను కారణములున్నప్పుడు మనుష్యదుర్గము నాశ్రయింపవలెను. పైకారణములులేనప్పుడు శత్రువు బలసమన్వితుఁడై యున్నప్పుడును దుర్గమునువిడిచి పాఱిపోవలెను.

లేక, అగ్నియందుఁ బతంగమువలె శత్రువునిపైఁ బడవచ్చును. ఏలనఁగాఁ ద్యక్తశరీరునకేదియో యొకఫలముతప్పదని యాచార్యులు. అట్లుకాదు. తనయొక్కయు శత్రువుయొక్కయు సంధి

యోగ్యతను కనిపెట్టి సంధిచేసికొనవలెను. అట్లుకానపుడు విక్రమించియైనను సంధిచేసికొనవలెను, లేక మిత్రునొకని నాశ్రయింపవలెను. సంధేయునికి దూతనుపంపవలెను లేక శత్రునిచేఁ బంపఁబడిన దూతను నర్ఘ్యదానములచే సత్కరించి, ఇది రాజుయొక్క పణ్యాగారము, ఇది దేవీకుమారుల పణ్యాగారము, దేవీకుమారులవచనానుసారముగ నేనును నారాజ్యమును నీకుస్వాధీనమగుచున్నామని పలుకవలెనని కౌటిల్యుఁడు.

లబ్ధసంశ్రయుఁడై సమయాచారునివలె భర్తయందుఁ బ్రవర్తింపవలెను. దుర్గాదికర్మలను ఆవాహవివాహపుత్రాభిషేకముల ను పణ్యహస్తిగ్రహణసత్రయాత్రావిహారగమనములను వానిచేననుజ్ఞాతుఁడై చేయవలెను. స్వభూమియందలి ప్రకృతులతో సంధినికాని అపసృతుల యుపఘాతమునుకాని యనుజ్ఞఁబొందియే చేయవలెను. పౌరజానపదులు దుష్టులైనపుడు న్యాయవృత్తిగల మఱియొక దేశమును కోరవలెను. లేక రహస్యశిక్షచే దూష్యులకువలె వారికిఁ బ్రతీకారము గావింపవలెను. మిత్రునినుండిసహిత ముచితముగ నియ్యఁబడుభూమినితీసికొనరాదు. మంత్రిపురోహితసేనాపతియువరాజులలో నొకరిని భర్తకుఁదెలియకుండఁజూచి శక్త్యనుసారముగ వారికుపకారము చేయవలెను. దైవతస్వస్తివాచనసమయములందు భర్తపరమగు నాశీర్వాదములఁ జెప్పింపవలెను. ఎల్లప్పుడు భర్తకు లొంగినవానివలె నుండవలెను.

దండోపనతుఁడు బలవంతుని సేవించుచు శంకితాదులవిడిచి భర్తయెడ నీపథముగఁ బ్రవర్తింపవలెను.

ఇది పాడ్గుణ్యమందు బలవంతునితో విగ్రహించుసమయమున నుపరోధహేతువులు దండోపనతవృత్తమును

పదునేనవ యధ్యాయము.

ఆదినుండి నూటపదుమూఁడవ యధ్యాయము.



## 121 ప్రకరణము.

### దండోపనాయువృత్తము.

విజిగీషమాణుఁడగు బలవంతుఁడు భర్త్రనుజ్ఞాతుఁడై వానికి (భర్తకు) హిరణ్యోద్యోగకరముగ స్వాస్థ్యముల కనుకూలించునట్టి యు నసద్గ్రాపసారుఁడును నపాష్ణిఁ యు ననపసారుఁడునునగు శత్రు వ్యాలినట్టియు దేశమునుగుఱించి వెళ్ళవలెను. అట్లుగానపుడు కృత ప్రతీకారుఁడై వెళ్ళవలెను.

దుర్బలులను సామదానములచేతను బలవంతులను భేదదండ ములచేతను వశపఱచుకొనవలెను. ఉపాయములలో నొకటినికాని, అన్నిటినికాని యుపయోగించి యనంతరులగు ప్రకృతులనుసాధింప వలెను. గ్రామారణ్యోపజీవి ప్రవణిక్పథముల ననుపాలించియు; ఉష్ణితాపసృతాపకారులను రక్షించియు సామ మాచరింపవలెను. భూమిద్రవ్యకన్యాదానములవలనను నభయదానమువలననుదానోపా యమాచరింపవలెను. సామంతాటవిక తత్కులీనావరుద్ధులలో నొక నిని వశపఱచుకొని కోశదండభూమిదాయయాచనముచేయించిభేదో పాయమాచరింపవలెను. ప్రకాశకూట తూష్ణీంయుద్ధ దుర్గలంభోపా యములచే శత్రుగ్రహణముగానించి దండోపాయమాచరింపవలెను. అట్లే ఉత్సాహవంతులను దండోపకారులను స్వప్రభావవంతులను కోశోపకారులను ప్రజ్ఞావంతులను భూమ్యుపకారులను చేరదీయ వలెను.

పణ్యపట్టణగ్రామఖనిసంజాతమును రత్నసారకుప్యమును ద్ర వ్యహస్తివనవ్రజమును యానవాహనమునునిచ్చి పెక్కువిధములుగ నుపకారముచేయుట చిత్రభోగము. దండకోశములనిచ్చి యుపకా రము చేయుట మహాభోగము. దండకోశభూములనిచ్చుట సర్వభో గము. అమిత్రప్రతీకారముచేయుట యేకతోభోగి. అమిత్రాసా రుల కుపకారముచేయుట యుభయతోభోగి. అమిత్రాసారప్రతివే శాటవికుల నెల్లవిధములఁ బ్రతీకరించుట సర్వతోభోగి. (అను నుప

కారములను పైఁజెప్పినవారి కొనర్పవలెను.)

పార్ష్ణిగ్రాహుఁడు ఆటవికశత్రువు ముఖ్యశత్రువు— వీరిలో నెవరినైనను భూమిదానముచే స్వాధీనముచేసికొనఁ దగియున్నప్పుడు నిస్సారమగు భూమిచేనతనిని వశపఱచుకొనవలెను; ఇట్లే దుర్గస్థుని సంబంధములేని భూమినిచ్చియు, ఆటవికుని నిరుపజీవియగు భూమినిచ్చియుఁ దత్కులీనుని ప్రత్యాదేయమగు భూమినిచ్చియు శ్రేణీబలమును నిత్యామిత్రయగు భూమినిచ్చియు సంహాతబలుని బలవత్సామంతులుగల భూమినిచ్చియు, యుద్ధములందుఁ గుతూహలుఁడగువానిని పైరెండువిధములగు భూములచేతను ఉత్సాహవంతుని వ్యాయామరహితమగు భూమిచేతను అరిపక్షీయుని శూన్యభూమిచేతను అపవాహితునిఁ గర్శితమగుభూమిచేతను గతప్రత్యాగతుని మహాక్షయవ్యయనివేశమగు భూమిచేతను ప్రత్యపన్నతుని ననుపాశ్రయమగు భూమిచేతను భర్తను నివాసయోగ్యముకాని భూమిచేతను స్వయముగ వశపఱచుకొనవలెను:

పైవారిలో మహోపకారియు నిర్వికారియునగువాని ననువర్తింపవలెను; అట్లుకానివానిని రహస్యముగసాధింపవలెను: ఉపకారిని నుపకారమునకుఁదగినట్లు సంతోషపెట్టవలెను; ప్రయాసమునుపట్టి యర్థలాభము లొనర్పవలెను. వ్యసనములం దనుగ్రహమును చేయవలెను; స్వయముగనచ్చినవానికి యథేష్టదర్శనప్రతివిధానములుచేయవలెను. వారియెడలఁ బరిభవోపఘాతకుత్సాతివాదములఁ జూపరాదు. అభయమునిచ్చితండ్రివలె ననుగ్రహింపవలెను. దోషములొనర్చినదోషమును పైకిఁబ్రకటించి వారినిప్రకాశముగ శిక్షింపవలెను శత్రువునకు భయముఁకలుగునట్లుకై దండశీలునివలె వర్తింపవలెను.

హతశత్రువు భూమిద్రవ్యపుత్రదారలను కోరరాదు. వానివంశస్థులను వారివారియుద్యోగములందు నిలుపవలెను. తనకుసహాయముచేయుచు మృతిచెందినవానిపుత్రునిఁ దండ్రియొక్కరాజ్యమందు నిలుపవలెను. ఇట్లుగావించునచో దండోపనతులు పుత్రపౌ

తుల ననుపర్తింతురు.

ఉపనతులఁ జంపియు, బంధించియు వారి భూమిద్రవ్యపుత్త్రదారలను కోరునట్టివాని నాశముకొఱకుఁ దక్కిన రాజమండలమంతయుఁ బ్రయత్నించును. స్వభూమ్యాయుక్తులగు వానిమంత్రులు సహితము వానిపైవిరోధించి శత్రుమండలము నాశ్రయించి వానిరాజ్యమును ప్రాణమును హరింపఁగోరుదురు.

కావున దండోపనతులగురాజులు సామముచే వారివారిభూములయందు నిలుపఁబడినవారయినచో రాజును వానిపుత్త్రపౌత్త్రులను ననుసరించిప్రవర్తించెదరు.

ఇది షాడ్గుణ్యమందుఁ దండోపనాయివృత్తము
పదునాఱవ యధ్యాయము.
ఆదినుండి నూటపదునాలుగవ యధ్యాయము.



## 122-23 ప్రకరణములు

### సంధికర్మ, సంధిమోక్షము

శమము సంధి సమాధి యనునవి పర్యాయపదములు. రాజులకుఁ బరస్పరవిశ్వాసమును పుట్టించునవి గూడ శమసంధిసమాధులు.

సత్యమును కాని శపథమునుకాని యొనర్చిచేసినసంధి చాలసంధి. జామీనునిచ్చిగాని ప్రతిగ్రహమునిచ్చిగాని చేసికొనినది స్థావరసంధియని ఆచార్యులు. అట్లుకాదు, సత్యమును శపథమును ననుసరించి చేసికొనినసంధి యిహపరములురెంటియందును స్థిరమై స్థావరసంధియని యనిపించుకొనును. సంధిని బలపఱచుకొనుటకై యొనర్చుకొను ప్రతిభూప్రతిగ్రహములు కేవలమిహార్థమేయనికౌటిల్యుఁడు.

పూర్వరాజులు సత్యసంధులై సంధిచేసికొంటిమని సత్యపూర్వకముగ సంధిచేసికొనెడివారు. అట్టిసంధి నతిక్రమింతురను సందేహముకలిగినపుడు అగ్నిఉదకసీతాప్రాకారలోష్టహస్తిస్కంధాశ్వపృ

డను.

ప్రాజ్ఞశూరులలో నశూరుఁడగు ప్రాజ్ఞునకు మతికర్మయోగ ముండును; అప్రాజ్ఞుఁడగు శూరునకు విక్రమాధికార ముండును. శూరునకు విక్రమాధికారమున్నను లుబ్ధకుఁడేనుఁగునువలెఁ బ్రాజ్ఞుఁడు శూరునతిక్రమించును.

శూరకృతాస్త్రులలో నకృతాస్త్రుఁడగు శూరునికి విక్రమవ్యవసాయత్న ముండును. అశూరుఁడగు కృతాస్త్రునకు సములక్ష్యాధికార ముండును. అయినను స్థైర్యప్రతిపత్త్యసంతోషము లుండుటవలన శూరుఁడు కృతాస్త్రునతిక్రమించును.

బహుపుత్త్రైకపుత్త్రవంతులలో బహుపుత్త్రుఁడొక్కపుత్త్రునిచ్చి మిగిలినపుత్త్రులతో సంతృప్తినొంది సంధినతిక్రమింపఁగలిగియుండును. ఏకపుత్త్రుఁడిట్లు చేయఁజాలఁడు.

పుత్త్రులనందఱినిచ్చి సంధచేసికొనువారిలో మఱికొందఱుపుత్త్రులు కలుగుటఁబట్టి విశేషమును నిర్ణయింపవలెను. పుత్త్రులఫలింపఁజేయుటయందు సమానులగువారిలో శక్తివంతులఁగనుటఁబట్టి విశేషము. శక్తిమంతులఁ గనువారిలోఁగూడ వేగముగఁగనుటఁబట్టి విశేషమేర్పడును.

శక్తివంతుఁడగు నేకపుత్త్రునిచ్చి సంధిచేసికొనవలసి వచ్చినపుడు లుప్తపుత్త్రోత్పత్తియగువాఁడు తన్నుసమర్పించుకొనవలెనుకాని యేకపుత్త్రునియ్యరాదు.

అభివృద్ధిలోనున్నవాఁడు సంధినివిడుచుకొనవచ్చును. కుమారాసన్నులగు సత్త్రులు కారుశిల్పవ్యంజనులు (శత్రువువద్ద) పనులఁ జేయుచున్నవారై రాత్రియందు సురంగమును త్రవ్వించి దానిమూలమునఁ గుమారునినపహరింపవలెను. పూర్వప్రణిహితులగు నటనర్తకగాయన వాదకవాగ్జీవన కుశీలవప్లవకసౌభికులు శత్రునాశ్రయింపవలెను. వారు పరంపరగా రాజకుమారునిఁగూడ నాశ్రయింపవలెను. వారనియమితకాలముగఁ బ్రవేశస్థాననిర్గమనముల నేర్ప

బచుకొనవలెను. తర్వాత(ను కుమారుఁడు వారిలోనొకరివేషమును వేసికొని రాత్రియందుఁ దప్పించుకొనిరావలెను.

భార్యావ్యంజనులగు రూపాజీవలుగూడ నిట్లేయాచరింపవలెను రాజకుమారుఁడు వారియొక్క తూర్యభాండాదులఁబట్టుకొని వెడలిపోవలెను.

సూదారాళికస్నాపక సంవాహకాస్తరకకల్పకప్రసాదకోదకపరిచారకులు ద్రవ్యవస్త్రభాండఫేలాశయనాసనసంభోగములమూలమున రాజకుమారునిఁ దప్పింపవలెను; లేదా పరిజనరూపముధరించి ఏదియోయొకవస్తువును తీసికొని యరూపవేళయందతఁడు వెడలిపోవచ్చును.

లేక సురంగమూలమునఁగాని నిశోపహారమూలమునఁగాని వారుణపూజనొసర్పవలెనను మిషపెట్టి జలాశయమును చేరవలెను. సైదేహకవ్యంజనులు పక్వాన్నఫలవ్యవహారమూలమున రక్షకభటులకపచారము కలిగింపవలెను.

దైవతోపహారశ్రాద్ధప్రవహణనిమిత్తములని అన్నపానరసములను మదనయోగయుక్తములుగఁజేసి రక్షకభటులకిచ్చి వెడలిపోవలెను. నాగరక కుశీలవచికిత్సకాపూపికవ్యంజనులు రాత్రి యారక్షకులఁబ్రోత్సహించి సమృద్ధగృహముల కగ్గిపెట్టవలెను. లేక ఆరక్షకులలోఁగొందఱు వైదేహజవ్యంజనులై పణ్యసంస్థను తగులఁబెట్టవలెను. తన్నెవరును వెదకుటకు యత్నింపకుండునట్లు స్వగృహమున మఱియొకనినుంచి దానికినిప్పుపెట్టి తర్వాత సంధిచ్ఛేద గవాక్ష సురంగముల మూలమునఁ బాఱిపోవలెను.

లేక, కాచకుంభభాండభారవాహకవ్యంజనుఁడైగాని ముండజటిలవాసస్థలములఁజేరి తద్వ్యంజనుఁడైగాని రాత్రిబయటుదేరి పోవలెను. లేక విరూపవ్యాధితారణ్యచరులవేషము నెద్దానినయినధరించిగాని ప్రేతవ్యంజనుఁడైగాని గూఢచారులచేఁబరిహరింపఁబడవలెను. లేక స్త్రీవేషముధరించి ప్రేతమునొకదానిననుసరింపవలెను. పిమ్మట

వనచరవ్యంజనులగు కొందఱిచేఁ దానొకదిక్కున వెళ్ళినట్లు చెప్పించి మఱియొకదిక్కునుపట్టి వెళ్ళిపోవలెను.

చక్రిచరులచాటునఁగాని శకటములచాటునఁగాని డాగి వెళ్ళిపోవలెను. వెంటతరుమువారు సమీపించినపుడొక రహస్యస్థలము నాశ్రయింపవలెను.

అట్టిదిలేనపుడు మార్గమునని ఉపక్కల హిరణ్యమును కాని రసవిద్ధములగు భక్ష్యజాతమును కాని చల్లి మఱియొకత్రోవనుపట్టి వెళ్ళవలెను.

పట్టుకొనఁబడినపుడు సామాదులచేఁగాని రసవిద్ధములగుభక్ష్యదానముచేఁగాని యనుగ్రతుని మోసపెట్టవలెను. లేక వారుణయోగాగ్ని దాహములందు మఱియొకనిశరీరమునుంచి, నాపుత్రుఁడునీచేఁజంపఁబడెనని శత్రునిపై నభియోగము తేవలెను.

రహస్యముగ శస్త్రమునొకదానినితీసికొని రాత్రియందు రక్షకభటులపై విక్రమించి గూఢప్రణిహితులతోఁగలిసి శీఘ్రప్రయాణముచేసి తొలఁగిపోవలెను.

ఇది షాడ్గుణ్యమను సప్తమాధికరణమున సంధికర్మ సంధిమోక్షములను పదునేడవ యధ్యాయము.

ఆదినుండి నూటపదునైదవ యధ్యాయము.



## 124-26 ప్రకరణములు.

### మధ్యమోదాసీనమండలచరిత్రములు.

తృతీయపంచమప్రకృతులు మధ్యమునకుఁ (మిత్ర) ప్రకృతులు; ద్వితీయచతుర్థషష్ఠప్రకృతులతనికి వికృతులు. మధ్యముఁడీరెంటిని ననుగ్రహించునపుడు విజిగీషువతని ననుసరింపవలెను. అట్లనుగ్రహింపనపుడతఁడు ప్రకృతుల ననుసరింపవలెను.

మధ్యముఁడు విజిగీషుమిత్రుని మిత్రభావిని వశపఱచుకొన బూనఁ గోరునపుడు (విజిగీషువు) తనయొక్కయుఁ దనమిత్రులయొక్కయు మిత్రులను లేవనెత్తి మధ్యమునకును వానిమిత్రునకును భేదము గలిగించి తనమిత్రుఁడు పోకుండ నిలుపుకొనవలెను. ఈమధ్యముఁ డతిగర్వితుఁడై మనయందఱి వినాశమునకై యత్నించుచున్నాఁడు. కావున మనమెల్లరముకలిసి యితనియాత్రను చెఱుపవలెనని మండలమును ప్రోత్సహింపవలెను. మండలము దీనికొప్పుకొనినయెడల మధ్యముని బట్టుకొని తన్ను వృద్ధినొందించుకొనవలెను. మండలము దీనికొప్పుకొననియెడలఁ గోశదండములచే మిత్రుని వశపఱచుకొని, ఎవరు మధ్యముని విరోధించి పరస్పరైక్యముఁ గలిగియుందురో ఎవరిలోనొకఁడు వశపడినచో మిగిలినవారుగూడ వశపడఁగలరో ఎవరు పరస్పరశంకితులై యూరకుందురో వారిలోఁ బ్రధానునిఁగాని సమీపస్థునిఁగాని ఒకని సామదానములచే వశపఱచుకొనవలెను. ఇట్లే ద్వితీయుని వశపఱచుకొని ద్విగుణుఁడై తృతీయుని వశపఱచుకొని త్రిగుణుఁడై మిక్కిలివృద్ధిపొంది మధ్యముని లోఁబఱచుకొనవలెను.

ఇట్లు చేసికొనుటకు దేశకాలాతిపాతము కలిగినపుడు సంధిపూర్వకముగ మధ్యమేతర మిత్రునితో స్నేహము చేసికొనవలెను; లేక దూష్యులలోఁ గల సంధియుఁ గర్మసిద్ధియుఁ జేయుచు విజిగీషుమిత్రుని మధ్యముఁడు వశపఱచుకొనఁదలఁచునపుడు నీకుఁ గిష్టములైనంత నిచ్చెదను నేను నిన్ను రక్షింతునని వానిని దనపక్షమున నిలుపుకొని కష్టముఁ బడినపుడు వానిని రక్షింపవలెను. ఉచ్ఛేదనీయుఁడగు విజిగీషుమిత్రుని మధ్యముఁడు వశపఱచుకొనఁదలఁచినపుడు వీనినికూడఁ గర్శితుఁడైనపుడు రక్షింపవలెను. లేక మధ్యమవృద్ధిచేత భయమునొందుకుఁడగను ఉచ్ఛిన్నుఁడై మఱియొకచోటికిఁ బోలేనంతటివాఁడుగను వీనికి భూమినిచ్చి స్వాధీనము చేసికొనవలెను.

కర్శనీయోచ్ఛేదనీయులగు మిత్రులు మధ్యమునకు సాచివ్యకరులైనచో మఱియొకనితో విజిగీషువు సంధిచేసికొనవలెను. వారు

విజిగీషువులయినపుడు వారిమిత్రులవగ్రహసమర్థులైనచో సంధిచేసికొనవలెను. ఈరీతిని స్వార్థసిద్ధిని పొంది మధ్యమునకుఁగూడఁ బ్రియుఁడగును.

మధ్యముఁడు విజిగీషుమిత్రునిఁగాని మిత్రభావినిఁగాని కోరినచో విజిగీషువు పురుషాంతరునితోఁ సంధిచేసికొనవలెను. లేక సాపేక్షుఁడగు మిత్రునుచ్ఛేదించుట తగదని మిత్రునివారింపవలెను. లేక స్వపక్ష ఘాతకుఁడని మండలమితనిని కోపించునని తోఁచినపుడు నుపేక్షింపవచ్చును. మధ్యముఁడు (విజిగీషు) శత్రునిఁగోరునపుడు కోశదండములచే రహస్యముగవాని ననుగ్రహింపవలెను.

మధ్యముఁడుదాసీనునికోరునపుడు వారిద్దఱికి భేదముగల్పింపవలెను.

మధ్యమోదాసీనులలో నెవఁడుమండలప్రియుఁడో వానినను సరింపవలెను. మధ్యమచరిత్రమునుపట్టి యుదాసీనుని చరిత్రమును కూడ గ్రహింపనగును.

ఉదాసీనుఁడు మధ్యముని వశపఱచుకొనఁగోరునపుడు తాను శత్రునికంటె నధికుఁడగుటకును మిత్రోపకారముచేయుటకును దండోపకారియగు నుదాసీనుని సంపాదించుటకును వలయు నుపాయముగని పెట్టి తన్నుబలపఱచుకొని శత్రుప్రకృతినికర్షించి అమిత్రభావులయినను మిత్రప్రకృతి ననుగ్రహింపవలెను.

అనాత్మవంతుఁడు నిత్యాపకారియునగు శత్రువు, శత్రుసహితుఁడగు పార్ష్ణిగ్రాహియు, వ్యసనియగు యాతవ్యుఁడు, వ్యసనము వచ్చినపు డభియోగము చేయనెంచువాఁడును, విజిగీషునకు శత్రుభూతులు.

ఏకార్థాభిప్రయాతుఁడు పృథగర్థాభిప్రయాతుఁడు కలిసియాత్ర చేయువాఁడు సంహితప్రయాణికుఁడు స్వార్థాభిప్రయాతుఁడు సాముత్థాయికుఁడు కోశదండములలో నొకదానినికొనువాఁడు విక్రయించువాఁడు ద్వైధీభావికుఁడు— విజిగీషుని మిత్రభూతులు.

బలవంతునిచేఁ బ్రతిహతుఁడైనవాఁడు విజిగీషునకును వాని శత్రునకును మధ్యనుండువాఁడు బలవంతునికిఁ బార్ష్ణిగ్రాహిగనుండు వాఁడు స్వాయముగ నుపనతుఁడగువాఁడు ప్రతాపోపనత దండోపనతులగు సామంతులు — భృత్యభావులు.

భూమ్యేకాంతరుల విషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

తనకు శత్రువిరోధముగలిగినపు డేకార్థాభిప్రాయముగలవాఁడగుమిత్రుని శక్త్యనుసారముననుగ్రహించి శత్రువినెదుర్కొనవలెను.

శత్రునిసాధించి మిత్రుఁడువృద్ధిఁబొందునపుడు సామంతైకాంతరులగు ప్రకృతులతో వానికి విరోధము గల్పింపవలెను; లేక శత్రులీనాచరుస్థులచే వానిభూమిని హరింపఁజేయవలెను; లేక అతఁడెట్లు తనయనుగ్రహము నపేక్షించి తనకువశ్యుఁడగునో యట్లుప్రవర్తింపవలెను.

అమిత్రునకు నుపకారముచేయఁగూడదు. మిక్కిలిక్షీణించుచుండుమిత్రుఁ డహీనుఁడును నవృద్ధుఁడును నగునట్లు విదుఁడగువాఁడు నిలుపుకొనవలెను.

చలమిత్రుఁ డర్థయోగముచే సంధిచేసికొనినపుడతఁడు తొలఁగక తనకడనుండుట కుపాయము నాలోచించుకొనవలెను.

అరిసాధారణుఁడును శఠుఁడును నగుమిత్రుని శత్రువునుండి భేదపెట్టి వానిఁ బెల్లగించి పిమ్మట శత్రుని భేదింపవలెను.

ఉదాసీనుఁడుగనుండు మిత్రునకు సామంతులతో విరోధము పుట్టించి విరోధసంతప్తుఁడగునట్టి మిత్రునికినుపకారముగావించి నిలుపుకొనవలెను.

దుర్బలుఁడగుటచే శత్రుని విజిగీషుని నాశ్రయించుచుండు మిత్రునిఁ బరాఙ్ముఖుఁడు కాకుండునట్లనుగ్రహింపవలెను. లేక స్వదేశమునుండి వానినిఁదొలఁగించి మఱియొక దేశమునకంపి యాచట దండానుగ్రహహేతువుగ మొదటనే మఱియొకనినుంపవలెను.

సమర్థుఁడయినను నాపత్కాలమున నుపకారముచేయక అప

కారముచేయుమిత్రుని నమ్మించి దగ్గరకురప్పించి భేదింపవలెను.

అమిత్రవ్యసనుఁడగు శత్రువు వనచరగ్రహణోద్యతుఁడై వచ్చినప్పుడు బాధితవ్యసనుఁడగు మిత్రునిచేతనే యతఁడు సాధ్యుఁడగును.

ఉద్ధితుఁడగుమిత్రుఁ డరివ్యసనముచే విరక్తుఁడైనపు డరివ్యసనసిద్ధియగు శత్రువుచే సాధింపఁబడును.

అర్థశాస్త్రవేత్త వృద్ధిక్షయస్థానములను కర్శనోచ్ఛేదములను పైఁజెప్పినసర్వోపాయములను నుపయోగింపవలెను.

అన్యోన్యసంచారమగు షాడ్గుణ్యమును ప్రయోగించువాఁడు రాజులందఱిని స్వబుద్ధినిగళబద్ధులఁజేసి స్వేచ్ఛగఁగ్రీడించును.

ఇది షాడ్గుణ్యమందు మధ్యమచరితోదాసీనచరితమండలచరితమను పదునెనిమిదవ యధ్యాయము.

ఆదినుండి నూటపదునాఱవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున షాడ్గుణ్యమను నేఁడవయధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## ఎనిమిదవయధికరణము — వ్యసనాధికారికము.

### 127 ప్రకరణము.

#### ప్రకృతివ్యసనవర్గము.

వ్యసనములొక్కమారు సంభవించునపుడు సౌకర్యములఁబట్టి యానముమంచిదా? రక్షణముమంచిదా? యని యాలోచించుటయే వ్యసనచింత.

దైవమానుషములగు ప్రకృతివ్యసనములు నయాపనయములచే సంభవించుచున్నవి. గుణప్రాతిలోమ్యము గుణాభావము ప్రదోషము ప్రసంగపీడ — ఇవియే వ్యసనములు. శ్రేయస్సునుండి మనుష్యునిఁదొలఁగించునది (వ్యస్యతి) యగుటచే దీనికి వ్యసనమని పేరు.

స్వామ్యమాత్య జనపదదుర్గకోశదండ మిత్రవ్యసనములలో వరుసగ వెనుకవానికంటె ముందుండునవి గరీయములని యాచార్యులు.

అట్లుకాదు. స్వామ్యమాత్యవ్యసనములలో నమాత్యవ్యసనమే గరీయము. మంత్రము మంత్రఫలావాప్తి కర్మానుష్ఠానము ఆయవ్యయకర్మ దండప్రణయనము అమిత్రాటవీప్రతిషేధము రాజ్యరక్షణము వ్యసనప్రతీకారము కుమారరక్షణము కుమారాభిషేకము— లోనగునవి యమాత్యాయత్తములు. అమాత్యులులేనిచో నివియన్నియుఁలేకపోవును. రెక్కలులేనిపక్షివలె రాజునకుఁ జేష్టానాశమగును: వ్యసనములందుఁ బరోపజాతములాసన్నములగును. అమాత్యులు ప్రాణాంతికచరులగుటచే వారికివైగుణ్యము కలిగినపుడు రాజునకుఁ బ్రాణబాధసంభవించునని భారద్వాజుఁడు.

అట్లు కాదు. మంత్రిపురోహితాదిభృత్యవర్గమునకును అధ్యక్షప్రచారమునకును పురుష ద్రవ్యప్రకృతివ్యసన ప్రతీకారమునకును తద్వృద్ధికిని రాజే మూలము. అమాత్యాదివ్యసనులైన పుడు వ్యసనులు కానివారి నమాత్యులుగఁ జేసికొనఁగలిగియుండును. పూజ్యులను పూజించుటయందును దుష్టులను శిక్షించుటయందును జాగరూకుఁడై యుండును. స్వామి సంపన్నుఁడై స్వసంపదలచేఁ బ్రకృతులను సంపన్నులుగఁ జేయును. రాజెట్టిశీలము గలిగియుండునో ప్రకృతులు గూడ నట్టిశీలమునే గలిగియుందురు. ఉత్థానప్రమాదములు రాజాయత్తములుగదా? కావున స్వామి కూటస్థానీయుఁడని కౌటిల్యుఁడు.

అమాత్యజనపదవ్యసనములలో జనపదవ్యసనము గరీయము. కోశదండములు కుప్యము విష్టి వాహనము నిచయము లోనగునవి జనపదమువలనఁ గలుగుచున్నవి. జనపదములేనిచో నివియన్నియు లేకపోవును. నుటియుజనపదము స్వామ్యమాత్యులతరువాతి దేగదా యని విశాలాక్షుఁడు.

అట్లు కాదు. సర్వారంభము లమాత్యమూలములు. జనపద కర్మసిద్ధులు స్వామినుండియు శత్రువునుండియు యోగక్షేమముల సాధించుట వ్యసనప్రతీకారము శూన్యనివేశోపచయములు దండకరానుగ్రహము—— ఇవి యమాత్యమూలములని కౌటిల్యుఁడు.

జనపదదుర్గవ్యసనములలో దుర్గవ్యసనము గరీయము. కోశదండములు దుర్గమందేయుత్పత్తి యగును. ఆపదలందు జనపదమునకది స్థానమగును. పౌరజానపదులకంటె దుర్గములు శక్తిమత్తరములగుటచే నాపత్కాలమునందు రాజులకు నిత్యసహాయములగును. జానపదులు స్వామికిని శత్రువునకును గూడ సాధారణులైయుందురని పారాశరులు.

అట్లు కాదు. దుర్గ కోశదండములు సేతు వార్తారంభములు శౌర్యస్థైర్యదక్షత్వములు వస్తుబాహుళ్యము లోనగునవి జనపద మూలములు. జనపదములందుఁ బర్వతాంతర్ద్వీపములుండును. జన

పదము లేనప్పుడే దుర్గమును చేరుదురు. జనపదము కర్షకప్రాయము గానపుడు దుర్గవ్యసనము గొప్పది. జనపదమాయుధీయప్రాయముగు నపుడు జనపదవ్యసనముగొప్పదని కౌటిల్యుఁడు

దుర్గకోశవ్యసనములలోఁ గోశవ్యసనము గరీయము. దుర్గసంస్కార దుర్గరక్షణములు కోశమూలములు. కోశముచే శత్రుమిత్రములవిషయమున నుపజాపముగలిగింపవచ్చును. జనపద మిత్రామిత్ర నిగ్రహము దేశాంతరితోత్సాహనము దండ బలవ్యవహారములు కోశమూలములై యున్నవి. వ్యసనమువచ్చినపుడు కోశమునుతీసికొని మఱియొకప్రదేశమునకుఁ దొలఁగిపోవచ్చునుకాని దుర్గమును తీసికొనిపోవుట సంభవింపదుగదా యని పిశునుఁడు.

అట్లుకాదు. కోశదండములు తూష్ణీంయుద్ధము స్వపక్షనిగ్రహము దండబలవ్యవహారము ఆసారప్రతిగ్రహము పరచక్రాటవీప్రతిషేధము— ఇవి దుర్గాయత్తములు. దుర్గము లేనిచోఁ గోశము పరాధీన మగును దుర్గవంతుల కుచ్ఛేద మగపడదుగదా? యని కౌటిల్యుఁడు.

కోశదండవ్యసనములలో దండవ్యసనము గరీయము. మిత్రామిత్రనిగ్రహము పరదండోత్సాహనము స్వదండప్రతిగ్రహములు దండమూలములు. దండము లేనపుడు కోశవినాశము నిశ్చితము. కోశవ్యసనము కలిగినను కుప్యము భూమి పరభూమి స్వయంగ్రాహము మున్నగు మార్గములచే దానిని సంపాదింపవచ్చు నని కౌణపదంతుఁడు.

దండము శత్రువుఁజేరును. స్వామికిఁగూడ హాని గలిగించి సర్వాభియోగకరముగనుండును. కోశము ధర్మకామహేతువు. దేశకాలకార్యవశముచేఁ గోశదండములలో నొకటికంటె మఱియొకటి యాధిక్యముఁ బొందవచ్చును. దండము లబ్ధకోశపాలకముగదా? కోశము కోశదండములరెంటిని సాధింపఁగలదు. మఱియు నది సర్వద్రవ్యప్రయోజకముగుటచేఁ గోశవ్యసనముగరీయమని కౌటిల్యుఁడు

దండమిత్రవ్యసనములలో మిత్రవ్యసనము గొప్పది. మిత్రుఁడు పోషింపఁబడుచున్నను దూరమందున్నను సహాయముచేయును. పార్ష్ణిగ్రాహాసారామిత్రాటవికులఁ బ్రతీకరించును. వ్యసనావస్థ నొందినతనకుఁ గోశదండములనిచ్చి యుపకరించునని వాతవ్యాధి.

అట్లుకాదు. దండవంతునియెడలనే మిత్రుఁడు మిత్రభావిమై యుండును. అమిత్రుఁడుగూడ నప్పుడు మిత్రభావము గలిగియుండును. కార్యమొకదానిని దండముచేఁ గాని మిత్రుని మూలమునఁ గాని సాధింపఁదగినప్పుడు సారమునుబట్టియు స్వయుద్ధదేశకాలములఁ బట్టియు వానిలోవిశేషము నెఱుంగునది. శీఘ్రాభియానమందును అమిత్రాటవికాభ్యంతర కోపముగలిగినప్పుడును మిత్రుఁడు నమ్మఁదగినవాఁడుకాఁడు. వ్యసనములు రెండేకకాలమున సంభవించినపుడును శత్రువు వృద్ధిపొందుచున్నప్పుడును మిత్రుఁడర్థము నిచ్చినఁగాని లభింపఁడు.

ప్రకృతివ్యసనసంప్రధారణ మింతటితో ముగిసెను.

ప్రకృతియొక్క యవయవములకు వ్యసనము కలిగినపుడు వ్యసనముకలుగని భాగముయొక్క బాహుళ్యానురాగసారములఁబట్టి కార్యమును సాధించుకొనవలెను.

రెండుప్రకృతులకు వ్యసనము తుల్యమైనపుడు తక్కినప్రకృతులలో లోపములేనపుడు వీని గుణక్షయములఁబట్టి విశేషము నెఱుగునది.

ఏప్రకృతివ్యసనమువలనఁ దక్కినప్రకృతులన్నిటికి నాశమగునో యది ప్రధానమైనదైనను కాకపోయినను నదియే గొప్పవ్యసనమని చెప్పఁదగును.

ఇది వ్యసనాధికారికమనునష్టమాధికరణమందుఁ బ్రకృతివ్యసనవర్గమను

మొదటి యధ్యాయము.

ఆదినుండి నూటపదునేడవ యధ్యాయము.



## 128 ప్రకరణము.

### రాజరాజ్యముల వ్యసనచింత.

### రాజు, రాజ్యము, అని ప్రకృతిసంక్షేపము.

రాజునకాభ్యంతరబాహ్యకోపములు కలుగుచుండును. వానిలో స్వపక్షమందుండెడుపుట్టు నాభ్యంతరకోపము బాహ్యకోపముకంటె గరీయము. అభ్యంతరకోపములలో నమాత్యునివలనఁగలిగినది తక్కినవానికంటె గరీయమయినది. కావునఁ గోశదండశక్తిని తన యధీనమందే యుంచుకొనవలెను.

ద్వైరాజ్య వైరాజ్యములలో ద్వైరాజ్య మన్యోన్యపక్షద్వేషానురాగములచేతను పరస్పరసంఘర్షణముచేతను నశించును. జీవితుఁడగుశత్రువును బలాత్కరించి సంపాదింపఁబడిన వైరాజ్యవిషయమును వానిప్రభువు ఇదినాదికాదని తలంచుచుఁబ్రజలకుఁ గర్శనాపవాహనములొనర్చును; లేక రాజ్యమును, పణ్యముగఁజేసి లాభమొందుటకు యత్నించును; లేక జనులు విరక్తులయినచో రాజ్యమునువిడిచి వెళ్ళిపోవును.

బొత్తుగ శాస్త్రజ్ఞానములేని యంధుఁడును చలితశాస్త్రజ్ఞుఁడునునగు రాజులలో నెవఁడుత్తముఁడు? అశాస్త్రచక్షువగునంధుఁడు యత్కించన కారియు దృఢాభినివేశియుఁ బరప్రణేయుఁడును నై యన్యాయముగ రాజ్యమును చెఱచును. చలితశాస్త్రజ్ఞుఁడన్ననో శాస్త్రాతిక్రమణము నొకప్పుడొనర్చినను మఱలఁదిద్దఁదగినవాఁడగు నని యాచార్యులు.

అట్లుకాదు. శాస్త్రజ్ఞానశూన్యుఁడగునంధుఁడు (శాస్త్రజ్ఞుల) సహాయసంపదచే రాజ్యమునునిలుచుటకు సమర్థుఁడగును. చలితశాస్త్రజ్ఞుఁడన్ననో శాస్త్రవ్యతిరిక్తమగు త్రోవనవలంబించి యన్యాయముగ రాజ్యమును తన్నును చెఱచుకొనుచున్నాఁడని కౌటిల్యుఁడు.

వ్యాధితుఁడగు రాజా? లేక క్రొత్తగవచ్చినరాజా? మంచివాఁడు? వ్యాధితుఁడగురాజు [illegible] రాజ్యపక్షపాత

మునుకాని రాజ్యమూలముగఁ బ్రాణాబాధమునుకానిపొందుచున్నాఁడు. క్రొత్తవాఁడగురాజు ప్రకృతిరంజనోపకారరూపములగు స్వధర్మానుగ్రహ పరిహార దాన మాన కర్మలచేఁ బ్రవర్తించునని ఆచార్యులు.

అట్లుకాదు. వ్యాధితుఁడగురాజు యథాప్రకారముగ రాజప్రణిధి ననుసరించుచుండును. క్రొత్తవాఁడన్ననో స్వబలముచేతనే యీరాజ్యమును సంపాదించితినని యథేష్టముగ నడ్డులేక ప్రవర్తించును. సామూత్థాయికులచే ననుగృహీతుఁడై వారొనర్చు రాజ్యోపఘాతమును సహించి యూరకుండును. లేక ప్రకృతులయెడ నగూఢుఁడగుటచే సుఖముగఁ దొలఁగింపఁదగి యుండునని కౌటిల్యుఁడు.

వ్యాధితులలోఁ బాపరోగియనియు, అపరోగియనియు విశేషము. క్రొత్తవారిలో నభిజాతుఁడనియు ననభిజాతుఁడనియు విశేషము.

దుర్బలుఁడగు నభిజాతుఁడా బలవంతుఁడగు ననభిజాతుఁడా మంచివాఁడు? దౌర్బల్యాపేక్షులగు ప్రకృతులుసహితము దుర్బలుఁడగు నభిజాతుని యుపజాపమును కతిశ్రమముమీఁద వశులగుదురు. కాని బలాపేక్షులగుప్రకృతులు బలవంతుఁడగు ననభిజాతునియొక్కయుపజాపమునకు సుఖముగ వశులగుదురని యాచార్యులు.

అట్లుకాదు. అభిజాతుఁడు దుర్బలుఁడయినను ప్రకృతులు వాని ననువర్తింతురు. ఐశ్వర్యప్రకృతి మంచిజాతియందుఁ బుట్టినవానినే యనుసరించునుకదా? అనభిజాతుఁడు బలవంతుఁడయినను వానియుపజాపమునకు వారు లొంగరు. సద్గుణము గలవానియందే ప్రజలు స్నేహముగలిగియుందురని కౌటిల్యుఁడు.

ప్రయాసమంతయు నష్టమగుటవలన సస్యవధ ముష్టివధకంటె కష్టకరము. ప్రాణమును సంపూర్ణముగ నశింపఁజేయు ననవృష్టి యతివృష్టికంటెఁ బాపీయమగునది.

ప్రకృతులలో వ్యసనము గలిగినట్టియుఁ బౌరుషర్యముగఁ

జెప్పఁబడినట్టియు రెండు రెండుప్రకృతుల బలాబలములఁబట్టి స్థానయానముల నిర్ణయించుకొనవలెను.

ఇది వ్యసనాధికారికమందు రాజరాజ్యములవ్యసనచింతయను
రెండవ యధ్యాయము.
ఆదినుండి నూటపదునెనిమిదవ యధ్యాయము.



## 129 ప్రకరణము.

### పురుషవ్యసనవర్గము.

అవిద్యావినయములు పురుషవ్యసనహేతువులు. అవినీతుఁడు వ్యసనదోషములనుకనిపెట్టలేఁడు. వానినిచట నుపదేశించెదము.

కోపజములగుదోషములు మూఁడువిధములు. కామజములు నాలుగువిధములు. ఈరెంటిలోఁ గోపమే గరీయమయినది. ఏలనఁగాఁ గోపము సర్వత్ర వ్యాపించును; కోపవశులగురాజులు తరుచుగఁ బ్రకృతికోపముచే హతులగుటవినుచున్నాము. కామవశులగురాజులు క్షయవ్యయహేతుకములగు నతివ్యాధులచే హతులగుచుందురు.

అట్లుకాదు. కోపము సత్పురుషాచారమై యున్నది. మఱియునది వైరులకుస్థానముగను నవజ్ఞులవధించునదిగను మనుష్యులకు భీతిగలిగించునదిగను నున్నది. పాపసంబంధము నిత్యమై కోపప్రతిషేధార్థమగుచున్నది. కామము సిద్ధిలాభముగలదై సాంత్వముత్యాగశీలత సంప్రియభావములకు మూలము. నిత్యమగు కామసంబంధము కృతకర్మునకు ఫలోపభోగార్థమైయున్నదని భారద్వాజుఁడు.

అట్లుకాదు. ద్వేష్యత శత్రువులనుండి వేదనదుఃఖప్రాప్తియుఁ గోపమువలనఁగలుగును. పరిభవము ద్రవ్యనాశము చోరద్యూతకారలుబ్ధకగాయనవాదకులు లోనగునన్థలతోసంయోగము కామమువలనఁ గలుగును. పరిభూతుఁడు తనవారిచేతను, పరులచేతను గ్రహింపఁబడును; ద్వేష్యుఁడన్ననో ఛేదింపఁబడును; కావునఁ ఇరి

భవముకంటె ద్వేషమే గరీయమైనది. ద్రవ్యనాశము కోశబాధక ము మాత్రమే; శత్రువేదనమన్ననో ప్రాణబాధకమై యుండును. కావున ద్రవ్యనాశముకంటె శత్రువేదనమే గరీయము. అనర్థసంయోగము మహాపాతక ప్రతీకారమ్ము; దుఃఖసంయోగ మన్ననో దీర్ఘక్లేశకరము. కావున నన్థసంయోగముకంటె దుఃఖసంయోగము గరీయము. (ఈపైకారణములంబట్టి) కామముకంటెం గోపము గరీయమయినది.

వాక్పారుష్యము అర్థదూషణము దండపారుష్యము— వీనిగుఱించినచర్చ— వాక్పారుష్యార్థదూషణములలో వాక్పారుష్యము గరీయము. పరుషముగం బలుకంబడిన తేజస్వి తనతేజస్సుచేత బాధింపయత్నించును. దురుక్తమను శల్యము హృదయమందు నాటుకొన్నదై తేజస్సందీపకమును నింద్రియోపతాపియు నగునని విశాలాక్షుండు.

అట్లుకాదు. వాక్శల్యము నర్థపూజచేం దొలంగింపవచ్చును. దానము ఆదానము వినాశము పరిత్యాగము లోనగునవి యర్థదూషణములు. ఈయర్థదూషణము వృత్తిలోపకరమగును. (అందుచే నిదియే గరీయ) మని కౌటిల్యుండు

అర్థదూషణదండపారుష్యములలో నర్థదూషణము గరీయము ధర్మకామము లర్థమూలములు. లోకమర్థప్రతిబంధమై వర్తించుచున్నది. కాంబట్టి యర్థోపఘాతము గరీయమని పారాశరులు.

అట్లుకాదు. ఎవండుగాని యధికధనమిచ్చినను శరీరవినాశము నకొప్పుకొనండుగదా ? దండపారుష్యమొనర్చినవాం డితరులవలన నట్టిశిక్షనేపొందునని కౌటిల్యుండు.

ఇది కోపజమగు త్రివర్గము.

వేట ద్యూతము స్త్రీ పానములను నాలుగును కామజముల గు చతుర్వర్గము.

అందు మృగయాద్యూతములలో వేటయే గరీయమయినది.

పలనఁగా వేటవలన స్తేనామిత్రవ్యాళదావప్రస్ఖలనభయదిఙ్మోహము లుక్షుత్పిపాసలు ప్రాణాబాధము, సంభవించును. జయత్సేన దుర్యోధనులచేతనువలె ద్యూతమందక్షకుశలులచే జయింపఁబడుటమాత్రము సంభవించునని పిశునుఁడు.

అట్లుకాదు. అన్యతరపరాజయము ద్యూతమువలనఁగలుగునన్నమాట నలయుధిష్ఠిరుల చరిత్రమునుపట్టి తెలియుచున్నది. ద్యూతమందు జయింపఁబడిన ద్రవ్యమామిషమై వైరబంధహేతువగును. మఱియు సద్ద్రవ్యనాశము అసద్ద్రవ్యసంపాదనము అప్రతిభుక్తనాశము మూత్రపురీషధారణబుభుక్షాదులచే వ్యాధిప్రాప్తియు ద్యూతమువలనఁగలుగును. వేటవల్లనన్ననో శ్లేష్మపిత్తమేదస్స్వేదనాశము చలస్థిరములందు లక్ష్యపరిచయము కోపమొందిన మృగముల చిత్తవికారముఁ దెలిసికొనుట; అనిత్యయానము లోనగుఫలములు లభించునని కౌటిల్యుఁడు.

ద్యూతస్త్రీవ్యసనములలో ద్యూతవ్యసనము గరీయము. కితవుఁడు రాత్రింబగళ్ళెడతెగక రాత్రి దీపములుంచుకొనియుఁ దల్లి మృతయైనపుడును విడువక జూదమాడుచుండును. కృచ్ఛ్రకాలమందుఁ బ్రశ్నింపఁబడి కోపించును. స్త్రీవ్యసనియన్ననో స్నానప్రతికర్మభోజనప్రదేశములందు ధర్మార్థపరిప్రశ్నము చేయఁదగియుండును. రహస్యశిక్షచే రాజహితముకొఱకుఁగూడ స్త్రీని నియోగింపవచ్చును. వ్యాధికలిగినదను మిషచే మఱలించుటగాని తొలఁగించుటగాని చేయవచ్చునని కౌణపదంతుఁడు.

అట్లుకాదు. ద్యూతమునుండి మఱలింపవచ్చునుకాని స్త్రీవ్యసనమునుండి మఱలించుట దుస్సాధ్యము. (మంచిచెడ్డల) అదర్శనము కార్యాతిపాతముచే నష్టధర్మలోపములు తంత్రదౌర్బల్యము పానానుబంధము లోనగునవికూడ స్త్రీవ్యసనమువలనఁ జేకూరునని కౌటిల్యుఁడు.

స్త్రీపానవ్యసనములలో స్త్రీవ్యసనమే గరీయము. స్త్రీలతో

శాలీశలని నిశాంతప్రణిధిప్రకరణమునఁ జెప్పఁబడినది. పానమన్న నో శబ్దాసంధిరోహపభోగము ప్రీతిదానము పరిజనపూజనము కర్మ శ్రమవధలను కలిగించునని వాతవ్యాధి.

అట్లుకాదు. అపత్యోత్పత్తి ఆత్మరక్షణము అంతఃపుదారల లోనూతనము మార్పుగలిగించుకొనుట అగమ్యబాహ్యస్త్రీజనవై ముఖ్యములు స్త్రీవ్యసనమువలనలభించును. పానవ్యసనమున నీరెం డుదోషములుగూడ నుండును. సంజ్ఞానాశము అనున్మత్తుఁడుగూడ నున్మత్తుఁడగుట బ్రతికియుండియు మృతునివలెనగపడుట కౌపీనదర్శ నము శ్రుతప్రజ్ఞాప్రాణవిత్తమిత్రహాని సజ్జనవియోగము అనర్థసం యోగము అర్థఘ్నములగు తంత్రీగీతనైపుణ్యములందుఁ బ్రసక్తిలో నగునవి పానమునవలనఁగలుగు తక్కినదోషములని కౌటిల్యుఁడు.

ద్యూతమద్యములలో ద్యూతముగరీయమయినది. ద్యూత మువలన నెవరికోయొకరికిఁ బణనిమిత్తములగు జయాపజయములగు ను. నిశ్చేతనములగు ప్రాణులకుసహితము పక్షద్వైధముచేఁ బ్రకృ తికోపమును పుట్టించును. మఱియు నైక్యబుద్ధిగల సంఘములలోను రాజకులములలోను ద్యూతమువలననే భేదముత్పత్తియగును. దాని వలననే వినాశము. అసత్ప్రగ్రహము తంత్రదౌర్బల్యములను కలి గించునదగుటచే వ్యసనములన్నిటిలో నదియే పాపిష్ఠతమము.

కామమసత్ప్రగ్రహమును కోపము, సత్కార్యావగ్రహమును కలిగించును. రెండునుకూడ దోషబహుళములగుటచే మిక్కిలిగొ ప్పవియగు వ్యసనములని చెప్పఁబడుచున్నవి.

కావున వ్యసనారంభహేతువులును మూలహరములునునగు కామక్రోధముల నాత్మజ్ఞానముగలవాఁడు వృద్ధసేవియు జితేంద్రియుఁ డునునై విడువవలెను.

ఇది వ్యసనాధికారికమందు పురుషవ్యసనవర్గమను
మూఁడవ యధ్యాయము.
ఆదినుండి నూటపంచొమ్మిదవ యధ్యాయము.



## 130-32 ప్రకరణములు.

పీడనవర్గము, స్తంభవర్గము, కోశసంగవర్గము.

అగ్ని ఉదకము వ్యాధి దుర్భిక్షము మరకములు దైవపీడనములు.

అగ్ని ఉదకము వీనిలో నగ్నిపీడనము ప్రతీకారములేనిది. సర్వోదకపీడనముగూడ శక్యోపశమనముగను, తరింపఁదగినదనగులచే నబాధకముగనుండునని యాచార్యులు.

అట్లుకాదు. అగ్ని యొక గ్రామమునుకాని గ్రామములోసగమునుకాని దహించును. ఉదకవేగమన్ననో గ్రామశతమునుసహితము కొట్టుకొనిపోవునని కౌటిల్యుఁడు.

వ్యాధిదుర్భిక్షములలో వ్యాధివలన మరణము శరీరబాధ పరిచారికాపసృష్టము వ్యాయామోపరోధములు కలుగునుగానఁగర్మ వినాశముసంభవించును దుర్భిక్షమన్ననో కర్మోపఘాతికాక హిరణ్యపశుకరముల నిచ్చునదిగనుండునని యాచార్యులు.

అట్లుకాదు. వ్యాధి యేకదేశపీడనము శక్యప్రతీకారము, దుర్భిక్షము సర్వదేశపీడనమై ప్రాణులకు జీవనహాని గలిగించునని కౌటిల్యుఁడు.

మరకమువిషయమునఁగూడనిట్లేయనిగ్రహించునది.

క్షుద్రకక్షయ ముఖ్యక్షయములలో క్షుద్రకక్షయము కర్మానుష్ఠానోపరోధకరమని ఆచార్యులు.

అట్లుకాదు. క్షుద్రులు బహుళసంఖ్యాకులుగాన క్షుద్రకక్షయమును మరలఁబూరించుకొనవచ్చును క్షుద్రులకొఱకై ముఖ్యక్షయమెన్నఁడుఁ గోరఁగూడదు. సత్త్వప్రజ్ఞాధిక్యములచే క్షుద్రులకాశ్రయుఁడగు ముఖ్యుఁడు వేవురుమనుష్యులలో నొక్కఁడునుకూడ నుండుట దుస్సాధ్యమని కౌటిల్యుఁడు

స్వచక్ర పరచక్రపీడలలో నతిమాత్రములగు నపకారములు గలిగించునట్టియు వారింపనశక్యమైనట్టియు స్వచక్రపీడ విశేషముగ

బాధించును. పరచక్రపీడయన్ననో ప్రతియుద్ధమువలనఁగాని యపసారముచేఁగాని సంధిమూలమునఁగాని తొలఁగింప శక్యమగునని యాచార్యులు.

అట్లుకాదు. ప్రకృతిపురుషముఖ్యుల కుపగ్రహవిఘాతములఁ గలిగించి స్వచక్రపీడనమును వారించుకొననగును. మఱియు నది యేకదేశమునే పీడించును. పరచక్రపీడనమన్ననో సర్వదేశపీడనమై విలోపఘాత దాహ విధ్వంసనాపవాహనములచే బాధించునని కౌటిల్యుఁడు.

ప్రకృతిరాజవివాదములలోఁ బ్రకృతిభేదకమును పరాభియోగహేతువునగు ప్రకృతివివాద మధికహానిని గలిగించును. రాజవివాదమన్ననో ప్రకృతులకు ద్విగుణభక్తవేతనములను పరిహారమును కలిగించునని యాచార్యులు.

అట్లుకాదు. ప్రకృతిముఖ్యోపగ్రహమునఁ గలహహేతువును తొలఁగించియుఁ బ్రకృతివివాదమును వారింపవచ్చును. వివాదపడుచుండు ప్రకృతులు పరస్పరసంఘర్షణముచే నుపకారముగూడఁ జేయుదురు. రాజవివాదమన్ననో పీడనోచ్ఛేదనములు గలిగించి ద్విగుణముగ శ్రమపడినఁగాని సాధింపఁదగియుండదని కౌటిల్యుఁడు

దేశరాజవిహారములలో దేశవిహారము (దేశములోఁ బ్రజల విహారము) కాలత్రయమందును కర్మఫలోపఘాతము గలిగించును. రాజవిహారమన్ననో కారుశిల్పి కుశీలవ వాగ్జీవన వైదేహకుల కుపకారముగ నుండునని యాచార్యులు.

అట్లుకాదు. దేశవిహారము కర్మలవలనఁగలుగు శ్రమఁబోఁగొట్టునదియై కొంచెము నష్టమునుమాత్రము గలిగించును. మఱియునది పనులఁజేయుటలోఁ బ్రజలకుఁ బ్రోత్సాహము గలిగించును. రాజవిహారమన్ననో రాజవల్లభులమూలమునను రాజుచేఁగావింపఁబడు బలాత్కారయాచనలమూలమునను పణ్యాగారకార్యోపగ్రహముచేతను ప్రజలకుఁ బీడగలిగించునని కౌటిల్యుఁడు.

రాజభార్యా రాజకుమారులలోఁ గుమారుఁడు స్వామివల్ల ఫలములమునను బలాత్కారయాచనలమూలమునను బహ్యాగార కార్యపరోధముచేతను (ప్రజలను) పీడించును. భార్యయన్నఁ దో విలాసోపభోగమాత్రముచేతనే పీడించునని యాచార్యులు.

అట్లుకాదు. మంత్రిపురోహితుల మూలమునఁ గుమారుని వారింపవచ్చును. బాలికయగుటచేతను నన్యజనసంయోగము గల దియగుటచేతను భార్యనువారించుట సాధ్యముకాదని కౌటిల్యుఁడు.

శ్రేణీముఖ్యులలో బాహుళ్యము ముఖ్యమగుటచే శ్రేణి యన్యులే స్తేయసాహసములచేఁ బీడించును. ముఖ్యుఁడు కార్యానుగ్రహ విఘాతములనుమాత్రము కలిగించునని యాచార్యులు.

అట్లుకాదు. (శ్రేణియు ముఖ్యుఁడును) సమానశీలవ్యసనములఁ గలవారగుటచే ముఖ్యులలోనొక్కనిఁబట్టుకొని శ్రేణీనుల భముగ నణఁచివేయవచ్చును. సహాయసామర్థ్యముగల ముఖ్యుఁడట్లుగాక పరప్రాణద్రవ్యవఘాతము లొనర్చునని కౌటిల్యుఁడు.

సన్నిధాతృసమాహర్తలలో సన్నిధాత కార్యనాశనము గా ర్యనష్టమును కలిగించి పీడించును; సమాహర్త కరణాధిష్ఠితుఁడై నిర్ణీతముగు ఫలోపభోగమాత్రముచేతనే పీడించునని యాచార్యులు.

అట్లుకాదు. ఇతరులచేఁ గోశప్రవేశ్యమని యియ్యఁబడినదానిని మాత్రము సన్నిధాతప్రతిగ్రహించును. సమాహర్త స్వార్థముచే ముందుటసంగ్రహించుకొని పిమ్మట రాజార్థముగొనఁబడయత్నించును లేక రాజార్థమునకు వినాశముగలిగించును. మఱియుఁ బరధనమును తీసికొనుటలో స్వతంత్రుఁడై చరించునని కౌటిల్యుఁడు.

అంతపాలవైదేహకులలో నంతపాలుఁడు చోరులను ప్రవేశ పెట్టియు, నియ్యవలసినపన్నులకంటె నెక్కుడుపుచ్చుకొనియు, వణిక్పథమును పీడించును. వైదేహకుఁడు పణ్యప్రతిపణ్యానుగ్రహముచే దేశమునకు మేలుచేయునని యాచార్యులు.

అట్లుకాదు. అంతపాలుఁడు పణ్యసమూహముల దేశములోనికిఁ బంపుటయం దుపయోగించును. వైదేహకులన్ననో అందఱేకీభవించి పణ్యములధరల హెచ్చించుచుఁ దగ్గించుచు నూటికినూఱుచొప్పున లాభముపొందఁ బ్రయత్నింతురని కౌటిల్యుఁడు.

అభిజాతోపరుద్ధయగు భూమియా లేక పశువ్రజోపరుద్ధయగు భూమియా విశేషింపఁదగినది? అభిజాతోపరుద్ధయగుభూమి మహాఫలమునిచ్చుచు నాయుధీయులఁ గూర్చునట్టిదైనను అభిజాతునివలన వ్యసనాబాధభయము కలుగును కావున దానిని విశేషింపఁదగదు. పశువ్రజోపరుద్ధయగునది కృషియోగ్యమైయుండును. వివీతముకంటె క్షేత్రముత్తమము. కావున దానినివిడిపింపవలెనని ఆచార్యులు.

అట్లుకాదు. అభిజాతోపరుద్ధయగునది మహోపకారియైయుండినను దభిజాతునిచే వ్యసనాబాధకలుగకుండుటకై విడిపింపఁదగియున్నది. పశువ్రజోపరుద్ధయగునది కోశవాహనోపకారిణి యగుటచే సస్యోపరోధియగునప్పుడు తప్పఁ దక్కినప్పుడు విశేషింపఁదగినది కాదని కౌటిల్యుఁడు.

ప్రతిరోధకాటవికులలోఁ బ్రతిరోధకులు రాత్రియందు స్త్రీపరులై శరీరముల నాక్రమించుచు నెల్లప్పుడు శతసహస్రములపహరింతురు. ఆటవికులన్ననో ప్రధానులకులోఁగి సమీపారణ్యములందస్పష్టులైచరించుచు నేకదేశమాత్రఘాతకులగుదురని ఆచార్యులు.

అట్లుకాదు. ప్రతిరోధకులు ప్రమాదమొందినవారిని మాత్రమపహరింతురు. (వారిలో) అసమర్థులగువారిని సులభముగఁబట్టుకొనుటకును తెలిసికొనుటకును వీలుపడియుండును. ఆటవికులన్ననో తమప్రదేశములందుండి యెక్కువసంఖ్యగలవారై పరాక్రమవంతులై ప్రకాశముగ యుద్ధముచేయుచు రాజులవలె దేశోపద్రవకారులగుదురని కౌటిల్యుఁడు.

మృగవనహస్తివనములలో— మృగములు సంఖ్యాబాహుళ్యముగలవై యధికముగ మాంసచర్మములనిచ్చునవియై యల్పముగ

గా ప్రసక్లేశముగలిగించుచు సులభముగ స్వాధీనము చేసికొనఁగలవియు గాను. ఏనుఁగులిట్లుగాక పట్టుకొనఁబడినతర్వాతఁగూడ దేశవినాశకరములుగఁ గన్పట్టును.

స్వస్థానీయ పరస్థానీయోపకారములలో స్వస్థానీయోపకారము ధాన్యపశుహిరణ్యకుప్యోపకారియై యాపదలందు జానపదులకు సంరక్షకమగును. పరస్థానీయోపకారమట్టిదికాదు.

ఇవియే పీడనములు.

ముఖ్యులవలనఁగలుగు ప్రతిరోధమాభ్యంతరస్తంభము; మిత్రాటవులవలనఁగలుగునది బాహ్యస్తంభము— ఇదియే స్తంభవర్గము. వీనిచేతను, వెనుకచెప్పినపీడనములచేతను, కోశమునకుఁగలుగు పీడలు ముఖ్యాసక్తము పరిహారోపహతము ప్రకీర్ణము మిథ్యాసంభృతము సామంతాటవీభృతము అనినైదువిధములు.

పీడనములు పుట్టకుండునట్లుగను, పుట్టినవానిని వారించుటకును స్తంభసంగములు తొలఁగునట్లుగను దేశవృద్ధికై ప్రయత్నింపవలెను.

ఇది వ్యసనాధికారికమందు పీడనవర్గము స్తంభవర్గము కోశసంగవర్గమను నాలుగవయధ్యాయము.

ఆదినుండి నూటయిరువదియవ యధ్యాయము.



## 133-4 ప్రకరణము.

### బలవ్యసనవర్గము, మిత్రవ్యసనవర్గము.

అమానితము విమానితము అభృతము వ్యాధితము నవాగతము దూరాయాతము పరిశ్రాంతము పరిక్షీణము ప్రతిహతము హతాగ్రవేగము అనృతుప్రాప్తము అభూమిప్రాప్తము ఆశానిర్వేది పరిసృప్తము కళత్రగర్హి అంతశ్శల్యము కుపితమూలము భిన్నగర్భము అతిస్రుతము అతిక్షిప్తము ఉపనివిష్టము సమాప్తము ఉపరుద్ధము ఉపక్షిప్తము భిన్నధాన్యపురుషవీవధము స్వవిక్షిప్తము మిత్రవిక్షిప్తము దూష్య

యుక్తము దుష్టపార్ష్ణిగ్రాహము శూన్యమూలము అస్వామిసంహత
ము భిన్నకూటము అంధము — ఇవి బలవ్యసనములు.

అమానితవిమానితబలములలో నమానితబలము లబ్ధమా
నములొసంగినచో యుద్ధముచేయును. అంతఃకుపితమగుటచే విమా
నితబలమట్లు ప్రవర్తింపదు.

అభృతవ్యాధితములలో నభృతమప్పటికప్పుడు వేతనమియ్యం
బడినదై యుద్ధము చేయును. కర్మల కుపయోగింపనిదగుటచే వ్యాధి
తమట్లు చేయఁజాలదు.

నవాగతదూరయాతములలో నవాగత ముపలబ్ధదేశస్థానవ
మిశ్రమై యుద్ధముచేయును. దూరయాత మాయాతగతిపరిక్లేశ ము
గుటచేనట్లుపయోగింపదు.

పరిశ్రాంతపరిక్షీణములలోఁ బరిశ్రాంతసైన్యము స్నానభో
జనస్వప్నములచే విశ్రాంతిపొందినదై యుద్ధముచేయును. యుగ్య
పురుషక్షయమొందినదగుటచేఁ బరిక్షీణసైన్యమట్లు చేయఁజాలదు.

ప్రతిహతహతాగ్రవేగసైన్యములలోఁ బ్రతిహతబల మగ్ర
పాతభగ్నమయినను ప్రవీరపురుషులతోఁ గలిపినయెడల యుద్ధము
చేయును. అగ్రభాగమందుండు ప్రవీరులు వినాశమొందినందున
హతాగ్రవేగబలమట్లు చేయఁజాలదు.

అనృతుప్రాప్తభూమిప్రాప్తములలో ఋత్వనుసారముగ
శస్త్రావరణములొంది యనృతుప్రాప్తబలము యుద్ధముచేయును
ప్రసార వ్యాయామావరుద్ధమగు నభూమిప్రాప్తబలమట్లుచేయ
జాలదు.

ఆశానిర్వేది పరిసృప్తబలములలో మొదటిది లబ్ధాభిప్రా
ముగలదై యుద్ధముచేయును. పరిసృప్తబలము చెదరినదగుటచే
ట్లుపయోగింపదు.

కళత్రగర్హి అంతశ్శల్యము వీనిలో మొదటిది కళత్రవ

వాలి యుద్ధముచేయును. అంతశ్శత్రుగ్రస్తముగల రెండవది యట్లు చేయఁజాలదు.

కుపితమూల భిన్నగర్భములలో సామదానాదులచేఁ గోపశాంతిఁబొందిన కుపితమూలము పనిచేయును. పరస్పరభిన్నమైన భిన్నగర్భమట్టిది కాదు.

అపసృతాతిక్షిప్తములలో మంత్రివ్యాయామముల కారణమునఁగాక ఏకరాజ్యాతిక్రాంతమయినది శత్రుమిత్రులయాశ్రయముంది యుద్ధముచేయును. అనేకరాజ్యాతిక్రాంతమగు నతిక్షిప్తసైన్యము బహుబాధాకరమై యట్లుచేయఁజాలదు.

ఉపనివిష్టసమాప్తములలో నుపనివిష్టబలము భిన్నములగు నస్థానమతిస్కంధావారముగలదై యుద్ధముచేయును. ఏకస్థానయానముబంధుమాత్రము పరిచయముగల సమాప్తమట్లుపయోగింపదు.

ఉపరుద్ధపరిక్షిప్తములలో నుపరుద్ధబలము ప్రదేశాంతరమునకు వెళ్లి యుపరోధకముతో యుద్ధముచేయును. సర్వతఃప్రతిరుద్ధమగు పరిక్షిప్తమట్లు చేయఁజాలదు.

ఛిన్నధాన్య ఛిన్నపురుషవీవధములలో ఛిన్నధాన్యబలము మఱియొకప్రదేశమునుండి ధాన్యమును తెచ్చుకొనిగాని జంగమస్థావరాహారముల మూలమునఁగాని యుద్ధముచేయును. అనభిసారమగు ఛిన్నపురుషవీవధమట్లు చేయఁజాలదు.

స్వవిక్షిప్త మిత్రవిక్షిప్తములలో స్వభూమియందుండు సైన్యమాపత్కాలమందుఁ దొలఁగింపశక్యమగును. మిత్రునియొద్దనుండు సైన్యమును దేశకాలములు దూరములగుటచే నట్లుచేయుటకు వీలుపడదు.

దూష్యయుక్త దుష్టపార్ష్ణిగ్రాహములలో నాప్తపురుషాధిష్ఠితమునను నసంహతమునను నైనచో దూష్యయుక్తబలము యుద్ధమునకుపయోగించును దుష్టపార్ష్ణిగ్రాహమన్ననో వెనుకనుండి దెబ్బలుతగులునను భయముగలదగుటచే నట్లుపయోగింపదు.

శూన్యమూలాస్వామిసంహతబలములలో శూన్యమూలము పౌరజానపదులసహాయమును, తదితరసహాయమునుపొంది యుద్ధము చేయఁగలిగియుండును. రాజసేనాపతిహీనమగుటచే నస్వామిసంహత మట్లుచేయఁజాలదు.

భిన్నకూటాంధ (వినాయక) బలములలో భిన్నకూటము మఱియొకముఖ్యునిచే నధిష్ఠింపఁబడి యుద్ధముచేయును. అంధబలము నేతృలేనిదగుటచే నట్లుచేయఁజాలదు.

దోషనివారణము బలసంపాదనము శత్రుస్థానాతిసంధానము ముఖ్యులతోసంధి— ఇవి బలవ్యసనములఁ బోఁగొట్టుకొనుట కుపాయములు.

నిత్యోత్థితుఁడై స్వసైన్యము వ్యసనముగలిగినపుడు శత్రువులనుండి దానిని రక్షించుకొనుచు శత్రుసైన్యమందు లోపములగ ఏర్పడినపుడు దానిని (శత్రుసైన్యమును) ప్రహరింపవలెను,

దేనిచేఁ బ్రకృతులకు వ్యసనము సంభవించునో దానిపైముందుగనే జాగరూకుఁడై యాకారణమును తొలఁగించుకొనవలెను.

స్వయముగఁగాని యితరునితోఁగలిసిగాని యితరుల ప్రోత్సాహముచేఁగాని యభియాతుఁడైనట్టి మిత్రుఁడును; అశక్తిలోభప్రణయములచేఁ దన్నుఁబరిత్యజించినట్టి మిత్రుఁడును; సంగ్రామమందుఁ దొలఁగిపోవునట్టివానికి వశుఁడగు మిత్రుఁడును; వేరుగఁగాని సహయానమునఁగాని మఱియొకమిత్రునిపై దండెత్తువానితో ద్వైధీభావ విశ్వాసములచేఁ గలిసినట్టిమిత్రుఁడును, భయావమానాలస్యములచే వ్యసనమునుండి రక్షింపఁబడనట్టి మిత్రుఁడును, స్వభూమియందే యవరుద్ధుఁడైనట్టియు భయపడి సమీపమునుండి వెడలిపోయినట్టియు విస్తారము నష్టముఁ బొందినట్టియుఁ దనకురావలసినది రాకపోవుటచే నసంతృప్తిఁబొందినట్టియు, ఇచ్చినతర్వాత విమానితుఁడగునట్టియు మిత్రుఁడును, స్వయముగఁగాని పరులప్రోత్సాహముచేఁగాని యప

హృతార్థుఁడగునట్టియుఁ గోరఁబడి యశక్తిచే నుపేక్షింపఁబడి విరోధితుఁడైనట్టియు మిత్త్రుఁడు నతికష్టము గాఁద వశులగుదురు. వశులై గూఢశీఘ్రముగనే విరోధమొందుదురు.

మైత్రియందలి కష్టసుఖముల నెఱిఁగినవాఁడు మాన్యుఁడు ప్రమాదముచే నవగానింపఁబడినవాఁడు సమముగ గౌరవింపఁబడనివాఁడు శక్తికొలఁదిని వారింపఁబడినవాఁడు మిత్త్రోపఘాతమగునని భయపడువాఁడు శత్రువులు కలియుటవలనఁ దనకపాయము వచ్చునని శంకించువాఁడు దూష్యులచే భేదింపఁబడినవాఁడు—ఇట్టిమిత్త్రుఁడు సాధ్యుఁడగును సాధింపఁబడి విరక్తుఁడు గాకుండును.

కావున మిత్త్రోపఘాతకములగు నీదోషములను గలిగించుకొనక, ఉత్పన్నములయినవానిని సహితము దోషోపఘాతకములగు గుణములచేఁ దొలఁగించుకొనవలెను.

ఇది వ్యసనాధికారికమను నష్టమాధికరణమందుఁ బలవ్యసనవర్గమిత్త్రవ్యసనవర్గములను అయినవ యధ్యాయము.

ఆదినుండి నూటయిరువదియొకటవ యధ్యాయము



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున

వ్యసనాధికారికమను నెనిమిదవ యధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## 9 యధికరణము — అభియానము చేయువానికర్మ.

### 135-6 ప్రకరణము.

#### శక్తిదేశకాలబలాబలజ్ఞానము, యాత్రాకాలములు.

విజిగీషువు తనయొక్కయుఁ బరునియొక్కయు బలాబలములను శక్తి దేశకాల యాత్రాకాల బలసముత్థానకాలములను పిమ్మటఁ గలుగు క్షయవ్యయలాభాపత్తులను తెలిసికొని విశిష్టబలుఁడైనచో యానముఁజేయువలెను, లేనిచో నూరకుండవలెను.

ఉత్సాహప్రభావములలో నుత్సాహము శ్రేయస్కరము. స్వయముగ శూరుఁడును బలవంతుఁడును నరోగియుఁ గృతాస్త్రుఁడు నునగు రాజు కేవలము దండద్వితీయుఁడునగు ప్రభావముగలరాజును జయింపసమర్థుఁడగును. వీనిసైన్యమల్పమయినను తేజస్సుగలదగుటచేఁ బనులఁజేయ సమర్థతగలిగియుండును. నిరుత్సాహుఁడగు రాజు ప్రభావవంతుఁడయినను ప్రాజ్ఞుఁడయినను నశించుననియాచార్యులు.

అట్లుకాదు. ప్రభావవంతుఁ డుత్సాహముగలరాజునుసహితము తన ప్రభావముచే జయించును. ఉత్సాహవంతుఁడగు మఱియొక రాజునుపిలిపించి ప్రవీరసైన్యములను క్రయమిచ్చికొని ప్రభూతప్రభావముగల హయహస్తిరథోపకరణ సంపన్నుఁడగును. (అందుచే) వీనిసేన సర్వప్రదేశములం దప్రతిహతమై చరించును. ప్రభావవంతులు స్త్రీలయినను బాలురయినను సంగువులయినను అంధులయినను ఉత్సాహవంతుల జయించియు వారినిఁగొనియు భూమినివశపరుచుకొనిరని కౌటిల్యుఁడు.

ప్రభావమంత్రములలోఁ బ్రభావము శ్రేయస్కరము. అప్రభావుఁడు మంత్రశక్తిసంపన్నుఁడయినను వానిబుద్ధియంతయు వ్యర్థమగును. గర్భధాన్యము నవృష్టివలె నప్రభావుఁడగు వీనినిశ్చితమును మంత్రకర్మ నాశముగావించునని ఆచార్యులు.

అట్లుకాదు. మంత్రశక్తియే శ్రేయస్కరమయినది. ప్రజ్ఞాశాస్త్రచక్షువగు రాజల్పప్రయత్నముచేత మంత్రమును నిలుపుకొని యుత్సాహప్రభావములుగల శత్రువులనుసహితము సామాదులచేతను యోగోపనిషత్తులచేతను మోసపెట్టుటకు సమర్థుఁడగును. ఈ విధముగ నుత్సాహప్రభావమంత్రశక్తులలో నుత్తరోత్తరములచే నధికుఁడగువానికి జయముకలుగునని కౌటిల్యుఁడు.

దేశమనఁగాఁ బృథివి. దానియందు హిమవంతము మొదలు సముద్రము వఱకునుకల ప్రదేశములో నుత్తరభాగమున యోజనసహస్రపరిమితిగల భాగము చక్రవర్తిక్షేత్రము. అట్టిక్షేత్రమున నరణ్యములు గ్రామములు నీటిధారలు సమవిషమప్రదేశములు లోనగునవి యుండును. స్వబలవృద్ధికరమగునట్లుగ వానియందుఁ గార్యముచేయుంపవలెను ఏభూమి స్వసైన్యవ్యాయామములకుఁ దగియుండి పరసైన్యవ్యాయామములకుఁ దగియుండదో అది యుత్తమదేశము. దీనికి విపరీతమగునది యధమము ఉభయసాధారణమగునది మధ్యమము.

కాలము శీతోష్ణవర్షాత్మకమైయుండును. అందు రాత్రిపగలు పక్షము మాసము ఋతువు సంవత్సరము యుగమని భేదములు. వానియందు స్వబలవృద్ధికరమగునట్లు కార్యములుచేయుంపవలెను. ఏకాలము స్వసైన్యవ్యాయామముల కనుకూలమై పరసైన్యముల కననుకూలమైయుండునో అది యుత్తమకాలము. తద్విపరీత మధమకాలము. ఉభయసాధారణమగునది మధ్యమము.

శక్తిదేశకాలములలో శక్తి శ్రేయస్కరి. శక్తిమంతుఁడు

నిమ్నస్థలములుగల ప్రదేశమందును శీతోష్ణవర్షాత్మకమగు కాలమందును వలయు ప్రతీకారము లొనర్పసమర్థుఁడగునని ఆచార్యులు.

దేశమే శ్రేయస్కరము. స్థలగతమయిన శ్వానము మొసలిని నిహీనము లాగివేయఁగలదు. నిమ్నగతమగు నక్రము శ్వానమును లాగివేయునని కొందఱు.

కాలమే శ్రేయస్కరము. పగటియందుఁ గాకము గూబను చంపుచున్నను రాత్రియందు గూబ కాకిని చంపును కదా? యని మఱికొందఱు.

అట్లుకాదు. శక్తిదేశకాలములు మూఁడును పరస్పరసాధకములని కౌటిల్యుఁడు.

అట్టి, శక్తిదేశకాలములవలన వృద్ధిపొందినవాఁడై సైన్యములో మూఁడవవంతుగాని నాలుగవవంతుగాని రక్షణకొఱకు మూలపార్ష్ణిప్రత్యంతాటవులయందుంచి కార్యసాధనసహమగు కోశదండములఁదీసికొని వెనుకటిది, పాతదియగు నాహారసామగ్రినిమాత్రము గలిగినట్టియు నవధాన్యమును సంగ్రహింపనట్టియు, దుర్గసంస్కారమొనరింపనట్టియు శత్రువునకు వానివార్షికసస్యమును హైమంతముష్టిని చెఱచుటకు మార్గశీర్షమునందు యాత్రచేయవలెను. హైమంతసస్యమును వాసంతికముష్టిని చెఱచుటకుఁ జైత్రమాసమున యాత్రచేయవలెను. క్షీణతృణకాష్ఠోదకములుగలిగినట్టియు దుర్గసంస్కారణమొనర్చుకొననట్టియు శత్రువునకు వానివాసంతికసస్యమును వార్షికముష్టిని చెఱచుటకు జ్యేష్ఠమాసమున యాత్రచేయవలెను. అత్యుష్ణము నల్పయవసేంధనోదకములును కల దేశమునకు హేమంతమున యాత్రచేయవలెను. తుషారమేఘచ్ఛన్నమైనట్టియు నగాధనిమ్నప్రాయమైనట్టియు గహనతృణవృక్షములను కలిగినట్టియు దేశమునకు గ్రీష్మమందు వెళ్ళవలెను. స్వసైన్యవ్యాయామయోగ్యమైనట్టియుఁ బరసైన్యమున కయోగ్యమైనట్టియు దేశమునకు వర్షఋతువున వెళ్లవలెను.

మార్గశీర్ష చైత్రములకు నడుమ దీర్ఘకాలయాత్రను చైత్ర వైశాఖములకు నడుమ మధ్యమకాలయాత్రను జ్యేష్ఠాషాఢములమధ్యను హ్రస్వకాలయాత్రను చేయవలెను.

వ్యసనాభియానమునుగుఱించి విగ్రహించి యానముచేయుట అను ప్రకరణమునఁ జెప్పఁబడినది.

శత్రుఁడు వ్యసనమందున్నప్పుడు తప్పకుండ నతనిపయికి వెళ్లవలెనని యాచార్యులు.

వ్యసనము లనైకాంతికములగుటచే స్వశక్త్యభివృద్ధినిచూచుకొనియే శత్రునిపయికి వెళ్లవలెనని కౌటిల్యుఁడు. ఎప్పుడుబయలుదేరినచో శత్రునిఁగర్శించుటకును ఛేదించుటకును వీలగునో యప్పుడే వెళ్లవలెను.

మిక్కిలివేఁడిలేని కాలమున హస్తిబలప్రాయుఁడుగ వెళ్లవలెను. ఏనుఁగు లంతస్స్వేదముగలిగి కుష్ఠులైయుండును. జలావగాహమును జలపానములేనిచో వేగముచెడి కోపావేశములఁ బొందును. కావునఁ బ్రభూతోదక దేశమందును వర్షాకాలమందును హస్తిబలప్రాయుఁడై వెళ్లవలెను. తద్విపరీతకాలమందును నల్పవర్షపంకములగు దేశమందును ఖరోష్ట్రాశ్వబలప్రాయుఁడై వెళ్లవలెను. వర్షాకాలమందు మరుప్రాయప్రదేశములపైఁ జతురంగబలములతో వెళ్లవలెను. మార్గముయొక్క సమవిషమనిమ్నస్థల హ్రస్వదీర్ఘతలఁబట్టి యాత్రనేర్పఱచుకొనవలెను.

కార్యము సులభసాధ్యమయినచో స్వల్పకాలమునకే యాత్రను సవరించుకొనవలెను; కార్యముగొప్పదయినచో దీర్ఘకాలయాత్రను చేయుటయేగాక పరదేశమందు సహితము వర్షావాసము చేయవచ్చును.

ఇది యభియానముచేయువానికర్మయను నవమాధికరణమున
శక్తిదేశకాలబలాబలజ్ఞానయాత్రాకాలములను
మొదటి యధ్యాయము
ఆదినుండి నూటయిరువదిరెండవయధ్యాయము.

## 137-39 ప్రకరణములు.

### బలోపాదానకాలములు, సన్నాహగుణములు ప్రతిబలకర్మ

మౌల భృతక శ్రేణీ మిత్రా మిత్రాటవీబలముల సంగ్రహించు కాలములు:—

మౌలరక్షణమునకుఁ గావలసినంతకంటె నధికముగ మౌలబలముండునపుడును, అత్యధికసంఖ్యగలది యగుటచేనది మౌలమందుంచినచో వికారిమొందునని తోఁచునపుడును, ప్రతియోద్ధబహుళానురక్తమౌలబల సారబలములు గలవాఁడగుటచే వ్యాయామము గలవారిచేతనే యోధింపఁదగినవాఁడని తోఁచునపుడును; మార్గమును కాలమును దీర్ఘములగునను మౌలబలమే క్షయవ్యయసహమై యుండునని తోఁచునపుడును భృత్యాదిసైన్యములు బహుళానురక్తములయ్యు యాతవ్యోపజాపమునకు లోఁగునను భయముకలిగినపుడును, సర్వసైన్యములకు బలక్షయమగునపుడును మౌలబలమునుపయోగింపవచ్చును.

నా భృతబలము మిక్కిలియధికముగ నున్నది; నామౌలబలమల్పమైయున్నది. పరునిమౌలబల మల్పమును విరక్తమును నై యున్నది. వాని భృతసైన్యమసారముగను ఫల్గుప్రాయముగ నున్నది. అల్పవ్యాయామముతోఁ గూడినమంత్రముచే యుద్ధముచేయవచ్చును. దేశకాలములు హ్రస్వముగను తనుక్షయవ్యయములుగనున్నవి. నా సైన్యము సోమరితనములేక శత్రూపజాపమునకు లోఁగక విశ్వసింపఁదగినదిగనున్నది. శత్రుప్రాకారమల్పమగుటచే నతఁడు సులభసాధ్యుఁడని తోఁచునపుడు భృతబలము నుపయోగింపవలెను.

నా శ్రేణీబలము ప్రభూతమగుటచే మౌలమందుంచుటకును యాత్రయందుపయోగించుటకును చాలియున్నది. నాప్రవాసము హ్రస్వము. శత్రువు శ్రేణీబలప్రాయుఁడై మంత్రవ్యాయామములచే యుద్ధముచేయఁదలఁచియున్నాఁడని తోఁచునపుడు శ్రేణీబలము నుపయోగింపవలెను.

నామిత్రబలమధికమగుటచే మూలమునందుంచుటకును యాత్రయందుపయోగించుటకును చాలియున్నది. నాపరివారమల్పము. మంత్రియుద్ధముకంటె వ్యాయామయుద్ధమే విశేషముగనుండును. మొదట మిత్రబలముచే నటవీనగరస్థానములను వశపఱచుకొని యాసారునిఁగొట్టి తర్వాతస్వబలముచే యుద్ధముచేయించెదను. ఈనాకార్యముమిత్రసాధారణమైయున్నది. ఈనాకార్యసిద్ధిమిత్రాయత్తమైయున్నది; నామిత్రుఁడు సన్నుఁడు ననుగ్రాహ్యుఁడై యున్నాఁడు. వీని యత్యధికసైన్యమును సాధింపవలెనని తోఁచునపుడు మిత్రబలముపయోగింపవలెను.

పరిభూతమగు నాశత్రుబలమును నగరస్థానాటవులకై వేఱొక శత్రుబలముచే యుద్ధముచేయించెదను. శ్వవరాహకలహమందుఁ జండాలునికివలె దానియందునాకేదియోయొక సిద్ధికలుగును. దీనిచే నాసారాటవిక కంటకమర్దనము చేయింపఁగలను. అత్యుపచితమును నిత్యమును కోపభయమువలన నాసన్నమునునగుశత్రుబలమును నాభ్యంతరకోపశంకవలనవేఱొకప్రదేశమునకుఁబంపవలెను. ఇది శత్రుయుద్ధావరయుద్ధకాలమని తోఁచునపుడుశత్రుబలము నుపయోగింపవలెను.

అటవీబలకాలముకూడ నిట్లేయని గ్రహింపనది.

అటవీబలము మార్గోపదేశికమును శత్రుభూమియోగ్యమును శత్రుయుద్ధప్రతికూలమును నగునని తోఁచునపుడును, శత్రుఁడటవీబలప్రాయుఁడుగను నల్పప్రమాణుఁడునైనప్పుడును బిల్వమును బిల్వముచేతనే కొట్టవలెనను న్యాయానుసారముగ నటవీబలమునుపయోగింపవలెను.

ఎక్కువసంఖ్యగలదియు ననేకజాతిపురుషులతోఁగూడినదియుఁ జెప్పినను చెప్పకుండినను భక్తవేతనములియ్యకుండినను లోపములఁ బూరించుటకుఁ బ్రయత్నించునదియు నుత్సాహముతోఁ గూడినదియు పరలోపమవృష్టి ప్రతాపకరమయినదియు స్వాభేద్యమయినదియుఁ

ఏకాభిప్రాయము గలదియు, తుల్యదేశజాతి శిల్పప్రయోజనము గలదియు సంహతమునగు సైన్యము గొప్పది.

ఇవి బలోపాదానకాలములు.

వీనిలో నమిత్రాటవీబలమును కుప్యభృతముగను విలోపభృతముగను చేయవలెను.

శత్రువునకు బలకాలముత్పన్నమైనపుడు వానిని తొలగించుటగాని మఱియొకప్రదేశమునకుఁ బంపుటగాని వాని ప్రయత్నములఫలములగునట్లుగాని వానిసైన్యమును విక్షిప్తము సేయునట్లుగాని చేయవలెను. వాని బలకాలమతిక్రమించినచో వానిని విడువవలెను. శత్రువునకుఁగలుగు బలసముత్థానమును విఘాతమొనర్చి స్వబలసంపాదనము చేసికొనవలెను.

పై బలములలో మొట్టమొదటివి ఉత్తరోత్తరములకంటె నెక్కువ సన్నాహయోగ్యములు.

రాజాభిప్రాయము ననుసరించునదగుటచేతను నిత్యసంస్కారమును పొందునదియగుటచేతను మూలబలము భృతబలముకంటె శ్రేయస్కరము.

ఎల్లప్పుడు సమీపమునందుండునదియు వేగముగ యుద్ధమునకు బయలుదేరునదియు వశ్యమయినదియు నగు భృతబలము శ్రేణీబలముకంటె శ్రేయస్కరము.

జానపదమును ఏకార్థోపగతమును తుల్యసంఘర్షామర్షసిద్ధిలాభమునునగు శ్రేణీబలము మిత్రబలముకంటె శ్రేయస్కరము. అపరిమితదేశకాలములు గలదయినను శ్రేణీబలమే కార్యోపగతమగుటచే మిత్రబలముకంటె శ్రేయస్కరము.

ఆర్యాధిష్ఠితమగు నమిత్రబలమాటవీబలముకంటె శ్రేయస్కరము. ఈ రెండు బలములకెల్లప్పుడు విలోపమందుత్సాహముండును. వానివలన నహిభయము సంప్రాప్తించును.

బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రసైన్యములలో దేహసారాధిక్యమును బట్టి పూర్వపూర్వములు శ్రేయస్కరములని ఆచార్యులు తలంతురు. నమస్కారమొకటిచేసి శత్రువు బ్రాహ్మణబలమును వశపఱచుకొనును. కావునఁ బ్రహరణవిద్యావినీతమగు క్షత్రియబలము శ్రేయస్కరము. లేక బహుళసారముగల వైశ్యశూద్రబలములుకూడ శ్రేయస్కరములని కౌటిల్యుఁడు.

కావున, శత్రునకిట్టిబలమున్నది: దానికిదిప్రతిబలమని బలసముత్థానము చేయవలెను.

హస్తియంత్రశకటగర్భకుంతప్రాసఖర్వటకవేణుశల్యయుతమగు బలము హస్తిబలమునకుఁ బ్రతిబలము. అస్త్రపాషాణలగుడావరకాంకుశకచగ్రహణీప్రాయమగుబలము రథబలమునకుఁ బ్రతిబలము. అశ్వబలమునకుఁగూడ నిదియే ప్రతిబలము. కవచధారులగు మనుష్యులు హస్తిబలమునకును, అశ్వములు కవచధారులకును ప్రతిబలము. కవచధారులు రథములు ఆవరణధారులగుపదాతులు చతురంగబలమునకును ప్రతిబలము.

ఈరీతిగఁబరసైన్యనివారణముగ స్వసైన్యాంగభేదముల ననుసరించి విభవముతో బలసముత్థానము చేయవలెను.

ఇది యభియానముచేయువాని కర్మయను నవమాధికరణమున
బలోపాదానకాలములు సన్నాహగుణములు ప్రతిబలకర్మయను
రెండవ యధ్యాయము.
ఆదినుండి నూటయిరువదిమూఁడవ యధ్యాయము.



## 140-1 ప్రకరణము.

— పశ్చాత్కోపచింత, బాహ్యాభ్యంతరప్రకృతికోపప్రతీకారములు. —

అల్పమగుపశ్చాత్కోపము (పృష్ఠభాగమునుండికలుగుబాధ) పురోభాగమందలి మహాలాభముకంటె గరీయము. ప్రయాతునకుఁ గలుగు పశ్చాత్కోపమల్పమయినను దూష్యమిత్రాటవికులు కలు

వైపులనుండి దానిని వృద్ధిచేయుదురు. ఏమాటలభించులాభము నో ప్పనయినను దానివలనబ్రకృతికోపము కలుగవచ్చును. ఇట్టిసందర్భ మున వెనుకనుండుశత్రువునకు భృత్యమిత్రక్షయవ్యయములుగలిగించి ముందుభాగమునందలుగు లాభమువిషయమై సేనాపతికుమారులలో నొకనిని దండచారునిగఁ జేయవలెను.

పశ్చాత్కోపమును తొలఁగింపనసమర్థుఁడగునట్టి బలవంతుఁ డగురాజు పురోభాగమందలిలాభముఁ బొందుటకు స్వయముగ వెళ్ళ వచ్చును. అభ్యంతరకోపము కలుగునని తోఁచినపుడు శంకితులను వెంటఁబెట్టుకొని వెళ్ళవలెను.

బాహ్యకోపశంకకలిగినపుడు పుత్రదారుల నాభ్యంతరప్ర దేశమందుంచి శూన్యపాలబలము ననేకవర్గములుగఁజేసి వానిపైన నేకముఖ్యుల నియమించి వెళ్ళవలెను; లేదా వెళ్లుట మానవలెను. అభ్యంతరకోపము బాహ్యకోపముకంటె పాపీయమని పూర్వమే చెప్పఁ బడియున్నది.

మంత్రిపురోహితసేనాపతియువరాజులలో నొకరు ప్రకోపిం చుట యభ్యంతరకోపము. దానినాత్మదోషముచేఁగాని పరునివలన నపాయము కలుగునని చెప్పిగాని సాధింపవలెను. పురోహితుఁడు మ హాపరాధముగావించినను వానికి సంరోధనాపనారణములమాత్రమే చేయవలెను; యువరాజపరాధమొనర్చినపుడు గుణవంతుఁడగుమఱి యొకపుత్రుఁడుండినయెడల సంరోధనిగ్రహములచే నతనిని శిక్షింప వలెను. మంత్రి సేనాపతుల విషయమునఁగూడ నిట్లేయని గ్రహిం చునది.

రాజ్యమును గ్రహింపఁదలఁచుభ్రాతను పుత్రునిఁ గులబంధు వును ఉత్సాహముచే సాధింపవలెను. అట్లువీలుగానపుడు గృహీతా నువర్తనసంధికర్మలచేతనయినను శత్రుసంధానముగావింతునని భయ పెట్టియు లేక అట్టివారినుండి భూమినిప్పించియు వానికివిశ్వాసము కలిగింపవలెను. లేక స్వయంగ్రాహసైన్యమును వారికిసహాయముగ

గనిచ్చి సామంతాటవికులపైఁ బంపి వారివలనఁ గలిగిన విగ్రహము మూలమున మోసపెట్టవలెను. లేక అవరుద్ధావధాన పారగ్రామిక విషయమునఁ జెప్పఁబడిన విధానము లొనర్పవలెను. మంత్రి సేనాపతులవిషయమునఁగూడ నిట్లే యని గ్రహించునది.

ముఖ్యమంత్రితప్పఁ దక్కినయమాత్యులలో నొకనికిఁ గలుగు కోపమంతరమాత్యకోపము. దానివిషయమునఁగూడఁ దగినయుపాయములఁ బ్రయోగింపవలెను.

రాష్ట్రముఖ్యాంతపాలాటవికదండోపనతులలో నొకరికి జనించినకోపము బాహ్యకోపము. వారిలోఁ బరస్పరభేదము గలిగించి దానినితొలఁగించుకొనవలెను. లేక వాఁడు దుర్గప్రతిస్తబ్ధుఁడయిన చో సామంతాటవిక తత్కులీనావరుద్ధులలో నొకనిమూలమున వానిని పట్టుకొనవలెను. లేక అతఁడు శత్రువుఁ బొందకుండునట్లు మిత్రుని సహాయమునఁ బట్టుకొనవలెను.

లేక, యతఁడు నిన్ను యోగపురుషునిఁగఁ దలఁచి నీభర్తపై విక్రమింపఁజేసి కార్యసాఫల్యమొంది తర్వాత నమిత్రాటవికులపై సహాయునిగఁ జేసి దీర్ఘప్రవాసమందు నిన్ను నియోగించును, లేక నీపుత్రదారలకు దూరముగ నిన్నుఁ బంపివేయును. ప్రక్రమము చెడిన నిన్ను భర్తకుఁ బణ్యముగ విక్రయించును. నీతోసంధి చేసికొని నీభర్తయనుగ్రహమును సంపాదించుకొనును. లేక అధికుఁడగు మిత్రునిన యునఁ బొందుననిచెప్పి కుపితుని శత్రుప్రునుండి సత్రియగువాఁడు భేదపెట్టి దానికంగీకరించినచో వానినిష్టానుసారముగఁ బూజింపవలెను. అంగీకరింపనిచో, ఈభేదమంతయు యోగపురుషులచేఁ గావింపఁబడినదని వానివిశ్వాసమును పొందవలెను. లేక స్పష్టముగశాసనములుగలవారిచేఁగాని గూఢపురుషులచేఁగాని వానిఁజంపింపవలెను. లేక వానివెంట సహప్రస్థితులుగఁ బ్రవీరపురుషులఁ గొంతమందిని పంపి వారిచేనయిన వానిని చంపింపవలెను. దీనిచేఁ గార్యసిద్ధియగును.

శత్రువునకిట్టి (బాహ్యాభ్యంతర) కోపముకలిగించి తనకుఁగలిగినకోప మును ప్రశమనము చేసికొనవలెను.

కోపమును బుట్టించుటకును పోఁగొట్టుటకును శక్తుఁడగువాని విషయమున నుపజాపముచేయవలెను; సత్యసంధుఁడును పనులుచే యుటయందు శక్తుఁడును ఫలప్రాప్తియందునను దనుగ్రహించుటకును నాపదనుండి రక్షించుటకును సమర్థుఁడునునగు వానివిషయమునఁబ్ర తీజాపకముచర్చవలెను. లేక ఇతఁడువివేకియా మూర్ఖుఁడాయని యా లోచింపవలెను.

బాహ్యుఁడగు శత్రుఁడాభ్యంతరులవిషయమై భేదమీక్రింది విధముగఁ బెట్టవలెను. "భర్తనుచంపి నన్నురాజ్యమున నిలిపినచో శత్రువధ భూమిలాభమును ద్వివిధలాభము నాకగును; లేక శత్రువు వీనిఁజంపఁగలఁడు. లేక హతబంధుపక్షుఁడై తుల్యదోషదండముచే భయపడినవాఁడు నాకువశుఁడగుటచే వాఁడు కృత్యపక్షుఁడు కాఁజా లఁడు అట్టిమతిమొకనివిషయమున నపిశంకితుఁడై యుండును. అట్టి వారి నభివ్యక్తశాసనముచేఁ బరస్పరము చంపింపఁగలను"

ఆభ్యంతరశత్రుఁడు బాహ్యునిట్లు భేదపెట్టవలెను. ఇతనికోప మునుహరింపఁగలను. వీనిసైన్యమును నాశముచేయఁగలను. దుష్టుఁ డగుభర్తను వీనిచేఁ జంపించెదను ప్రతిపన్నుఁడగు బాహ్యునివ యుని అమిత్రాటవికులపయిని దాడిచేయించెదను. ప్రభువుమొక్క మండలము సన్నద్ధపడును. వీనికివైరము ప్రబలమగును. అప్పుడతఁ డు నాకుస్వాధీనమగును. అప్పుడు భర్తయనుగ్రహమును కూడఁ బొందెదను. లేక స్వయముగరాజ్యమును గ్రహింపఁగలను. వానిని బంధించి బాహ్యభూమిని భర్తృభూమినిగూడఁ బొందెదను. లేక శత్రుని నివాసస్థానమునుండి తొలఁగించి బాహ్యుఁడగు విశ్వస్తునిఁ జంపించెదను; లేక శూన్యమగు వీనిమూలమును హరించెదను.

కల్యాణబుద్ధియగువాఁడు కలిసి యనుభవింపఁగోరును. కా వున వానితో సంధి చేసికొనవలెను. శత్రునిఁగూడ, అట్లేయనిపుంచి

చేసి మోసపెట్టవలెను.

ఈవిధముగ నైవిషయముల నాలోచింపవలెను. పరులనుండి పరులను స్వీయులనుండి స్వీయులను స్వీయులనుండి పరులను పరులనుండి స్వీయులను రక్షింపవలెను. స్వీయులనుండియు బరులనుండియుఁగూడఁ బండితుఁడగువాఁడు తన్ను రక్షించుకొనవలెను.

ఇది యభియానముచేయువానికర్మయందుఁ బశ్చాత్కోపచింత,
బాహ్యాభ్యంతర ప్రకృతికోపప్రతీకారమను
మూఁడవ యధ్యాయము.
ఆదినుండి నూటయిరువదినాలుగవ యధ్యాయము.



142 ప్రకరణము

క్షయవ్యయలాభవిపరిమర్శ.

యుగ్యపురుషాపచయము క్షయము. హిరణ్యధాన్యాపచయము వ్యయము. లాభము వీనికంటె బహుగుణాధికముగ నుండునపుడు యానముచేయవలెను.

ఆదేయము ప్రత్యాదేయము ప్రసాదకము కోపకము హ్రస్వకాలము తనుక్షయము అల్పవ్యయము మహావృద్ధ్యుదయము కల్యము ధర్మ్యము పురోగము— ఇది లాభసంపద.

సులభప్రాప్యము సులభపాల్యము నగునదియు బరులకుని య్యఁదగనదియు నాదేయము. తద్విపరీతము ప్రత్యాదేయము. ప్రత్యాదేయమును తీసికొని యనుభవించు వాఁడు వినాశముఁ బొందును.

ప్రత్యాదేయమును తీసికొని శత్రుకోశదండనిచయరక్షావిధానములఁ బాడుచేయఁగలను. వాని ఖనిద్రవ్యహస్తివనసేతుబంధవణిక్పథములందలి సారములఁ దొలఁగింపఁగలను. వాని ప్రకృతులను కర్శించుటయో దేశమునుండి తొలఁగించుటయో వానిపైఁ గలహింపఁజేయుటయో నేనొనర్పఁగలను. దానిచే శత్రువు వానిపై మఱింత

కోపమువహించును. దీనినిపణ్యముగనిచ్చి వీనికిని వీనిప్రతిపక్షునికిని యుద్ధముగలిగించెదను. దానివలన శత్రువు వానియమిత్రునిగాని విరక్తునిగాని తత్కాలీనునిగాని కలిసినపుడు వానికి నాభూమినిచ్చి వృద్ధిపొందించి నాకుఁజిరకాలమిత్రునిగఁజేసికొనఁగలనని తోఁచినపుడు పరిత్యాజ్యలాభమునుకూడఁ బుచ్చుకొనవచ్చును.

ఆదేయపరిత్యాజ్యదేయము లిట్లు చెప్పఁబడినవి.

అధార్మికునినుండి ధార్మికునికి వశపడినలాభము తనవారికిని పయివారికినికూడఁ బ్రసాదకమగును. తద్విపరీతమగునది ప్రకోపకము.

మంత్రులయుపదేశమువలనఁ బొందఁబడినలాభము వారికి క్షయవ్యయములఁ గలిగించినచోఁ గోపకమగును. వీఁడు కార్యసిద్ధిని పొంది మనలను నాశముచేయునని తలఁచు దూష్యమంత్రుల ననాదరించి పొందినలాభముకూడఁగోపకమే. తద్విపరీతముప్రసాదకము.

ప్రసాద కోపకములిట్లు చెప్పఁబడినవి.

గమనమాత్రముచే సాధ్యమగునది హ్రస్వకాల (లాభ)ము. మంత్రసాధ్యమగునది తనుక్షయము. భక్తమాత్రవ్యయముచే సాధ్యమగునది అల్పవ్యయము. తత్కాలమునందు విస్తారము ఫలము నిచ్చునది మహాలాభము. అర్థానుబంధియగునది వృద్ధ్యుదయము. నిరాబాధకమగునది కల్యము. ప్రశస్తముగ సంపాదింపఁబడినది ధర్మ్యము. సామవాయికులనిర్బంధములేక ప్రాప్తించినదిపురోగము.

లాభములురెండుసమానములై యున్నప్పుడు దేశకాలములు శక్త్యుపాయములు ప్రియాప్రియములు భేదాభేదములు సన్నికర్ష విప్రకర్షములు తదాత్వానుబంధములు సారత్వాసారత్వనిత్యత్వములు బాహుళ్యబహుగుణత్వములను విమర్శించి బహుగుణయుక్తమగు లాభమును స్వీకరింపవలెను.

లాభవిఘ్నములు— కామము కోపము సాధ్వసము కారుణ్యము లజ్జ అనార్యభావము మానము సానుక్రోశత పరలోకాపేక్ష

ధార్మికత్వము అత్యాహితత్వము దైన్యము అసూయ హస్తగతావమానము ఉదారస్వభావము అవిశ్వాసము భయము ఉపేక్షణము శీతోష్ణవర్షాక్షమత్వము మంగళతిథినక్షత్రేష్టిత్వము.

నక్షత్రములను మిక్కిలిపరిగణించు బాలునికిఁ గార్యములు సిద్ధింపవు. అర్థమునకర్థమే నక్షత్రముగాని నక్షత్రము లేమిచేయఁగలవు? సాధకులగునరులు నూఱుప్రయత్నములఁజేసియైనను కార్యసాఫల్యమునొందఁగలరు. గజములు ప్రతిగజములచేతనువలె నర్థము లర్థములచే సిద్ధించును.

ఇది యభియానముచేయువానికర్మయను నవమాధికరణమందు
క్షయవ్యయాలాభవిపరిమర్శమను
నాలుగవయధ్యాయము.
ఆదినుండి నూటయిరువదియైదవ యధ్యాయము.



## 143 ప్రకరణము.

### బాహ్యాభ్యంతరములగు నాపదలు.

సంధ్యాదుల నుద్దేశవిరోధముగఁ జేయుట యపనయము. దానివలన నాపదలు సంభవించును.

బాహ్యమందుత్పన్నమై యాభ్యంతరుల ప్రతిజాపమొందినవి ఆభ్యంతరమునందుత్పన్నమై బాహ్యుల ప్రతిజాపమొందినవి. బాహ్యమందుత్పన్నమై బాహ్యుల ప్రతిజాపమొందినవి. ఆభ్యంతరమునందుత్పన్నమై యాభ్యంతరుల ప్రతిజాపమొందినవనియాపదలు (నాలుగు విధములు).

బాహ్యులాభ్యంతరులతోఁ జేరియు నాభ్యంతరులు బాహ్యులతోఁ జేరియుఁ గలుగఁజేసిన యాపదగొప్పదిగనుండును. ప్రతిజాపకులు మిక్కిలి కపటముగలవారైయుందురు. ఉపజాపకులట్టివారుకారు. ప్రతిజాపకుల శాంతిపఱచినచో నుపజాపకులు మఱెవ్వరి నుపజాపింపఁజాలరు. బాహ్యులకాభ్యంతరులును నాభ్యంతరులకు బాహ్యులును

కృ చోప్రోత్సాహప్రజాపులుగదా? కావునఁ బరుల మహాప్రయత్నములు వ్యర్థములగుటయేగాక స్వకార్యసిద్ధికూడఁ గలుగును.

ఆభ్యంతరులు ప్రతిజాపము చేయునపుడు వారియెడ సామదానముల నుపయోగింపవలెను స్థానమూనకర్మయే సాంత్వము. అనుగ్రహపరిహారములు కర్మలయందు నియోగించుట— ఇవియే దానము.

బాహ్యులు ప్రతిజాపమొనర్చునపుడు భేదదండముల నుపయోగింపవలెను మిత్రవ్యంజనులగు సత్రులు బాహ్యులచారులతో, ఇతఁడు రాజదూష్యవ్యంజనులచే మిమ్ము లమోసపెట్టుచున్నాఁడని తెలిసికొనుఁడని చెప్పవలెను. దూష్యవ్యంజనులు దూష్యులతోఁగలిసి దూష్యులను బాహ్యులనుండియు బాహ్యులను దూష్యులనుండియు భేదింపవలెను. తీక్ష్ణులు దూష్యులలోఁ బ్రవేశించి శస్త్రరసముల చేఁ (వారిని) జంపవలెను; లేక బాహ్యులను పిలిపించి (వారిని) చంపవలెను.

బాహ్యులు బాహ్యులతోడను నాభ్యంతరు లాభ్యంతరులతోడను కలిసినపుడు ప్రధానపురుషుల యుపజాపమువలన విశేషసిద్ధియగును. దోషమును పోఁగొట్టినచో దూష్యులుండరుగాని దూష్యశుద్ధియైనను నాదోషమును మఱికొందఱు దూష్యులుచేయుట సంభవించును.

కావున బాహ్యులుపజాపముగావించునపుడు భేదదండముల నుపయోగింపవలెను. మిత్రవ్యంజనులగు సత్రులు, ఈమీరాజు స్వలాభముఁబొందఁగోరి మీపైవిరోధించుచున్నాఁడని తెలిసికొనుఁడని చెప్పవలెను. తర్వాతఁ దీక్ష్ణులు ప్రతిజపితుని దూతలతోను సేవలతోనుకలిసి వీరిఛిద్రములఁగనిపెట్టి శస్త్రరసాదులచే వీరినిపరిహరింపవలెను. అటుపిమ్మట సత్రులు ప్రతిజపితుఁడు నేరమునుచేసినట్లు ప్రకటింపవలెను.

ఆభ్యంతరు లాభ్యంతరులతో సంజాపము చేయునపుడు యథాస్థోపాయమును ప్రయోగింపవలెను. తుష్టునిగాఁ గనిపించువాని విషయమునను అతుష్టునియొక్కగాని తద్విపరీతునియొక్కగాని విషయమునను సామమును ప్రయోగింపవలెను.

శౌచసామర్థ్యాపదేశముచేఁగాని వ్యసనాభ్యుదయావేక్షణముచేఁగాని పూజించుట దానమనఁబడును. మిత్రవ్యంజనుఁడు వీరితో మీమనస్సు దెలిసికొనుటకు మీరాజు మిమ్ములను భేదపెట్టును; కాఁబట్టి వీరికి నిజము చెప్పుఁడని పలుకవలెను. లేక, ఇతఁడు మిమ్ములను గుఱించి మీరాజుతో నిట్లుపజాపము చేయుచున్నాఁడని భేదపెట్టవలెను. దండమును దాండకార్మిక ప్రకరణమునఁ జెప్పినట్లు చేయవలెను

నాలుగువిధములగు నీయాపదలలో నాభ్యంతరాపదను ముందుగఁ దొలఁగించుకొనవలెను. అహిభయముగుఱించే బాహ్యకోపము కంటె నాభ్యంతరకోపము పాపీయమని, ఇదివఱకే చెప్పఁబడెను.

బలవంతులనుండి సంభవించునపుడు సహిత మీనాలుగాపదలలోఁ దొలుతటివానిని లఘ్వాపదలుగ నెఱుంగవలెను. స్వల్పులనుండి సంభవించునపుడు లఘూపాయమును బ్రయోగింపవచ్చును.

ఇది యభియానము చేయువాని కర్మయను నవమాధికరణమున

బాహ్యాభ్యంతరములగు నాపదలను

అయిదవ యధ్యాయము.

ఆదినుండి నూటయిరువదియాఱవ యధ్యాయము.



## 144 ప్రకరణము.

### దూష్యశత్రుసంయుక్తలు.

దూష్యులలోఁ గలియునట్టివారనియు శత్రువులలోఁ గలియునట్టివారనియు శుద్ధులనుప్రజలు రెండువిధములుగ నుందురు.

పౌరజానపదములు దూష్యులతోఁ గలియకుండుటకై దండవర్జములగు నుపాయములు ప్రయోగింపవలెను. బహుజనముపై దండము ప్రయోగింప వీలుపడదు. వీలుపడినను దానివలనఁ బ్రయోజనముండకపోవుటయే గాక మఱియొక యనర్థము సహితము సంభవించును. వీరిలో ముఖ్యులగువారి విషయమున దాండకార్మిక ప్రకరణమునఁ జెప్పినట్లు చేయవలెను.

(పౌరజానపదులు) శత్రువుతోఁ గలియకుండుటకై వారికిఁ గార్యసిద్ధిఁ గలిగించు ప్రధానుని సామాదులచే వశపఱచుకొని సిద్ధిఁ బొందవలెను.

ప్రధానసిద్ధి స్వామ్యాయత్తము; యత్నసిద్ధి మంత్ర్యాయత్తము; ప్రధానాయత్తసిద్ధి యుభయాయత్తము.

దూష్యాదూష్యులు కలిసినప్పుడు సహితము సిద్ధిపొందుట యామిశ్రసిద్ధి. అప్పుడదూష్యనిమూలమున సిద్ధికలుగును. ఆలంబనములేనిచో నాలంబితయుండదుగదా? మిత్రామిత్రులేకీభవించినపుడు కలుగుసిద్ధి పరమిశ్రసిద్ధి. పరమిశ్రియందు మిత్రునిమూలమున సిద్ధిసంభవించును మిత్రునిమూలమున సిద్ధిసుకరమగును కాని యమిత్రునిమూలమునఁ గాదుగదా?

మిత్రుఁడు సంధిష్టపడనిచో వానిపైఁ గ్రిగ నుపజాపమొనర్పవలెను. పిమ్మట శత్రులమూలమున శత్రులనుండి వానిని భేదించి వశపఱచుకొనవలెను; మిత్రసంఘమున కంతస్థాయియగు వానిని (కూడ) వశపఱచుకొనవలెను. అంతస్థాయి వశపడినయెడల మధ్యస్థాయులు భేదింపఁబడుదురు, లేక మధ్యస్థాయినయిన వశపఱచుకొనవలెను. ఇతఁడు లభించినచో నంతస్థాయులు కలియఁజాలరు. కావున నేయుపాయముచే వీరికిఁ బరస్పరభేదము కలుగునో యట్టియుపాయము లొనర్పవలెను.

జాతికులశ్రేష్ఠత్వ త్తస్తవముచేఁగాని సంబంధముచేఁగాని వాని

పూర్వుల మైత్రిలోక్యోపకారానపకారముల సూచించిగాని ధార్మికుం డగురాజును మంచిచేసికొనవలెను.

నివృత్తోత్సాహుఁడును విగ్రహశ్రాంతుఁడగుటచే నుపాయరహితుఁడైనవాఁడును క్షయవ్యయప్రవాసోపతప్తుఁడును నిష్కపటముగ నన్యునిసహాయమును గోరువాఁడును మఱియొకనివలనభయ మొందినవాఁడును మైత్రియే ప్రధానముగఁగలవాఁడును నగు కల్యాణబుద్ధిని సామముచే సాధింపవలెను.

లుబ్ధుఁడును క్షీణుఁడునునగువానిని వానివద్దనుంపఁబడిన తపస్విముఖ్యునిమూలమున దానముచేసి సాధింపవలెను.

దానమైదువిధములు— దేయవిసర్గము, గృహీతానువర్తనము, ఆత్తప్రతిదానము, స్వద్రవ్యదానము పరధనములఁగ్రహించునపుడు సహాయముచేయుట.

ఇది దానకర్మ.

రాజులిరువురు పరస్పర ద్వేషముగలవారై భూమిహరణవిషయమై శంకించుచుండునపుడు వారిద్దఱికి భేదముకలిగింపవలెను. ఓడు వగువానితో, ఇతఁడు నీతోసంధిచేసికొనును. నీపైఁగపటమువహించియున్నాఁడు, స్నేహితులుగూడ యథేష్టముగ మఱియొకరితో సంధి చేసికొనవచ్చుననియుఁ జెప్పుచున్నాఁడని బెదరించి సాధింపవలెను.

స్వదేశమునుండికాని పరదేశమునుండికాని (యాతవ్య)పణ్యాగారమునకుఁ బోవుపణ్యములు శత్రువివలనఁ బంపఁబడుచున్నవని సత్రులుప్రకటించి, పణ్యములధికముగఁ జేరిన పిమ్మట, ఈపణ్యమును నేనుపంపితిని. సామవాయికులపై నీవువిక్రయింపుము లేక వారి నివిడువుము. పణశేషమునుకూడ నిచ్చెదనని రాజశాసనముప్రకటించి పణ్యమంతయుశత్రుదత్తమని సామవాయికులకు బోధింపవలెను.

శత్రుదేశమందుఁ బ్రసిద్ధమగుపణ్యమును విజ్ఞాతముగ విజిగీషురాష్ట్రమునకుఁ దెప్పించి దానిని వైదేహకవ్యంజనులు (సామవాయికులగు) శత్రుముఖ్యులకు విక్రయింపవలెను. పిమ్మట సత్రులు,

ఉపజాప్యము శత్రుదత్తమని సామవాయికులలోఁ బ్రకటింపవలెను.

మహాపరాధుల సత్కారమానములచే సంగ్రహించి శస్త్రరసాగ్నులనిచ్చి శత్రునికడ కనుపవలెను. తర్వాత నమాత్యునొకనిఁ జంపించి వానిపుత్రదారలను వశపఱచుకొని రాత్రిహతుఁడయ్యెనని ప్రకటింపవలెను. పిమ్మట శత్రుమంత్రి వారిని వేఱువేఱుగా నడుగును. అప్పుడువారు తాముచెప్పినట్లు చేసినయెడల వారిని బయలుపెట్టఁగూడదు; లేనిచో బయలుపెట్టవలెను. లేదా శత్రురాజువద్ద నాప్తతను సంపాదించినవాఁడొకఁడు, నీముఖ్యునినుండి నిన్ను రక్షించుకొనుమని భేదపెట్టవలెను. పిమ్మట నుభయవేతనుఁడు శత్రురాజు శంకితుఁడయ్యెనని ముఖ్యునితోఁజెప్పి వానిమూలమున శత్రూపఘాత మొనర్పవలెను.

ఇతనిరాజ్యమును గ్రహించుటకు వెళ్లుము. మనసంధి యథాస్థితముగనుండవచ్చునని యొకనిని మఱియొకయుత్సాహవంతుని పయికిఁ బంపవలెను. పిమ్మట సత్త్రిలివర్తమానము నితరునికిఁ జెప్పవలెను. తర్వాత నందులోనొకని స్కంధావారవీవధాసారములనపహరించి యితరులతో మైత్రి చేసికొని, సత్త్రులు, నీవువీరిచేఁ జంపఁదగియుంటివని చెప్పి పరస్పరభేదము గలిగింపవలెను.

ఏశత్రురాజుయొక్క వీరపురుష హస్తి హయములు మృతి నొందునో లేక గూఢపురుషులచేఁ జంపఁబడునో హరింపఁబడునో వానితో సత్త్రులు, ఇవి పరస్పరోపహతములయ్యెనని చెప్పి, యభిశప్తునితో నీవుమఱియొకమారిట్లుచేయుము; నీకురావలసిన శేషమిచ్చెదమనిపలుకవలెను అప్పుడుభయవేతనుఁడా పణశేషమును వానికిప్పింపవలెను. ఇట్లు భేదమొందినవానిలో నొకరిని వశపఱచుకొనవలెను.

సేనాపతి కుమార దండచారులవిషయమునుఁ గూడనిట్లేయూహించునది.

సంఘీభావముతో నున్నవారిలో నిట్టిభేదమును బ్రయోగింపవలెను.

ఇది భేదకర్మ.

హీనుఁడు వ్యసనిస్థితశత్రుఁడునగువానిని గూఢపురుషులు తీక్ష్ణులసహాయములేకయే శస్త్రాగ్నిరసములచే సాధింపవచ్చును. సాకర్యమునుపట్టి వారిలో నొక్కఁడే పనినిచేయవచ్చును. లేక తీక్ష్ణుఁడొక్కఁడే శస్త్రరసాగ్నులచే వానిని సాధింపవచ్చును. ఏలనఁగాఁ దీక్ష్ణుఁడు సర్వసందోహావశిష్టకర్మ ముకూడఁ జేయఁగలవాఁడు.

ఇది యుపాయచతుర్వర్గము.

ఈయుపాయములలోఁబూర్వపూర్వము సులభము. సాంత్వ మేకగుణము. సాంత్వపూర్వముగుదానము ద్విగుణము. సాంత్వదానపూర్వముగు భేదము త్రిగుణము. సాంత్వదానభేదపూర్వముగు దండము చతుర్గుణము, అని యభియోక్తలవిషయమునఁ జెప్పఁబడెను.

స్వభూమిష్ఠులగువారి విషయమునఁగూడ నివియే యుపాయములు. మఱియొకవిశేషముకూడ నున్నది. పణ్యాగారములమూలమున నభిజ్ఞాతదూతముఖ్యులను స్వభూమిష్ఠులగువారిలో నొకనివద్దకుఁ బంపవలెను. వారు వీనిని సంధివిషయమునఁగాని పరహింసకుఁగాని యొప్పింపవలెను. అతఁడట్లంగీకరింపనపుడు మనకార్యసిద్ధియైనదని రాజుతోఁజెప్పవలెను. ఉభయవేతనులు, ఈమారాజుదుష్టుఁడు కాన వీనితోసంక్రమింపుఁడని బోధింపవలెను. ఎవనికెవనినుండి భయవైరద్వేషములు శంకింపఁబడుచున్నవో వానిని వానినుండి, ఇతఁడు నీశత్రునితోసంధిచేసికొనుచున్నాఁడు. నిన్ను మునుముందు మోసపెట్టును. కావున శీఘ్రముగ నీవేసంధిచేసికొని వీనినిగ్రహము నకై ప్రయత్నింపుమని భేదపెట్టవలెను. ఆవాహవివాహములమూలమున శత్రుసంయుక్తుల భేదింపవలెను; లేక వారినామంతాటవికతత్కులీనావరుద్ధుల మూలమునఁగాని సార్థప్రజాటవికులమూలము నఁగాని రాజ్యమునుండి తొలఁగింపవలెను. లేక పిరిపహస్త్రాహావాశ్రయులభిసృతసైన్యమును జాతిసంఘచ్ఛిద్రములుకలిగినపుడు ప్రహరింపవలెను; లేక గూఢులగ్నిరసశస్త్రములచేఁ జంపింపవలెను.

శత్రువులను గరళముతోఁగూడిన పానమునిచ్చియు యోగాచరణములచేతను చంపింపవలెను. పరమిశ్రసిద్ధివిషయమైన విశ్వాసపూర్వముగ నామిషమునుపెట్టవలెను.

ఇది యభియానము చేయు వానికర్మయందుఁ దూష్యశత్రు సంయుక్తలను ఆఱవ యధ్యాయము.
ఆదినుండి నూటయిరువదియేడవ యధ్యాయము.



## 145-6 ప్రకరణము.

—అర్థానర్థసంశయములు, ఉపాయములఁబట్టి వానివిషయమగుసిద్ధులు.—

కామాద్యుత్సేకము స్వప్రకృతులకును అపనయము బాహ్యప్రకృతులకును కోపముగలిగించును. ఈ రెండునుకూడ నాసురవృత్తి (లక్షణములు). కోపము స్వజనవికారము ఆపదర్థానర్థసంశయములు పగవృద్ధి హేతుకములు.

పొందఁబడిన యేయర్థము శత్రువృద్ధికారకమగునో ప్రాప్తమయ్యును పరులకుఁ బ్రత్యాదేయమైయుండునో లేక క్షయవ్యయములఁగలిగించునో, అది యాపదర్థము. సామంతవ్యసనమువలనఁ గలిగి సామంతులకామిషభూతమగులాభము స్వభావముచేఁబొందఁదగి శత్రువుచేఁబ్రార్థింపఁబడు లాభము పశ్చాత్కోపముగల పార్ష్ణిగ్రాహునిచే విగృహీతమగు పురస్తాల్లాభము మిత్రోచ్ఛేదముచేఁగాని సంధివ్యతిక్రమముచేఁగాని మండలవిరోధకరమగులాభము— ఇవియును ఆపదర్థములే.

స్వకీయులనుండికాని పరులనుండికాని భయమునుకలిగించు లాభమనర్థము.

ఈరెంటివిషయమై అనర్థమున్నదా లేదా యనియు, మొదట నర్థమయినను పిమ్మట ననర్థమగునాయనియు, మొదట ననర్థమైనను పిమ్మట నర్థమగునాయనియు నాలోచించుట సంశయము. శత్రునిఁ

గాని మిత్రునిఁగాని యుత్సహింపఁజేయుట కుపయోగించునా లేదా యని యాలోచించుటకూడ సంశయమే. అర్థమానములచే శత్రుబలమునుపిలిపించుటవలన నర్థమగునా కాదాయని యాలోచించుట కూడసంశయము. పైవిషయములగుఱించి యర్థచింతనుచేయవలెను.

అర్థానుబంధమగునర్థము నిరనుబంధమగునర్థము అనర్థానుబంధమగునర్థము అర్థానుబంధమగుననర్థము నిరనుబంధమగుననర్థము అనర్థానుబంధమగు ననర్థము— ఇది యనర్థషడ్వర్గము.

శత్రువునుపెల్లగించి పార్ష్ణిగ్రాహుని వశపఱచుకొనుట అర్థానుబంధమగు నర్థము. ఉదాసీనునికి సైన్యానుగ్రహముచేసి పొందినయర్థము నిరనుబంధమగు నర్థము. పరునియంతచ్ఛేదమువలనఁగలిగినది యనర్థానుబంధమగు నర్థము. కోశదండములచే శత్రుప్రతివేశునను గ్రహించుట యర్థానుబంధమగు ననర్థము. హీనశక్తిగలవానిని ప్రోత్సహించి వెనుకకుమఱలుట నిరనుబంధమగు ననర్థము. జ్యాయునిఁబ్రోత్సహించి మరలుట యనర్థానుబంధమగు ననర్థము. వీనిఁబొందుటలోఁ బూర్వపూర్వము శ్రేయస్కరము.

ఇది కార్యనిశ్చయము.

నాలుగువైపులనుండి యర్థోత్పత్తియగుట యుగపదర్థోత్పత్తి. అదియే పార్ష్ణిగ్రాహునిచే విగ్రహీతమగునపుడు సంశయాపదర్థమగును. అప్పుడు మిత్రాక్రందోపగ్రహమువలన సిద్ధియగును.

అన్నివైపులనుండి శత్రుభయమువలననగు భయోత్పత్తిసమంతత ఆపదర్థమగుచున్నది.

అది మిత్రగృహీతమై సమంతతోనర్థ సంశయాపదయగును. వీనికిఁ జలామిత్రాక్రందోపగ్రహమువలన సిద్ధి.

రెండువైపులనుండి వచ్చులాభమునకుఁబరులడ్డుగలిగించినపుడుభయతోర్థాపదయగును.

దానియందును సమంతతోర్థాపదయందును లాభగుణయుక్తముగ నర్థమునుతీసికొనుటకు యానముచేయవలెను. లాభమునమా

నమైనవైపునందుఁ బ్రధానమును నాసన్నమును నతిపాతరహితమును సులభోపాయసాధ్యమును నగుదానికై యానముచేయవలెను.

రెండువైపులనుండి యనర్థముకలుగుట యుభయతోనర్థాపద. దీనియందును సమంతతోనర్థాపదయందును మిత్రులనుండిసిద్ధిఁబొంద వలెను. మిత్రులులేనపుడు సులభులగుప్రకృతులసహాయముచే నొక వైపునుండివచ్చిన యనర్థమునుతొలగించుకొనవలెను. ఉభయతో నర్థమును జ్యాయునిసహాయమునను సమంతతోనర్థములను మూలబ లసహాయమునను సాధింపవలెను. ఈమూఁడు సాధనములచేఁగూడ నశక్యమైనపుడన్నిటినివిడిచి పాఱిపోవలెను. సుయాత్రోదయనుల వలె జీవించియుండినచోఁ బునరావృత్తికలుగును.

ఒకవైపునుండిలాభము మఱియొకవైపునుండి రాజ్యాభిమర్శ ము తటస్థించుట యుభయతోర్థానర్థాపద. అప్పుడర్థసాధకమునకై యానముచేయవలెను; లేదా రాజ్యాభిమర్శమును వారించుకొన వలెను.

సమంతతోర్థానర్థాపద యిట్లువ్యాఖ్యానము చేయఁబడినది.

ఒకవైపునుండి యనర్థము మఱియొకవైపునుండి యర్థసంశ యమునగుట యుభయతోనర్థార్థసంశయము. సమంతతోర్థానర్థ సంశయము దీనిఁబట్టిగ్రహించునది. అప్పుడు ప్రకృతులలోఁబూర్వ పూర్వప్రకృతుల ననర్థసంశయమునుండి విడిపించుటకు యత్నింపవ లెను. అనర్థసంశయమందు మిత్రమోక్షణము శ్రేయస్కరము. అ దండుఁడగువానికిఁ గోశమోక్షణముకంటె దండమోక్షణము శ్రేయ స్కరము. సమగ్రమోక్షణము వీలుకానపుడు ప్రకృత్యవయవమో క్షణమునకైన యత్నింపవలెను. అందుఁబురుషప్రకృతులలోఁదీక్ష్ణలు బవద్ధముగ నధికానురక్తమగువానిని, ద్రవ్యప్రకృతులలో సారమును మహోపకారియు నగుదానిని రక్షింపవలెను. సులభసాధ్యములను సంధ్యాసనద్వైధీభావములచేతను, కష్టసాధ్యముల నితరోపాయముల చేతను రక్షింపవలెను.

క్షయస్థానవృద్ధులలో నుత్తరోత్తరమునుకోరవలెను. క్షయా దులవలన భావికాలమందు ఫలమురానున్న ప్పుడు ప్రాతిలోమ్యము నయినం గోరవచ్చును.

ఇది దేశావస్థాపనము.

యాత్రామధ్యాంతరములందుంగలుగు నర్థానర్థసంశయముల విషయమునంగూడ నిట్లేయని గ్రహించునది.

అర్థానర్థసంశయములు నిరంతరముండునవిగనుక యాత్రాది యందర్థముసంపాదించుట శ్రేయస్కరము. ఏలనంగాం బొమ్మిఁగాని పాసారప్రతిఘాతమునకును క్షయవ్యయప్రవాసప్రత్యాదేయములాల రక్షణములకును నదియుపయోగించును. అట్లే స్వభూమియందనర్థ సంశయమువిషహ్యము.

యాత్రామధ్యమందనర్థసంశయప్రాప్తిని గుఱించికూడ నిట్లే యని గ్రహించునది.

యాత్రాంతమందుం గర్శనీయోచ్ఛేదనీయులకుం గర్శనోచ్ఛే దములొనర్చి యర్థమునుపొందుట శ్రేయస్కరము. పరాబాధభయ ముండునుగాన నర్థసంశయమట్టిదికాదు.

సామవాయికులలోం బురోగామికానివానికి యాత్రామధ్యాం తప్రాప్తమగు నర్థసంశయము గమననిర్బంధము లేనివాఁడగుటచే శ్రే యస్కరము.

అర్థధర్మకామము లర్థత్రివర్గము. వానినిపొందుటలోం బూ ర్వపూర్వము శ్రేయస్కరము. అనర్థాధర్మశోకము అనర్థత్రివర్గము. వానికిం బ్రతీకారముచేయుటలోం బూర్వపూర్వము గ్రాహ్యము. అ ర్థమా అనర్థమా ధర్మమా అధర్మమా కామమా శోకమాయని సం శయత్రివర్గము. వీనిలో రెండవదానిని నివర్తింపంచుటకు మొదటిది సమర్థమగుటచే మొదటిదానిని పొందుటయే శ్రేయస్కరము.

ఇది కాలావస్థాపనము.

ఇవి యాపదలు.

వానిసిద్ధి— పుత్రభ్రాతృబంధువులవలనఁ గలిగినయాపదల ను సామదానములచేతను, పౌరజానపదదండముఖ్యులవలనఁ గలిగిన వానిని దానభేదములచేతను, సామంతాటవికులవలనఁ గలిగినవానిని భేదదండములచేతను బ్రతీకరించుకొనుట యుచితము. ఇట్లుచేయుట యనులోమము విపర్యయమగునపుడు ప్రతిలోమము.

మిత్రామిత్రులవలనఁ గలిగినయాపదలకుఁ బ్రతీకారముపాయ మిశ్రమైయుండును. ఉపాయములు పరస్పరసాధకములుగదా?

శత్రువుయొక్క శంకితామాత్యులవిషయమునఁ బ్రయుక్తమగుసాంత్వము తక్కినప్రయోగముల నివర్తింపఁజేయును. దూష్యామాత్యులవిషయమున దానము సంఘాతులయెడ భేదము శక్తిమంతులయెడ దండము నుపాయములు.

ఆపదల గురుత్వలఘుత్వములఁబట్టి నియోగ వికల్ప సముచ్చయోపాయములఁ గల్పింపవలెను.

ఇదితప్ప వేఱొకయుపాయములేదనుటనియోగము. దీనిచేతఁగాని మఱియొకదానిచేతఁగాని సాధింపవచ్చుననుట వికల్పము. దీనిచేతను మఱియొకదానిచేతను కలిసి సాధింపవచ్చు ననుట సముచ్చయము.

వానిలో నేకయోగములునాలుగు త్రియోగములునాలుగు. ద్వియోగములాఱు చతుర్యోగ మొకటియని పదునైదుపాయము లున్నవి. ప్రతిలోమములుగూడ నిన్నియే. ఒకయుపాయముచే సిద్ధించున దేకసిద్ధి; రెండిటిచేసిద్ధించునది ద్విసిద్ధి, మూఁడింటిచేసిద్ధించునది త్రిసిద్ధి, నాలుగుచేసిద్ధించునది చతుస్సిద్ధి.

అర్థము ధర్మమూలమగుటవలనను కామఫలకమగుటవలనను ధర్మార్థకామానుబంధమగు నర్థసిద్ధి సర్వార్థసిద్ధి.

ఇవి సిద్ధులు.

అగ్న్యుదకవ్యాధిప్రమారవిద్రవదుర్భిక్షాసురసృష్టులు దైవికములగునాపదలు. దేవబ్రాహ్మణప్రణిపాతమువలన వీనికిఁ బ్రతీకారమగును.

ఆసురసృష్టి అతిసృష్టి అసృష్టి సంభవించినపుడు వానికిసిద్ధారంభములగుసిద్ధులు అథర్వణకర్మలు ప్రతిక్రియలగును.

ఇది యభియానముచేయువానికర్మయను నవమాధికరణమం

దర్థానర్థసంశయములు, ఉపాయములఁబట్టి వానివిషయమగుసిద్ధులను

యేడవయధ్యాయము.

ఆదినుండి నూటయిరువదియొనిమిదవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున

నభియానముచేయువానికర్మయను తొమ్మిదవయధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## 10 అధికరణము — సాంగ్రామికము.

### 147 ప్రకరణము.

### స్కంధావారనివేశము.

వాస్తుశాస్త్రోక్తమగు ప్రదేశమున నాయకవర్ధకమౌహూర్తజ్ఞులు వృత్తముగనో దీర్ఘముగనో చతురశ్రముగనో భూమినిపట్టి నాలుగుద్వారములు, ఆఱుత్రోవలు తొమ్మిదివిభాగములు నుండునట్లుగ స్కంధావారమును నిర్మింపవలెను

భయప్రతీకారమగునట్లు ఖాతవప్రసాలద్వారాట్టాలకములతోఁగూడినట్టియు నూఱుధనుస్సులపొడవు నేఁబదిధనుస్సుల వెడల్పునుకలిగినట్టియు మధ్యప్రదేశమున కుత్తరముగఁ దొమ్మిదవభాగమున రాజగృహమును; పశ్చిమార్థమందతని యంతఃపురికను దానిచివర నంతర్వంశికసైన్యము నుంపవలెను. రాజగృహమున కెదుట దేవీగృహము దక్షిణమునఁ గోశశాసనకార్యకరణములను వామభాగమున రాజోపవాహ్యములగు హస్త్యశ్వరథస్థానము నుంపవలెను. వీనికి వెలుపల నూఱుధనుస్సుల యవకాశముండునట్లు నాలుగుశకటమేఢీప్రతతులను స్తంభసాలపరిక్షేపముల నుంపవలెను. అందు మొదటి దానియెదుట మంత్రిపురోహితవర్గములు దక్షిణమునఁ గోష్ఠాగార మహానసములు వామభాగమునఁ గుప్యాయుధాగారములు, రెండవ దానియందు మౌలభృతాశ్వస్థానము దానికివెలుపటఁ దూర్యాగ్నులతోఁగూడిన లుబ్ధకశ్వగణులు గూఢారక్షకులు, శత్రువులవలనబాధ

తప్పించుకొనుటకుఁ గూపకూటావపాతకంటకినులను స్థాపింపవలెను. ఆత్మరక్షణకొఱకు ష్టానవర్గములవారిని మార్చుచుండవలెను. అప సర్పజ్ఞానముకొఱకు గేబనలుల విభజింపవలెను.

వివాదపానసమాజద్యూతములను వారింపవలెను. ముద్రార క్షణమునుకూడఁ జేయవలెను. సేనానియొక్కన్ని త్రము నాయుధీ యులకు సంబంధించిన శాసనము నంతవారును పరీక్షింపవలెను. ప్రశాస్తమార్గములఁ గనిపెట్టుటకైముందునడుచుచు వర్ధకివిష్టులచే నీటిసనుపాయములఁ గల్పించుచుండవలెను.

ఇది సాంగ్రామికమను దశమాధికరణమున స్కంధావారనివేశమను మొదటి యధ్యాయము.

ఆదినుండి నూటయిరువదితొమ్మిదవ యధ్యాయము.



## 148-9 ప్రకరణము.

— స్కంధావారప్రయాణము, బలవ్యసనావస్కందకాలరక్షణము. —

గ్రామారణ్యములకు సంబంధించిన యధ్వనివేశములను యవ సేంధనోదకములను స్థానాసనగమనకాలములను పరిశీలించి యాత్ర చేయవలెను. ఆపత్ప్రతీకారద్విగుణముగ భక్తోపకరణములఁ దీసికొని పోవలెను. వాహనములు చక్కని ముగ దొరకనపుడు వీనిని సైన్య ములచేతనే మోయింపవలెను, లేక వానిని మధ్యప్రదేశములందు దా చి యుంచుకొనవలెను.

ముందు నాయకుఁడు మధ్యభాగమున రాజమహిషియురాజు పార్శ్వములందశ్వములు శరీరరక్షకులు చక్రాంతములందేనుఁగులు త క్కినసైన్యము, అన్నిభాగములందాటవికసైన్యము నడవవలెను. స్వదేశమందుండివచ్చిన వీవధము మిత్రబలము వారియాసారులు వారివారిమార్గములఁబట్టి వెళ్లవలెను. ఏలనఁగా యుద్ధమందు స్వ భూమిష్ఠులగువారభూమిష్ఠులకంటె మంచిస్థితియందుందురు. అధ ము లొకయోజనము మధ్యములొకటిన్నరయోజనము ఉత్తములు

రెండుయోజనములు (రోజునకు) నడతురు. దీనినూహించి వెనుక నుండి సేనాపతివెళ్ళి వారినాపవలెను. ముందుభాగమునుండి యాప దవచ్చునపుడు మకరవ్యూహముచేతను వెనుకభాగమునుండి వచ్చున పుడు శకటవ్యూహముచేతను పార్శ్వములనుండివచ్చునపుడు వజ్ర వ్యూహముచేతను అన్నివైపులనుండి వచ్చునపుడు సర్వతోభద్రవ్యూ హముచేతను ఒక్కరుమాత్రము నడువఁదగిన మార్గమందు సూచీ వ్యూహముచేతను యాత్రచేయవలెను. ద్వైధీభావసందార్శ్రియ కారి సంపన్నఘాతి పార్ష్ణిగ్రాహాసారమధ్యమోదాసీనులు— వీరు ప్రతీకరింపఁదగినవారు. సంకటమార్గమును శోధింపవలెను. కోశము దండము మిత్రామిత్రాటవీబలము వృష్టి ఋతువులు లోనగువాని నికూడఁ బరిశోధింపవలెను.

(శత్రువుయొక్క) దుర్గకర్మనిచయరక్షా క్షయమగునపుడును క్రీతబల మిత్రబలములకు నిర్వేదముకలుగునపుడును ఉపజాపకులుత్త రపెట్టకుండునపుడును శత్రువు సంధిచేసికొనఁగోరునని తోఁచినపుడును మెల్లగాఁబోవచ్చును. లేనియెడల శీఘ్రయానముచేయవలెను.

హస్తిస్తంభసంక్రమ సేతుబంధనౌకాష్ఠవేణుసంఘాతములచే తను, అలాబు చర్మకరండ దృతిప్లవ గండికా వేణికలతోడను ఉదక ముల దాటవలెను.

శత్రువు రేవులనడ్డగించినపుడు హస్త్యశ్వములసహాయముచే రాత్రికాలమున మఱియొకచోటనుండి యుదకములనుదాటి రహస్య ముగాదాగియుండి శత్రువుపైఁబడవలెను. మార్గమందుదకములేన పుడు బండ్లమీఁదను చతుష్పదములమీఁదను శక్త్యనుసారముగ ను దకములఁ దీసికొనిపోవలెను.

అనూదకమగు దీర్ఘకాంతారమునఁ బ్రయాణముచేయున పుడును యవసేంధనోదకహీనమై కష్టతరమగుమార్గమునఁ బోవున పుడును శత్రువుచేనాక్రమింపఁబడినపుడును క్షుత్పిపాసాధ్వక్లాంతమై నపుడును పంకతోయములచే గంభీరములగు నదీదరీశైలములనెక్క

టయు దినటయు సంభవించినపుడును ఇఱుకగు త్రోవలలోను శైల వనసంకటములగు త్రోవలలోను సమ్మర్దముకలిగినపుడును నివేశప్రస్థానములందును భోజనమందును నాసక్తమైయుండుపుడును మిక్కిలి నడచుటవలనఁ బరిశ్రాంతమై నిద్రించునపుడును వ్యాధిమరక దుర్భిక్షపీడితమగునపుడును పత్త్యశ్వద్విపములు వ్యాధితములయినపుడును బలము స్వల్పముగనున్నపుడును బలవ్యసనములందును స్వసైన్యమును రక్షించుకొనవలెను. పరసైన్యము లిట్టి స్థితియందున్నపుడు వానిని కొట్టవలెను.

ఇఱుకుత్రోవలో శత్రుబలము ప్రయాణముచేయునపుడు దక్షి రహోక్తయొక్క సేనానాయకుఁడు శత్రువి యాహారగ్రాసశయ్యాస్తరాగ్నినిధానధ్వజాయుధముల సంఖ్యను తెలిసికొని, స్వబలజ్ఞానమును దాచవలెను.

అపసారప్రతిగ్రహములతోఁగూడిన పార్వతదుర్గమునో నదీదుర్గమునో వెనుకభాగమందు నిర్మించుకొని యుద్ధమునో నివేశమునో యొనర్పవలెను.

ఇది సాంగ్రామికమను దశమాధికరణమున
స్కంధావారప్రయాణము బలవ్యసనావస్కందకాలరక్షణములను
రెండవ యధ్యాయము.
ఆదినుండి నూటముప్పదియవ యధ్యాయము.



## 150-2 ప్రకరణము.

—కూటయుద్ధభేదములు, స్వసైన్యోత్సాహనము, స్వబలాన్యబలవ్యాయోగము.—

బలవిశిష్టుఁడు కృతోపజాపుఁడు ఋతుప్రతీకారియగువాఁడు స్వభూమియందుఁ బ్రకాశయుద్ధము చేయవచ్చును. అట్లు కానివాఁడు శకటయుద్ధమును చేయవలెను.

పరుఁడు బలవ్యసనావస్కందములొందినపుడు నభూమిష్ఠుఁడై యుండునపుడును వానిని కొట్టవలెను.

ప్రకృతుల వశపఱచుకొనిన విజిగీషువు దూష్యామిత్రాటవీబలసహాయముచే స్వభూమిష్ఠుఁడగు శత్రునికిసహితముభంగముగలిగించి విభూమిని పొందినతర్వాత వానిని కొట్టవలెను. సంక్షోభవించిన శత్రుసైన్యము నేనుఁగులచే భేదింపవలెను. భంగపఱచుటచే ననుసరింపవచ్చుచున్న శత్రుఁడు భిన్నుఁడయినను కాకపోయినను వెనుకకుమఱలి వానిని కొట్టవలెను.

ఎదుటనుండి కొట్టఁబడుటవలనఁ జలించి విముఖమైపఱుగెత్తు శత్రుసైన్యమును వెనుకనుండి హస్త్యశ్వములచేఁ గొట్టవలెను. పృష్ఠమున విషమముగనున్నపు డెదుటనుండియు నొకపార్శ్వమున విషమముగనున్నపుడు మఱియొకపార్శ్వమునుండియుఁ గొట్టవలెను.

దూష్యామిత్రాటవీబలములచే ముందుయుద్ధము చేయించి శ్రాంతుఁడయినశత్రునిఁ దానశ్రాంతుఁడై కొట్టవలెను. లేక దూష్యబలముచే శత్రునికి భంగముగలిగించి జయింపఁబడెనని నమ్మిన శత్రుని రహస్యప్రదేశమందుండి కొట్టవలెను. సార్థవ్రజస్కంధావారసంవాహముల విలోపముగలిగెనని భ్రమపడినశత్రువును జాగరూకుఁడై కొట్టవలెను. సారబలుఁడు ఫల్గుబలావచ్ఛన్నుఁడై శత్రువీరులను ప్రవేశించికొట్టవలెను. గోగ్రహణముచేసిగాని శ్వాపదవధముచేఁగాని పరవీరుల నాకర్షించి రహస్యప్రదేశమందు దాగియుండి వానినికొట్టవలెను.

రాత్రియందాక్రమణముచే శత్రుబలమునకు నిద్రలేకుండఁజేసి నిద్రాక్లాంతులును తప్తులునునగు వారినిఁ దానతప్తుఁడై పగటిపూటఁగొట్టవలెను. పాటచర్మములచేఁ గప్పఁబడిన యేనుఁగులసహాయమున రాత్రియుద్ధముఁజేయింపవలెను. పూర్వాహ్ణమున సన్నాహముచేఁ బరిశ్రాంతులగువారి నపరాహ్ణమునఁగొట్టవలెను. శత్రుసైన్యమునెండగలిగియున్నపుడు దానినికొట్టవలెను.

ధాన్వన సంకట పంక శైల నిమ్న విషమ ప్రదేశములును నావలు గోవులు శకటవ్యూహనీహారములు రాత్రి — ఇవి సత్రములు (కపటోపాయావకాశములు.)

కూటయుద్ధమునకు యుద్ధప్రారంభమే తగినకాలము.

సంగ్రామమన్ననో — నిర్దిష్టదేశకాలములు గలవాఁడై ధర్మిష్ఠుఁడై స్వసైన్యమునంతను నొకచోఁ జేర్చి, మీతో నేను తుల్యవేతనుఁడను, ఈరాజ్యము మీతోఁగలిసి నాకనుభవింపఁ దగియున్నది. కాఁబట్టి నాచే నిర్దేశింపఁబడుశత్రుని మీరుచంపుఁడు. వేదములందుఁ గూడ, సమాప్తదక్షిణలుగల యజ్ఞముల నవభృథస్నానముచే లనఁగలుగుఫలము శూరులకుఁ రాఁగలదని చెప్పఁబడియున్నది. ఇదిగాక దీని సిగురించి రెండుశ్లోకములుగూడ నున్నవిగదా? "యాన్యజ్ఞసంఘైస్తపసాచవిప్రాః స్వర్గైషిణః పాత్రచయశ్చయాంతి। క్షణేనతానప్యతియాంతిశూరాః ప్రాణాన్సుయుద్ధేషు పరిత్యజంతః॥ నవంశరావం సలిలస్యపూర్ణం సుసంస్కృతం దర్భకృతోత్తరీయం। తత్తస్య మాభూన్నరకం చగచ్ఛేద్ యోభర్తృపిండస్య కృతేనయుధ్యేత్॥" (పాత్రచయములతోఁగూడిన స్వర్గకాంక్షులగు విప్రులు యజ్ఞముల మూలముగను తపస్సుమూలముగను పొందుఫలమును యుద్ధములందుఁబ్రాణములఁ ద్యజించినశూరు లాక్షణముననే పొందఁగలరు. భర్తృనిమిత్తమై యుద్ధముచేయక నరకముఁబొందువానికి సలిలపూర్ణమును సుసంస్కృతమును దర్భకృతోత్తరీయమును క్రొత్తదియును నగు శరావముకూడ లభింపదు) అనిచెప్పి మంత్రిపురోహితులమూలమున యోధులకుత్సాహమును పుట్టింపవలెను.

కార్తాంతికాదివర్గము వ్యూహసంపదనుసూచించియు సర్వజ్ఞదైవసంయోగఖ్యాపనముచేసియు స్వపక్షమున కుత్సాహమును పరపక్షమున కుద్వేగమును కలిగింపవలెను. యుద్ధమునకుఁ బూర్వదినము రాజుపవాసముండి శస్త్రసహితమగువాహనముపైఁబరుండి యాథర్వవేదోక్తముగ హోమమొనర్చి విజయయుక్తములును స్వర్గసంపా

దకములుగను సాక్షిస్సులఁజెప్పించి బ్రాహ్మణులకుఁ దనశరీరమర్పింప వలెను. శౌర్యశిల్పాభిజనానురాగయుక్తులయినట్టియు సత్కృతమానముల లోపమొందనట్టియువారిచే సేనాగర్భమునుంచవలెను. ఆయుధీయులును ధ్వజరహితులును శిరోవేష్టనములేనివాడును నగుచిత్రపుత్రుని రాజుండవలెను. సైన్యమశ్వానుబంధమైన ప్రుష్ఠ గజముగాని రథముగాని రాజవాహనముగ నుండవలెను. సైన్యమందేదియంగ మధికముగనుండునో, యేదివినీతముగ నుండునో దానిని కూడ నారోహింపవచ్చును. రాజవ్యంజనుఁడు వ్యూహానుష్ఠానము చేయింపవలెను.

శూరులకు స్వర్గమును భీరులకస్వర్గమును కలుగునని సూత మాగధులుచెప్పుచు యోధుల జాతిసంఘకులకర్మవృత్త స్తవమును కావించుచుండవలెను. పురోహితపురుషులు కృత్యాభిచారముల గుఱించి చెప్పుచుండవలెను. సత్రికవర్ధకీమౌహూర్తికులు స్వకర్మసిద్ధిని పరకర్మాసిద్ధిని వర్ణింపవలెను.

అర్థమానములచే గౌరవింపఁబడిన సైన్యముతో సేనాపతి, (శత్రు) రాజవధను చేసినవానికి శతసాహస్రము, సేనాపతికుమార వధకేఁబదివేలు, ప్రవీరముఖ్యవధకుఁ బదివేలు, హస్తిరథవధకైదు వేలు, అశ్వవధకు సహస్రము, పత్తిముఖ్యవధకుశతము, శిరోవధ కిరువది, స్వయంగ్రాహానికి భోగద్వైగుణ్యము పారితోషికమనిచెప్పవలెను. దశవర్గాధిపతులు దీని నెఱుంగవలెను.

శస్త్రయంత్రాగదస్నేహవస్త్రహస్తులై చికిత్సకులుండవలెను. స్త్రీలన్నపానములఁ బెట్టుకొని రక్షణీయపురుషులఁ బ్రోత్సహించుచు వెనుకనుండవలెను.

సైన్యమును దక్షిణముఖముగాక అనుకూలప్రాకారముగల సూర్యునివైపు వెనుకభాగమున నుండునట్లు స్వభూమియందు వ్యూహముగనొనర్పవలెను. పరభూమియందు వ్యూహమొనర్చునపుడశ్వములఁ బఱుగెత్తింపవలెను. ఏభూమివ్యూహ మొనర్పఁబడిన సైన్యమునకు

శత్రువువలన స్థానముగాని ప్రజవముగాని కలిగినపుడది యచటనుండినను పఱుగెత్తిపోయినను జయింపఁబడును. స్థానప్రజవములు రెంటియందు దీనికివిరుద్ధముగ జరిగినపుడది శత్రుసైన్యములజయించును.

ముందుభాగమందును ప్రక్కలను వెనుకభాగమందు నుండు భూమి సమమైనదో విషమమైనదో వ్యామిశ్రమైనదో తెలిసికొని సమమయినచో దండమండలవ్యూహములను విషమమయినచో భోగసంహతవ్యూహములను చేసికొనవలెను.

(శత్రువుయొక్క) విశిష్టబలమును కోట్టిగాని సమబలుఁడగు శత్రునిచే యాచింపఁబడిగాని సంధిచేసికొనవలెను. హీనుఁడు స్వభూమిపొందినపుడును శరీరవిరక్తినొందినపుడునుతప్పఁ దక్కినపుడతనిని వెంటనంటి నాశముచేయవలెను.

పాఱిపోవుచు వెనుకకు మఱలివచ్చునట్టియు జీవితమందు నిరాశ చేసికొనినట్టియు సైన్యముయొక్క వేగమోర్వఁదగనిదియైయుండును. కావున భగ్నసైన్యమును పీడింపరాదు.

**ఇది సాంగ్రామికమను దశమాధికరణమున**

**కూటయుద్ధభేదములు, స్వసైన్యోత్సాహనము, స్వబలాన్యబలవ్యాయోగమను మూఁడవ యధ్యాయము.**

**ఆదినుండి నూటముప్పఁదియొకటవ యధ్యాయము.**



## 153-54 ప్రకరణము.

### యుద్ధభూములు, పత్త్యశ్వరథహస్తికర్మలు.

యుద్ధమునకైనను నివేశమునకైనను పత్త్యశ్వరథములకుఁ దగిన భూమినేర్పఱచుట మంచిది.

ధాన్వనవననిమ్నస్థలయోధులకును ఖనకాకాశాదిదివారాత్రియోధులకును నాదేయపర్వతానూపసారస ప్రదేశములందు యుద్ధముచేయు పురుషులకును గజములకును గుఱ్ఱములకును కావలసిన

యుద్ధభూములను కాలములను వానివానియిష్టమునుబట్టి నిర్ణయింపవలెను.

సమమైనది స్థిరావకాశముగలది హెచ్చుతగ్గులులేనిది చక్రఖురములజాడలులేనిది అక్షమునడ్డనిది వృక్షగుల్మ ప్రతతులు లేనిది స్తంభ కేదారశ్వభ్రవల్మీకసికతాభంగ కంటకాదివిహీనమైనది— ఇట్టి భూమి రథయోగ్యము.

యుద్ధనివేశములు రెండిటియందును మనుష్యులకును హస్త్యశ్వములకును సమవిషమభూములు రెండును హితములుగ నుండును.

సులభముగ దాటదగిన చిన్నచెట్లు వృక్షములు కన్నములు ముండ్లుగలభూమి గుఱ్ఱములకు దగినది.

స్థూలములగు స్థాణ్వశ్మవృక్షప్రతతులను వల్మీకగుల్మములను కలది పదాతియోగ్యమగుభూమి.

గమ్యశైలములచే విషమమైనదియు నిమ్నవిషమమైనదియు మర్దనీయవృక్షములుగలదియు ఛేదనీయప్రతతులు గలదియు బంకభంగురమయినదియు గంటకహీనమయినదియు నగుభూమి హస్తియోగ్యము.

కంటకహీనమైనదియు బహువిషమముకానట్టిదియు మిక్కిలి వైశాల్యముగలదియు బదాతులకును; ద్విగుణప్రత్యాసారముగలదియు గర్దమోదకఖంజనహీనమయినదియు నిశ్శర్కరమగునదియు గుఱ్ఱములకును; పాంసుకర్దమోదక నళశరములుగలదియు శ్వదంష్ట్రహీనమయినదియు మహావృక్ష శాఖాఘాత వియుక్తమైనదియు గజములకును; తోయాశయములుగలదియు మిట్టపల్లములులేనిదియు గేదారహీనమయినదియు మఱలుటకు దగినదియునగుభూమి రథములకును మిక్కిలి యోగ్యములగుభూములు.

అన్నిటికిని తగినభూములు చెప్పబడినవి. యుద్ధనివేశముల కనుకూలించు ప్రదేశములుకూడ దీనిబట్టి గ్రహించునది.

భూమివాసవననిచయము విషమతోయ తీర్థవాతరశ్మిగ్రహణము వీవధాసారములఘాతరక్షలు బలమునకు విశుద్ధిస్థాపన సైన్యాపసారవృద్ధి సైన్యపార్శ్వరక్షణము ప్రథమయుద్ధము (శత్రుసైన్యమును) చెదర్చుట బాధించుట (స్వసైన్య) రక్షణము గ్రహణము మోక్షణము మార్గానుసారవినిమయము కోశకుమారాభిహరణము పశ్చాద్భాగఘాతము హీనానుసారణము అనుయానము సమాజకర్మ — ఇవి అశ్వకర్మలు.

పురోయానము మార్గవాసతీర్థములనేర్పఱచుట పార్శ్వరక్షణము నీటినిదాటునప్పుడును నీటిలోదిగునపుడును స్థానగమనములఁ దెలిసికొనుట విషసంబాధప్రవేశము అగ్నిదానము అగ్నిశమనము ఏకాంగవిజయము భిన్నసంధానము అభిన్నభేదనము వ్యసనమందు రక్షించుట అభిఘాతనము బిభీషికచే భయపెట్టుట ఔదార్యము గ్రహణము మోక్షణము సాలద్వారాట్టాలకభంజనము కోశవాహనము ఇవి హాస్తికర్మలు.

స్వబలరక్ష చతురంగబలప్రతిషేధము యుద్ధమందుగ్రహణమోక్షణములు భిన్నసంధానము అభిన్నభేదనము త్రాసనము ఔదార్యము భీమఘోషము— ఇవి రథకర్మలు.

సర్వదేశకాలశస్త్రవహనము వ్యాయామము— ఇవి పదాతికర్మలు.

శిబిరమార్గసేతుకూపతీర్థశోధనము యంత్రాయుధావరణోపకరణగ్రాసవహనము కొట్టఁబడినపురుషులను వారి ప్రహరణావరణములను యుద్ధభూమినుండి (శిబిరమునకు) తెచ్చుట— ఇవి విష్టికర్మలు.

అల్పహయుఁడగురాజు వృషభములతో నశ్వములఁజేర్పవలెను; అల్పగజుఁడగువాఁడు ఖరోష్ట్రశకటములచే సేనాగర్భమును పూరింపవలెను.

ఇది సాంగ్రామికమను దశమాధికరణమున
యుద్ధభూములు పత్త్యశ్వరథహస్తికర్మలను.

నాలుగవ యధ్యాయము.

ఆదినుండి నూటముప్పదిరెండవ యధ్యాయము.



## 155-7 ప్రకరణము.

### సైన్యముయొక్క పక్షకక్షోరస్యముల వ్యూహవిభాగము. సారఫల్గుబల విభాగము. పత్త్యశ్వరథహస్తియుద్ధములు.

అయిదువందలధనుస్సుల దూరమున దుర్గముగట్టి యుద్ధము ప్రారంభింపవలెను. సేనాపతినాయకులు భూమిని పట్టి చక్షుర్విషయము గాకుండునట్లు చప్పుడుచట ముఖ్యులనిలిపి వ్యూహమునుపన్నవలెను.

పదాతుల శమూంతరముగను (పదునాలుగంగుళములకొక శమ్యప్రమాణము) అశ్వములను మూఁడుశమములకొకటిచొప్పునను రథముల నైదుశమములకొకటిచొప్పునను దీనికి రెండుమూఁడురెట్లవకాశముచొప్పున గజములనునుంచి వ్యూహముఁబన్ని యథాసుఖముగను నసమ్మర్దముగను యుద్ధముచేయువలెను.

అయిదరత్నులొకధనుస్సు. ధనుర్ధరుల నొకధనుస్సునకొకపంక్తిచొప్పునను, మూఁడుధనుస్సులకొకపంక్తిచొప్పున గుఱ్ఱములను, అయిదుధనుస్సులకొకపంక్తిచొప్పున హస్తిరథములను నుంపవలెను.

సేనాపక్షకక్షోరస్యములలోనొకదానికిమధ్యమున నైదుధనుస్సులవకాశముండవలెను. ఒకగుఱ్ఱమునకు ముగ్గురుప్రతియోధులు; ఒకరథమునకుఁగాని గజమునకుఁగాని పదునైదుగురు ప్రతియోధులు లేక అయిదుగుఱ్ఱములొకరథమునుకానిగజమునుకానియెదిరింపవచ్చును. వాజిరథద్విపములలోనొకదాని కైదుగురు పాదగోప్తు లుండవలెను.

మూఁడు రథత్రికములను సేనకురస్యముగను మూఁటిని కక్షములందును నుంపవలెను. ఇట్లుచేయుటవలనవ్యూహమందు నలువది

యైదురథములు రెండువందలయిరువదియైదశ్వములు ఆఱువందలడె
బ్బదియైనగురు(పతియోధులు వాజిరథద్విపములకందఱే పాదగోప్తు
లు నుండుదురు. ఇదియే సమవ్యూహము. దానికి రెండేసి రథముల
చొప్పున నిరువదియొకటివఱకుఁ బెంచినచోఁ బదివిషమవ్యూహప్ర
కృతులగును. వ్యూహముపన్నినతర్వాత శేషించిన సైన్యము నందం
దు నిలుపవలెను. మిగిలినరథములను మూఁడుభాగములుచేసి రెంటిని
తక్కినయంగముల నడుమను మూఁడవభాగము నురస్యమందును
నుంపవలెను. ఈవిధముగ రథములకుఁ ద్విభాగోనమగు నావాపము
ను చేయవలెను. హస్త్యశ్వముల విషయముఁగూడ నావాప మిట్లే
యని యెఱుంగునది.

అశ్వరథద్విపములకు యుద్ధసమ్మర్దము కలుగకుండున ట్లావా
పము చేయవలెను.

దండబాహుళ్య మావాపము. పదాతులబాహుళ్యము ప్ర
త్యావాపము. ఏకాంగబాహుళ్య మన్వావాపము. దూష్యబాహు
ళ్య మత్యావాపము. శత్రువు యావాపప్రత్యావాపములకంటె నా
లుగెనిమిదిరెట్లధికము స్వసైన్యావాపము చేయవలెను.

రథవ్యూహములచే హస్తివ్యూహము గ్రహించునది. హస్తి
రథాశ్వములను కలిపి వ్యూహమొనర్ప నచ్చును. చక్రాంతములం
దేనుఁగులు, పార్శ్వములం దశ్వములు ముఖ్యులు, ఉరస్యమున రథ
ములుగలది వ్యామిశ్రవ్యూహము. ఉరస్యగముగ నేనుఁగులు కక్ష
ములందు రథములు పక్షములందశ్వములుగలవ్యూహము మధ్యభేది.
తద్విపరీత మంతభేది.

ఏనుఁగులలో సాన్నాహ్యము లురస్యముగను నపవాహ్యము
లు జఘనముగను వ్యాళములు కోటిస్థితముగను నుండఁబడిన వ్యూ
హము శుద్ధము.

కవచములుగల యశ్వముల నురస్యముగను గవచరహితము
లగువానిని కక్షపక్షములందునుంచి పన్నినవ్యూహమశ్వవ్యూహము.

కవచములుగల యోధులు, ముందును ధనుర్ధరులు వెనుకనుంపఁబడిన వ్యూహము పత్తివ్యూహము.

పక్షములందు శుద్ధములగుపదాతులను పార్శ్వములం దశ్వములను పృష్ఠమున నేనుఁగులను పురోభాగమున రథములనుంచిఁగాని శత్రువ్యూహమున ననుసరించి కొన్నిమార్పులచేసిగాని వ్యూహముప న్నవలెను. దీనిచే త్ర్యంగబలవిభాగముకూడఁ దెలిసికొనునది.

కులము జాతి సత్త్వము వయస్సు ప్రాణము జవము తేజస్సు స్థైర్యము ఉదగ్రత్వము విధేయత్వము ప్రసిద్ధమగునాచారములుగల పత్త్యశ్వరథద్విపములవిశేషమే దండసంపద.

సారమగు మూఁడవవంతుసైన్యము నురస్యముగనుంచి కక్ష పక్షములు రెండిటియందు రెండుమూఁడవవంతులనుంచి సారానుగుణముగ నేర్పఱచినపు డనులోమమగును. మూఁడవవంతు సారమై తక్కినది ఫల్గుబలమైనపుడు ప్రతిలోమమగును. ఈరీతిగసర్వసైన్యము నుపయోగపఱచుకొనవలెను.

కొనలయందు ఫల్గుబలములనుంచినచో శత్రువేగాభిహతమగుచు. అగ్రభాగమున సారబలమును కోటులందనుసారబలమును నుంపవలెను. జఘనమునఁ దృతీయసారమును నడుమ ఫల్గుబలమును నుంచినచోనది శత్రుసైన్యమును సహింపఁగలదియగును. వ్యూహస్థాపనముగావించి పక్షకక్షోరస్యసైన్యములలో నొకటి రెండిటిచే శత్రునిఁబ్రహరించి మిగిలినదానితో వానినిపట్టుకొనవలెను.

శత్రుసైన్యము దుర్బలమై యల్పముగుహస్త్యశ్వములుగలదియై దూష్యామాత్యకృతోపజాపమైనదిగ నున్నపుడు ప్రభూతసారసైన్యములచేదానినికొట్టవలెను. శత్రుబలము మిగులసారముగలదైనపుడు ద్విగుణసారమగు సైన్యముచే దానినికొట్టవలెను. స్వసైన్యములో నేయంగమల్పసారముగనుండునో దానిని వృద్ధిపఱుపవలెను. ఎచట శత్రుసైన్యముల కపచయభయములగునో అచట స్వసైన్య

వ్యూహము గావించవలెను.

ఎదురుగఁబఱుగెత్తుట అంతటఁదిరుగుట అధికముగఁదిరుగుట పాఱిపోవుట శత్రుసైన్యమును బెదరించి యాపివేయుట స్వసైన్యము నొకచోటఁ జేర్చుట చుట్టుతిరుగుట చెదరఁగొట్టుట పృష్ఠవ్యావృత్తముగావించుట ఎదుటను బ్రక్కలను వెనుకను శత్రుసేనలఁదరుముట భగ్నస్వసైన్యరక్షణము భగ్నానుపాతము— ఇవి అశ్వయుద్ధములు.

పైవానిలోఁ జెదరఁగొట్టుటతప్పఁ దక్కినవియు వ్యస్తసమస్తములగు చతురంగములఘాతము పక్షకక్షోరస్యములగు శత్రుసైన్యములకు పరిభంజనావస్కందములు సౌప్తికము — అనునవి హాస్తియుద్ధములు.

పైవానిలో శత్రుసైన్యముల బెదరించి యాపివేయుటతప్పఁ దక్కినవియు స్వభూమియందభియానాపయానస్థితయుద్ధములు రథయుద్ధములు.

సర్వదేశకాలప్రహరణము రహస్యముగఁగొట్టుట— ఇవి పత్తియుద్ధములు.

చతురంగముల విభవమునమసరించి యీరీతిగ వ్యూహములను యోజములుగను యుగ్మములుగను చేయవలెను. రెండువందలధనుస్సుల దూరమందునిలిచి ప్రతిగ్రహుఁడై (ప్రత్యేకముగఁగొంతసైన్యముంచుకొని) రాజుండవలెను. ప్రతిగ్రహమువలననే చెదరిన సైన్యము తిరిగియొకచోటఁ జేరఁగలుగునుకాన నప్రతిగ్రహుఁడై యుద్ధము చేయరాదు.

ఇది సాంగ్రామికమను దశమాధికరణమున

సైన్యముయొక్క పక్షకక్షోరస్యాదులవ్యూహవిభాగము, సారఫల్గుబలవిభాగము, పత్త్యశ్వరథహస్తియుద్ధములను అయిదవ యధ్యాయము.

ఆదినుండి నూటముప్పదిమూఁడవ యధ్యాయము.



## 158-9 ప్రకరణము.

—దండభోగమండలాసంహతవ్యూహనము. దానికిఁ బ్రతివ్యూహస్థాపనము.—

పక్షోరస్యములు (శత్రుసైన్యముపై) తిరుగునట్లొనర్చుట భోగవ్యూహము. పక్షములు కక్షములు ఉరస్యము ప్రతిగ్రహము (ఇవి వ్యూహాంగములు) అని బార్హస్పత్యులు. ఉభయులయొక్క దండభోగమండలాసంహతములను ప్రకృతివ్యూహములు పక్షకక్షోరస్యములుగ నుండును.

వానిలోఁ దిర్యగ్వృత్తి దండము. సమస్తములై ఒకరినొకరి ననుసరించుట భోగము. అన్నివైపుల వ్యాపించియుండుట మండలము. వేరువేఱుగఁ బనిచేయఁదగినట్లు సైన్యమునేర్పఱచుట యసంహతము.

పక్షకక్షోరస్యములందు హెచ్చుతగ్గులులేకసమముగనుండుట దండము. అది కక్షభాగమున నతిక్రాంతమయినచో ప్రదరము. పక్షకక్షములందుఁ బ్రతిక్రాంతమైనపుడు దృఢకము. పక్షములందు నిష్క్రాంతమైనపు డసహ్యము. పక్షములనేర్పఱచినతర్వాత నురస్యము నతిక్రాంతపఱచినచో నది శ్యేనమగును. పైవానికి విరుద్ధముగనున్నప్పుడివి చాపము చాపకుక్షి ప్రతిష్ఠ సుప్రతిష్ఠలని యనిపించుకొనును. చాపమువలెఁ బక్షముల నుంచినయెడలనది సంజయమగును. ఉరస్యమతిక్రాంతమయినచో విజయమగును. స్థూలకర్ణపక్షమయినపుడు దానికి స్థూలకర్ణమని పేరు. పక్షములు రెండురెట్లుస్థూలములయినచో నదివిశాలవిజయము. అతిక్రాంతపక్షమైనది చమూముఖము. తద్విరుద్ధమగునది ఝషాస్యము.

ఊర్ధ్వరాజియగు దండవ్యూహమునకు సూచియని పేరు. రెండుదండములుగలది వలయము. నాలుగుదండములుగలది దుర్జయము. ఇవి దండవ్యూహములు.

పక్షకక్షోరస్యములచే విషమముగనుండుభోగవ్యూహమునకు సర్పసారియనియు గోమూత్రికయనియుఁ బేర్లు. అదియే యుగ్మోరస్యమై

సంజ్ఞల నేర్పఱుపవలెను. ఇద్దఱివ్యూహములు సమానములుగనున్నప్పుడు అంగవిభాగసంఘాతస్థానమున వ్యావర్తన సపరిహారణములందు దేశకాలయోగమునుబట్టి సిద్ధికలుగును.

సైన్యములు ఉపనిషద్యోగములు వ్యాసక్తఘాతులగు తీక్ష్ణులు మాయలు దేవసంయోగములు శకటములు హస్తిభూషణములు లోనగువాని చేతను; దూష్యులకుఁ బ్రకోపముగలిగించియు గోయూథములఁ బట్టుకొనియు స్కంధావారములందు నిప్పుపెట్టియుఁ గోటీజఘనములఁగొట్టియు దూతవ్యంజనులగువారిచే భేదపెట్టియు; (శత్రు)నిఁ గోట దగ్ధమయినదనియు హరింపఁబడినదనియుఁ గుల్యుఁడగు వానిశత్రువు నాటవికుఁడును కుపితులై సముద్ధతులైరనియుఁజెప్పి శత్రునకుద్వేగము గలిగింపవలెను.

ధనుర్ధరుఁడు ప్రయోగించినబాణము కొట్టినచో నొకనినికొట్టును లేక కొట్టకయేపోవును ప్రాజ్ఞునిచే నుపయోగింపఁబడిన బుద్ధి గర్భగతులనుసహితము కొట్టును.

ఇది సాంగ్రామికమను దశమాధికరణమున

దండభోగమండలాసంహతవ్యూహనము, దానికిఁబ్రతివ్యూహస్థాపనమును

ఆఱవ యధ్యాయము.

ఆదినుండి నూటముప్పదినాలుగవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున

సాంగ్రామికమను దశమాధికరణము సమాప్తము.





శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## 11 అధికరణము — సంఘవృత్తము.

### 160-1 ప్రకరణము.

#### భేదకారణములు రహస్యదండము.

దండమిత్రలాభములలో సంఘలాభముత్తమము. సంఘములు కలిసిపనిచేయునవి యగుటచే శత్రువులకధృష్యములై యుండును గాన వానిని సామదానములచేఁ దనకనుగుణములుగఁ జేసికొని వశపఱచుకొనవలెను. తనయందు ద్వేషించిన సంఘములవిషయమున భేదదండములఁ బ్రయోగింపవలెను.

కాంభోజసురాష్ట్రములలోని క్షత్రియశ్రేణ్యాదులు వార్తాశస్త్రోపజీవులు.

లిచ్ఛికవివ్రజకమల్లకమద్రకకుకురకురుపాంచాలాదులు రాజశబ్దోపజీవులు.

సత్త్రిలీసంఘములన్నిఁటినిపొంది వాని పరస్పరద్వేషవైరకలహస్థానములఁ దెలిసికొని క్రమముననుసరించిన భేదమును కల్పించి, ఇతఁడు నిన్ను నిందించుచున్నాఁడని యొకనితోఁ జెప్పవలెను. పరస్పరదోషములుగలవారి కాచార్యవ్యంజనులు విద్యాస్త్రశిల్పవిహారములందు బాలకలహముఁ బుట్టింపవలెను. వేశస్థలములందును శౌండికస్థలములందును తీక్ష్ణులు నిందాగర్భస్తోత్రములచే సంఘముఖ్యులకుఁ గలహముపెట్టవలెను. లేక, కృత్యపక్షోపగ్రహముచేఁ(సంఘములోని) కుమారకులలో హీనకులమందుఁబుట్టినవారిని విశిష్టకులోత్పన్నులని ప్రోత్సహింపవలెను. హీనులతో నేకపాత్రభోజనవివాహముల

నుండి విశిష్టులవారింపవలెను; లేక ఏకపాత్రభోజనవివాహములమూలమున హీనులను విశిష్టులతోఁ గూర్పవలెను. కులపౌరుషస్థానముల కు విరుద్ధముగ సమగౌరవమునుచూపి హీనులతో వ్యవహారముచేసెనని (విశిష్టునిగుఱించి) ప్రకటింపవలెను. ర్వాత్రులందుఁదీక్ష్ణులు వివాదకారణములగు ద్రవ్యపశుమనుష్యాభిఘాతముచేఁ గలహములఁ బుట్టింపవలెను. సర్వవిధములగుకలహములందును రాజు కోశదండములనిచ్చి హీనులపక్షమవలంబించి ప్రతిపక్షవధకై వారిని నియోగింపవలెను; భేదమొందినవారిని దేశమునుండి వెడలఁగొట్టవలెను; లేక వారినందఱి నేకదేశమందుంచి, అయిదేసికుటుంబములచేఁగాని పదేసికుటుంబములచేఁగాని (ప్రత్యేకముగ) కృషిచేయింపవలెను. వారొక్కచోటనుండినచో శస్త్రగ్రహణ సమర్థులగుదురుగదా! వారు కలిసి (కుట్రలుచేయుచుండిన) నయెడల శిక్షను విధింపవలెను. కులీనుఁడు నభిషిక్తుఁడునగు రాజావరుద్ధునిఁగాని యాక్షిప్తునిఁగాని రాజపుత్రత్వమున నిలుపవలెను. కార్తాంతికాదులు వీనిరాజలక్షణముల ను సంఘమందుఁ బ్రకటించి, ప్రజలమొదలనువిను నితనియెడ భక్తి గలవారై స్వధర్మమనుష్ఠింపుఁడని ధర్మిష్ఠులగు సంఘముఖ్యుల భేదపెట్టవలెను వీరువశపడినచో మఱికొందఱు కృత్యపక్షులసంగ్రహించుటకై యర్థదండములఁ బంపవలెను. కలహకాలమున శౌండికవ్యంజనులు పుత్రదానప్రేతాపదేశముచేఁ బానోత్సవమని మదనరసయుక్తములగు నందలకొలఁది మద్యకుంభములను నియ్యవలెను. చైత్యదేవతద్వారరక్షాస్థానములందు సత్రిలభిజ్ఞానముద్రలతోఁగూడిన హిరణ్యభాజనములను సమయకర్మనిక్షేపములని ప్రకటింపవలెను. సంఘములగపడినపుడు మేము విక్రీతులమయితిమని చెప్పి కలహమునను వారిని పురికొల్పవలెను; లేక సంఘముయొక్క వాహనహిరణ్యముల నపహరించి వానిలోఁ బ్రఖ్యాతద్రవ్యమును సంఘముఖ్యునికిచ్చి సంఘముచేఁ బ్రశ్నింపఁబడినపుడు వీరముఖ్యునికిచ్చితిమని చెప్పవలెను.

స్కంధావారాటవిక భేదవిషయముఁగూడ నిట్లేయని గ్రహించునది.

సత్త్రి, సంఘముఖ్యనిష్క్రాంతునితో, నీవీరాజ పుత్రుఁడవు శత్రుభయముచే నిచటనుంపఁబడితివని చెప్పి వానినివశపఱచుకొని వశుఁడయినతర్వాత వానికిఁ గోశదండములనిచ్చి సంఘముపై విక్రమింపఁజేయవలెను. వానివలన స్వార్థమునొందినతర్వాత వానినికూడఁ బరదేశమునకంపవలెను.

పరిశిహితులగు బంధకీపోషకులును ప్లవకనటనర్తకసౌభికులును, పరమరూపయౌవనలగు స్త్రీలమూలమున సంఘముఖ్యుల నున్మాదింపఁజేసి జాతకాములగు ముఖ్యులలో నొకనిని నమ్మించి మఱియొకనియొద్దకుఁ బోవుగాని లేక మఱియొకఁడు బలాత్కారహరణముగావించెననిగాని ముఖ్యులకుఁబరస్పరకలహమును పుట్టింపవలెను. కలహములోఁ దీక్ష్ణులు వారిపనిని కావించి కాముకుఁడగునితఁడు హతుఁడయ్యెనని చెప్పవలెను.

ఆశాభంగమొంది కోపించినముఖ్యునికడకు స్త్రీవెళ్లి, నిన్నుఁ బ్రేమించిన నన్నీముఖ్యుఁడు బాధించుచున్నాఁడు. వాఁడు జీవించియుండినచో నేనిచట నిలువలేనని చెప్పి వానిఁజంపింపవలెను.

బలాత్కరింపఁబడిన స్త్రీ రాత్రియందుపవనాంతమునఁగాని క్రీడాగృహమునఁగాని తన్నపహరించినవానిని తీక్ష్ణులచేఁ జంపింపవలెను. లేదా వానినిస్వయముగ రసమూలమునఁజంపి, వీనిచేనాప్రియుఁడు హతుఁడయ్యెనని ప్రకటింపవలెను. సిద్ధవ్యంజనుఁడు జాతకామునికి స్త్రీనివశపఱచుకొనుటయందుపయోగించు నౌషధముతో మేళగించిన రసమునిచ్చి వంచించి పాఱిపోవలెను. అతఁడు వెళ్ళినపిమ్మట సత్త్రులువచ్చి వరుఁడిట్టిప్రయోగము చేసెనని చెప్పవలెను. విధవలు గూఢాజీవలు యోగస్త్రీలు రాజువద్దనిక్షేపముంచినట్లు వివాదపడుచు (వివాదప్రదేశమునకువచ్చిన) సంఘముఖ్యులను మోసపెట్టవలెను. కౌశికస్త్రీలను నర్తకీగాయనలను పొందుటకై గూఢగృహా

ములందు రాత్రిప్రవేశించినవారిని తీక్ష్ణులుచంపవలెను, లేక పట్టితీసి కొనిపోవలెను. లేక సత్రియొకఁడు స్త్రీలోలుఁడగు సంఘముఖ్యుని తో, ఈగ్రామమందున్న దరిద్రకుటుంబమొకటి విదేశమునకుఁ బో యినది. దానికిసంబంధించినయీ స్త్రీరాజార్హ. దీనినితీసికొనుమని చెప్పవలెను. తర్వాతఁ బదునైదురోజులకు సిద్ధవ్యంజనుఁ డొకఁడు సంఘముఖ్యమధ్యమున, ఇతఁడు నాముఖ్యభార్య కోడలు చెల్లెలు కూతురు— లోనగువారిలో నొకతెయగుదీని నపహరించెనని మొఱ పెట్టుకొనవలెను. సంఘము వానినిశిక్షించినచో రాజాతనిపక్ష మవ లంబించి యతనివిరోధులపైఁ బురికొల్పవలెను. తీక్ష్ణులెల్లప్పుడు సిద్ధ వ్యంజనునొకనిని త్రిప్పుచుండవలెను. ఆయావేషములను వేసికొనిన కొందఱు, వీఁడు బ్రాహ్మణహంత, వీఁడు బ్రాహ్మణీజారుఁడని సం ఘముఖ్యులగుఱించి ప్రకటించుచుండవలెను.

లేక, కార్తాంతికవ్యంజనుఁ డొకనిచేవరింపఁబడిన కన్యనుగు ఱించి మఱియొకనితో, ఈకన్య రాజపత్నియు రాజప్రసవినియు న గును. కావున నీసర్వస్వమునిచ్చిగాని బలాత్కరించిగాని దీనినిఁబొం దుమని చెప్పవలెను. అది లబ్ధముకానపుడు పరపక్షమునకు ద్రోహము గలిగింపవలెను. లబ్ధమయినయెడలఁ గలహము సిద్ధము.

లేక, భిక్షుకియొకతె భార్యాప్రియుఁడగు నొకముఖ్యునితో, యౌవనోద్రిక్తుఁడగు నీముఖ్యుఁడు నీభార్యను గలియఁగోరి నన్నుఁ (దూతగ) బంపెను. వానివలనిభయముచే లేఖ్యాభరణములఁదెచ్చి తిని. నీభార్యనిర్దోషి. కావున రహస్యముగ నీవిషయమై ప్రతీకరిం చుకొనుము. నేనుకూడ సహాయముచేసెదనని చెప్పవలెను. ఇట్టి క లహస్థానములందు స్వయముగఁగాని తీక్ష్ణులమూలమునఁగాని జనిం చినకలహములలో హీనపక్షులను కోశదండములచే ననుగ్రహించి విగుణులపై వారిని విక్రమింపఁజేయవలెను, లేదా వారిని దేశమునుం డి తొలఁగింపవలెను.

ఈరీతిగ సంఘములకన్నిటికిఁ దానొక్కఁడే రాజుగనుండవలెను. తమకొక్కఁడే ప్రభువయినను సంఘములు పైవిధములగు మోసములనుండి రక్షించుకొనవలెను. సంఘముఖ్యుఁడు న్యాయవృత్తిచే సంఘహితుఁడై ప్రియుఁడును శాంతుఁడును యోగ్యులగుజనులతోఁ గూడినవాఁడును సర్వచిత్తానువర్తుఁడునునై యుండవలెను.

ఇది సంఘవృత్తమందు భేదకారణములు, రహస్యదండమును

మొదటి యధ్యాయము.

ఆదినుండి నూటముప్పదియైదవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున

సంఘవృత్తమను పదునొకండవ యధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## 12 ప్రకరణము = ఆబలీయసము.

### 162 ప్రకరణము.

#### దూతకర్మలు.

బలవంతునిచే నభియుక్తుఁడగు దుర్బలుఁడు పుత్రులతోఁగూడ నమ్రుఁడై వేతనధర్మము నవలంబింపవలెను.

బలవంతునికి నమ్రుఁడయినవాఁ డింద్రునికి నమ్రుఁడయిన వాఁడ (పొందునట్టి ఫలమునుపొందు) ని భారద్వాజుఁడు.

పరాక్రమ మెట్టివ్యసనమునయినఁ బోఁగొట్టును. క్షత్రియునకిదియే ముఖ్యధర్మము. యుద్ధమందు జయముగాని పరాజయము గాని రావచ్చును. కావున బలములనన్నిటినిఁ గూర్చుకొని యుద్ధముచేయవలెనని విశాలాక్షుఁడు.

అట్లుకాదు. ఎల్లఅశనమ్రుఁడగువాఁడు ఒడ్డునయున్న నక్రము వలె జీవితనిరాశుఁడు కావలసివచ్చును. అల్పసైన్యుఁడు యుద్ధమునకుఁ బ్రయత్నించినచో నావలేకసముద్రమును ప్రవేశించినవానివలె నశించును. కావున విశిష్టుఁడగురాజునుకాని యవిషహ్యమగు దుర్గమునుకాని యాశ్రయింపవలెనని కౌటిల్యుఁడు.

ధర్మవిజయి అసురవిజయి లోభవిజయియని యభియోక్తలు మూఁడువిధములు. వారిలో నమ్రత్వమాత్రముచే ధర్మవిజయి తృప్తి నొందును, కావున వానికి నమ్రుఁడై యుండవలెను. శత్రుభయము గలవాఁడై లోభవిజయి భూమి ద్రవ్యములచేఁ దృప్తినొందును;

కావున నర్థమిచ్చి వానిని హితపఱచుకొనవలెను. భూమిద్రవ్యపుత్రదారప్రాణహరణముచే నసురవిజయి తృప్తిఁబొందును కాన భూమిద్రవ్యములనిచ్చి వానినివశపఱచుకొని వానినుండి హానిని తప్పించుకొనవలెను.

వీరిలో నెవరయిన నుద్రేకించినపుడతనిని సంధిచేఁగాని మంత్రయుద్ధకూటయుద్ధములఁచేఁగాని ప్రతిఘటింపవలెను. శత్రుపక్షమును సామదానములచేతను స్వపక్షమునుభేదదండములచేతను, శత్రుని దుర్గరాష్ట్రస్కంధావారములను గూఢదూతలు శస్త్రాగ్నులచేతను సాధించి దిక్కులన్నిటినుండి వానిపార్ష్ణిని గ్రహింపవలెను. ఆటవికులచే వానిరాజ్యమును కొట్టవలెను; తత్కులీనావరుద్ధులచే రాజ్యాపహరణముగావింపవలెను. ఈయపకారమంతయు చేసినపిమ్మట వాని దగ్గఱకు దూతనంపవలెను. లేదా అపకారముచేయకయే సంధిచేసికొనవచ్చును. అప్పటికిఁగూడ యుద్ధసన్నద్ధుఁడగు శత్రునికిఁ దనకోశదండములలో నాలుగవవంతుకంటె నధికము నొకటిరెండురోజులలో నిచ్చెదనని సంధిచేసికొనవలెను.

అతఁడు దండసంధినికోరినచో నుత్సాహితమును కరయుక్తమునునగు హస్త్యశ్వసైన్యమునియ్యవలెను. పురుషసంధినికోరినచో యోగపురుషాధిష్ఠితమగు దూష్యామిత్రాటవీబలమునియ్యవలెను. శత్రునకును తనదూష్యబలమునకును వినాశమగునట్లొనర్పవలెను. లేక, తీక్ష్ణబలమునియ్యవలెను; ఇదిశత్రునిచేనవమానింపఁబడి ప్రకోపించును. లేక, తనయందనురక్తమగుమౌలబలముసైననియ్యవచ్చును; అయ్యదిశత్రువ్యసనమునుకనిపెట్టియుపకరించును. కోశసంధినికోరినచో నెవ్వఁడుకొనుటకిష్టపడనిసారద్రవ్యమునుకాని, యుద్ధయోగ్యముకానట్టి కుప్యమునుకాని ఇయ్యవలెను. భూమిసంధిని కోరినచోఁ బ్రత్యాదేయము నిత్యామిత్రము అనపాశ్రయము మహాక్షయవ్యయనివేశనమునగు భూమినియ్యవలెను. రాజధానీవర్జమగు సర్వస్వసంధినికోరినచో బలవంతుఁడు బలాత్కరించి యెద్దానినిహరింపఁగో

కునోదాని నెల్లనతనికిచ్చి స్వదేహరక్షణము చేసికొనవలెను. అనిత్యమగుధనమందుఁ బ్రీతియేల ?

ఇది ఆబలీయసమను ద్వాదశాధికరణమున దూతకర్మలు సంధియాచనమను మొదటి యధ్యాయము.

ఆదినుండి నూటముప్పదియాఱవ యధ్యాయము.



## 163 ప్రకరణము

### మంత్రియుద్ధము.

సంధినుండితొలఁగిన శత్రునితో, షడ్వర్గమునకు వశపడినరాజులు వినష్టులైరి. అనాత్మజ్ఞులగు వారిమార్గమవలంబింపఁబోకుము. ధర్మార్థములఁ జూచికొనుము. సాహసాధర్మములందును నర్థాతిక్రములందును నిన్నుఁ బ్రవేశపెట్టిన నీమిత్రులు నిజముగనీకుశత్రువులై యున్నారు. త్యక్తాత్ములగుశూరులతో యుద్ధముచేయుటసాహసము ఉభయజనక్షయమునుగలిగించుట యధర్మము. ప్రాప్తమగునర్థమును నదుష్టుఁడగుమిత్రుని విడిచికొనుట యర్థాతిక్రమము. మిత్రవంతుఁడగు నీరాజీయర్థమును నీపైనభియానము చేయఁబోవు మిత్రులకిచ్చి వారినిఁజేరఁదీసికొనును. మధ్యమోదాసీనమండలమున కితఁడు పరిత్యక్తుఁడు కాలేదు, కాని నీవుపరిత్యక్తుఁడవైతివి. సముపత్యక్తుఁడవైనను నీపైఁబడుటకువారు సమయము వెదకుచున్నారు. క్షయవ్యయయోగముకలుగును; మిత్రులను వదలుకొనుము. అటుతర్వాతఁ బరిత్యక్తమూలుఁడగువీనిని సులభముగ భేదింపవచ్చును. కావునమిత్రముఖులగు నీయమిత్రులమాట వినకుము. (నావంటి) మిత్రులను భయపెట్టుటయు, అమిత్రులకు శ్రేయస్సుగలిగించుటయుఁ బ్రాణసంశయానర్థములఁ బొందుటయు నీకుఁదగదని చెప్పవలెను.

ఇట్లుచెప్పినను విరోధించి యభియానముచేసినయెడల సంఘవృత్తియోగవామనప్రకరణములందుఁ జెప్పఁబడినరీతిని వానిప్రకృ

తులకు వానిపైఁగోపము పుట్టింపవలెను. ఆత్మరక్షితకప్రకరణమునఁ జెప్పఁబడినట్లు తీక్ష్ణులను రసదులను ప్రయోగింపవలెను. బంధకీపోషకులు పరమరూపయౌవనలగు స్త్రీలచేత శత్రుసేనాముఖ్యులను మోహపెట్టి ముఖ్యులలోనొకనికిఁగాని ఇరువురికిఁగాని కామముత్పన్నమైనపుడు తీక్ష్ణులువారికిఁ బరస్పరకలహముఁబుట్టించి కలహమందోడినవారినిఁ బరదేశమునకు వెళ్ళఁగొట్టుటగాని ప్రభువుయొక్క యాత్రయందు సహాయపడునట్లుగఁగాని చేయవలెను.

కామవశులగుముఖ్యులకు సిద్ధవ్యంజనులు సాంవననికౌషధములతో మేళగించినరసమునిచ్చి వంచింపవలెను.

లేక వైదేహకవ్యంజనుఁడు చక్రవిరాజభార్యయొక్క సమీపవర్తినియగు నొకపరిచారికను కామించి ధనముచేదానిని తృప్తిఁ బొందించి విడువవలెను. పిమ్మటవైదేహకుని పరిచారకవ్యంజనుఁడు వైపరిచారికకు సాంవననికౌషధములిచ్చి వైదేహకునిపై వానినిప్రయోగింపుమని చెప్పవలెను. తనకోరికసిద్ధించినపిమ్మట నాపరిచారిక రాజుపై నాయోగమును ప్రయోగింపుమని రాజభార్యతోఁజెప్పి రసమిశ్రితముగదానిని రాజునకిచ్చి వానినిమోసపెట్టవలెను.

కార్తాంతికవ్యంజనుఁడుక్రమముగ మహామాత్రునివశపఱచుకొని వానితో, నీవు రాజలక్షణసంపన్నుఁడవనిజెప్పవలెను. అట్లే భిక్షుకియొకతె మహామాత్రునిభార్యతో, నీవు రాజపత్నియు రాజప్రసవినియు నగుదువనిచెప్పవలెను. అప్పుడు భార్యావ్యంజనయొకతె మహామాత్రునితో, రాజునన్ను బలాత్కరించుచున్నాఁడు. ఇవియేఅతఁడు పరివ్రాజికచేఁబంపఁబడిన పత్రిలేఖ్యాభరణములని పలుకవలెను.

లేక సూదారాళికవ్యంజనుఁడొకఁడు రాజాజ్ఞచే యుద్ధమునకొఱకని కొంతద్రవ్యము దీసికొనిపోవునపుడు వైదేహకవ్యంజనుఁడు దానినపహరించి పిమ్మటమంత్రికిచ్చితినని ప్రకటింపవలెను. ఇట్లొకటిరెండుమూఁడుపాయములచేత నొక్కశత్రురాజుయొక్క మహామాత్రునతనిరాజుపై విక్రమింపఁజేయవలెను. లేక, అక్కడనుండి

వారు తొలఁగిపోవునట్లుగనఁ జేయవలెను.

శత్రురాజునొక్క శూన్యపాలాసన్నులగు సత్త్రిలు వాని దుర్గమందలి పౌరజానపదులతో మైత్రిచేసికొనుటకై యిట్లుపలుకవలెను. రాజాపన్యస్తుఁడయ్యెను; మఱి జీవించినచోఁ దుర్లభము. కావున బలాత్కరించి ధనమునుసంపాదింపకుఁడు. శత్రువులఁజంపుఁడని యోధులతోడను నధికరణస్థులతోడను శూన్యపాలుఁడు చెప్పియున్నాఁడు. అప్పుడు పౌరులొకచోఁగూడఁగా రాత్రులందుఁదీక్ష్ణులు వారి నొకచోటికిఁ దీసికొనిపోయి ముఖ్యులఁజంపి శూన్యపాలుని మాటచొప్పునఁ బ్రవర్తింపనివారి కిట్టిశిక్షయగునని చెప్పవలెను. శూన్యపాలస్థానములందు రక్తముతోఁగూడిన శస్త్రవిత్తబంధనముల నుంచి శూన్యపాలుఁడు కొట్టిచంపుచున్నాఁడని సత్త్రిలుప్రకటింపవలెను. ఇట్లే సమాహర్త నుండి జానపదులను భేదింపవలెను. సమాహర్త పురుషులతో గ్రామమధ్యమున రాత్రులందుఁ దిరుగుచు, అధర్మముగ జనపదమునుబాధించువారి కిట్టిశిక్షసంభవించునని చెప్పవలెను. దోషమారోపించినతర్వాత శూన్యపాల సమాహర్తలను ప్రకృతికోపమూలమునఁ జంపించి తత్కులీనావరుద్ధులను వారిస్థానమున నిలుపవలెను. ఆపత్కాలము సమీపించుచున్నదని చెప్పి సత్త్రులంతఃపురద్వారమును, ద్రవ్యధాన్యపరిగ్రహములను తగులఁబెట్టి ద్వారపాలకులఁ జంపవలెను.

ఇది ఆబలీయసమను ద్వాదశాధికరణమందు దూతకర్మలు వాక్యయుద్ధము
మంత్రియుద్ధమను రెండవయధ్యాయము.
ఆదినుండి నూటముప్పదియేడవ యధ్యాయము.



## 164-5 ప్రకరణము.

### సేనాముఖ్యవధ, మండలప్రోత్సాహనము.

రాజునకును రాజవల్లభులకును నాసన్నులగు సత్త్రిలు పత్త్యశ్వరథముఖ్యులపై రాజాగ్రహించియున్నాఁడని సుహృద్విశ్వాసము

చేఁ గొందఱుమిత్రులయెదుటఁ బ్రకటింపవలెను. తీక్ష్ణులందఱుకలిసి రాత్రి చారపరిశీకారములొనర్చుకొని, రాజాజ్ఞానుసారముగ నీగ్రహా మునకురండని చెప్పి దానినుండిమఱలివచ్చుచున్నవారిఁ జంపవలెను. అప్పుడాసన్నులగువా రిదిరాజాజ్ఞయనిపలుకవలెను. ప్రవాసితులగు సత్రులు, మేముచెప్పినట్లొనర్చి జీవితేచ్ఛయున్నచోఁదొలఁగిపొండని చెప్పవలెను.

ఎవరివలనరాజు యాచితుఁడై వారుకోరినదాని నియ్యకపో వునో వారినిగుఱించి సత్రులు, కోరఁగూడని ద్రవ్యమును వీరునన్నుఁ గోరి నాచేఁబ్రఖ్యాతులై శత్రులఁగలిసిరి. కావున వారివినాశముకొ ఱకుఁ బ్రయత్నింపుమని రాజశూన్యపాలునితోఁ జెప్పెనని ప్రకటించి పైవిధముగఁ బ్రవర్తింపవలెను.

యాచించినదానిని రాజువలనఁ బొందినవారినిగుఱించి సత్రు లు కోరఁదగినయర్థమును వీరివిశ్వాసమునుసంపాదించుటకై వీరికిచ్చి తిని; అయిననువీరు శత్రుసహితులయిరి. కావునవీరి నున్మూలింపఁ బ్రయత్నింపుమని రాజుశూన్యపాలునితోఁ జెప్పెనని ప్రకటించి పిమ్మ ట వెనుకఁజెప్పినవిధమున నాచరింపవలెను.

యాచ్యమగు నర్థమునుయాచింపనివారినిగుఱించి సత్రులు యాచ్యమగునర్థమును వీరునన్నుఁ గోరుటచే నిరి. దీనికి స్వదోష శంకితులగుటతప్ప వేఱొకకారణములేదు. కావున వీరియున్మూల మునకై ప్రయత్నింపుమని శూన్యపాలునితో రాజుచెప్పెనని ప్రక టించి వెనుకటివిధమునఁ జేయవలెను.

కృత్యపక్షులందఱివిషయమున నిక్షేయునియెలుంగునది.

లేక సత్రియొకఁడు రాజునాశ్రయించి. ఈ యీసీమహామా త్రులు శత్రుపురుషులతో మాట్లాడుచుండిరని బోధించి దానివలన రాజు వశపడినపుడు వీరే దూష్యులగుశాసనహారులని కొందఱినిచూ పి అవియేమిదియని చెప్పవలెను.

సేనాముఖ్యప్రకృతిపురుషులను భూమిహిరణ్యములచే లోభపెట్టి వారిబలముపై విక్రమింపఁజేయవలెను, లేక వారిని వారిరాజునుండి వేఱుపఱుపవలెను. వీనిపుత్రులలో నొకఁడయిన సమీపదుర్గమందుండినయెడల, నీవాత్మసంపన్నుఁడవగు పుత్రుఁడవు. అయినను నీవప్రధానుఁడవని యెంచఁబడుచున్నావు. ఏలయుపేక్షించెదవు? కావున విక్రమించి నీపదవినిపొందుము; లేనియెడల యువరాజు నీకువినాశముగలిగించునని భేదపెట్టవలెను.

లేక, తత్కులీనావరుద్ధులలో నొకనిని హిరణ్యముచే లోభపెట్టి వీనియంతరబలమునుకాని పార్శ్వమందును దేశాంతరమందునుండు సేననుకాని నాశముచేయుమని బోధింపవలెను.

లేక అర్థమానములచే నాటవికుల వశపఱచుకొని వీనిరాజ్యమును కొట్టింపవలెను. లేక వీనిపార్ష్ణిగ్రాహునితో నేనుమీకు సేతువువంటివాఁడను. ప్లవప్రియుఁడగు నీరాజు నన్నుఁగొట్టి మీయందఱిని ముంచివేయుననియు మనమందఱముగలిసి వీనియాత్రకు వినాశము గలిగింతమనియుఁ జెప్పవలెను. తర్వాత సంహతాసంహతులకు ఈరాజు నన్నున్మూలించి పిమ్మట మీపైఁబడును. మీరు శ్రేయమునుపొందుటకు నేను కారణభూతుఁడనని సందేశమంపవలెను.

తన్ను రక్షించుకొనుటకై మధ్యమోదాసీనాసన్నులకు సర్వస్వమర్పించి పంపవలెను.

ఇది ఆబలీయసమందు సేనాముఖ్యవధ, మండలప్రోత్సాహనమను
మూఁడవ యధ్యాయము.
ఆదినుండి నూటముప్పదియెనిమిదవయధ్యాయము.



## 166-7 ప్రకరణము.

### శస్త్రాగ్నిరసప్రణిధులు. వీవధాసారప్రసారవధ.

శత్రుదుర్గమందలి వైదేహకవ్యంజనులు గ్రామములందుండు గృహపతికవ్యంజనులు జనపదసంధులందలిగోరక్షకతాపసవ్యంజనులు

(శత్రుని) సామంతాటవిక తత్కులీనావరుద్ధులను, ఈశత్రుదేశము పహరింపఁదగియున్నదని పణ్యపూర్వముగ సందేశము పంపవలెను. తర్వాత వారివద్దనుండివచ్చిన గూఢపురుషులనర్థమానములచే గౌరవించి ప్రకృతిచ్ఛిద్రములను వారికి బోధించి వారితోఁగలిసి శత్రునిఁ బ్రహరింపవలెను.

శౌండికవ్యంజనుఁడు స్కంధావారమంద (శత్రుని) భృత్యకృత్యునొకనినుంచి అవస్కందకాలమందు నైషేచికమని మదనరసయుక్తములగు మద్యకుంభములను వందలకొలఁదిగ నియ్యవలెను. ఒకరోజువఱకు శుద్ధమైనట్టిగాని మాద్యమైనట్టిగాని మద్యమునుపయోగించి పిమ్మట రసమిశ్రితమగుదానినియ్యవలెను. దండముఖ్యులకుఁదొలుత శుద్ధమద్యమునిచ్చి మదకాలమున రసమిశ్రితమగుదానినియ్యవలెను.

దండముఖ్యవ్యంజనుఁడుకూడ నిట్లేచేయవచ్చును.

పక్వమాంసికౌదనికశౌండికాపూపికవ్యంజనులు గొత్తపణ్యమొకదానిని తెచ్చితిమనియుఁ బరస్పరసంఘర్షణముచే న్యాయమగు ఖరీదునకిచ్చెదమనియుఁ బ్రకటించి పరులనురప్పించి స్వపణ్యములను రసమిశ్రితములుగఁజేసి యియ్యవలెను. సురాక్షీరదధిసర్పిస్తైలములను స్త్రీలుబాలురు తద్వ్యవహర్తలనుండి కొని రసయుక్తములగుస్వభాజనములందుఁబోసి, ఈధరలకు మీవస్తువులన్నిటిని మ్యవలెనని వారిద్రవ్యములలో వీనినిచేర్పవలెను. వైదేహకవ్యంజనుఁడు వీనినే కొని (శత్రుని) హస్త్యశ్వములకువలసిన విధాయనసములందుపయోగించునట్లు చేయవలెను.

కర్మకరవ్యంజనులు రసమిశ్రితములగు యవసోదకములను విక్రయింపవలెను. చిరకాలమునుండి తయారుగాపెంపఁబడిన గోవాణిజకు (వ్యంజను) లు గోవులయు మేకలయు యూథములను యుద్ధకాలమందు శత్రువుల మోహస్థానములకై అచ్చటవిడువవలెను. అట్టివారే చుచుందరిశోణితము పూయఁబడిన కన్నులుగల దుష్టములగు

సశ్వాఖరోష్ట్రమహిషాదుల నచట విడువవలెను. లుబ్ధక వ్యంజనులు పంజరములనుండి క్రూరమృగములను సర్పగ్రాహులుగ్రవిషముగల సర్పములను హస్తిజీవులేనుఁగులను వదలిపెట్టవలెను. అగ్నిజీవు లగ్ని నిపెట్టవలెను. గూఢపురుషులు విముఖులగు పత్త్యశ్వరథద్విపముఖ్యులను చంపవలెను; లేక ముఖ్యులనివాసముల కగ్గిపెట్టవలెను. దూష్యామిత్రాటవికవ్యంజనులు కార్యములందు నియుక్తులై శత్రుపృష్ఠాభిఘాతమునుకాని యవస్కందప్రతిగ్రహమునుకానిచేయవలెను. వనములందు గూఢసంచారముచేయువారు శత్రువుయొక్క ప్రత్యంతమండలి శిబిరమునుచెఱచి నాశముచేయవలెను. ఏకాయనమునవచ్చుచుండు వీవధాసారప్రసారముల నాటంకపఱుపవలెను. రాత్రియుద్ధమందు సంకేతముచేసికొని తూర్యఘోషమునుకావించి ప్రవేశించితిమి; మీరాజ్యమును పొందితిమని కేకలవేయవలెను. లేకరాజనివాసమును ప్రవేశించి సందడిలో రాజునుచంపవలెను. నాలుగు దిక్కులకువెళ్లుచుండు (శత్రు) రాజును మ్లేచ్ఛాటవిక దండచారులు రహస్యస్థలములందుఁగాని స్తంభవాటముల వెనుకఁగానిదాగియుండి చంపవలెను. లుబ్ధకవ్యంజనులవస్కందసంకులములందు రహస్యయుద్ధములమూలమునఁ గొట్టవలెను. లేక మంచిప్రదేశములందుఁ దాముదాగియుండి శత్రుసైన్యమేకాయనమునఁగాని పర్వతముల మీఁదఁగాని వృక్షముల సమీపమునఁగాని యుదకములోఁగాని వెళ్లునప్పుడు దానినికొట్టవలెను; లేక నదీసరస్తటాకసేతుబంధముల భేదించి తద్వేగముచే వారికి వినాశముగలిగింపవలెను. ధాన్వనవనదుర్గనిమ్నదుర్గస్థుఁడగుశత్రుని యోగాగ్నిధూమములచే నాశముచేయవలెను. సంకటప్రదేశమందుండువాని నగ్నిచేతను ధాన్వనమందుండువానిని ధూమముచేతను సురక్షితప్రదేశమందుండువానిని రసముచేతను ఉదకమందుండువానిని దుష్టగ్రాహములులోనగు నుదకచరములచేతను తీక్ష్ణులు సాధింపవలెను. పైనిచెప్పిన ప్రదేశములందుఁ జిక్కువడియున్న శత్రుని యోగవామన యోగములచేఁగాని మఱి

ఇది ఆబలీయసమందు శస్త్రాగ్నిరసప్రణిధులు వీవధాసారప్రసారవధయను నాలుగవ యధ్యాయము.

ఆదినుండి నూటముప్పదితొమ్మిదవయధ్యాయము.

## 168-70 ప్రకరణము.

### యోగాతిసంధానము. దండాతిసంధానము. ఏకవిజయము.

భక్తిచే శత్రువు దేవతాయజ్ఞములకుఁగాని తీర్థయాత్రలకుఁగాని వెళ్లుపూజ్యస్థానములందు యోగోపాయములఁ గల్పింపవలెను. దేవతాగృహమును ప్రవేశించిన శత్రునిపై యంత్రబాధనముగ గూఢభిత్తినికాని శిలనుకాని పడఁద్రోయవలెను. ఉత్తమాగారమునుండి శిలాశస్త్రవర్షమును గురిపింపవలెను. కవాటమునుకాని యేకదేశబద్ధమై భిత్తిప్రణిహితమగు పరిఘమునుకాని పడఁద్రోసి శత్రునిఁజంపవలెను. లేక దేవతాదేహములందుంపఁబడిన శస్త్రములను వానిదేహముపైఁ బడఁద్రోయవలెను. అతని స్థానాసనగమనభూములందు గోమయముతోఁగాని శుద్ధోదకముతోఁగాని రసమునుకలిపి చల్లవలెను. పుష్పచూర్ణమును గానుకగ నిచ్చుమిషచేఁ బరిమళద్రవ్యములతోఁ గలిసిన తీక్ష్ణధూమమును పుట్టించి వానిఁజంపవలెను. లేక కీలమోక్షణముచే నతనిని శూలఘటితమగు కూపమునఁగాని శయనాసనములకుఁ గ్రిందుగ యంత్రబద్ధమగుప్రదేశమునఁగాని త్రోయవలెను. శత్రుఁడు స్వజనపదమందుఁ గలిగిన విరోధమును తప్పించుకొనుటకుఁ బాఱిపోవుచుండఁగా సమీపమందలి యటవ్యమిత్రులను పొందింపవలెను. దుర్గమునుండి పాఱిపోవుచున్నవానిని మోసపెట్టి ప్రత్యాదేయమగు శత్రుదేశమున కంపవలెను. ఒకప్రదేశమందుఁ జేరిన శత్రుజనమును నటవీవ్యవహితమగు శైలవననదీదుర్గములందుఁ బుత్రభ్రాతృపరిగృహీతముగ స్థాపింపవలెను.

దండోపనతవృత్తప్రకరణమున నుపరోధహేతువులు చెప్పఁబడియున్నవి.

ఒక యోజనపర్యంతము తృణకాష్ఠములదహింపఁజేయవలెను; ఉదకముల పాడుచేయవలెను. లేక నశింపఁజేయవలెను. బహిఃప్రదేశములందుఁ గూటకూపావపాత కంటకములనుకల్పింపవలెను. శత్రుస్థానమందు సురంగమును బహుముఖముగఁజేసి సేనాముఖ్యులను శత్రురాజును దానిమూలమునఁ దీసికొనిరావలెను. శత్రుప్రయుక్తమగు సురంగములోనికిఁ బరిఖలోని యుదకము పాఱునట్లుచేయవలెను. కూపశాలసమీపమునఁగాని కోటగోడవద్దఁగాని శంకాస్థానములందు నీళ్లులేని కంచుకుండలను వాతాభిజ్ఞానముకొఱకు నుంపవలెను. దానిమూలమున శత్రుసురంగాపథము తెలిసినపిమ్మట దానికిఁబ్రతిసురంగమును నిర్మింపవలెను. లేక శత్రుసురంగపు మధ్యభాగమును భేదించి ధూమోదకములలో నొకదానిని దానిలోనికిఁ బంపవలెను. దుర్గప్రతివిధానము చేసికొని మూలబలమున దాయాదునొకనినుంచి ప్రతిలోమదిశకుఁ బరుగెత్తిపోవలెను. తన మిత్రులతోడను బంధువులతోడను నాటవికులతోడను కలియుటకును, పరునిగొప్ప దూష్యమిత్రులతోఁ గలియుటకును, పరునికి వానిమిత్రులతో వియోగము గలిగించుటకును, వానిపార్ష్ణిఁ బ్రగ్రహించుటకును, వాని రాజ్యమును హరించుటకును, చెల్లునపడఁద్రోసి వానినిఁబ్రహరింపసమర్థుఁడగుటకును, స్వరాజ్యమును రక్షించుకొనుటకును, యిష్టానుసారముగ సంధిచేసికొనుటకును నేదిక్కునకువెళ్ళిన శ్రేయస్కరముగనుండునో ఆదిక్కునకు వెళ్ళవలెను.

(విజిగీషుని) సహప్రస్థాయులు, ఈనీశత్రువు నీకు వశుఁడగుచున్నాఁడు; పణ్యమునుమిషపెట్టి హిరణ్యమునంతసారబలమును పంపుము. బద్ధుఁడగువీని నర్పించెదను లేదా దేశమునుండి వెడలఁగొట్టెదమని శత్రువునకు సందేశించవలెను. అందుకతఁ డంగీకరించిహిరణ్యసారబలముల నిచ్చినయెడల వానిని తీసికొనవలెను.

అంతపాలుఁడు దుర్గమునిచ్చి సైన్యములో నొకభాగమును తీసికొనిపోయి విశ్వస్తుఁడగుశత్రునిఁజంపవలెను. జనపదమునొకదా

నిని నాశముచేయుటకు శతృసైన్యమును పిలిపించి విశ్వస్తముగ దాని నవరుద్ధదేశమునం బ్రవేశపెట్టి చంపవలెను.

లేక మిత్రవ్యంజనుండు బాహ్యునికి, ఈమర్గమందుండు ధాన్యస్నేహక్షారలవణములు క్షీణించినవి. ఈయీ దేశకాలములందవి దుర్గములోనికిఁ దీసికొనిరాఁబడును. కావున వానినిపట్టుకొనుడని సందేశమంపవలెను. పిమ్మట దూష్యామిత్రాటవికులుగాని దానికై నియోగింపఁ బడినవారుగాని రసవిద్ధములగు ధాన్యస్నేహక్షారలవణములఁ దేవలెను.

సర్వవిధములగు భాండవీవధగ్రహణవిషయమునఁగూడ నిట్లేయని యెఱుంగునది.

సంధినిచేసికొని హిరణ్యమందొక్కభాగమును వానికిచ్చి తక్కినదానివిషయమై యాలస్యము చేయువలెను. అట్లుచేసి వానిరక్షావిధానములు చెడఁగొట్టవలెను, లేక అగ్నిరసశస్త్రములచే వానినిఁ బ్రహరింపవలెను. హిరణ్యప్రతిగ్రాహులగు వానివల్లభులను వశపఱచుకొనవలెను.

పరిక్షీణుఁడయినచో దుర్గమునువానికిచ్చి పరుగెత్తిపోవలెను; లేక సురంగమార్గమునఁగాని కుక్షిప్రదరమార్గమునఁగాని ప్రాకారమును భేదించిగాని పరుగెత్తిపోవలెను.

రాత్రియందు యుద్ధమునకుఁ బిలిచి సిద్ధుఁడై యుండవలెను. అసిద్ధుఁడయినయెడల బార్శ్వమందుండి తొలఁగిపోవలెను. మందపరివారుఁడై పాషండవేషమును ధరించి వెళ్ళిపోవలెను ప్రేతవ్యంజనుఁడై గూఢులచే మోసికొనిపోఁబడవలెను. స్త్రీవేషధారియై ప్రేతమునననుసరించి వెళ్ళవలెను. దైవతోపహారశ్రాద్ధప్రవహణములందన్నపానముల రసవిద్ధముగఁజేసి కృతోపజాపుఁడై దూష్యవ్యంజనులతోఁగలిసి గూఢసైన్యముగలవాఁడై శతృవును కొట్టవలెను. శతృవు దుర్గమును పట్టుకొనినపుడు ప్రాశనముచేసి దేవతాగృహమునుకల్పించి దేవతాప్రతిమలోని ఛిద్రమును ప్రవేశింపవలెను, లేక

గూఢభిత్తియు దైవతాప్రతిమా యుక్తమునునగు భూమిగృహమును ప్రవేశింపవలెను. తన్నుగుఱించి శత్రువు మఱచిపోయినపిదప రాత్రియందు సురంగమూలమున రాజావాసముఁబ్రవేశించి నిద్రితుఁడగునతనిని చంపవలెను. విశ్లేషముగలయంత్రమును వాని మైఁబడఁద్రోయవలెను. రసాగ్ని యోగములచే నవలిప్తమగు గృహమందుఁ గాని లక్క యింటిలోఁగాని పరుండియున్న శత్రుని దహింపవలెను. ప్రమదవన విహారములలోఁగాని మఱియొక విహారస్థానమందుఁగాని ప్రమత్తుఁడుగనుండుశత్రుని భూమిగృహసురంగా గూఢభిత్తిప్రవిష్టులగు తీక్ష్ణులు చంపవలెను. నిరుద్ధదేశమందు నిద్రించుచున్న శత్రునిపై జార స్త్రీలు గూఢముగ వెళ్లి సర్పరసాగ్నిధూమములనువిడువవలెను; లేక సమయముగని పట్టి గూఢసంచారులెప్పుడెప్పుడు దేనినిచేయుటకు వీలుండునో అప్పుడప్పుడా యుపాయములను ప్రయోగింపవలెను. అటుపిమ్మట గూఢముగఁ బాఱిపోవలెను. ఆసమయములందు స్వజనమునకుఁ దెలియునట్టిసంజ్ఞల నేర్పఱచుకొనవలెను.

ద్వారపాలకులను వర్ష వరులను శత్రునిచే నిగూఢముగ నుంపఁబడినమఱికొందఱిని తూర్యసంజ్ఞలచేఁబిలిపించి శత్రువిషయమునఁ జేయఁదగిన మిగిలినపనులను చేయవలెను.

ఇతి ఆబలీయసమందు యోగాతిసంధానము దండాతిసంధానము ఏకవిజయమను అయిదవ యధ్యాయము.

ఆదినుండి నూటపదునొకండవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమం

దాబలీయసమను ద్వాదశాధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## 13 అధికరణము — దుర్గలంభోపాయము.

### 171 ప్రకరణము

ఉపజాపము.

పరగ్రామమును పొందఁదలఁచిన విజిగీషువు తనసర్వజ్ఞత్వదైవతసంయోగములఁ బ్రకటించి స్వపక్షమునకుత్సాహమును పరపక్షమునకుద్వేగమును కలిగింపవలెను.

సర్వజ్ఞత్వఖ్యాపనము— ముఖ్యులగృహములందలి రహస్యప్రవృత్తులఁ దెలిసికొని వారినిఁదొలఁగించుటచేతను కంటకశోధనులగు దూతలమూలమున రాజద్వేషులఁదెలిసికొని ప్రకటించుటచేతను మనవిచేసినవారికే తప్పుపట్టుటచేతను అదృష్టసంసర్గవిద్యాసంజ్ఞాముల మూలమున ముద్రాసంయుక్తముగు గృహకపోతమును వదలి దానివలనఁదక్షణమే విదేశప్రవృత్తిఁ దెలిసికొనుటచేతను సర్వజ్ఞత్వఖ్యాపనమగుచున్నది.

దైవతసంయోగఖ్యాపనము— సురంగాముఖమూలమున నగ్నిచైత్యదైవతప్రతిమాచ్ఛిద్రములలోఁ బ్రవేశించిన యగ్నిచైత్యదైవతవ్యంజనులతో సంభాషణము వారినిపూజించుట; ఉదకమునుండివెడలివచ్చి నాగహిరణ్యవ్యంజనులతో సంభాషణము వారినిపూజించుట; రాత్రి యుదకమందు సముద్రవాలుకాకోశమునుంచి యగ్నిమాలను చూపించుట; శిలాఘటితశిక్యములచేఁ గట్టఁబడిన పడవపైఁ గూర్చుండుట, శిరస్సును నాసికను నుదకవస్తిచేఁగాని జరాయువుచేఁ

గాని కప్పకొని లేడిపేగులనుండియుఁ గుళీరనక్రశింశుమారోద్రవములనుండియుఁ దయారుచేయఁబడిన తైలమును నాసికకుఁబూసికొనిరాత్రిగణము చరించుచున్నదని జలమందుఁజరించుట, వానిచే వరుణనాగకన్యలతో వాక్క్రియాసంభాషణముగావించుట, కోపసమయములందగ్నిధూమములను ముఖమందుండివిడచుట — ఈవిషయములు రాజునకుఁదెలియునని కార్తాంతికనైమిత్తికమౌహూర్తికపౌరాణికక్షణికగూఢపురుషసాచివ్యకరులును వానిని చూచినవారును ప్రకటింపవలెను. దైవతదర్శనము దివ్యములగుకోశదండముల యుత్పత్తియు వీనికిఁగలిగినదని శత్రురాష్ట్రమునఁ బ్రకటింపవలెను. దైవప్రశ్ననిమిత్తములను సాంగముగఁదెలిసినట్టివారు వీనికి స్వప్నమృగపక్షివ్యాహారములందుఁ బ్రజ్ఞగలదనియు శత్రునికట్టిది లేదనియుఁజెప్పవలెను. శత్రునక్షత్రమందు దుందుభిఘోషముతోఁగూడిన యుల్కగలదని చూపింపవలెను. దూతవ్యంజనులు శత్రురాజునొద్ద ముఖ్యమిత్రులుగనటించుచువిజిగీషునిసత్కారమును వానిబలాధిక్యమును వానివలనశత్రునకుఁ గలుగుప్రతిఘాతమును ప్రకటించి, వాఁడమాత్యులకు నాయుధీయులకును తనతోసమానముగ యోగక్షేమములఁ గూర్చువాఁడనియు వారివ్యసనాభ్యుదయములఁ గనిపెట్టి వారియందుఁ బుత్రవాత్సల్యముగలిగియుండుననియుఁ జెప్పవలెను. పరపక్షమును యథోక్తముగ నుత్సాహపెట్టవలెను. దానివిషయమై ముందుచెప్పెదము.

(శత్రువు) దక్షులయెడ సాధారణగార్దభమువలెను, సేనాధ్యక్షులయెడ విరిగినలకుచశాఖవలెను, ఉద్విగ్నులయెడఁ గూటైలకమువలెను, విమానితులయెడ నశనిపర్జన్యమువలెను, విహతాశులయెడలఁ గాశావకేశివాయసపిండకైతవజమేఘములవలెను, మిక్కిలిపూజించినను ద్వేషించినవారియెడ దుర్భగాలంకారములవలెను, సన్నిహితులయెడ వ్యాఘ్రచర్మమృత్యుకూటములవలెను, ధ్రువాపకారులయెడఁ బీలువిఖాదనకరకరోష్ట్రిగర్దభక్షీరాభిమంథనములవలెను నటించునని చెప్పవలెను. పైవిషయము లంగీకరించినవారి నర్థమానము

లో సంగి సంగ్రహింపవలెను. ద్రవ్యభక్తలోపములు వారికిఁగలిగినపుడు వారికివానినిచ్చి యనుగ్రహింపవలెను. అంగీకరింపనివారి స్త్రీకుమారాలంకారము లపహరింపవలెను.

దుర్భిక్షస్తేనాటవికోపఘాతములు కలిగినపుడు పౌరజానపదుల కుత్సాహముగలిగించుటకై సత్త్రిలు, రాజానుగ్రహమునుకోరుఁడు, అనుగ్రహింపనిచోఁ బరదేశమునకుఁ బోవుదమని చెప్పవలెను. దీనికంగీకరించినవారిని ద్రవ్యధాన్యపరిగ్రహములచే మంచిచేసి గొప్పలాభమును సాధింపఁదగును.

ఇది దుర్గలంభోపాయమను త్రయోదశాధికరణమున నుపజాపమను

మొదటి యధ్యాయము.

ఆదినుండి నూటనలువదియొకటవ యధ్యాయము.



## 172 ప్రకరణము.

### యోగవామనము.

ముండుఁడుగాని జటిలుఁడుగాని పర్వతగుహాలలో నివసించుచు నాలుగువందలసంవత్సరముల వయస్సుగలవాఁడనని చెప్పుచు జటిలులగు ననేకశిష్యులతోఁగూడ శత్రునగరసమీపమున నుండవలెను. వీనిశిష్యులు ఫలమూలములఁ బ్రసాదముగఁ బట్టుకొనిపోయి శత్రురాజును వానియమాత్యులను భగవద్దర్శనమునకని పిలుచుకొని రావలెను. రాజువచ్చినవెంటనే వానితోఁబూర్వరాజదేశాభిజ్ఞానములఁజెప్పుచు నూరునూరు సంవత్సరములకొకమా రగ్నిప్రవేశముచేసి మఱల బాలుఁడనగుచుందును. కావుననిపుడు నీసమీపమునఁ జతుర్థాగ్నిప్రవేశము చేసెదను. అవశ్యముగ నాకునీవే సత్కరింపఁదగినవాఁడవు, కావున మూఁడువరములను కోరుకొనుమని చెప్పవలెను. అందుకంగీకరించినచో, నీవేడురాత్రులు దారపుత్రులతో నీయగ్నిప్రవేశముఁ జూచుటకై యిచట నుండవలెనని చెప్పి, అట్లురాఁగా వాని పట్టుకొనవలెను.

స్థానికవ్యంజనుఁడగు ముండుఁడుగాని జటిలుఁడుగాని జడలుగల పెక్కుశిష్యులతోఁగూడి వేణుశలాకకు శోణితవస్త్రమును చుట్టి సువర్ణచూర్ణమును దానికిఁబూసి పుట్టయందుంపవలెను; లేక సర్పము దూఁటకుఁదగిన సువర్ణనాళికనయిన నచటనుంపవలెను. తర్వాత సత్రిరాజుతోఁ, ఈసిద్ధుఁడు పుష్పించిననిధి నెఱిఁగియున్నాఁడని చెప్పవలెను రాజుచేఁ బ్రశ్నింపఁబడినవాఁడై వ్యంజనుఁడదినిజమని చెప్పి యభిజ్ఞానమును చూపింపవలెను. లేక పుట్టలోఁ గొంతబంగారము నుంచి నాగరక్షితముగునీనిధి ప్రణిపాతసాధ్యమని మఱలఁజెప్పవలెను. రాజు దానినినమ్మినచోఁ బైవిధముగ వానిని మోసపెట్టవలెను.

క్రియాభినీతుఁడును తేజనాగ్నితోఁ గూడినవాఁడును రహస్యప్రదేశమందుండువాఁడునునగు స్థానికవ్యంజనునిఁగూర్చి సత్త్రిరాజుతోఁ, ఈసిద్ధుఁడు నామేధికుఁడని చెప్పవలెను. పిమ్మటరాజు దేనిని కోరునో దానినిచ్చుటకుసిద్ధపడి పైవిధముగ వానిని పట్టుకొనవలెను.

సిద్ధవ్యంజనుఁడు రాజును జంభకవిద్యలచే లోభపెట్టి పైవిధముగ వంచింపవలెను.

సిద్ధవ్యంజనుఁడు పూజింపఁదగు దేశదేవతనాశ్రయించి ప్రహరణములచేఁ బ్రకృతిముఖ్యులవంచించి క్రమముగరాజునుకూడ వంచింపనలెను.

అంతరుదకవాసినిఁగాని సర్పచైత్యసురంగాభూమిగ్రహములందు సంచరించునట్టి జటిలవ్యంజనునిఁగాని వరుణుఁడనియు నాగరాజనియు రాజుకడకుఁదెచ్చి రాజుతోఁబైవిధముగఁజెప్పి వంచింపవలెను.

జనపదాంతవాసియగు సిద్ధవ్యంజనుఁడు శత్రుదర్శనమునకై రాజనొప్పించి అట్లొప్పుకొనినరాజునకు శత్రుబింబమునుచూపి రహస్యప్రదేశమున వానినిచంపవలెను.

పణ్యములతోవచ్చిన వైదేహకవ్యంజనులు పణ్యాశ్వములఁబరీక్షించుటకై రాజునురమ్మని పణ్యాశ్వపరీక్షాసక్తుఁడగురాజును స్వయముగఁ దామునాని గుజ్జములచేఁగాని చంపవలెను.

నగరసమీపమందలి చైత్యమునధిష్ఠించి తీక్ష్ణులు రాత్రియందు నాళికలఁగాని రెల్లునుగాని కుంభములలో జ్వలింపఁజేయుచుఁ బ్రభువుయొక్కయు ముఖ్యులయొక్కయు మాంసములను భక్షింపఁబోవుచున్నాము. పూజలు జరుగనిండని యవ్యక్తముగఁ బలుకవలెను. దానినివారి నైమిత్తిక మౌహూర్తిక వ్యంజనులు ప్రకటింపవలెను. తేజనతైలాభ్యక్తులై నాగరూపులగువారు మంగళహ్రదమునఁగాని తటాకమధ్యమునఁగాని రాత్రియందుండి అయోమయములగు శక్తిముసలములను సానపెట్టుచుఁ బైవిధముగఁ బలుకవలెను. ఋక్షచర్మములనుకప్పుకొని ధూమాగ్నులఁగ్రక్కుచు రక్షోరూపముల వహించినవారు పట్టణమునకపసవ్యముగ ముమ్మారుప్రదక్షిణముచేయుచుఁ దోడేళ్లునక్కలు సంచరించుప్రదేశములందుఁ బైవిధముగఁ బలుకవలెను. తేజనతైలమునుపూసిన యభ్రకపటములచేఁ గప్పఁబడిన యగ్నిచేఁ జైత్యదేవతప్రతిమను ప్రజ్వలింపఁజేసి పైవిధముగఁ బలుకవలెను. ఇతరులువీనినెల్లఁ బ్రకటింపుచుండవలెను. అభ్యర్హితములగు దైవతప్రతిమలనుండి వచ్చురక్తము నంతటఁ జల్లవలెను. మఱికొందఱు శూరవాదికుఁడెవఁడైయున దైవరుధిరసంస్రావమునుచూచుటకు రావచ్చునని ప్రకటింపవలెను. అట్లువచ్చినవానిని రాక్షసులు చంపుచున్నారని లోకులకు నిరూపించుటకై మఱికొందఱు లోహముసలములచేఁ జంపవలెను. దానినెఱింగినసత్రులీయద్భుతమును రాజునకుఁ దెలుపవలెను. పిమ్మట నైమిత్తికమౌహూర్తికవ్యంజనులు శాంతిప్రాయశ్చిత్తములు చేయవలెననియు లేనిచో రాజునకును దేశమునకును గొప్పయుపద్రవము సంభవించుననియుఁ జెప్పవలెను. రాజందుకంగీకరించినచో, ఏకరాత్రము స్వయముగ మంత్రబలిహోమము రాజుచేఁ జేయఁదగియున్నదని రాజుతోఁ జెప్పి పైవిధముగ రాజును చంపవలెను.

పరులయుపదేశార్థమైపై యోగములను తొలుతఁదమయందే ప్రయోగించుకొని ప్రతీకరించుకొనవలెను. పిమ్మట శత్రునిపైఁబ్ర

యోగింపవలెను. మఱియు యోగదర్శన ప్రతీకారములనిమిత్తము దేశములందలికోశముల సంగ్రహింపవలెను.

శత్రురాజు హస్తికాముఁడయినయెడల లక్షణయుక్తమగునాగవనపాలహస్తి నిచ్చెదమని లోభపెట్టి అందులకంగీకరించినచో నెక్కుడేతోత్రవగల అరణ్యమునుపొందించి చంపవలెను. లేక కట్టితీసికొనిపోవలెను. మృగయాకామునివిషయమునఁ గూడ నిట్టియని గ్రహించునది.

రాజు ద్రవ్యస్త్రీలోలుఁడయినయెడల సాధ్యవిధవలమూలమునఁగాని దాయాదనిక్షేపార్థమైవచ్చిన పరమరూపయౌవనలగు స్త్రీలమూలమునఁగాని సత్రులులోభపెట్టి దానికంగీకరించినచో రాత్రియందు సమాగమకాలమునఁ గపటసత్రులు శస్త్రరసములచేవానిని చంపవలెను.

శత్రురాజు సిద్ధప్రవ్రజితచైత్యస్తూపదైవతప్రతిమల దర్శించుటకై పోవునపుడు భూమిగృహసురంగాగూఢభిత్తిప్రవిష్టులై తీక్ష్ణులుశత్రునిఁ జంపవలెను.

ఏప్రదేశములందలి చిత్రములనుచూచుటకు రాజుస్వయముగవెళ్లునో, ఎచ్చట నుత్సవములనిమిత్తముగాని జలక్రీడకుఁగాని వెళ్లునో, ఎచటఁదిట్టుమాటలాడునో, యజ్ఞదర్శనమునకుఁగాని సూతికాప్రేతరోగములకడకుఁగాని ప్రీతిశోకభయస్థానములకుఁగాని యెప్పుడువెళ్లునో, స్వజనోత్సవములందు విశ్వాసముచే నెచటఁ బ్రమాదమొందునో, రక్షకములేక దుర్దినసంకులప్రదేశములందెప్పుడు సంచరించునో, ఎప్పుడువిప్రస్థానములను ప్రదీప్తదేశములను నిర్జనప్రదేశములను ప్రవేశించునో, అట్టిప్రదేశములందును సమయములందును వస్త్రమాల్యాభరణశయనాసన మద్యభోజనాది సమయములందును తీక్ష్ణులుదాగియుండి తూర్యస్వనములు వినినతోడనే (శత్రుని) కొట్టవలెను. కపటహేతువులచే శత్రుప్రదేశమునెట్లు వీరుప్రవేశించిరో అట్లే తప్పించుకొనిపోవలెను. ఇదియే యోగవామనము.

ఇది దుర్గలంభోపాయమందు యోగవామనమను

రెండవ యధ్యాయము.

ఆదినుండి నూటనలుబదిరెండవ యధ్యాయము.



## 173 ప్రకరణము.

### అపసర్పప్రణిధి.

అప్పుడగు శ్రేణీముఖ్యునిఁ (ఉద్యోగమునుండి) తొలఁగింపవలెను. అతఁడు మిత్రవ్యాజముచే శత్రు నాశ్రయించి విజిగీషురాష్ట్రమండలివారిని వీనికి సచివులుగఁ జేయవలెను. లేక, భృత్యసమూహమును తెప్పించి శత్రునియంగీకారముపై మాప్యగ్రామమును వీత హస్త్యశ్వదూష్యామాత్యులను నాశ్రిందుని సేనను కొట్టి వానికిఁ జంపవలెను. లేక శత్రుజనపదములలో నొక్కదానినికాని శ్రేణినికాని యాటవికునిఁగాని సహాయముకొఱకై ఆశ్రయించి వారివిశ్వాసమును పొంది స్వామిపక్షమునకి వారినిపంపవలెను. పిమ్మట విజిగీషువు హస్తిబంధనాటవీఘాతములకొఱకని మిష పెట్టి వారినిప్రహరింపవలెను. అమాత్యాటవికులవిషయమునఁగూడ నిట్లేయని గ్రహించునది.

శత్రునితో సంధిచేసికొని యమాత్యులనుతొలఁగింపవలెను. వారు, మా ప్రభువును మా యొద్దఁ బ్రసన్నునిగఁ జేయుమని శత్రునిఁగోరవలెను. అప్పుడుశత్రువు స్వయముగ దూతనంపును. ఆవచ్చినదూతను, నీభర్త నాకును నాయమాత్యులకును భేదముగలిగించుచున్నాఁడు. మఱినీవిక్కడికి రావలదనినిందింపవలెను. పిమ్మటఁ దొలఁగింపఁబడినవారిలో నొకఁడు శత్రువునాశ్రయించి యోగాపసర్పులను నపరక్తులను దూష్యులను శక్తిహీనులను నుభయఘాతకుల గు స్తేనాటవికులను శత్రునికడఁజేర్పవలెను. శత్రునివిశ్వాసమును సంపాదించినవాఁడై, వీఁడును వీఁడును నీశత్రువుతోఁ గలిసియున్నారని మిష పెట్టి ప్రవీరపురుషులగు నంతపాలాటవికదండచారుల నుపఘాత

ముగలిగింపవలెనని చెప్పవలెను. విజిగీషువు శత్రునితో, వీఁడుదండ బలవ్యవహారుఁడై మనకపకారముచేయుచున్నాఁడు. కావున మనము కలిసి వానినిచంపుదము. వానిభూహిరణ్యములనునీవుదీసికొనవచ్చునని చెప్పవలెను. అందులకతఁడంగీకరించినయెడల వానినిగౌరవించి వచ్చినవాని నవస్కందముచేఁ గాని ప్రకాశయుద్ధమునఁ గాని చంపవచ్చును.

భూమిదానపుత్రాభిషేకరక్షణములనుమిషచే శత్రునినమ్మించి పట్టుకొనవలెను. దీని కంగీకరింపనివానిని రహస్యముగఁజంపవలెను. అతఁడు స్వయముగరానప్పుడు వానిశత్రువుచేఁ జంపింపవలెను. విజిగీషునితోఁగాక కేవలము స్వసైన్యముతోడ బయలువెడలుటకిష్టపడినచో రెండువైపులనుండి పీడనుకలిగించి వానినిచంపవలెను.

విజిగీషునియందు నమ్మకములేక ప్రత్యేకముగ యానముచేయుటకుఁగాని యాతవ్యుని రాష్ట్రైకదేశమును సంపాదించుటకుఁగాని కోరినపుడు సర్వసందోహమునిచ్చి శత్రునిచే వానినిచంపింపవలెను. వాఁడు శత్రునితోఁ గలిసినపుడు దండోపనయముచే వానిమూలప్రదేశమును తీసికొనవలెను. శత్రుభూమిహరింపవలెనని మిత్రునికిని మిత్రునిభూమినపహరింపవలెనని శత్రునికిని నుపదేశించి శత్రుభూమికోరుమిత్రుఁడు తనకపకారముగావించునట్లుచేసి వానిశత్రునిపయికిఁబంపవలెను. ఈయోగములన్నియు నొకవిధముగనుండును.

మిత్రభూమినికోరు శత్రునకు స్వసైన్యమిచ్చునట్లు ప్రతిజ్ఞ చేయవలెను. పిమ్మట మిత్రునితో రహస్యముగఁ జేరవలెను. ఏదిరో యొకమిష పెట్టి తనకాపదతటస్థించినదనిచెప్పి మిత్రునిమూలమున నమిత్రునికి యుద్ధోత్సాహమును పుట్టించి తనపయికి వారిరువురు వచ్చునట్లు చేయవలెను. అప్పుడిరుప్రక్కలనుండి పీడించి శత్రునిఁ జంపవలెను, లేదా ప్రాణముతోఁబట్టుకొని రాజ్యవినిమయమునుచేయింపవలెను.

శత్రువు వానిమిత్రునాశ్రయించి యగ్రాహ్యప్రదేశమం
దుండినచో సామంతాదులచే వానిమూలమును హరింపఁజేయవలె
ను. సైన్యముచే రక్షించుకొనదలఁచినపుడాసైన్యమును నాశనముచే
యవలెను. వారిద్దరిని వేరుపఱచుటకు వీలులేనపుడొకరిభూమినిఁ మ
ఱియొకఁడు హరించుటలో సహాయముచేయుట కంగీకరించి భేదపె
ట్టవలెను. పిమ్మట వారొకరికొకరు, ఈరాజు శత్రుసంహితుఁడై నీ
భూమినికోరుచున్నాఁడని చెప్పుటకై మిత్రవ్యంజనులు నుభయవేత
నులునగు దూతలను పంపుకొనవలెను. వారిలోనొకఁడు శంకించి
పైవిధమునఁ బ్రవర్తించును.

లేక, దుర్గరాష్ట్రదండముఖ్యులను శత్రుపక్షమువారని మిష
పెట్టి తొలఁగింపవలెను. వారు యుద్ధావస్కంధావరోధనసమయము
లందు శత్రుని వశపఱచుకొనవలెను, లేనిచో స్వవర్గముతో వానికి
భేదముగలిగింపవలెను. అభివ్యక్తశాసనములచే దానిని ఋజువుచేసి
కొనవలెను.

లుబ్ధకవ్యంజనులు మాంసవిక్రయమునకు శత్రుదుర్గద్వారము
లఁజేరి యందలిదౌవారికుల నాశ్రయించి చోరులు రెండుమూఁడు
పర్యాయములు శత్రుపురమునకువచ్చిన క్రమమునెఱింగించి విశ్వా
సమునుసంపాదించినవారై భర్తయొక్కసైన్యమును రెండుభాగములు
గఁజేయింపవలెను. అప్పుడు శత్రుసంబంధమగు గ్రామముల వధా
వస్కంధములను విజిగీషువు చేయుచుండఁగా వీరు, చోరగణమాస
న్నమైనది. అల్లరియెక్కువగనున్నది. గొప్పసైన్యమునుపంపవలెనని
చెప్పి ఆసైన్యమును విజిగీషుదండమునఁజేర్చి, విజిగీషుసైన్యమునుతీసి
కొని దుర్గద్వారముఁజేరి, చోరగణము హతమైనది. మనసైన్యము
యాత్రాసిద్ధి నొందివచ్చినది. ద్వారములఁదెఱువుఁడని చెప్పవలెను.
ఇట్లుచెప్పఁగా ద్వారపాలకులు ద్వారములుదెఱతురు. అప్పుడు వా
రితోఁగూడ నందఱినిఁ జంపవలెను.

అనాయుధీయులగు కారుశిల్పపాషండకుశీలవవైదేహకవ్యంజ

ములనుపరదుర్గములకంపవలెను. గృహపతికవ్యంజనులు కాష్ఠతృణధాన్యపణ్యశకటముల మూలమునఁగాని దేవధ్వజప్రతిమల మూలమునఁగాని ప్రహరణావరణములను వారికిఁబంపవలెను. పిమ్మటఁదద్వ్యంజనులు శంఖదుందుభిశబ్దములనొనర్చి దుర్గమునుపట్టుకొనుటకును ప్రమత్తసైన్యమునువధించుటకును విజిగీషుసైన్యము వెనుకనుండివచ్చుచున్నదని ఘోషింపవలెను. తర్వాత విజిగీషునకు దుర్గప్రాకారద్వారాట్టాలకములందుఁ జోటునిచ్చి శత్రుసైన్యభేదమునుకాని నాశమునుకాని కావింపవలెను.

చేసికొనినసంధిపై విశ్వాసముచెడకుండునట్లు సార్థగణములు అతివాహకులు కన్యావాహకులు అశ్వపణ్యవ్యవహారులు ఉపకరణహారులు ధాన్యక్రేతృవిక్రేతలు ప్రవ్రజితవ్యంజనులు దూతలు లోనగువారిమూలమున సైన్యమును శత్రుదుర్గమునఁ జేర్పవలెను. రాజాపసర్పు లిట్లుప్రవర్తింపవలెను.

వీరును ఆటవికాపసర్పులును కంటకశోధనమునఁ జెప్పఁబడిన యుపసర్పులును నాటవికాసన్నమగు వ్రజమునుకాని సార్థమునుకాని చోరులచేఁ జంపింపవలెను. లేక సంకేతపూర్వముగ మదనరసవిద్ధమగు నన్నపానముల నాటవీవ్రజప్రదేశసమీపమందుంచి వెళ్లవలెను. గోపాలకవైదేహకులకు మదనరసవికారము కలిగినపుడు వారి సరుకులగ్రహించి చోరులు వారినిపట్టుకొనవలెను. ముండజటిలవ్యంజనుఁడు సంకర్షణదైవతయోగమునుపూని పశువహణకర్మమున మదనరసయోగమును వీరికిచ్చి వీరినిమోసపెట్టవలెను. దైవతప్రేతకార్యోత్సవసమాజములందు శౌండికవ్యంజనుఁడు సురావిక్రయమును మదనరసయోగములతోఁగలిపి, ఆటవికులవంచించి పట్టుకొనవలెను. గ్రామఘాతముకొఱకుఁ బ్రవేశించిన సైన్యమును నాటవికసైన్యమును వేరువేరుచేసి చంపింపవలెను. ఇవియు చోరగణాపసర్పములు.

ఇది దుర్గలంభోపాయమం దపసర్పప్రణిధియను మూఁడవయధ్యాయము.

ఆదినుండి నూటనలుపదియాఱవ యధ్యాయము.

## 174-5 ప్రకరణము.

### పర్యుపాసనకర్మ, అవమర్దము.

పర్యుపాసనకర్మ (ముట్టడివేయుట) కర్శనపూర్వమై యుండును. జయింపఁబడిన జనపదమును మంచిస్థితియందుంచి నిర్భయముగ నిద్ర నొందునట్లు చేయవలెను. అది తన పైఁగలహించినచో దానినివదలు కొనుటకు నిశ్చయించినప్పుడు తప్పఁ దక్కినసమయములం దనుగ్రహ పరిహారములచే దానినివశపఱచుకొనవలెను. శత్రుభూమిలో నొక చోట సంగ్రామభూమినేర్పఱచుకొనియుండవలెను. జనరహితమగు జనపదము రాజ్యముగాని జనపదముగాని కానేరదని కౌటిల్యుఁడు.

జనపదము విషమమైయున్నప్పుడు ముష్టిసస్యవీవధాసారవధ ములు గావింపవలెను. ప్రసారవీవధచ్ఛేదమువలనను ముష్టిసస్యవధ మువలనను ప్రజలనుతొలఁగించుటవలనను రహస్యవధమువలనను ప్రకృతిక్షయము కలుగుచున్నది.

నాసైన్యము ప్రభూతగుణవత్తరమై ధాన్యకుప్యయంత్రశస్త్రా వరణవిష్టిరశ్మి సమగ్రమైయున్నది. నాకు సమయము మంచిదైయు న్నది. శత్రునికి సమయముమంచిదిగాకున్నది. వానిసైన్యము వ్యా ధిదుర్భిక్షనిచయరక్షాహీనమైనది. వాని క్షేత్రబల మిత్రబలములు నిర్విణ్ణములయినవని తోఁచునప్పుడు పర్యుపాసనము చేయవలెను.

తనస్కంధావార వీవధాసారమార్గములను రక్షించుకొనుచు ఖాతసాలములచేఁ దనదుర్గమునకావరణము గలిగించుకొని శత్రుఖా తమును తెగఁగొట్టి జలమునుతొలఁగించి, తనపరిఖలనుజలపూరితను లుగఁజేసి సురంగాబిలకూటకలచే శత్రునప్రాకారములను పట్టు కొనవలెను.

ద్వారము నిమ్నముగనున్నప్పుడు ధూళిపటలముచే దానిని కప్పివేయవలెను. అధికరక్షగల శత్రుదుర్గమును యంత్రములచేఁ గొట్టింపవలెను. నిష్కురమూలమున లోపలఁబ్రవేశించి యశ్వము లచేఁ గొట్టింపవలెను. కొంతవఱకుఁ బ్రవేశించిన పిమ్మట సమాయ

-ములయొక్క నియోగవికల్పసముచ్చయములచే సిద్ధిని కోరవలెను.

పరదుర్గమందుండు శ్యేనకాకనప్తృభాసశుకశారికోలూకకపోతములనుపట్టుకొని వానితోకల నగ్నియోగయుక్తములుగఁ జేసి పరదుర్గములపై విడువవలెను. తనస్కంధావారమునకు దూరముగ నిలఁబడి యున్నతప్రదేశమున ధ్వజములను ధనుర్ధరులనునుంచి మానుషాగ్నిచేఁ బరదుర్గమును ప్రజ్వలింపఁజేయవలెను.

అంతర్దుర్గపాలకులగు గూఢపురుషులు నకులవానరబిడాలశ్వానములతోకల కగ్నియోగముగలిగించి డేరాలులోనగు గృహములందు విడువవలెను.

శుష్కమత్స్యముల కడుపునందు నిప్పునుంచి భల్లూకరేవా వాయసోపహారముగఁ బక్షులు తీసికొనిపోవునట్లు చేయవలెను.

సరళదేవదారుపూతితృణగుగ్గులుశ్రీవేష్టకసర్జరసలాక్షాగుళికలును ఖరోష్ట్రాజీవుల లండములు నగ్నిధారణద్రవ్యములు.

ప్రియాళచూర్ణము అవల్గుజమషి మధూచ్ఛిష్టము అశ్వఖరోష్ట్రగోలండములు — అగ్నిక్షేపమునందుపయోగించునవి.

అగ్నివర్ణముగు సర్వలోహచూర్ణము కుంభీసీసత్రపుచూర్ణపుచూర్ణము పారిభద్రకపలాశపుష్పకేశమషీతైలమధూచ్ఛిష్టకశ్రీవేష్టకయుక్తమై యగ్నియోగమగును. దానిచేనవలిప్తమై శణత్రపుసీసవల్కవేష్టితముగు విశ్వాసఘాతి అగ్నియోగబాణము.

ఉపాయాంతరములేనపు డగ్నివిసర్జనము చేయవలెను. అగ్నినివిశ్వసింపరాదు. దానివలన దైవపీడనముసహితము సంభవించును. మఱియు నష్టులేక ది ప్రాణిధాన్యపశుహిరణ్యకుప్యద్రవ్యములకు క్షయమొనర్చును. ఇట్లు క్షీణనిచయంబగు రాజ్యము క్షయముకొఱకే యగునుగదా ?

ఇది పర్యుపాసనకర్మ.

నేను సర్వారంభోపవిష్టిసంపన్నుఁడను. శత్రువ్యాధితుఁడై యుపధాశుద్ధప్రకృతియై దుర్గకర్మనిచయవిహీనుఁడై నిరాసారుఁడై

యున్నవాఁడు. ఆసారసహితుఁడయ్యు శత్రుఁడుమిత్రులతోఁ గూడియున్నాఁడని తోఁచునప్పుడు నవమర్దముచేయవలెను.

అగ్ని స్వయముగఁ బుట్టినప్పుడుగాని యొకరిచేఁ బెట్టఁబడినప్పుడుగాని, యజ్ఞకాలమందుఁగాని, ఉత్సవములను జేయుచు సహించుచున్నప్పుడుగాని గౌరికకలహములందును సైన్యము నిత్యయుద్ధశ్రాంతమైనపుడును జాగరణక్లాంతులై జనులు నిద్రించుచున్నప్పుడును దుర్దినమందును నదీవేగముకలిగినపుడును మిక్కిలి మంచుపడినప్పుడును నవమర్దనముచేయవలెను.

స్కంధావారమునువిడిచి వనమందు రహస్యముగనుండి దుర్గనిష్క్రాంతుఁడగు శత్రునిఁజంపవలెను.

మిత్రాసారముఖ్యవ్యంజనుఁడొకఁడు దుర్గస్థునితో మైత్రిచేసి, అభివ్యక్తదూతనొకనిని, ఇదిసీలోపము. పిదపఁ హస్త్యాలు. సంధిలోపమిది. ఈవచ్చుదూతనీకుఁ గృత్యపక్షీయుఁడని పంపవలెను. శత్రుదూతనుతీసికొని మఱలివచ్చుచున్న వెనుకటిదూతను బట్టుకొని వానిదోషమును ప్రకటించి తొలఁగించుచుండవలెను. అప్పుడుమిత్రాసారవ్యంజనుఁడు దుర్గస్థునితో, 'నన్ను రక్షించుటకు దుర్గమువెడలిరమ్ము. లేక నిన్ను నేనుకలిసి సంరోద్ధను వధింతము' అని చెప్పవలెను. అందులకంగీకరించిన సంరుద్ధునకు రెండు వయిపులనుండి పీడనముకలిగించి చంపవలెను, లేక ప్రాణములతోఁ బట్టుకొని రాజ్యవినిమయముగా విడువవలెను. వానినగరమును మట్టింపవలెను, లేక వానిసారబలమునుబయటికిరప్పించి వినాశముచేయవలెను.

దండోపనతాటవికులవిషయమునఁగూడ నిట్లేయని గ్రహించునది.

దండోపనతాటవికులలో నొకఁడు. ఈసంరోద్ధ వ్యాధితుఁడై వానితోడ మోహరించిన పార్ష్ణిగ్రాహునిచే నభియోగమొంది మఱియొకవైపునుండి కొట్టఁబడినవాఁడై నేఁడొకప్రదేశమునకు వెళ్ళనుద్దేశించియున్నాఁడని సంరుద్ధునితోఁ జెప్పవలెను. వానికివాఁడు సహా

సముకు సంరోధ స్కంధావారము తగులఁబెట్టించి తొలఁగిపోయి పయిని చెప్పినవిధముగ శత్రుని వంచింపవలెను. లేక, పణ్యసంపాతమును గావించి రసవిద్ధమగు పణ్యముచే వీనిని వంచింపవలెను.

లేక, ఆసారవ్యంజనుఁడు సంరుద్ధునితో, నాచేపీఁడింతకుముందే కొట్టఁబడియున్నాఁడు. కావున నీవు వీనిని సులభముగఁగొట్టుటకు రమ్మని చెప్పి దూతనంపవలెను. అందులకంగీకరించినచోఁ బయి విధముగ నాచరింపవలెను.

శాసనముద్రాహస్తులగు యోగపురుషులు మిత్రులనియు బంధులనియుమిషపెట్టిలోనికిఁబ్రవేశించి దుర్గమునుపట్టుకొనవచ్చును.

ఆసారవ్యంజనుఁడు, ఈసమయమున నిచట నీశత్రుస్కంధావారమును కొట్టఁదలఁచియున్నాను. నీవునుయుద్ధముచేయుటకు రమ్మని సంరుద్ధునికి దూతనంపవలెను. అందులకంగీకరించినపిమ్మట నతిసంకులముగనుండు సమయమును రాత్రియందుఁజూచి దుర్గనిష్క్రాంతుఁడగు శత్రునిపైఁబడి కొట్టవలెను.

(శత్రు) మిత్రునిఁగాని యాటవికునిఁగాని పిలిపించి, సంరుద్ధునిపైవిక్రమించి వానిభూమిని పట్టుకొనుమని పురికొల్పవలెను. అట్లు విక్రమించినవానిని ప్రకృతులచేఁగాని, దూష్యముఖ్యులచేఁగాని స్వయముగ రసముపయోగించిగాని చంపింపవలెను. ఇతఁడు మిత్రఘాతకుఁడని మిత్రవ్యంజనుఁడితనినిగుఱించి శత్రునకునమ్మకము కలుగునట్లుచెప్పవలెను. ఇట్లు మిక్కిలి విశ్వాసమునుసంపాదించి శత్రుప్రవీరపురుషులఁ జంపింపవలెను. లేక సంధిచేసికొని వీనినొకజనపదమందుఁ బ్రవేశపెట్టి శత్రుజనపదనివిష్టుఁడయినతర్వాత రహస్యముగఁ జంపవలెను. దూష్యాటవికులయెడ నపకారముచేయించి కొంతసేనను తీసికొనిపోయి యవస్కందముచే దుర్గమునుపట్టుకొనవలెను. లేక తొలఁగిపోయిన దూష్యమిత్రాటవికు లర్థమానములఁబొందినట్లు నటించి నమ్మకమునుపుట్టించి శత్రుదుర్గమును (ప్రవేశించి) పట్టుకొనవలెను.

పరదుర్గస్కంధావారములను స్వాధీనముచేసికొనిన తర్వాతఁ బతితపరాఙ్ముఖాభిపన్నముక్తకేశముక్తశస్త్రభయవిరూపులై యుద్ధముమానిన శత్రుదుర్గస్థులకు నభయమియ్యవలెను.

స్వాధీనమయినపరదుర్గమును విశుద్ధశత్రుపక్షముగాను నుపాంశుదండప్రతీకారముగలదానినిగను చేసి, తర్వాతదానిలోఁ బ్రవేశింపవలెను.

ఈవిధముగ విజిగీషువు మొదట శత్రుభూమినివశపఱచుకొని పిమ్మటమధ్యముని, మధ్యముఁడు వశపడినపిమ్మట నుదాసీనుని వశపఱచుకొనయత్నింపవలెను. పృథివినంతను జయించుటకిదియే మొదటిమార్గము. మధ్యమోదాసీనులు లేనపుడు స్వగుణోత్కర్షచే శత్రుప్రకృతుల వశపఱచుకొని పిమ్మట నితరశత్రుప్రకృతుల సాధింపవలెను. ఇది రెండవమార్గము. మండలములేనపుడు శత్రునిమూలమునమిత్రుని మిత్రునిమూలమునశత్రుని రెండువైపులనుండిపీడించిసాధింపవలెను. ఇది మూఁడవమార్గము. అశక్యుఁడగు సామంతుని మొదటజయించి దానిచే ద్విగుణబలుఁడై రెండవసామంతుని దానిచేఁ ద్రిగుణబలుఁడై మూఁడవసామంతుని జయింపవలెను. ఇది నాలుగవమార్గము.

భూమినిజయించి వర్ణాశ్రమధర్మముల నేర్పఱచి స్వధర్మమునుతప్పక పరిపాలింపవలెను.

ఉపజాపము అపసర్పము యోగవామనము పర్యుపాసనము అవమర్దనము— ఇవియైదును దుర్గలంభోపాయములు.

ఇది దుర్గలంభోపాయమందుఁ బర్యుపాసనకర్మ, అవమర్దనమును

నాలుగవ యధ్యాయము.

ఆదినుండి నూటనలుపదినాలుగవ యధ్యాయము.



## 176 ప్రకరణము.

### లబ్ధప్రశమనము.

అటవ్యాదికమనియు నేకగ్రామాదికమనియు విజిగీషుసముద్థానము రెండువిధములు.

వానివలనఁగలిగిన రాజ్యలాభము నవము భూతపూర్వము పిత్ర్యమని మూఁడువిధములు.

పిమ్మట నవమును పొంది, పరునిదోషములను స్వగుణములచేతను, పరుని గుణములను స్వగుణద్వైగుణ్యముచేతను స్వధర్మకర్మానుగ్రహపరిహారదానమానకర్మలచేతను కప్పవలెను. ప్రకృతిప్రియహితుల ననువర్తింపవలెను. తాను ప్రతిజ్ఞచేసినట్లు కృత్యపక్షీయుల ననుగ్రహింపవలెను. కృతప్రయాసులను మఱిమఱి సత్కరింపవలెను. ప్రతిజ్ఞను నిర్వర్తింపనివాఁడు తనవారికిని పరులకునుకూడ నవిశ్వాస్యుఁడగునుకదా? ప్రకృతివిరుద్ధాచారుఁడు కాఁగూడదు. కావున సమానశీలవేషభాషాచారముల నవలంబింపవలెను. దేశదైవతసమాజోత్సవవిహారములందు భక్తినిచూపింపవలెను. సత్రులు దేశగ్రామజాతిసంఘముఖ్యులయెడ శత్రువు గావించిన యపచారములను విజిగీషుఁడుచూపు భక్తిస్వామిసత్కారమహాభాగ్యములను వారందఱకుఁ దెలియునట్లుగఁ బ్రకటింపవలెను. వీరిని నుచితములగు భోగపరిహారరక్షావేక్షణములచేఁ బాలించుచు సర్వకాలములందాశ్రమపూజనమును విద్యావాక్యధర్మశూరులగు పురుషులకు భూమిద్రవ్యదానపరిహారములను చేయింపవలెను. సర్వబంధనమోక్షణమును దీనానాథవ్యాధితుల కనుగ్రహమును చేయవలెను. చాతుర్మాస్యమున నర్ధమాసమును పౌర్ణిమాసులందు నాలుగురాత్రులును రాజదేశనక్షత్రకాలమందొకరాత్రియు జంతుఘాతమొనర్పఁగూడదు. (జంతువులలో) యోని బాలవధను పుంస్త్వోపఘాతమును ప్రతిషేధింపవలెను. కోశదండోపఘాతమును నధర్మిష్ఠమునునగు చరిత్రను తొలఁగించి ధర్మవ్యవహారమును స్థాపింపవలెను. చోరప్రకృతులకును

మ్లేచ్ఛజాతులకును స్థానవిపర్యాసమొనర్చి వేరు వేరుస్థలముల నుంపవలెను. పరోపగృహీతులగు దుర్గరాష్ట్రదండముఖ్యులను మంత్రిపురోహితులను ప్రత్యంతభూములలో వేరువేరుప్రదేశములం దుంపవలెను. అపకారసమర్థులును భర్తృవినాశమునుచింతించు పరముఖ్యులుమనగువారిని రహస్యదండముచే శమింపఁజేయవలెను. మొదట స్వదేశీయులుగనుండి (పరదేశమునకుఁబాఱిపోయి) పరునితోఁగూడఁబట్టుకొనఁబడినవారిని దూరప్రదేశములందుంపవలెను. ప్రత్యాదేయమునుతీసికొన సమర్థుఁడును ప్రత్యంతాటవీసమర్థుఁడునై బాధించుచుండు శత్రుకులీనునకి విగుణభూమినికాని గుణవద్భూములో నాలుగవవంతునుకాని ఇచ్చి దానికిబదులతఁడు కోశదండములిచ్చునట్లేర్పఱచి దానిమూలమున వానిపౌరజానపదులకుఁ గోపముగలిగించుకుపితులగువారిచే నతనినిచంపింపవలెను. ప్రకృతినిందకులోనయినవానిని తొలఁగింపవలెను, లేక హానికరమగుదేశమందుంపవలెను.

భూతపూర్వము (ఇదివఱకుఁ దనయనుభవమందుండి శత్రువశమై మఱలఁ దనయనుభవములోనికి వచ్చిన దేశము)— ఏదోషముచేనది తననుండి తొలఁగినదో యాదోషమును పోఁగొట్టుకొని, ఏగుణముచేనది సంప్రాప్తించినదో దానివృద్ధిపఱచుకొనవలెను.

పిత్ర్యము రాజ్యవిషయమున— పితృదోషములను కప్పిపుచ్చి గుణములఁ బ్రకాశింపఁజేయవలెను.

తన దేశమందుఁ బ్రచారములో లేకపోయినను ఇతరులచే ననుసరింపఁబడినమార్గము ధర్మమార్గమయినయెడల దానిని ప్రవర్తింపఁజేయవలెను, అధర్మమును నితరులనువర్తించుచున్నను దానిని ప్రవర్తింపఁజేయకపోవుటయేగాక దానినినివర్తింపఁజేయవలెను.

ఇది దుర్గలంభోపాయమున లబ్ధప్రశమనమను నైదవయధ్యాయము.
ఆదినుండి నూటనలుబదియైదవ యధ్యాయము.

ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున
దుర్గలంభోపాయమను పదమూడవయధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము.

## 14 ప్రకరణము—ఔపనిషదికము.

### 177 ప్రకరణము.

#### పరఘాతప్రయోగము.

చాతుర్వర్ణ్యరక్షార్థమై యౌపనిషదికమును నధర్మిష్ఠులయెడ నుపయోగింపవలెను.

సమ్మతదగిన దేశవేషశిల్పభాషాజనాపదేశములుగలిగి కుబ్జవామనకిరాతమూకబధిరజడాంధచ్ఛద్మములుగల మ్లేచ్ఛస్త్రీపురుషులచేఁ గాలకూటాదివిషవర్గమును పరశరీరోపభోగద్రవ్యములందుఁ జేర్పింపవలెను.

రాజక్రీడలందును భాండనిధానద్రవ్యోపభోగసమయములందును గూఢులు శస్త్రముల నుపయోగింపవలెను. సత్త్రిలు రాత్రిచారులు అగ్నిజీవులు— వీరగ్నిప్రయోగముచేయవలెను.

భల్లాతకావల్గుకారసయుక్తములగు చిత్రభేకకాండిన్యకకృకణపంచకుష్ఠశతపదీచూర్ణమును, ఉచ్చిదింగకబలీశతకందోధ్మకృకలాసచూర్ణమును, గృహగోళికాంధాహికక్రకంటకపూతికీటగోమారికాచూర్ణమును సద్యఃప్రాణహరములు. వానిధూమమున్గూడ నట్టిదియే.

కృష్ణసర్పప్రియంగులతోఁదప్తములగు పైకీటకములలో నొకదానితోఁగలిపి కాల్చిన పుడేర్పడుచూర్ణము సద్యఃప్రాణహరము.

భల్లాతకపుష్పచూర్ణయుక్తమగు ధామార్గవయాతుధానముల వేరు పదునయిదుదినములలోఁ బ్రాణహరణ మొనర్చును. భల్లాతకపుష్పచూర్ణయుక్తమగు వ్యాధాతకమూలము కీటయుక్తమై నెలదిన

ములలోఁ బ్రాణహరణ మొనర్చును. పైచూర్ణము పురుషులవిషయమునఁ గళామాత్రముగను ఖరాశ్వములకు ద్విగుణముగను హస్త్యుష్ట్రములకుఁ జతుర్గుణముగను నుపయోగింపవలెను.

శతకర్దమోచ్చిదింగకరవీరకటుతుంబీమత్స్యధూమము మదనకోద్రవపలాలముతోఁగాని హస్తికర్ణపలాశపలాలముతోఁగాని కలిపి గాలిలో నుంచినచో దానిగాలి యెంతదూరము వ్యాపించునో యంతవఱకుఁ బ్రాణులన్నియు నశించును.

పూతికీటమత్స్యకటుతుంబీశతకర్దమేధ్మేంద్రగోపచూర్ణము గాని పూతికీటక్షుద్రారాళాహేమవిదారీచూర్ణముగాని బస్తశృంగఖురచూర్ణయుక్తమై అంధీకరధూమమగును. ఇట్లే పూతికరంజపత్రహరితాళమనశ్శిలాగుంజారక్తకార్పాసపలాలాన్యాస్ఫోటకాచగోశకృద్రసయుక్తమగుధూమముకూడ అంధీకరమే. సర్పనిర్మోకము గోశ్వపురీషము అంధాహికశిరము — వీనితోఁ గూడిన ధూమముసహితమంధీకరము.

మదనకోద్రవపలాలముతోఁగాని హస్తికర్ణపలాశపలాలముతోఁగాని సంస్కరింపఁబడిన పారావతప్లవకక్రవ్యాద హస్తినరవరాహమూత్రపురీషము కాసీసహింగుయవతుషకణతండులములు కార్పాసకుటజకోశాతకీలబీజములు గోమూత్రికాభాండీమూలము నింబశిగ్రుఫణిర్జకాక్షీబపీలుకభాంగము సర్పశఫరీచర్మహస్తినఖశృంగచూర్ణము లోనగువానియొక్క ధూమము ప్రసరించునంతవఱకుఁ బ్రాణఘాత మొనర్చును.

కాళీకుష్ఠనీడశతావరీమూలము సర్పప్రచలాకకృకణపంచకుష్ఠచూర్ణము — వీనిని వెనుకఁ జెప్పినకల్కముతోఁగాని ఆర్ద్రశుష్కపలాలముతోఁగాని సంస్కరించినపుడేర్పడినధూమము సంగ్రామావతరణావస్కందనకాలములం దంజనోదకములచే నేత్రప్రతీకారములోనర్చుకొని ప్రయోగించినచో సర్వప్రాణినేత్రఘాతమగును.

శారికాకపోతబకబలాకాలండము సంకాక్షిపీలుకస్నుహిక్షీర

ముచే మర్దించినపుడు కలిగినయంజన మంధీకరణమును నుదకదూషణమును నగును.

యవశాల మూలమదనఫలజాతీపత్ర నరమూత్రయోగములు ప్లక్షవిదారమూలయుక్తములును మూకోదుంబర మదనకోద్రవక్వాథయుక్తములును హస్తికర్ణపలాశక్వాథయుక్తములునునయినచో మదనయోగములగును.

శృంగిగౌమేషవృశ్చికంటకారమయూరపదీయోగము గుంజవాంగలీవిషమూలికేంగుదీయోగము కరవీరాక్షిపీలుకార్కమృగమారణీయోగము — ఇవి మదనకోద్రవక్వాథయుక్తముగఁగాని హస్తికర్ణపలాశక్వాథయుక్తముగఁగాని యైనచో మదనయోగమగును. ఈ రెండు.(మదన) యోగములుకలిసి యవసేంధనోదకదూషణములగును.

కృతకండకకృకలాసగృహగోధికాంధాహికధూమము నేత్రవధోన్మాదములను కలిగించును.

కృకలాసగృహగోళికాయోగము కుష్ఠకరము. ఇది చిత్రభేకాంత్రమధుయుక్తమై ప్రమేహమునుకలిగించును; మనుష్యలోహితయుక్తమై శోషమును పుట్టించును.

దూషీవిషము మదనకోద్రవచూర్ణము — ఇవి యుపజిహ్వాయోగములు.

మాతృవాహకాంజలికారప్రచలాకభేకాక్షిపీలుకయోగము విషూచికాకరము.

పంచకుష్ఠకకౌండిన్యకరాజవృక్షమధుపుష్పమధుయోగముజ్వరకరము.

ఖరీక్షీరముతో మర్దించిన భాజినీకులజిహ్వాగ్రంథికాయోగము మూకబధిరకరము.

పురుషునకు మాసార్ధమాసములలోఁగలుగుఫలము కళామాత్రములోనగుపరిమాణము మొదలగునవి పైవిధముగ నెఱుంగునది.

ఔషధములకాఘ్రోపనయనము జంతువులమూర్ణము సర్వాద్ర వ్యములకాఘ్రోపనయనము— ఇవి పై యోగములను వీర్యవత్తరము లుగఁజేయును. ఇదియే యోగసంపద.

శాల్మలీవిదారీధాన్యముచే సంస్కరింపఁబడినట్టియు మూలవ త్సనాభసంయుక్తమును చుచుందరీశోణితప్రలేపముచేఁ బూయఁబడి నదియును నగు బాణముచే స్పృశింపఁబడినవాఁడు మఱిపదునగురుపు రుషులను కొఱుకును; ఇట్లు కొఱకఁబడినట్టివారిలో నొక్కొక్కరు మఱి కొందఱుపురుషులను కఱతురు.

భల్లాతకయాతుధానధామార్గవబాణపుష్పముల యొక్కయు, ఏలకాక్షిగుల్గులుహాలాహలములయొక్కయుఁ గషాయము బస్త నరశోణితయుక్తమై దంశయోగమగును. ఈయోగములో అక్షధారణికమును సక్తుపిణ్యాకములతోఁగలిపి యుదకమందుఁ బ్రయోగించిన చో నది నూరుధనుస్సులదై శాల్యముగల సరస్సును దోషయుక్తము గఁ జేయును. దీనిచే దష్టములయినట్టియు నభిమృష్టములయినట్టియు మత్స్యపరంపరలు విషయుక్తములగును. ఈ యుదకమును త్రాగు వారును స్పృశించువారునుకూడ విషయుక్తులగుదురు.

మూఁడుపిడికిళ్లుగాని యేడుపిడికిళ్లుగాని రక్తశ్వేతసర్షపముల నొకపల్లములోనుంచి వధ్యునిచేఁ దీయించినచో దానినిచూచినమా త్రముననతఁడు మృతిచెందును.

విద్యుత్ప్రదగ్ధము నద్గారోజ్వాలమునునగు కృష్ణసర్పముగాని విద్యుత్ప్రదగ్ధకాష్టములచే గ్రహింపఁబడిన కృష్ణసర్పముగాని కృత్తి కాభరణులలో రౌద్రకర్మానుసారము హోమముచేయఁబడిన యె డల నాయగ్ని నిష్ప్రతీకారమై దహించును.

కర్మారునింటనుండు నగ్నిని తేనెతోడను, శౌండికాగ్నిని సు రతోడను, తద్భాగమును ఘృతముతోడను, ఏకపత్న్యగ్నిని మాల్య ముతోడను, పుంశ్చల్యగ్నిని సర్షపములతోడను, సూతికాగ్నిని దధి చేతను, ఆహితాగ్నినితండులములచేతను, చండాలాగ్నిని మాంసము

చేతను, చితాగ్నిని మనుష్యునితోడను, వీనినన్నిటిని కలిపి బస్తవస చేతను నగ్నిమంత్రము నుచ్చరించుచు హోమముచేసినచో నాయగ్ని నిష్ప్రతీకారమై నేత్రమోహనము గలిగించును.

అదితేనమస్తే అనుమతేనమస్తే సరస్వతినమస్తే సవితర్నమస్తే అగ్నయేస్వాహా సోమాయస్వాహా భూస్స్వాహా భువస్స్వాహా.

ఇది యౌపనిషదికమను పదునాలుగవయధికరణమందుఁ బరఘాతప్రయోగమను ఒకటవ యధ్యాయము.

ఆదినుండి నూటనలుపదియాఱవ యధ్యాయము.



## 178 ప్రకరణము.

### ప్రలంభనమందద్భుతోత్పాదనము.

నెయ్యితోఁగలిపిన శిరీషోదుంబరశమీచూర్ణమర్ధమాసికక్షుద్యోగము (అర్ధమాసమువఱకు ఆకలిని ఘటింపదు.)

కశేరుకోత్పలకందేక్షుమూలబిసదూర్వాక్షీరఘృతభండసిద్ధమగునది మాసికక్షుద్యోగము.

క్షీరఘృతయుక్తమగు మాషయవకులుద్ధదర్భమూలచూర్ణము, పాలతోఁగలిపినవల్లీక్షీరఘృతము సమసిద్ధమగు సాలపృశ్నిపర్ణీమూలకల్కము, ఈకల్కముతోడను మధుఘృతముతోడను గలిపిన పాలు— వీనిని త్రాగినచో నెలదినములనుపవాసముండవచ్చును.

శ్వేతబస్తమూత్రమందు రాత్రులుంపఁబడిన సిద్ధార్థకములనుండి తీసిన తైలమును కటుకాలాబువున నెలపదునైదుదినములుంచినచో నది చతుష్పదద్విపములకు విరూపముగలిగించును.

ఏడుదినములు తక్రయవముల భక్షించిన శ్వేతగర్ధభముయొక్క లండయవములతో సిద్ధమగు గౌరసర్షపతైలముకూడ విరూపకారి.

బస్తగర్ధభములలో నొకదానియొక్క మూత్రలండములచే

సిద్ధమగుసిద్ధార్థక తైలము జిల్లేడుదూదితోడను పక్షుల రెక్కలతోడను సంస్కరింపఁబడిన చో దానినుపయోగించినవారికి శ్వేతవర్ణమును కలిగించును.

శ్వేతకుక్కుటాజగర లండయోగముకూడ శ్వేతకారియే. శ్వేతబస్తమూత్రమున నేడురాత్రులుంచిన శ్వేతసర్షపములను తక్రార్కక్షీరలవణధాన్యములతోఁ గలిపి పదునైదురోజులుంచినచో నదికూడ శ్వేతకారియగును.

కటుకాలాబూవల్లులతోఁ గలిపిన గౌరసర్షపపిష్ట మర్ధమాసముపయోగించినయెడల రోమములు శ్వేతవర్ణములగును.

అనపకాయ పూతికీటము శ్వేతగృహగోళి— వీనినికలిపి పిష్టముచేసి పూసినచోఁ గేశములు శంఖమువలెఁ దెల్లనగును.

తిందుకారిష్టకల్కముతోఁగూడిన గోమయముచేత మర్దించి భల్లాతకీరసమును పూసినచో నదిమాసకాలమునకుఁ గుష్ఠరోగమునుఁ గలిగించును. కృష్ణసర్పముఖమందుఁగాని గృహగోళికాముఖమందుఁగాని యేడురాత్రులుండిన గురువిందగింజలు కుష్టరోగమును కలిగించును. శుకపిత్తాండరసముచే నభ్యంగముకూడఁ గుష్టకారియే.

ప్రియాళకల్కకషాయములు కుష్టప్రతీకారము.

కుక్కుటకోశాతకీశతావరీమూలయుక్తమును నెలరోజులు దినినవాఁడు గౌరవర్ణముగలవాఁడగును.

వటకషాయమున స్నానముచేసి సహచరకల్కమును పూసికొనినచోఁ గృష్ణవర్ణుఁడగును.

శకునకంక తైలయుక్తములగు హరితాళమనశ్శిలలు శ్యామవర్ణముగలిగించును.

సర్షపతైలయుక్తమగు ఖద్యోతచూర్ణము రాత్రియందు జ్వలించును. ఖద్యోతగండూపదచూర్ణము సముద్రజంతువులచూర్ణము భృంగకపాలచూర్ణము ఖదిరకర్ణికారపుష్పములచూర్ణము— ఇవి శకునకంకతైలయుక్తమై తేజనచూర్ణమగును.

పారిభద్రికవృక్షపుచుసిని మండూకవసతోఁగలిపిశరీరమునకుఁ బూసి (పరితాపముకలుకకుండ) అగ్నిచేత శరీరమును ప్రజ్వలింపఁజేయవచ్చును.

పారిభద్రికత్వక్కును తిలకల్కపదిగ్ధముచేసిశరీరమునకుఁబూసినచో నగ్నితాపమును సహించును.

పీలువృక్షపుమసితోఁ జేసిన పిండమును చేతిలోనుంచుకొని జ్వలింపఁజేయవచ్చును.

మండూకవసదిగ్ధమగు శరీరమునకగ్నితాపముగలుగదు. ఇది కుశామ్రఫలతైలసిక్తమును సముద్రమండూకీఫేనకసర్జరసచూర్ణయుక్తమునునై యగ్నితాపమును సహించును.

మండూక కుళీగాదుల వసచేతను సమభాగతైలము చేతను నభ్యంగముచేసినచో శరీరమగ్నితాపమును సహించునది యగును.

మండూకవసాదిగ్ధమగు శరీరమున కగ్నితాపముకలుగదు. వేణుమూలశైవలలిప్తమగు శరీరము మండూకవసాదిగ్ధమయినచోనిట్లే జరుగును.

పారిభద్రకప్రతిబలావంజుళవజ్రకదళీమూలకల్కమును మండూకవసతోఁగలిపిన తైలముతోఁజేర్చి పూసికొనినచో నగ్నిమీఁదనడువవచ్చును.

నీటిచేరువనున్న ప్రతిబలవంజులపారిభద్రికవృక్షముల మూలకల్కముతోడను మండూకవసతోడను తైలమునుతయారుచేసిదానిని నిర్మలమగు పాదములకుఁబూసికొని కుసుమరాశిపై నడచినట్లంగారరాశిపై నడువవచ్చును.

హంసక్రౌంచమయూరములు లోనగు మహాపక్షులయొక్కయు నితరములగు నుదకప్లవపక్షులయొక్కయుఁ దోకలకు మండుచున్న రెల్లుకట్టలఁగట్టి రాత్రియందు వదలినచోనుల్కాదర్శనమగును.

వైద్యుతభస్మ మగ్నిశమనము.

స్త్రీపుష్పపాయితములగు మినుములను వజ్రకందకీయాలమండూకవసలతోఁ గలిపి యుంచుచున్న ప్రొయ్యిలో వేసినచో నది పదార్థపచనము గానీయదు.

పొయ్యిని శుద్ధము చేయుటయే దీనికిఁ బ్రతీకారము.

పీలుమయమగు నగ్నిగర్భమణి సువర్చలామూలగ్రంథి సువర్చలాసూత్రగ్రంథి— వీనిని దూదితోఁ జుట్టి నోట నుంచుకొనినచో నగ్నిధూమములఁ బుట్టించును.

కుశామ్రఫలములనుండి తీయఁబడిన తైలసిక్తమగు నగ్ని వర్షప్రపాతములందుఁగూడ నుండును.

తైలయుక్తమగు సముద్రఫేనము నీటిపైఁ దేలుచు నుండును.

కోతియెముకలను నల్లనివెదురుతో మథించి పుట్టించినయగ్ని నీరుచల్లినకొలఁది ప్రజ్వలించును.

శస్త్రహతశూలప్రోతలలో నొకనియొక్క వామపార్శ్వమందలి పశుకాస్థులను కల్మాషవేణువుతో మథించిపుట్టించినయగ్ని స్త్రీయొక్కగాని పురుషునియొక్కగాని యస్థులను మనుష్యపశుకాస్థులతో మథించిపుట్టించినయగ్ని ముమ్మారపసవ్యముగఁ ద్రిప్పినచోట మఱియొకయగ్ని జ్వలింపదు.

చుచుందరీఖంజకీటఖారకీటముల నశ్వమూత్రముతోఁ గలిపి చేసినముద్ద గొలుసులనుభంజించును.

కులిందదర్దురఖారకీటవసాప్రదేహముచే నయస్కాంతము ద్విగుణమగును. నారకగార్ధభకంకభాసపార్శ్వముల నుత్పలోదకముచే ముద్దచేసిపూసినచోఁ జతుష్పదద్విపదములకుఁ బాదలేపమగును. ఉలూకగృధ్రవసల నుష్ట్రచర్మములతోఁ జేయఁబడిన జోళ్ళకుఁబూసి వటపత్రములచేఁగప్పి తొడిగికొనినచో నేఁబదియోజనములు శ్రమములేక నడవవచ్చును. శ్యేనకంకకాకగృధ్రహంసక్రౌంచవీచిరల్లముల మజ్జారేతస్సులను పూసినచో నూరుయోజనములు నడువవచ్చును. గర్భిణా [illegible] వాప్ప పక్షికము [illegible] ము కలిపి న

స్పృశించి వానిఁ గాని శ్మశానప్రేతశిశుసముద్ధితమేదస్సునుగాని పూసినచో యోజనశతము నడువవచ్చును.

అదృశ్యోత్పాదములగు ననిష్టములచే శత్రునకుద్వేగము బుట్టింపవలెను. ఉభయులకుఁ బట్టుపలసమానమగుటచే రాజ్యమువశపడునంతవఱకు నిర్వాదకోపములుండునుగదా ?

ఇది యౌపనిషదికమను పదునాలుగవయధికరణమందు

ప్రలంభనమున నద్భుతోత్పాదనమను

రెండవ యధ్యాయము.

ఆదినుండి నూటనలువదియేడవ యధ్యాయము.



## 179 ప్రకరణము.

### ప్రలంభనమందు భైషజ్యమంత్రయోగము.

మార్జారోష్ట్రవృకవరాహశ్వావిద్వాగులీనప్త్రకోలూకములు లోనగు నిశాచరసత్వములలో నొకటి రెండుగానొక్కగాని యంతకంటెనధికముగఁగాని దక్షిణవామనేత్రములను తీసి రెండువిధములుగఁ జూర్ణముచేసి పిమ్మట దక్షిణనేత్రచూర్ణమును వామనేత్రమునకును వామనేత్రచూర్ణమును దక్షిణనేత్రమునకును పూసికొనినచో రాత్రి చీకటియందుఁగూడఁ జూడఁగలుగును.

వరాహాక్షిఖద్యోతకాకశారికలకండ్లచూర్ణమును నేత్రములకుఁ బూసికొనినచో రాత్రియందుసహితము వస్తువులఁజూడనగును.

పుష్యమాసమందు మూడురాత్రులుపవాసముచేసి శస్త్రహతశూలప్రోతులలో నొకనికపాలమందు మృత్తికనుంచి దానిపైయవలనుబోసి వానిని బస్తావిక్షీరముచేఁదడిపి, మాలికగాఁగట్టుకొనినయెడల నదృశ్యచ్ఛాయారూపుఁడై తిరుగవచ్చును.

మూఁడురాత్రులుపవసించి పుష్యమీనక్షత్రమున శ్వమార్జారోలూకవాగులుల దక్షిణవామనేత్రములను రెండువిధములుగఁజూ

ర్ణముఁ జేసి దానిని నేత్రములకుఁ బూసికొనిన యెడల నదృశ్యచ్ఛాయా రూపుఁడై దిరుగవచ్చును.

మూఁడు రాత్రులుపవసించి పుష్యమీనక్షత్రమునఁ బురుష ఘాతి కాండమును నొకశలాకగఁ జేసి, నిశాచరములగు సత్వములలో నొకదానియొక్క శిరఃకపాలమునునంజనముతోఁ బూరించి మృతస్త్రీ యొక్క యోనిలో దానినుంచి దహింపవలెను. దానిని పుష్యమీన క్షత్రమునఁ బైకిఁదీసి నేత్రమునకుఁ బూసికొనినచో నదృశ్యచ్ఛాయా రూపముకలవాఁడై తిరుగవచ్చును.

ఆహితాగ్నియగు బ్రాహ్మణుఁడు దహింపఁబడుచుండుటను కని పెట్టి మూఁడురాత్రు లచటనుపవసించి స్వయంమృతుని వస్త్రము ను సంచిగఁజేసి పై బ్రాహ్మణుని చితాభస్మమును దానిని డఁబోసి దానినిధరించినచో నదృశ్యచ్ఛాయారూపుఁడై తిరుగవచ్చును.

బ్రాహ్మణుని ప్రేతకార్యమునఁ జంపఁబడుగోవుయొక్క యస్థిమజ్జాచూర్ణముతో నింపిన సర్పభస్త్రిక పశువుల నగపడకుండఁ జేయును.

సర్పదష్టునిభస్మతో నింపిన ప్రచలాకభస్త్రి మృగములనగప డకుండఁ జేయును.

ఉలూకవాగులీపుచ్ఛపురీషజాన్వస్థిచూర్ణములచే నింపినసర్ప భస్త్రిక పక్షులకంతర్ధానము గలిగించును.

ఇవి యెనిమిదివిధములగు నంతర్ధానయోగము.

వైరోచనుఁడగు బలి శతమాయుఁడగు శంబరుఁడు భండీరపా కుఁడు నరకుఁడు నికుంభుఁడు కుంభుఁడు దేవలుఁడు నారదుఁడు సావర్ణి గాలవుఁడు — లోనగువారిని నమస్కరించుచున్నాను. వీరి సెలవుచేత సు గొప్పనిద్ర కలుగుచున్నది. అజగరములవలె గ్రామరక్షణమున జాగరూకులగు నీసైన్యములోనిపురుషులు నిద్రింతురుగాక. వేయి కుక్కలతోడను నూరురథములతోడను నేనీగృహమును ప్రవేశించు చున్నాను. ఇచ్చటికుక్కలూరకుండుఁగాక. మనుష్య దేవలోకమం

దలి దేవతలు మనుష్యలోకమందలి బ్రాహ్మణులు అధ్యయనపరులు సిద్ధులు కైలాసతాపసులు— వీరికి నమస్కరించి శునకఫేలకములనోరుగట్టి నీకు నిద్రకలిగింపఁబడినది; చమరిపచుచ్చుచున్నది; సంహతులెల్లరు తొలఁగిపొందు. అలితే పలితే మనవేస్వాహా!

ఈమంత్రమునకుఁ బ్రయోగము— మూఁడురాత్రు లుపవసించి పుష్యమీనక్షత్రముతోఁ గూడిన కృష్ణచతుర్దశీనాఁడు శ్వపాకీహస్తమునుండి విలఖావలేఖనముఁగొని మాషములతోఁ గలిపి గంపలోఁ బెట్టి ప్రత్యేకముగ శ్మశానమునఁ బాతిపెట్టవలెను. రెండవచతుర్దశీనాఁడు వానిని పయికిఁదీసి కుమారీలతతో మర్దించి మాత్రఁగట్టవలెను. పిమ్మట నొకమాత్ర నభిమంత్రించి చల్లినచో నాప్రదేశమందుండువారెల్లరు నిద్రింతురు.

పైకల్పముచే ముండ్లపందియొక్క మూఁడు నల్లయెముకలను మూఁడు తెల్లయెముకలను ప్రత్యేకముగ శ్మశానమందుఁ బాతిపెట్టి రెండవచతుర్దశీనాఁడు తీసి శ్మశానభస్మముతోఁ గలిపి పయిమంత్రముతోఁ జల్లినచోట నెల్లరు నిద్రింతురు.

సువర్ణపుష్పియగు బ్రాహ్మణి బ్రహ్మ కుశధ్వజుఁడు సర్పములు దేవతలు తాపసులు—వీరికి నమస్కరించెదను. బ్రాహ్మణులు భూమిపాలురగు క్షత్రియులు వైశ్యులు శూద్రులు నాకు వశపడుదురుగాక. స్వాహా అమిలే కిమిలే వయుజారే ప్రయోగే ఫకే కవయుశ్వే విహాలే దంతకటకే స్వాహా

ఈ గ్రామరక్షణమందుఁ గుతూహలులగు నీకుక్కలు సుఖముగ నిద్రించుఁగాక. ముండ్లపందియొక్క యీ తెల్లయెముకలు బ్రహ్మనిర్మితములు. సిద్ధులందఱు పరిపుష్టులయిరి. సూర్యోదయమగునంతకు గ్రామములోనివారు నిద్రింతురుగాక. స్వాహా.

దీనికిఁ బ్రయోగము— పందియొక్క తెల్లయెముకలమూఁటి నేడురాత్రు లుపవసించి కృష్ణచతుర్దశీనాఁడు నూటయెనిమిది ఖదిరసమిధలను మధుఘృతములతో నగ్నియందు హోమముచేయవలెను.

పిమ్మట నీమంత్రముతో గ్రామద్వారమందుఁగాని గృహద్వారమందుఁగాని దీనిని పాతిపెట్టినయెడల నచటివారెల్లరు నిద్రింతురు.

వైరోచనియగుబలి శతమాయుఁడగుశంబరుఁడు నికుంభుఁడు నరకుఁడు కుంభుఁడు తంతకచ్ఛుఁడు మహాసురుఁడు అర్మాలవుఁడు ప్రమీలుఁడు మండోలూకుఁడు ఘటోద్బలుఁడు కంసాపచారియగు కృష్ణుఁడు యశస్వియగు పౌలోమి— వీరికినమస్కరించి నాయర్థమును సిద్ధపఱచు నీశవసారికనుగ్రహించుచున్నాను. జయమగుఁగాక. శలకభూతములకు నమస్కరించుచున్నాను. స్వాహా! అస్తమయమందుండి యుదయమువఱకును, నాయర్థముసిద్ధించునంతవఱకు గ్రామరక్షణమందుఁగుతూహలములగు నిశుసకములునిద్రించుఁగాక, స్వాహా.

దీనికిఁ బ్రయోగము— నాలుగురాత్రులుపవసించి కృష్ణచతుర్దశినాఁడు దహనభూమియందుబలినిచ్చి, శవశారిక నాకులదొన్నెలోఁబెట్టి మూసి దానినడుమ ముండ్లపందియెముకతోఁగొట్టి పైమంత్రమునుచ్చరించినచో, దానినిపాతిపెట్టిన-చోట నుండువారందఱు నిద్రింతురు.

అగ్నిని దైవతములను దశదిశలను శరణముఁబొందుచున్నాను. సర్వప్రతిబంధములు తొలఁగిపోవుఁగాక. అందఱును మాకు వశమగుదురుగాక. స్వాహా.

దీనికిఁ బ్రయోగము— మూఁడురాత్రు లుపవసించి పుష్యమీనక్షత్రమునాఁ డిరువదియొకచక్కెరముక్కలను మధుఘృతములతో హోమముచేసి వానిని గంధమాల్యములతోఁ బూజించి యొకచోటఁబాతిపెట్టవలెను. తర్వాత పుష్యమీనక్షత్రమునాఁడు వానిని తీసి యభిమంత్రించి యొకదానితోఁ గవాటమునుకొట్టి మఱినాలుగింటిని లోనికిఁబడవేసినచో ద్వారములన్నియు విడిపోవును.

నాలుగురాత్రు లుపవసించి కృష్ణచతుర్దశినాఁడు పురుషాస్థిచే నొకబుషభమునుచేసి యభిమంత్రించినచో రెండువృషభములతోఁగూడిన యొకయానమువచ్చును. పిమ్మటదానితో నాకాశము

న సంచరింపవచ్చును. మఱియు నట్టివాఁడు సూర్యునియందుండు సంగతులనెల్లఁ జెప్పఁగలుగును.

ఓ చండాలీ కుంభీ తుంభా కటుకా సరీఘా, నీవుసనారీభగవు స్వాహా. దీనివలనఁ దాలోద్ఘాటనప్రస్వాపనములు కలుగును.

మూఁడురాత్రులుపవసించి పుష్యమీనక్షత్రమునాఁడు శస్త్రహతుఁడును లేక శూలప్రోతుఁడును నగుపురుషునిశరీరకపాలమందు మృత్తికనుంచి దానిలోవల్లుల (?) నాటి యుదకముతోఁ దడుపవలెను. తర్వాతి పుష్యమినాఁడచటఁబుట్టిన మొక్కలఁదీసి త్రాడుగాఁ జేసి, వానిని సజ్యములగు ధనుస్సులయు యంత్రములయు నెదుట ఛేదించినచో జ్యాచ్ఛేదనమగును. ఉదకాహిభస్త్రను స్త్రీయొక్కగాని పురుషునియొక్కగాని యుచ్ఛ్వాసమృత్తికతోఁ బూరించినయెడల నాసికావర్ధనమగును,

గృహాశ్వాన గృహావరాహవస్తిని వైవిధముగఁబూరించి మర్కటస్నాయువుతోఁ గట్టినయెడల వైశాల్యమువృద్ధియగును.

కృష్ణచతుర్దశినాఁడు శస్త్రహతమగు కపిలగోవుయొక్క పిత్తముచే రాజవృక్షమయియగు నమిత్రప్రతిమను పూసినచో నంధత్వముకలిగించును.

నాలుగురాత్రులుపవసించి కృష్ణచతుర్దశినాఁడు బలినొసఁగి శూలప్రోతుఁడగు పురుషునియెముకచే కీలకములను చేయవలెను. వీనిలో నొకదానిని శత్రుపురీషమందుఁగాని మూత్రమందుఁగాని పాతినచో నాతనిశరీరమెండును. దానిచే వానిపాదమందుఁగాని యాసనమందుఁగాని యుంచినచో నతఁడుశుష్కించి చచ్చును. పణ్యస్థానమందును క్షేత్రమందును గృహమందును పాతినచో వానికివృత్తిచ్ఛేదమగును.

విద్యుద్దగ్ధవృక్షకీలకములవలనఁగూడ నిట్టిఫలము కలుగునని గ్రహించునది.

అపాచీనముగు పునర్నవము నింబము కామము మధుపు

కపిరోమము లోనగువానిని మనుష్యాస్థిని మృదుకవస్త్రముతోఁగట్టి యెవనిగృహమందుఁగాని పాదముక్రిందఁగాని పెట్టఁబడునో వాఁడు మూఁడుపక్షములలోఁ బుత్త్రధనదారసమేతముగ నశించును.

అవాచీనమగు పునర్నవము నింబము కామము మధువృషమనుష్యాస్థి లోనగువాని నెవనిపాదముక్రిందను గృహమందును నుంచెదరో వాఁడు మూఁడుపక్షములలోఁ బుత్త్రధనదార సమేతముగ నశించును; సేనాగ్రామనగరములలోనవియుంపఁబడినప్పుడు సేనాగ్రామములలోనివారు నశింతురు.

అజమర్కటనూర్జారనకులబ్రాహ్మణశ్వపాకకాకోలూకరోమములను తెచ్చి శత్రువిష్టమందుఁ గలిపినచోఁ దక్షణమే వాఁడు నశించును. ప్రేతమాలిక ప్రేతకిణ్వము నకులరోమములు వృశ్చికాళ్యహిచర్మములు లోనగువాని నెవనిపాదమందుంచెదరో వాఁడువెంటనే పురుషత్వమును గోలుపోవును. మఱలవానినితీసివేయువఱకతఁడట్లే యుండును.

మూఁడురాత్రులుపవసించి పుష్యమినాఁడు శస్త్రహతుఁడో శూలహతుఁడో యగు పురుషునికపాలమున మృత్తికనుంచి దానిలో గుంజలనుంచి యుదకముతోఁదడిపి దానిలోనుండిపుట్టిన గుంజావల్లులను పుష్యమితోఁగూడిన యమావాస్యయందుఁగాని పౌర్ణమియందుఁగాని పయికిఁదీసి చుట్టలుగఁజుట్టి వానిపై నన్నపానభాజనముల నుంచినచో నందలియన్నపానములు తరుగకుండును.

మృతధేనువుయొక్క స్తనములనుతీసి రాత్రులందుజరుగునుత్సవములలోని ప్రదీపాగ్నులయందు వేయవలెను. తర్వాతవానిని వృషమూత్రములతో ముద్దచేసి క్రొత్తకుండయొక్క లోపలిభాగమును పూయవలెను. ఆకుంభమును గ్రామమునకపసవ్యముగఁద్రిప్పియుంచినయెడల నాగ్రామమందలి గోవులనవనీతమంతయు దానితోఁ జేరును.

పుష్యయోగముగల కృష్ణచతుర్దశినాఁడు అగ్నిశశ్వానయోని

లోఁ గటలాయసమునుండి స్వయముగ నదికి క్రిందఁబడినపుడు దానిని తీసికొనినచో దేనిఫలమును కోరునో యావృక్షఫలములన్నియు నచటికి వచ్చును.

మంత్రభైషజ్యసంయుక్తులై యోగమాయలఁ జేసి శత్రువులను సంహరించువారు స్వజనమును సుఖముగఁ బాలింతురు.

ఇది యౌపనిషదికమను పదునాలుగవయధికరణమందుఁ
ప్రలంభనమున భైషజ్యమంత్రయోగమను
మూఁడవ యధ్యాయము.
ఆదినుండి నూటనలువదిరెండవ యధ్యాయము.



## 179 ప్రకరణము.

### స్వబలోపఘాతప్రతీకారము.

స్వపక్షీయులపై శత్రువు ప్రయోగించిన దూష్యవిషగరములకుఁ బ్రతీకారము—శ్లేష్మాతకకపిమదంతిదండాశతగోజిగీవిషపాటలీబల. శ్యోనాగపునర్నవశ్వేతకషాయముతోడను చందనముతోడను సాలావృకీలోహితముతోడను కూడిన తేజనోదకముచే రాజోపభోగవస్తువులను స్త్రీలయు సేనలయు గుహ్యప్రక్షాళనము విషప్రతీకారము చేయును.

పృషతనకులనీలకంఠగోధాపిత్తయుక్తమషీరాజిని సింధువారితవరణవారుణీతండులీయకశతపర్వాగ్రపిండీతకములతోఁ గలిపిన యోగము మదనదోషహరము.

సృగాలవిన్నామదనసింధువారితగరణవల్లీమూలములను వేరువేరుగఁగాని కలిపిగాని కషాయముపెట్టి దానిని పాలతోఁ గలిపి పుచ్చుకొనినచో మదనదోషహరమగును.

కైదర్యపూతతైల మున్మాదహరము.

ప్రియంగునక్తమాలచూర్ణమును నస్యముగ నుపయోగించినచోఁ గుష్ఠహరమగును.

కుష్ఠలోధ్రయోగము పాకశోషమును హరించును. కటుఫలద్రవంతివిళంగుచూర్ణమును నస్యముగనుపయోగించినచో శిరోరోగమును హరించును.

ప్రియంగుమంజిష్ఠతగరలాక్షారసమధుకహరిద్రాక్షౌద్రయోగము రజ్జూదకపతనములవలనఁ జైతన్యముదప్పినవారికి మరలఁజైతన్యముగలిగించును. మనుష్యులకక్షమాత్రము. గవాశ్వములకుద్విగుణముగను హస్త్యుష్ట్రములకుఁ జతుర్గుణముగను నుపయోగింపవలెను. సువర్ణగర్భమగు పైయోగము సర్వవిషహరము.

జీవంతీశ్వేతాముష్కకపుష్పవందాకములతోఁగలిసిపుట్టిన అశ్వత్థమణి సర్వవిషహరము. పైయోగములను వ్రాసినతూర్యములశబ్దము విషహరము. వానిచేఁ బూయఁబడిన ధ్వజపతాకములనుచూచినయెడల విషహరమగును. వీనిమూలము స్వసైన్యములకును తనకును ప్రతీకారముచేసికొని శత్రువులయెడ విషధూమాంబుదూషణములను ప్రయోగింపవలెను.

ఇది యౌపనిషదికమను పదునాలుగవయధికరణమందుఁ స్వబలోపఘాతప్రతీకారమను నాలుగవ యధ్యాయము.

ఆదినుండి నూటనలుబదితొమ్మిదవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున

ఔపనిషదికమను పదునాలుగవయధికరణము సమాప్తము.



శుభమస్తు.

# కౌటిలీయార్థశాస్త్రము

## 15 ప్రకరణము—తంత్రయుక్తి.

### 180 ప్రకరణము.

#### తంత్రయుక్తులు.

మనుష్యులవృత్తియు మనుష్యవతియగుభూమియు, అర్థమనఁబడుచున్నవి. అట్టిభూమియొక్క లాభపాలనోపాయమును తెలుపు శాస్త్రమర్థశాస్త్రము.

అది ముప్పదిరెండుయుక్తులతోఁ గూడియున్నది.— అధికరణము విధానము యోగము పదార్థము హేత్వర్థము ఉద్దేశము నిర్దేశము ఉపదేశము అపదేశము అతిదేశము ప్రదేశము ఉపమానము అర్థాపత్తి సంశయము ప్రసంగము విపర్యయము వాక్యశేషము అనుమతము వ్యాఖ్యానము నిర్వచనము నిదర్శనము అపవర్గము స్వసంజ్ఞ పూర్వపక్షము ఉత్తరపక్షము ఏకాంతము అనాగతావేక్షణము అతిక్రాంతావేక్షణము నియోగము వికల్పము సముచ్చయము ఊహ్యము.

భూసంపాదన పరిపాలనములగుఱించి పూర్వాచార్యులచే నెన్నెన్నియర్థశాస్త్రములు చెప్పఁబడినవో వానినెల్ల సంగ్రహించి సంక్షేపముగ నీయర్థశాస్త్రము చేయఁబడినదనురీతిగ నొకవిషయము నుద్దేశించి చెప్పుభాగమున కధికరణమనిపేరు.

విద్యాసముద్దేశము వృద్ధసంయోగము ఇంద్రియజయము అమాత్యోత్పత్తి అనురీతిగశాస్త్రమందలిప్రకరణానుపూర్వి విధానము.

చతుర్వర్ణాశ్రమోలోకః (లోకము చతుర్వర్ణచతురాశ్రమ ములుగలది) అనుచోటవలె, ఏవమాదికం (ఇది మొదలుగాగల) వాక్యయోజన, యోగము.

మూలహరుఁడనుపదమున కేవఁను పితృపైతామహమగుద్రవ్యము నన్యాయముగభక్షించునో వాఁడు మూలహరుఁడనురీతిగనర్థమును చెప్పుట పదార్థము.

ధర్మకామము లర్థమూలములుగదా ? అనురీతిగ నర్థసాధక మగుహేతువు హేత్వర్థము.

ఇంద్రియజయము విద్యావినయహేతువను రీతిగ సమాసవాక్య ముద్దేశము.

కర్ణత్వగక్షిజిహ్వాఘ్రాణేంద్రియములకుశబ్దస్పర్శరూపరసగంధములం దవిప్రతిపత్తి యింద్రియజయమనురీతిగవ్యాసవాక్యము (విపులముగఁజెప్పుట) నిర్దేశము.

ధర్మార్థావిరోధముగఁ గామమునుసేవింపవలెను. కాని సుఖరహితుఁడు గాఁగూడదను వాక్యమునందువలె నీలాగువర్తింపవలెనని చెప్పుట యుపదేశము.

పండ్రెండుగురుమంత్రుల మంత్రిపరిషత్తుగఁ గూర్పవలయునని మానవులు. పదునార్గురుండవలయునని బార్హస్పత్యులు. ఇరువదిమంది మంత్రులుండవలయునని యౌశనసులు. సామర్థ్యానుసారముగనని కౌటిల్యుఁడను వాక్యమునందువలె, వీరిట్లు చెప్పెననుట యుపదేశము.

దత్తము నియ్యకుండుటనప్పుడు ఋణాదానమునందుఁ జెప్పినవిషయముల గమనించునదియను వాక్యమునందువలె వెనుకఁజెప్పినదానిచే బ్రకృతమును సాధించుట యతిదేశము.

ఆపదలవిషయమై చెప్పఁబోవురీతిగ సామదానభేదదండముల చేతనయినను, అను వాక్యమునందువలెఁ జెప్పఁబోవుదానిచే సాధించుట ప్రదేశము.

నివృత్తపరిహారులను తండ్రివలె ననుగ్రహింపవలెనను వాక్యమునందువలె దృష్టముచే నదృష్టమును సాధించుట యుపమానము.

లోకానుభవముగలవాఁ డాత్మద్రవ్యసంపన్నుఁడగు రాజును ప్రియహితుఁడగువానిసహాయమున నాశ్రయింపవలెనను వాక్యము నప్రియహితద్వారమున నాశ్రయింపరాదను నర్థమువచ్చుచున్నట్లు వాక్యమునందు లేక అర్థమువలనస్ఫురించునది యర్థాపత్తి.

క్షీణలుబ్ధప్రకృతియగువానిపై దండెత్తవలెనా అపచరితప్రకృతియగువానిపై దండెత్తవలెనా యనువాక్యమునందువలె రెండు కార్యములకు సమానములగు హేతువులున్నప్పుడు సందేహించుట సంశయము.

కృషికర్మలకుపయుక్తములగు ప్రదేశములఁ బనులఁజేయించుచు మిగిలినవిషయములఁ బహువిధముగనే ప్రవర్తింపవలెనను వాక్యమునందువలెఁ బ్రకరణాంతరముతో సమానార్థము గలదని చెప్పుట ప్రసంగము.

(వీనికంటె) విపరీతములగు లక్షణములఁబట్టి యతుష్టుఁడయినట్లూహింపవలెనను వాక్యమునందువలెఁ బ్రతిలోమముగా సాధించుట విపర్యయము.

భిన్నపక్షమునకువలె రాజునకుఁజేష్టానాశమగునను వాక్యమందు (ఛిన్నపక్షమగు) పక్షికి యనువాక్యశేషమువలె దేనిచేవాక్యముపూర్తియగునో యది వాక్యశేషము.

పక్షములు కక్షములు ఉరస్యము ప్రతిగ్రహములని యౌశనసుల వ్యూహవిభాగమను వాక్యమునందువలెఁ బరవాక్యమునుప్రతిషేధింపకుండుట అనుమతము.

మఱియు నైక్యబుద్ధిగలసంఘములలోను రాజకులములలోను ద్యూతమువలననే భేదముత్పత్తియగును, దానివలననే వినాశము. అసత్ప్రగ్రహము తంత్రదౌర్బల్యములను కలిగించునదగుటచే వ్యసనములన్నిటిలో నదియేపాపిష్ఠతమమను వాక్యమునందువలెనతిశయ

వర్ణన వ్యాఖ్యానము.

శ్రేయస్సునుండి మనుష్యుని తొలఁగించునది (వ్యస్యతి) యగుట దీనికి వ్యసనమని పేరను వాక్యమునందువలె గుణములను పట్టి శబ్దవ్యుత్పత్తి చేయుట నిర్వచనము.

జ్యాయునితో విగ్రహించినచో నేనుఁగుతోఁ బాదయుద్ధము చేసినప్పుడు కలుగుఫలమును పొందునను వాక్యమునందువలె దృష్టాంతమును చూపుట నిదర్శనము.

అభ్యంతరకోపశంక కలిగినప్పుడు తప్పఁ దక్కిన కాలములందరి బలమును (స్వరాష్ట్రి) సమీపమునకు రానియ్యవచ్చునను వాక్యమునందువలె నభిప్లుతవ్యపకర్షణ మపవర్గము.

మొదటిప్రకృతి, వానికనంతరుఁడు రెండవప్రకృతి, భూమ్యేకాంతరుఁడు మూఁడవప్రకృతి యనువాక్యమునందువలె నితరులచే వ్యవహరింపఁబడనిశబ్దము స్వసంజ్ఞ.

స్వామ్యమాత్యవ్యసనములలో నమాత్యవ్యసనము గరీయ మనుచోటవలెఁ బ్రతిషేధింపఁదగువాక్యము పూర్వపక్షము.

రాజాయత్తములు గదా ? కావున స్వామి కూటస్థానీయుఁడను వాక్యమునందువలె (పూర్వపక్షమును) నిర్ణయించువాక్య ముత్తరపక్షము.

కావున నుద్థానివై యుండవలెనను వాక్యమందువలె సర్వత్రాయత్తమగునది యేకాంతము.

తులాప్రతిమానములగుఱించి పౌతవాధ్యక్షప్రకరణమునఁ జెప్పెదమను వాక్యమునందువలెఁ బిమ్మట నీవిధముగఁ జెప్పఁబడియున్నదనుట అనాగతావేక్షణము.

అమాత్యసంపద లిదివఱకే చెప్పఁబడినవను వాక్యమునందువలె ముందీవిధముగఁ జెప్పఁబడియున్నదనుట అతిక్రాంతావేక్షణము.

కావున ధర్మార్థముల నితనికుపదేశింపవలెను (గాని) అధర్మానర్థముల నుపదేశింపఁగూడదను వాక్యమునందువలె నిదియిట్లు మ

చేయొక విధము కాదని చెప్పుట నియోగము.

లేక ధర్మవివాహజాతలగు దుహితలనురీతిగ నిదిగాని యది గాని యని చెప్పుట వికల్పము.

స్వయంజాతుడును పితృబంధువులకు దాయాదుడగున నురీతిగ నిదియు నదియుఁగూడ దని చెప్పుట సముచ్చయము.

దాత ప్రతిగ్రహీతలకు నష్టముకలుగకుండునట్లు కుశలులను శయమును కల్పింపవలెననురీతిగ ననుక్తకరణ మూహ్యము.

పై తంత్రియుక్తులతోఁగూడి ఇహపరలోకప్రాప్తిపాలనముల కుపయోగించునట్టియు ధర్మార్థకామములను ప్రవర్తింపఁ జేయునట్టియు నధర్మానర్థద్వేషములను నశింపఁజేయునట్టియు నీశాస్త్రమును నంద రాజగతమగుభూమిని శాస్త్రములను శస్త్రములను నమర్షణముచేనుద్ధరించినవాఁడు రచించెను.

ఇది తంత్రియుక్తి యను పదునైదవయధికరణమందు తంత్రియుక్తులను ఒకటవ యధ్యాయము.

ఆదినుండి నూటయేఁబదియవ యధ్యాయము.



ఇంతటితోఁ గౌటిలీయార్థశాస్త్రమున తంత్రియుక్తి యను పదునైదవ యధ్యాయము సమాప్తము.

శాస్త్రములకు భాష్యములొనర్చినవారిలో బహువిప్రతిపత్తి యుండుట గనిపెట్టి సూత్రములొనర్చిన విష్ణుగుప్తుఁడే స్వయముగ భాష్యమునుకూడ నొనర్చెను.



Composed by J. Lakshmi Narayana Rao, Foreman,
S. V. V. Press, Vizianagram—1000—9-23.